

## శ్రీరామ చరణ వైభవము

శ్రీరామచంద్ర చరణౌ మనసా స్మరామి
శ్రీరామచంద్ర చరణౌ వచసా గృణామి ।
శ్రీరామచంద్ర చరణౌ శిరసా నమామి
శ్రీరామచంద్ర చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీరామచంద్రుని చరణములను మనసుతో స్మరిస్తున్నాను.
శ్రీరామచంద్రుని చరణములను వాక్కుతో వర్ణిస్తున్నాను.
శ్రీరామచంద్రుని చరణములను శిరస్సుతో నమస్కరిస్తున్నాను.
శ్రీరామచంద్రుని చరణములను శరణు బొందుచున్నాను.

***I think of the feet of Sri Ramachandra with my mind, glorify the feet of Sri Ramachandra with my speech, salute the feet of Sri Ramachandra with my head (bent low) and betake myself to the feet of Sri Ramachandra as my refuge.***

# అయోధ్యాకాండము





# శ్రీరామ
# జయరామ
# జయ జయ రామ....



## తొలకరి

పువ్వుకో నవ్వు
నదికోరేవు
దాచుకోలేవు
కాచుకోనువ్వు.....

**ఇది అయోధ్యాకాండము.**

అణువణువూ రసమయం
సరస రచనామయం.

భాషలో సౌందర్యం
భావంలో సంయమనం
ఉట్టిపడి ఊరేగే
కరుణా రసవత్కాండం ......
రాతిగుండెల్లో రసధునుల్ని నింపి
మధుర కవితా మకరంద సంపదల్ని తెలిపి,
మధుమయ ఫణితులతో
సహృదయ హృదయంగమంగా
అందానికి అందమై
మనసుకు మరందమై
వివేక విందు నందించుకాండ
అయోధ్యాకాండ.....
అవిరూపాలా ! కావు.
అపురూప చిత్రకారుని అసమాన కుంచెనుండి జాలువారిన
సజీవ చిత్ర ఖండికలు.
అవిమాటలా! కావు.
కవితాగగనంలో ఊరేగే కవిచంద్రుని కలంనుండి జారిపడిన
అమోఘ అక్షర నక్షత్రాలు.

ఇందులోని
అవమాన ధర్మం హర్షణీయం
అమోఘ ప్రేమ వర్షణీయం
దివ్యాదర్శం సముత్కర్షణీయం .......
అమృతమున్నచోటే హాలాహలం
అయోధ్యలోనే యుద్ధానికి ఆరంభం
కలతలకు, కన్నీళ్ళకు ప్రారంభం.
ఈ కాండము
బ్రతుకుకు అద్దంపడుతుంది.
అర్థంచెబుతుంది.
అర్థం అనర్థమని,
వ్యర్థమని
ధర్మమే పరమార్థమని
సమర్థవంతంగా చెబుతుంది.
పచ్చని రాజ్యంలో కార్చిచ్చు రేపింది మంథర
కోరికలు కోడెత్రాచులని నిరూపించింది కైక.
తండ్రి తనయుల ధర్మవత్సలతకు
అన్నదమ్ముల అనుబంధానికి
ఆలుమగల అనురాగానికి
స్నేహితుల సఖ్యతకు
పాలకుల, పాలితుల సద్భావనకు
ఈ కాండము ప్రతీక. ప్రదీపిక.
ఒడిదుడుకుల మధ్య ఊగే ఊయలే జీవితం.
నా తండ్రి చెబితేగాని నేను సీతను పెండ్లాడను - ఇది బాలకాండము.
నా తండ్రి చెప్పిన తర్వాత నేను అయోధ్యలో నిలవను - ఇది అయోధ్యాకాండము.
ముడిపడడం విడిపడేందుకే అంటుంది బాలకాండ
విడిపడడం ముడిపడేందుకే అంటుంది అయోధ్యాకాండ.
ఈ కాండములోనే
వేడుక చూడలేక ఏడుపొచ్చింది మంథరకు
నారచీరను కట్టుకొనుట చేతకాని నారి అరితేరినట్లు నడిచివెళ్ళింది అడవికి.
దాంపత్యబంధం విడదీయలేనిదని, విడదీయరానిదని

విడమరచి చెబుతుంది ఈ కాండము.
పవిత్రమని, పాపఘ్నమని మరీ మరీ పలుకుతుంది ఈ కాండము.
శీల సంపాదనము
ధర్మ ప్రవర్తనము
అనే రెండు రెక్కలతో అలసటలేకుండా విహరిస్తుంది
అయోధ్యాకాండా విహంగము.
రాళ్ళను కరిగించే రామభరతుల హృదయావేదన
రాళ్ళవలె కరగని కైకేయీమంథరల కర్కశ నివేదన.
వ్యక్తి సర్వతోముఖ వికసనానికి
సమాజ అభ్యుదయ విలసనానికి
వెనుక నిలిచి వెన్నుతట్టే
విమల ధర్మకాండ అయోధ్యాకాండ.
భరతునివంటి త్యాగధనులు
సుమిత్రవంటి మౌనయోగులు
మనసువిప్పి మాట్లాడిన మధుమయకాండ.
ఇచ్చినవాడు ఎదురుచూచేది ఫాయిదా
పుచ్చుకున్నవాడు నిరీక్షించేది వాయిదా
ధర్మం చెడితే ధనం చేయగలిగింది దహనమే అని
ధర్మశంఖాన్ని పూరించిన ధార్మికకాండ.
భార్యకు భర్తగా
తల్లిదండ్రులకు పుత్రుడుగా
సోదరులకు బహిః ప్రాణంగా
ప్రజలకు రాజుగా
యాచకులకు దాతగా
అధికార్యాన్ని కాదని, ఆదర్శాన్ని కాంక్షించిన
శ్రీరాముడు ఇక్కడే
ధర్మమూర్తిగా జాజ్వల్యమానమౌతాడు.
మనసులోని మర్మం ముఖంలో దర్శనం
భవనం యొక్క అందం గుమ్మంలో ప్రదర్శనం
గ్రంథంలోని వైభవం ఆరంభంలోనే సుదర్శనం ......

అయోధ్యాకాండములోని ప్రథమశ్లోకం

"గచ్ఛతా" అనే పదంతో ఆరంభం కావడమే విశేషం.

మేనమామగారింటికి భరతుడు వెళ్తూ (గచ్ఛతా) పాపరహితుడు, శత్రుసంహారకుడు అయిన శత్రుఘ్నుని వెంటబెట్టుకొని వెళ్తాడు - ఇది శ్లోక భావం.

'గచ్ఛ్' అను ధాతువునకు వెళ్ళుట అని అర్థము.

ఈ కాండములో

1. శత్రుఘ్నుని వెంటబెట్టుకొని భరతుడు వెళ్తాడు.
2. వనవాసానికై రాముడు అడవికి వెళ్తాడు.
3. పుత్రశోకాన్ని భరించలేక దశరథుడు పరలోకం వెళ్తాడు.
4. కోసలరాజ్య సింహాసనం అయోధ్యనుండి నందిగ్రామానికి వెళ్తుంది.

ఆహా... వాల్మీకి కోకిలా !

నీ కంఠంలో ఎన్ని కమనీయ స్వరాలు?

కవికోకిలా !

నీ కలంలో ఎన్ని రమణీయ నాట్య భంగిమలు ?

'గచ్ఛతా', వెళ్ళడం అని, అందరూ వెళ్ళేలా చేశావు.

మరి మేము?

మేమూ వెళ్తాం. అయోధ్యాకాండలోకి.

పదండి ... పదండి .... తొందరగా

బాలకాండవలె పెళ్ళిభోజనాలు లేవు.

ఇక్కడ అన్నీ కందమూలాలే

ఫలపుష్పాలే ....

ఆరగించాల్సింది కష్టాల్నే

పానం చేయాల్సింది కన్నీళ్ళనే

తప్పదుమరి .... పదండి.

మెలకువలు తెలిసి, మెలమెల్లగా నడిచి

జీవితారణ్యంలో

బాటను తెలిపే బాటసారి

మీ

స్వామి సుందర చైతన్యానంద

# చైతన్య రామాయణము

## అయోధ్యాకాండము

**ఇది అయోధ్యాకాండ.**

అయోధ్య అనగా యుద్ధము లేనిచోటు. ఆక్రమించుటకు వీలుగానిది. పోరులేని ఊరు. పోరాటాలు, ఆరాటాలు లేని ఊరు.

మానవ హృదయమే అయోధ్య. అయోధ్యలో రాముడున్నాడు. హృదయంలో ఆత్మా రాముడున్నాడు.

'సర్వేషు రమన్తే ఇతి రామః'

"సర్వులలో రమించు దివ్య చైతన్యమే రాముడు."

ఈ చైతన్యమే సత్యము. నిత్యము. అమరము. అజేయము. ఇదియే ఆత్మ. ఆత్మకు సంబంధించిన విషయము ఆత్మజ్ఞానము. ఆత్మ నిత్యమైనందున ఆత్మజ్ఞానము అమృతమై భాసిస్తుంది.

ఆత్మకు అన్యమైనదంతయు అనాత్మ. అది అనిత్యము. మృతం. అనాత్మకు సంబంధించిన విషయము అశాశ్వతమైనది. కాలపరిధిలోనిది.

కళ్ళుతెరచి ప్రపంచంలో కాలుపెట్టింది మొదలు కళ్ళుమూసి కాష్టంలో కాలూనే వరకు మనిషికి అనాత్మప్రపంచంతోనే సంబంధం.

తినడం, త్రాగడం, తిరగడం, తూలడం........ ఇంకేముంది జీవితం? నిన్న చేసిన పనులే నేడూ చేస్తున్నాం. నేడు చేస్తున్న పనులే రేపటికి మిగిలి ఉన్నాయి. నిన్నటి పనులు నేడు సుఖాన్ని పంచలేకపోయాయి. నేటి పనులు రేపు ఆనందాన్నిస్తాయా?

రోత పుట్టించే దేహాన్ని ఒకవైపు మోస్తూ, అలాంటి మరొక దేహంపై మోజు పెట్టుకుంటాడు మనిషి.

అడ్డంగా బలిసియున్న అశ్వశునకాదులయందు ఏ మాంసము, ఎముకలు, రక్తము, చర్మము ఉన్నదో, నిలువుగా, సొగసుగా నిలబడియున్న మనిషిలో కూడా ఆ రక్తమాంసాదులే కదా ఉండేది?

ఇలాంటి దేహాలపై ఏర్పరచుకొనే మోహమే సర్వ అనర్థములకు మూలం. మోహం కలిగిన తరువాత శునకానికి సురేంద్రునికి తేడాలేదు.

ఈ మోహకూపంలో పడినవారికి ఏడుపులేగాని వేడుకలుండవు. వారికి రోదనాస్త్రాలే గాని శోధనాస్త్రాలు లభించవు. ధర్మానికి, అధర్మానికి తేడా తెలియదు. అట్టివారు పశుతుల్యులు అని తీవ్రంగా పలికింది నీతిశాస్త్రము.

**ఆహార నిద్రా భయ మైథునాంచ సామాన్యమేత త్పశుభి ర్నరాణామ్**
**ధర్మోహి తేషా మధికో విశేషో ధర్మేణ హీనాః పశుభి స్సమానాః**

"ఆహార నిద్రా భయ మైథునములు మానవులకు, పశువులకు సామాన్యములు. ధర్మమును గ్రహించుటయే మానవునిలో విశిష్టమైన లక్షణము. ధర్మహీనులైన మానవులు పశువులతో సమానము."

ధర్మము అమృతమును అందిస్తుంది. అధర్మము మృత్యువును ముందుంచుతుంది. హృదయంలో శోభించే పరమాత్మను పొంది, బాహ్యకర్మలయందు దానికి వైరుధ్యము లేకుండా జీవించాలి. ఇదియే ధర్మం.

**ద్వివిధోహి వేదోక్తో ధర్మః ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణశ్చ జగతః**
**స్థితి కారణమ్, ప్రాణినాం సాక్షా దభ్యుదయ నిశ్శ్రేయస హేతుః**

"వేదము రెండురకాల ధర్మములను చెప్పింది. ఒకటి ప్రవృత్తి, రెండవది నివృత్తి. ఈ రెండు ధర్మాలే ప్రపంచ మనుగడకు కారణములు. ప్రాణుల అభ్యుదయ నిశ్శ్రేయసలకు హేతువులు" అని శ్రీశంకరాచార్యులవారు గీతాభాష్యంలో చెబుతారు.

ఏం చేయాలో చెప్పేది ప్రవృత్తి కాగా, ఎలా ఉండాలో తెలిపేది నివృత్తి. ఈ రెండూ తెలిసినవాడు ధర్మజ్ఞుడు. ఈ మార్గమును తెలిసి, ఈ త్రోవలో పయనించు ధర్మాత్ముడు సత్యాత్ముడై శోభిల్లుతాడు.

ప్రవృత్తిధర్మాలు లౌకికకర్మలను శుద్ధిచేసి సమాజంలో అభ్యుదయాన్ని సృష్టిస్తాయి. నివృత్తిధర్మాలు అలౌకికమైన జ్ఞానాన్ని ప్రసాదించి జీవులకు మోక్షాన్ని ప్రసాదిస్తాయి. నిశ్శ్రేయస అనగా మోక్షమే.

అభ్యుదయ నిశ్శ్రేయసలకు హేతువైన ధర్మములతో వ్యక్తి సంబంధమును కలిగియుండాలి. ఇదియే ధర్మజీవనము.

కానీ మానవులు అనాత్మ సంబంధంవల్ల అభ్యుదయ నిశ్శ్రేయసలను విస్మరించి అధర్మంగా చరిస్తూ పాపాచరణలో మునిగిఉంటారు.

ధర్మశీలురకు శ్రేయస్సు ప్రధానం కాగా అధర్మపరులకు ప్రేయస్సు ముఖ్యంగా ఉంటుంది. ప్రేయస్సు కల్గించే సుఖం అనిత్యం, అశాశ్వతం అని అధర్మపరులు గ్రహించలేరు.

తాత్కాలిక సుఖాన్ని ఎరగాజూపి శాశ్వతానందాన్ని కబళించేది ప్రేయస్సు. ఆరంభంలో కష్టంగా తోచినా అంత్యంలో శాశ్వతానందాన్ని ప్రసాదించేది శ్రేయస్సు.



ధర్మాచరణములో ప్రతి కష్టము సుఖంగా మారుతుంది. ప్రతి బాధ ఆనందప్రదంగా మారి తీరుతుంది.

ధర్మము మనిషికి శ్రేయమును ప్రసాదిస్తుంది. ఇహమున అభ్యుదయమును, పరమున మోక్షమును అనుగ్రహించేదే ధర్మము.

ఈ ధర్మాధర్మముల భయంకర సమరమే జీవితము. హృదయమే యుద్ధభూమి. ప్రతి మానవహృదయములో నిరంతరము ఈ ధర్మాధర్మాలకు మధ్య గొప్ప సంగ్రామము జరుగుతూ ఉంటుంది. పరస్పర వైరుధ్య భావాల మధ్య జరిగే సంఘర్షణయే ఈ భయంకర సంగ్రామము.

సంగ్రామములేని గ్రామమే అయోధ్య. ప్రతి మానవహృదయము అయోధ్య కావాలి. అప్పుడే హృదయంలో ఆత్మారాముడు నిలుస్తాడు.

ధర్మానుష్ఠానంవల్ల సంఘర్షణలు సమసిపోతాయి. శాంతి చేకూరుతుంది. అధర్మము సంఘర్షణలను రేపి, సంతాపాలకు నాంది పల్కుతుంది.

అధర్మప్రవర్తనతో బ్రతుకును కల్లోలంగా మార్చుకోవద్దని అయోధ్యాకాండ బోధిస్తుంది. ధర్మము ప్రగతికి, అధర్మము పతనానికి దారితీస్తాయని హెచ్చరిస్తుంది.

ఈ అయోధ్యాకాండ ధర్మప్రధానమైన కాండ. ఈ కాండములో అసలు యుద్ధమే లేదు. రామాయణంలో యుద్ధము లేని కాండము అయోధ్యాకాండమే.

బాలకాండలో రామునికి, రాక్షసులకు యుద్ధం జరుగుతుంది. అరణ్యకాండలో ఖరదూషణాదులతో రామలక్ష్మణులు పోరాడుతారు. కిష్కింధాకాండలో వాలిసుగ్రీవుల పోరాటముంది. సుందరకాండలో హనుమంతుడు రాక్షసులతో పోరాడుతాడు. యుద్ధకాండలో రామ రావణ సంగ్రామమే ఉంది. యుద్ధములేని ఏకైక కాండ ఈ అయోధ్యాకాండయే. అందుచేత ఇది ధర్మప్రధానమైన కాండగా ప్రసిద్ధిగాంచింది. అంతేగాదు. ఎక్కడ గృహ కల్లోలాలు తలెత్తినా అయోధ్యాకాండను పారాయణచేసి శాంతిని అనుభవించడం ఆచారంగా కూడా నిలిచింది.

రామాయణంలో రాజ్యంకొరకు సంఘర్షణకు గురియైన రాజ్యాలు మూడు తెలుస్తున్నాయి. ఈ మూడుకూడా ప్రత్యేకించి సోదరులమధ్య సంఘర్షణగా తెలుస్తున్నాయి. అవి 1. అయోధ్య 2. కిష్కింధ 3. లంక.

అయోధ్యలో రామ భరతులకు సంఘర్షణ. కిష్కింధలో వాలి సుగ్రీవులకు సంఘర్షణ. లంకలో రావణ విభీషణులకు సంఘర్షణ.

కిష్కింధలో తమ్ముడైన సుగ్రీవుని తరిమికొట్టి వాలి రాజ్యాన్ని ఆక్రమించాడు. రాముని సహాయంతో సుగ్రీవుడు వాలి మరణానికి కారకుడై, కిష్కింధలో రాజ్యాభిషిక్తుడయ్యాడు.

లంకలో రావణుని మరణానికి విభీషణుడు కారణమయ్యాడు. రావణుడు మరణించక ముందే సాగరతీరాన రామునిచే అభిషిక్తుడయ్యాడు. రావణవధానంతరము లంకలో రాజయ్యాడు.

ఒక్క అయోధ్యలోనే పరిస్థితి తారుమారుగా తెలుస్తుంది. తమ్ముడైన భరతుడు రాజ్యాన్ని పాలించాలని రాముడు అభ్యర్థిస్తుంటే, అన్నమైన రాముడే పరిపాలించాలని భరతుడు కన్నీళ్ళతో ప్రార్థిస్తుంటాడు.

కిష్కింధ లంకలలో అన్నల మరణానికి తమ్ములు కారకులుకాగా, అయోధ్యలో అన్నగారికొరకు తమ్ములు ప్రాణత్యాగం చేయడానికికూడా వెనుకాడరు.

ఇది అయోధ్యయొక్క ప్రత్యేకత.

అయోధ్య ధర్మనిలయం. శాంతినిలయం. ఈ అయోధ్యాకాండములో ధర్మాధర్మముల విశ్లేషణ అద్భుతంగా నడిచింది.

మిన్నువిరిగి మస్తకంపై పడుతున్నా చలించని ధీరోదాత్తులైన ధర్మపరులు ఒకవైపు శోభిస్తుండగా, మన్నుకు, సున్నకు విలువనిచ్చి తన్ను రక్షించుకోవాలని, రమణీయంగా తీర్చుకోవాలని జీవితాలతో క్రీడించే అధర్మపరులు మరొకవైపు మిణుకు మిణుకు మంటూ గోచరిస్తుంటారు.

ధర్మంకోసం రాజ్యాన్ని, సర్వాన్ని త్యజించేందుకు సిద్ధమైన ధర్మాత్ములు ఒకవైపు, అధర్మంతో అందరికీ అన్యాయంచేసైనా సుఖించాలనే అధర్మశీలురు మరొకవైపు ఈ కాండములో ప్రధానపాత్రలు పోషిస్తారు.

కదలి రావలసింది ఏమిటో, వదలి పోవలసింది ఏమిటో ఈ కాండములోనే మనం గ్రహించాలి. పట్టువిడుపులు మనిషికి ఇక్కడే తెలియాలి.

రామాయణంలో ఈ కాండము అద్భుతమైనది. వాస్తవానికి ఇది అద్వితీయం. అమోఘం. మానవ ధర్మజీవన వృక్షము ఈ కాండము మీదనే ఆధారపడి ఉంది. ఎలా ఉందో చూద్దాం పదండి.

## శత్రుఘ్నుని శరణాగతి

అయోధ్యాకాండము ప్రారంభమైంది.

**గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘః**
**శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః**

ఇది అయోధ్యాకాండములో ప్రథమసర్గలో ప్రప్రథమ శ్లోకం.

"అప్పుడు భరతుడు తన మేనమామగారింటికి వెళ్తూ అనఘుడు, తనను ప్రీతితో అనుసరించువాడు, నిత్య శత్రుసంహారియైన శత్రుఘ్నుని కూడా తనవెంట తీసుకు వెళ్ళాడు" ఇది పై శ్లోకంయొక్క భావం.

ధర్మప్రధానమైన అయోధ్యాకాండములోని ఈ ప్రథమ శ్లోకము ధర్మసాధానికి ప్రథమ సోపానమై శోభిస్తూ ఉంది. అందుచేత ఈ శ్లోకాన్ని భక్తులు, పెద్దలు ఎంతగానో శ్లాఘిస్తారు. గౌరవిస్తారు. ఈ శ్లోకం ప్రబోధించే ధర్మసూక్ష్మాలను, ధర్మావలంబనకు అనువైన అంశాలను పరిశీలిద్దాం.



తన మేనమామయైన యుధాజిత్తు ఆహ్వానంమేరకు భరతుడు మామగారింటికి ప్రయాణమయ్యాడు. వెళ్తూ వెళ్తూ శత్రుఘ్నుని వెంటబెట్టుకొని వెళ్ళినట్లు పై శ్లోకం చెబుతూ వుంది.

రామాయణంలో శత్రుఘ్నుని పాత్ర ఒక విలక్షణమైనది. తేజోవంతమైనది. భావపూర్తి కలిగినది. అదొక సుకుమార సజీవ పాత్ర.

రామాయణంలో శ్రీరాముడు కథానాయకుడు. ఆయనిది ప్రధాన పాత్ర. భరతుడు ఉపనాయకుడుగా తెలుస్తాడు. కథానాయకుని లక్ష్మణుడు సేవిస్తాడు. ఉపనాయకుని శత్రుఘ్నుడు సేవిస్తాడు. సేవకులిరువురూ సుమిత్ర కుమారులే.

సేవలో సంతృప్తిచెందే బిడ్డలను ప్రసవించిన, ప్రసాదించిన సుమిత్ర జన్మ ధన్యము. ఆమె పాత్ర కూడా రామాయణంలో చాలా విశిష్టమైంది. ఆమె మితభాషి. హితభాషి. అందరికీ మిత్రురాలై సుమిత్ర అయింది. సుమిత్ర కుమారులు సుబుద్ధులు కాకపోతారా?

సుమిత్రవలె సుమిత్రానందనుడైన శత్రుఘ్నుని పాత్ర శ్రీమద్రామాయణంలో ఎక్కువగా కనిపించదు. ఉత్తరకాండలో శత్రుఘ్నుని పాత్ర శోభిస్తుంది.

లక్ష్మణశత్రుఘ్నులు రామభరతులకు అంకితమైపోయారు. రాముడున్నచోట లక్ష్మణుడుంటాడని ఊహించవచ్చు. అలాగే భరతుని ప్రక్కన శత్రుఘ్నుడుంటాడని భావించవచ్చు.

భరతుడు మేనమామ ఇంటికి వెళ్తున్నాడు. అతనికి ఆహ్వానం ఉంది. కానీ శత్రుఘ్నుడు ఎందుకు వెళ్ళాడు? పైగా ఆహ్వానంకూడా లేదు. ఈ విషయాన్ని విశ్లేషిస్తూ ఆలోచిస్తే అనేక సద్విషయాలు, సాధనావిషయాలు బయటపడతాయి.

1. భరతుడు వెళ్తూ వెళ్తూ శత్రుఘ్నుని వెంటబెట్టుకొని వెళ్ళాడు. సంకల్పము భరతునిదే గాని శత్రుఘ్నునిది కాదు. ఇది శత్రుఘ్నుని శరణాగతి.

లక్ష్మణుడు శ్రీరాముని అనుసరిస్తూ సేవిస్తాడు. శ్రీరాముని సమీపించుటకు, సేవించుటకు తనకు అర్హత లేదని భావించిన శత్రుఘ్నుడు భక్తుడైన భరతుని అనుసరిస్తాడు. ఒక సత్పురుషుని ద్వారా సద్రూపచైతన్యమైన పరమాత్మను చేరవచ్చునని భావిస్తాడు. గుర్తు తెలిపేవాడు గురువేనని విశ్వసిస్తాడు. మహాత్ములను సేవించునపుడు వారి సంకల్పాలకు అనుగుణంగా చరించడం ప్రధానం. అందుచేత భరతుని సంకల్పాన్ని అనుసరించి వెళ్ళాడు శత్రుఘ్నుడు.

2. లక్ష్మణుడు రామునితో విలీనమై జీవించునట్లు, శత్రుఘ్నుడు భరతునితో విలీనమౌతాడు. వ్యక్తిని నీడ అనుసరించునట్లు సత్పురుషుడైన భరతుని శత్రుఘ్నుడు అనుసరిస్తాడు.

3. శత్రుఘ్నుడు తన ప్రయాణవిషయమై తల్లియైన సుమిత్రకుగాని, తండ్రియైన దశరథునికిగాని, భార్యయైన శ్రుతకీర్తికిగాని చెప్పినట్లు తెలియుటలేదు. వెళ్తూ వెళ్తూ భరతుడు శత్రుఘ్నుని తీసికొనివెళ్ళినట్లు మాత్రమే శ్లోకం చెబుతూవుంది.

ప్రయాణ సమయాల్లో ఎవరి వస్తువుల్ని వారు మరచిపోకుండా గొనిపోవునట్లు, భరతుడు శత్రుఘ్నుని తీసికొనివెళ్ళాడు. తన వస్తువులను తీసికొనిపోవుటకు అన్యుల అనుమతి

అవసరంలేదు. అలాగే శత్రుఘ్నుని గొనిపోవుటకు భరతుడుకూడా ఎవ్వరి అనుమతి తీసికోలేదు.

సత్పురుషుని లేదా గురువుని అనుసరించునపుడు ఎవరి అనుమతి అవసరంలేదని శత్రుఘ్నుడు ఆచరించి చూపాడు.

4. భరతుడు శుద్ధబుద్ధి. శత్రుఘ్నుడు నిర్మలమైన మనస్సు. నిర్మలమైన మనసు శుద్ధబుద్ధిని అనుసరించునట్లు శత్రుఘ్నుడు భరతుని అనుసరిస్తాడు.

మనిషికి మనసు దూరంగా ఉండలేదు. శత్రుఘ్నుడు భరతుని విడిచి ఉండలేడు. భరతునికి ఏది ఇష్టమో అదే తన అభీష్టమని భావిస్తాడు శత్రుఘ్నుడు. సత్పురుష సాంగత్యములో ఈ సత్యాన్ని సాధకులు సదా ఆంతర్యంలో అవధరించాలి.

5. భరతుడు తన మేనమామ యుధాజిత్తు ఇంటికి వెళ్తున్నాడు. శత్రుఘ్నునికి అది మేనమామ గృహం కాదు. అలాంటప్పుడు భరతుడు పిలిచినా "నేనెందుకు వెళ్ళాలి? నాకేమి ప్రయోజనం?" అని శత్రుఘ్నుడు ఆలోచించలేదు.

**"అనుకూలస్య సంకల్పః"** భరతుని సంకల్పానికి అనుగుణంగా చరించడమేగాని తనకంటూ ప్రత్యేకమైన ఆలోచనలు లేనివాడు శత్రుఘ్నుడు. ఇది శరణాగతిలో పరాకాష్ఠ.

ఒకనాడు కృష్ణార్జునులు షికారు వెళ్ళారట. మార్గమధ్యంలో "అర్జునా! ఆ కొంగలు చూడు. ఎంత చక్కగా బారులుతీరి కూర్చుని ఉన్నాయో?" అన్నాడట కృష్ణుడు.

"అవును బావా! చాలా బావున్నాయి. బారులుతీరి మరీ బావున్నాయి కొంగలు" అని జవాబిచ్చాడట అర్జునుడు.

మరికొంతసేపటికి శ్రీకృష్ణుడు "అర్జునా! ఆ కాకుల్ని చూశావా! ఎంత చక్కగా కూర్చుని ఉన్నాయో?" అని ఇంతకుపూర్వం చూపిన పక్షులనే చూపిస్తూ అన్నాడట.

"అవును కృష్ణా! ఆ కాకులు చక్కగా ఆకులు పరచినట్లు ఉన్నాయి" అని ప్రతివచనం పలికాడట పార్థుడు.

"అర్జునా! ఏమిటి నీ మనోస్థితి? నేను కొంగలంటే కొంగలంటావు. కాకులంటే కాకులంటావు. నీ విచక్షణ ఏమైంది? నీ మనసు ఎక్కడికి వెళ్ళింది?" అన్నాడట అచ్యుతుడు.

"కృష్ణా! నా మనసు ఎక్కడకీ పోలేదు. నీదగ్గరే ఉంది. కాకులైతే నాకెందుకు? కొంగలైతే నాకెందుకు? నీ రాగంలో శ్రుతికలపడమే నా యోగం. నీవు కొంగంటే కొంగే. నీవు కాకంటే కాకే;" అన్నాడట అర్జునుడు.

ఇదియే శరణాగతి. శత్రుఘ్నుడు సాధించుకొనిన స్థిరమతి. అమోఘ నియతి. అపూర్వగతి.

శరణాగత వైభవమును తన జీవితములో అసమాన రీతిలో వ్యక్తపరచిన శత్రుఘ్నునికి ఈ శ్లోకములో మూడు విశేషణాలు చెప్పబడ్డాయి.

**1. అనఘః** అవగా పాపరహితుడు అని అర్థము. మనసులో సమస్తమైన కల్మషములు నశించినవాడని భావము. సత్పురుషుని ఆశ్రయించిన సాధకుడు సాధనద్వారా పాపములను



క్షాళనం చేసుకోవాలి. ఆ తరువాతనే భగవదనుగ్రహం లభిస్తుంది. ఆత్మజ్ఞానం సిద్ధిస్తుంది. గురుబోధ హృదయంలో స్థిరపడుటకు సాధకుడు పాపరహితుడై యుండాలి.

**తపోభిః క్షీణ పాపానాం శాంతానాం వీతరాగిణామ్**
**ముముక్షూణా మపేక్ష్యోఽయం ఆత్మబోధో విధీయతే ॥**

"తపస్సు ద్వారా పాపములను నశింపజేసికొని, రాగద్వేషములనుండి విముక్తుడై, ప్రశాంతచిత్తుడైన ముముక్షువునకు అపేక్షింపదగిన ఆత్మబోధ చెప్పబడుచున్నది" అని ఆదిశంకరులు ఆత్మబోధ ప్రకరణగ్రంథములో తెలుపుతారు.

ఘోరమైన, క్రూరమైన, పాపభూయిష్ఠమైన ఆలోచనలు, కర్మలు ఆధ్యాత్మికమార్గంలో అడ్డుగోడలై నిలుస్తాయి. ప్రతిబంధకాలై పీడిస్తాయి. కనుకనే వీటినుండి విశ్వాన్ని విముక్తం చేయమని వేదఋషులు ప్రార్థించేవారు.

**యదిహ ఘోరం యదిహ క్రూరమ్ యదిహ పాపం**
**తచ్ఛాంతం తచ్ఛివం సర్వమేవ సమస్తునః**

"ఈ ప్రపంచంలో ఏది భయంకరమో, క్రూరమో, పాపమో, దానినంతయు శాంతింపజేసి, మాకు శ్రేయమును, శాంతిని ప్రసాదింతురు గాక!" అని విశ్వకల్యాణాన్ని వాంఛిస్తూ ఋషులు ప్రార్థించేవారు.

శత్రుఘ్నుడు పాపములను పోగొట్టుకొని మహాత్ముడైన భరతుని గురువుగా భావించి ఆశ్రయించాడు.

**2. నిత్య శత్రుఘ్నః** అనగా నిత్యశత్రుసంహారి అని భావము. దుఃఖమును ప్రసాదించు కోరికలే మనిషికి నిత్యశత్రువులు. శత్రువులను కలిగియున్నవాడు ఎలా సుఖంగా జీవించలేడో, కోరికలకు నిలయమైనవాడుకూడా సుఖపడలేడు.

గురువును సేవించే సాధకుడు కోరికలను అదుపులో ఉంచుకోవాలి. నిగ్రహించాలి. కామమును నిత్యశత్రువుగా శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో వర్ణించారు.

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూరే ణానలేనచ ॥**

"అర్జునా! కామము జ్ఞానికి నిత్యశత్రువు. పూరించుటకు శక్యముగాని అగ్నివంటిది యగు ఈ కామముచే జ్ఞానము ఆవరింపబడియున్నది" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత-కర్మయోగములో తెలిపియున్నారు.

కామమును నిత్యశత్రువుగా గీత కూడా అభివర్ణించింది. కనుక కోరికలను ముముక్షువు తుదముట్టించాలి. విషయములను అనుభవించినంతమాత్రాన కోరికలు శాంతింపవు.

**న జాతు కామః కామనా ముపభోగేన శ్యామతి**
**హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే ॥**

"కామ విషయములను అనుభవించుటచేత కామము తృప్తిపొందదు. ఇంధనము సమకూర్చునంత కాలము అగ్ని ఎలా శాంతించదో కామము కూడా అంతే" నంటాడు ధర్మశాస్త్రవేత్త మనువు.

సత్పురుషుని ఆశ్రయించి జ్ఞానమును పొందగోరు ముముక్షువు శత్రుఘ్నునివలె పాపరహితుడై ఉండాలి. కామరహితుడై ఉండాలి. అంతేగాదు

**3. ప్రీతి పురస్కృతః** గురువును ప్రీతితో అనుసరించేవాడై ఉండాలి. ఆసక్తి లేనిచోట అవధానముండదు. ప్రేమ లేనిచోట భక్తి కుదరదు. జ్ఞాన సముపార్జనలో నైరాశ్యాలు, వైకల్యాలు పనికిరావు. గురుసాన్నిధ్యంలో ఆనందంగా జీవిస్తూ, గురువును ప్రీతితో అనుసరించు ముముక్షువునకు జ్ఞానప్రాప్తి కల్గుతుంది.

ఈ మూడు లక్షణాలు కలిగియుండుటచేత శత్రుఘ్నుడు ముముక్షువులకు మార్గదర్శకు డయ్యాడు.

భరతుని మేనమామయగు యుధాజిత్తు చేయు సత్కారములను స్వీకరించి అనుభవించుచు భరతశత్రుఘ్నులు అచ్చట నివసిస్తున్నారు. సకల భోగములను అనుభవిస్తూ మాతులగృహమున ఆనందముగాఉన్నా, వారిరువురి మనసులు వృద్ధుడైన దశరథుని మీదే ఉండేవి. సదా తండ్రినిగూర్చే ఆలోచించేవారు. అలాగే అయోధ్యలో దశరథుడు కూడా దూరంగావున్న భరత శత్రుఘ్నులను గూర్చి ఆలోచిస్తూవుండేవాడు.

వృద్ధుడైన తమ తండ్రినిగూర్చి భరతశత్రుఘ్నులు ఆలోచిస్తున్నారు. వారు సుఖభోగముల ననుభవిస్తున్నా తండ్రి ఎలా వున్నాడో అని ఆందోళన చెందుతున్నారు. ఈనాటి పరిస్థితులతో పోల్చి చూస్తే కాలమార్పులు ఎంత కర్కశంగా ఉన్నాయో సామాన్యులకు కూడా అర్థం గాకపోవు.

ఎంతగానో కష్టించి, శ్రమించి బిడ్డల్ని తండ్రి వృద్ధిచేస్తాడు. వృద్ధాప్యంలో ఉద్ధరిస్తారని ఆశిస్తాడు. జీవిత సంధ్యాసమయంలో ఆశాకిరణాలవుతారని భావిస్తాడు. కానీ,

వివాహం కాగానే భార్యతోకలిసి వేరుగా కాపురంపెట్టే ప్రబుద్ధులు, ఉద్యోగధర్మమంటూ తల్లిదండ్రులకు దూరంగా జీవిస్తూ సంవత్సరాల తరబడి వారి ముఖం కూడాచూడని మేధావులు ఈనాడు కోకొల్లలుగా కన్పిస్తున్నారు. తల్లిదండ్రులను తృప్తిపరచనివాడు తనయుడా? కుమతులైన కుమారులందరు రామాయణమును శ్రద్ధతో పఠిస్తే, ధర్మపరాయణులై చరించే అవకాశముంటుంది. కుటుంబములో ప్రేమను పంచలేనివాడు లోకాన్ని ప్రేమించడమనేది భ్రమ.

## సుగుణాభిరాముడు

సుగుణాభిరాముడైన శ్రీరాముని అగణిత గుణశోభను గాంచి దశరథుడు ఎంతగానో సంతసించేవాడు. అమిత పరాక్రమవంతుడైన రాముని జూచి, ఇంద్రుని కనిన అదితిలాగ కౌసల్య పట్టరాని ఆనందాన్ని అనుభవించేది.

సముద్రంలో అలలను లెక్కింపవచ్చునేమోగాని రాముని సుగుణాలను వర్ణించలేము. రాముని సుగుణాలను వాల్మీకి అమోఘంగా వర్ణించాడు. పుటలకు పుటలు నింపినా మహర్షికి తనివి తీరలేదు. ఎక్కువ విషయాన్ని తక్కువ మాటలలో నింపడం ఆదికవి కవితావైభవం. అక్షరాలను తూచి పొదుపుగా వినియోగించడం మహర్షికి అలవాటు. అయినా శ్రీరాముని



సుగుణాలను వర్ణించడంలో ఆయన తన నియమాన్ని పాటించనేలేదు. సుగుణాభిరాముని సుకుమార గుణశోభ అలాంటిది.

కొన్ని సందర్భాలలో రాముని కళ్యాణగుణాలను తానే ఆనందంగా వర్ణిస్తాడు. కొన్ని సమయాలలో దశరథుడు వీక్షిస్తున్నట్లు చెబుతాడు. మరికొన్ని సందర్భాలలో లోకము ప్రతిస్పందిస్తున్నట్లు పేర్కొంటాడు. ఎలాగైనా రామ గుణాభివర్ణనము వాల్మీకికి దివ్యమైన సాహిత్య విందు. రామునిలోని కళ్యాణగుణాలు లోకకళ్యాణానికి సోపానాలని భావించడము వల్లనే వాల్మీకి అలా విరివిగా వర్ణించడం జరిగింది.

మనం అయోధ్యాకాండము ప్రథమ సర్గలోనే ఉన్నాం. శ్రీరాముని సుగుణాలను వాల్మీకి మహర్షి వర్ణిస్తున్నాడు.

శ్రీరాముడు సౌందర్యవంతుడు. రూపసౌందర్యమే గాక శక్తిసౌందర్యము కూడా కలవాడు. గొప్ప పరాక్రమవంతుడు. అసమాన శూరుడు. వీరుడు. వగధీరుడు.

**న చ నిత్యం ప్రశాన్తాత్మా మృదుపూర్వంతు భాషతే**
**ఉచ్యమానోऽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే ॥**

"రాముడు సదా ప్రశాంతచిత్తుడు. మృదువుగా మాట్లాడుతాడు. ఎవరైన పరుషంగా మాట్లాడితే బదులు చెప్పడు."

రాముడు మృదువుగా, మధురంగా మాట్లాడేవాడు. అలాంటివారు మహిలో అరుదుగా గోచరిస్తుంటారు. తియ్యగా పలకాలంటే తియ్యని మనసు గలవారై ఉండాలి. చేదు మనసులు గలవారు తీపిమాటలను పలకలేరు.

కొందరు మోసగాండ్రు తియ్యగా మాట్లాడుతారు. ఆ తియ్యదనం కార్యం సిద్ధించు వరకే ఉంటుంది. కార్యం సఫలంకాగానే తీపి విరిగి చేదుగా మారుతూఉంటుంది. ఈ లక్షణము ఎక్కువశాతం రాజకీయనాయకుల్లో స్పష్టంగా తెలుస్తూఉంటుంది.

**The tongue breaketh bone**
**Though itself have none**

"తనకు ఎముకలు లేకపోయినా ఇతరుల బొమికలు విరిచే శక్తి నాలుకకుంది" అని ఆంగ్ల సామెత.

దివ్యపురుషుల మాటల్లోనే నిజమైన మృదుత్వము, మాధుర్యము ఉంటుంది. వారికి ఆశలుండవు. వారి స్వభావమే మధురం గనుక మాటలుకూడా మధురంగా ఉంటాయి.

రజస్తమోగుణాలు నిస్సారమై సత్త్వగుణము ప్రధానంగా వ్యక్తిలో భాసించినపుడే స్వభావము మధురంగా మారుతుంది. రాముని హృదయము మధురమైంది. ఆయన మనసు మధురం. మాట మధురం. మనుగడ మధురం.

"ఎవరైనా పరుషంగా మాట్లాడినా రాముడు మారుపలికేవాడు కాడు" అవును. అందుచేతనే "ప్రశాంతాత్మా" అని కీర్తించబడినాడు. అన్యులు పలికే పరుషవాక్కులు రాముని ప్రశాంతతను భగ్నం చేయలేకపోయేవి. అందువలన ప్రత్యుత్తరం చెప్పేవాడు కాడు. అంతేగాని చెప్పలేకకాదు.

ఇతరులు పరుషంగా మాట్లాడినంతమాత్రాన మనం పరుషవాక్కులు ఎందుకు పలకాలి? ఎవరి స్వభావాన్ని వారు కాపాడుకోవాలి అని రాముడు భావించేవాడు. కోపమెరుగని శాంతపురుషుడు రాముడు. కనుక కోపము ఆ మహాత్ముని సమీపించలేకపోయేది.

**కథంచి దుపకారేణ కృతే నైకేన తుష్యతి**
**న స్మర త్యపకారాణాం శతమ ప్యాత్మవత్తయా ॥**

"మంచి మనసుగల రాముడు ఎవరైన ఏదోఒకవిధంగా ఒక మేలు చేసినా దానికి ఎంతగానో సంతోషిస్తాడు. ఇతరులు ఎన్ని అపకారాలు చేసినా వాటిని స్మరింపడు."

రాముని మాటతీరును ముందుశ్లోకంలో చెప్పి, రాముని మనసుతీరును ప్రస్తుత శ్లోకంలో చెప్పుచున్నాడు వాల్మీకిమహర్షి. ఇది చాలా అందమైన శ్లోకము. ఆకర్షణీయమైన శ్లోకము. ఆదర్శమైన శ్లోకము. ఆచరించదగిన శ్లోకము.

ఇతరులు ఉపకారం చేస్తే సంతసించడం, అపకారం చేస్తే పరితపించడం మనకు అలవాటు. చిన్న ఉపకారానికి మనం సంతోషించం. పెద్దదైతేనే ఆనందిస్తాం. అంతేగాదు. ఉపకారం చేసినవాడు ఏ ఉద్దేశ్యంతో చేశాడో కూడా ఆలోచిస్తాం.

రాముడు అలాకాదు. తనకు ఎవరు ఏ చిన్న సహాయం చేసినా వారిపట్ల సంతసించి కృతజ్ఞతతో మెలిగేవాడు. అదికూడా "**కథంచిత్**" ఏదోవిధంగా జరిగిన ఉపకారము అంటున్నాడు మహర్షి.

చేయాలని చేయకపోయినా, సందర్భానుసారంగా గానీ, కాకతాళీయంగా గానీ తనకు ఏ కొద్దిపాటి ఉపకారము జరిగినా వారిపట్ల రాముడు కృతజ్ఞుడై, విధేయుడై ఉండేవాడు. అదియే ఆయనలోని సౌజన్యం.

అంతేగాదు. పనిగట్టుకొని తనకు వంద అపకారములు ఎవరైనా చేసినా వారిని గూర్చిగాని, వారు చేసిన కీడునుగూర్చిగాని స్మరింపడు. తనకు అపకారము చేసినారనే విషయాన్ని మరచిపోతాడు.

ఒకే ఒక్క చిన్న ఉపకారమును, అదికూడా అనుకోకుండా జరిగింది అయినా రాముడు కృతజ్ఞతతో మనసులో ధరిస్తాడు. తెలిసి వంద అపకారాలు చేసినా రాముడు వాటిని మనసులో నిలుపుకోడు. ఆహా(... ఇది రామునికి ఎలా సాధ్యం? ఆత్మవత్తయా మంచి మనసు కలవాడు అగుటచేత అని వాల్మీకియే చెప్పాడు.

మంచి మనసులు గలవారే మంచి మనుష్యులు. మంచిని కోరేవారంతా రాముడు నడచిన మంచి బాటలో మంచి మనసుతో సాగిపోవాలి. ఇతరులు చేసిన చిన్న ఉపకారమును కూడా విస్మరించకూడదు. అలాగే మనపట్ల ఇతరులు చేసిన పెద్ద అపకారమును కూడా స్మరించకూడదు. ఇదియే ప్రేమజీవనం. రామునివలె సర్వులు ప్రేమజీవనాన్ని అలవరచుకోవాలి.

**Man reveals himself to man in love and sympathy.**

"సానుభూతి, ప్రేమలలోనే మనిషి మనిషికి స్నేహపాత్రుడవుతాడు," అంటారు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్.



ఈవిధంగా రాముని సుగుణాలను వర్ణించుటకు కదలిన వాల్మీకి అనేక అద్భుత విషయాలను మనముందు ఉంచుతాడు. రాముని ఔన్నత్యమును చూపుతాడు.

**బుద్ధిమాన్ మధురా భాషీ పూర్వభాషీ ప్రియంవదః**
**వీర్యవాన్న చ వీర్యేణ మహతా స్వేన విస్మితః**

"రాముడు బుద్ధిమంతుడు. మధురంగా మాట్లాడువాడు. అలాగే "**పూర్వభాషీ**" అంటే ఇతరులకన్నా ముందుగా తానే ప్రియంగా పలకరించేవాడు. గొప్ప పరాక్రమవంతుడు. అలాగని గర్వించనివాడు.

రాముడు అసత్యమాడి ఎరుగడు. సమస్త విషయములు తెలిసినవాడు. పెద్దలను గౌరవించువాడు. దయామయుడు. జితక్రోధుడు. ధర్మజ్ఞుడు. దీనులపై జాలి కలవాడు.

**అనురక్తః ప్రజాభిశ్చ ప్రజాశ్చా ప్యనురజ్యతే**

ప్రజలకు రామునిపై ఎంత ప్రేమ ఉండేదో రామునికి కూడా వారిపై అంతప్రేమ ఉండేది.

రాముడు ధర్మవిరుద్ధమైన విషయములయందు ఆసక్తిలేనివాడు. సాధుస్వభావుడు. దైన్యము లేనివాడు. ఋజువర్తనము కలవాడు. **సాధురేకో వినిర్మితః** ప్రపంచంలో పుట్టిన ఏకైక సత్పురుషుడు.

ఇట్టి శ్రేష్ఠగుణములు కలవాడైనందున ప్రజలందరు రామునిపై ప్రగాఢమైన ప్రేమ గలవారై, రాముని తమ బహిఃప్రాణముగా భావించారు.

శ్రీరాముడు చతుర్విధ పురుషార్థముల సత్యస్వరూపమును తెలిసినవాడు. విస్మృతి లేనివాడు. అమోఘమైన సమయస్ఫూర్తి కలవాడు. నమ్రత గలవాడు. మనసులోని భావమును ముఖంలో తెలియనివ్వడు. సేవాభావము కలవాడు. దాననిర్ణయమున నిష్ణాతుడు.

రాముడు దృఢభక్తి కలవాడు. మొండిపట్టుదల తెలియనివాడు. పరుషవాక్కులు పలుకనివాడు. సోమరితనము, ఏమరిపాటు లేనివాడు. అన్యుల దోషములనేగాక స్వదోషములను కూడా గుర్తించగలిగినవాడు. అలసత్వము లేనివాడు.

అసూయ లేనివాడు. గర్వము, క్రోధము లేనివాడు. మత్సరము తెలియనివాడు. ఎవరిని అవమానించి ఎరుగడు. "ఏ గాలికి ఆచాప" అనే మాటకు విముఖుడు.

ఓర్పులో రాముడు భూదేవిని మించినవాడు. బుద్ధిలో బృహస్పతికి అధికుడు. పరాక్రమములో ఇంద్రునికన్నా దిట్ట.

సర్వులకు సంతసమునుగూర్చు సుగుణాలంకార భూషణుడైన శ్రీరాముడు తండ్రికి ఆనందమును కలిగిస్తూ, సూర్యుడు కిరణములతో ప్రకాశించునట్లు తన సుగుణ కిరణజాలముచే దేదీప్యమానంగా ప్రకాశించాడు.

## దశరథుని అంతర్మథనము

సీతారాములు పన్నెండు సంవత్సరాలు ఆనందంగా, సుఖంగా అయోధ్యలో జీవించారు. అసమాన పరాక్రమవంతుడగు రామునిగూర్చి దశరథుడు ఆలోచించసాగాడు.

"నేను ముసలివాణ్ణయ్యాను. నేను జీవించియుండగా రాముడు రాజగునా? పట్టాభిషిక్తుడైన రాముని నేను చూడగలనా? నా ఈ కోరిక నెరవేరుతుందా?

"రాముడు నాకంటె కూడా ప్రజలకు ఇష్టుడు. ప్రజాక్షేమము కోరువాడు. సర్వులను దయతో ప్రేమించు నా రాముడు వర్షించుమేఘమువలె ప్రజలను చక్కగా పరిపాలించగలడు. రాముడు పరిపాలించుటను చూచి నేను కళ్ళుమూయాలని కుతూహలపడుచున్నాను;" అని దశరథుడు వ్యథచెందసాగాడు. దశరథుని మానసికకల్లోలాన్ని తులసీ,కంబరామాయణాలు విశేషించి చెప్పాయి.

ఒకనాడు దశరథుడు నిద్రించాడు. ఆనాటి రాత్రి స్వప్నంలో సముద్రజలం ఇంకిపోయినట్లు, చంద్రమండలం ఊడి క్రిందపడినట్లు, పట్టపుటేనుగు క్రిందపడి గిలగిల తన్నుకుంటున్నట్లు గోచరించింది. నాల్గవజామున వచ్చిన ఈ కల నిజమగునేమోయని దశరథుడు భీతిచెందాడు.

ఉదయముననే దశరథుడు నిలువుటద్దం ముందు నిలబడి తన ముఖమును దర్శించగా కిరీటము కొద్దిగా ప్రక్కకుతొలగి జారినట్లు అగుపించింది.

**స్రవన్ సమీప భయే సిత్ కేసా మనహు జరఠపను అస ఉపదేసా ॥**
**నృప జువరాజు రామ కహుఁ దేహూ జీవన్ జనమ లాహు కి న లేహూ ॥**

ఆయన చెవికి దగ్గరగా ఒకటి రెండు తెల్లవెంద్రుకలు ఉన్నాయి. "రాజా! రామునికి పట్టముగట్టి నీ జీవితాన్ని సఫలం చేసికోవెందుకని?" అని ముసలితనము ప్రశ్నించినట్లు అనిపించింది అంటాడు సంత్ తులసీదాస్.

దశరథుడు పులకితగాత్రు డయ్యాడు. నేత్రాలు ఆనందబాష్పాలను రాల్చాయి. జరాజీర్ణమైపోతున్న తన దేహంపై విశ్వాసాన్నిపెట్టక శ్రీరామునికి పట్టాభిషేకం చేయాలని దశరథుడు సంకల్పించాడు. లోకప్రియుడైన రాముని పట్టాభిషేకము తన ఆవేదనకు చరమవాక్యం పలుకగలదని భావించాడు.

అయోధ్య సమీపంలో ఉన్న రాజులను, నగరములోని అధికారులను, గ్రామాధికారులను పిలిపించాడు. జనకమహారాజును, కేకయరాజును పిలిపించలేదు. ఈ శుభవార్తను వారు తరువాత వింటారు అని భావించాడు. రాముని తొందరగా యువరాజును చేయాలని భావించుటే ఈ నిర్ణయాలకు కారణంగా తెలుస్తున్నది.

## శ్రీరాముడు లోకాభిరాముడు

దశరథుడు సభలో రాజులను, అధికారులను ఉద్దేశించి ఇలా పలికాడు.

"ఉత్తమమైన ఈ రాజ్యమును శ్రేష్ఠులైన మా పూర్వీకులు ఎలా పరిపాలించారో మీకందరికి తెలుసు. ఈ కోసలరాజ్యాన్ని కన్నబిడ్డకన్నా మిన్నగా మా పూర్వీకులు పోషించిన విషయం మీకు విదితమే. అటువంటి రాజ్యానికి మిక్కిలి శ్రేయస్సును, ఆనందమును కల్గించాలని నేను సంకల్పించాను.



"మా పెద్దలు నడచిన బాటలోనే నడిచి నేనుకూడా యథాశక్తిగా ప్రజల్ని కాపాడాను. ఇలా ప్రజల్ని పాలించుచుండగా నాశరీరం తెల్లనిగొడుగు నీడనే శిథిలమైపోయింది. జీర్ణమైన ఈ దేహం విశ్రాంతిని కోరుతూవుంది.

"రాజ్యభారము చాలా బరువైనది. జితేంద్రియులే ఈ భారాన్ని మోయగలరు. రాజ్యభారాన్ని వహించి వహించి నేను బాగా అలసిపోయాను. కనుక పెద్దల అంగీకారమును పొంది, రాజ్యభారమును నా కుమారుడైన రాముని భుజములపై నుంచి నేను విశ్రాంతి తీసికొన దలచాను. ధర్మసంరక్షకులలో శ్రేష్ఠుడు, పురుషశ్రేష్ఠుడు అయిన రాముని పట్టాభిషిక్తుణ్ణి చేయాలని నా ప్రగాఢ వాంఛ.

"ఈ రాజ్యమునకు రాముడు ప్రభువుగా తగినవాడు. రాముని ప్రభువుగా పొంది కోసలరాజ్యం అమితంగా సుఖించగలదని నా అభిప్రాయం.

"ఇది నా ఆలోచన. ఇది సముచితమో కాదో మీరు చెప్పండి. దీనికన్నా మరేదైనా హితకరముగా యున్నచో నిస్సంశయముగా తెల్పండి. మధ్యవర్తుల ఆలోచనలు ఉభయ తారకంగా ఉంటాయి" అని వినమ్రుడై పలికాడు దశరథుడు.

దశరథుని మాటలు వినిన రాజులు వర్షించే నీలమేఘాన్ని చూసి నెమళ్ళు ఉప్పొంగి ధ్వని చేయునట్లు సంతోషించారు. "బాగున్నది-బాగున్నది" అని మధురమైన, ప్రతిధ్వనించే శబ్దాలతో చేసిన వారి ధ్వనులు రాజభవనము కదిలిపోయేవిధంగా విన్పించాయి.

ఆ తరువాత బ్రాహ్మణులు, ప్రధానులైన రాజులు, ముఖ్యులైన గ్రామవాసులు, నగరవాసులు కలిసి ఆలోచించి, ఏకాభిప్రాయానికి వచ్చి దశరథునితో ఇలా పలికారు.

"మహారాజా! నీవు వృద్ధుడవయ్యావు. శ్రీరాముని యువరాజుగా చేయుట సముచితమైన నిర్ణయము. తెల్లని గొడుగుక్రింద, భద్రగజముపై ఆసీనుడై రాముడు ఊరేగుతూ వెళ్తూ ఉంటే చూడాలని మాకూ ఆసక్తిగా వుంది. రాముడు గొప్పవీరుడు. రఘువంశానికి మకుటం వంటివాడు" అన్నారు.

వారి మాటలు వినిన దశరథుడు అర్థంకానట్లు నటిస్తూ ఒక సంశయాన్ని వారి ముందుంచాడు. "రాజులారా! నామాట వినగానే రాముడు రాజుకావాలని మీరంతా ఏకాభిప్రాయానికి వచ్చారు. నా మనఃప్రీతికి ఇలా పలికారా? నన్ను వ్యతిరేకించడం ఇష్టంలేక ఇలా తెలిపారా? అలాకానిచో, నేను ధర్మబద్ధంగా రాజ్యాన్ని పరిపాలిస్తుండగా మీరు రాముని ఎందుకు కోరుకుంటున్నారు? నా పరిపాలనలో దోషములున్నాయా? లేనిచో రాముని మీరెందుకు అభిలషిస్తున్నారు?" అని పలికాడు దశరథమహారాజు.

ఇదే నిజమైన ధర్మపరిపాలన. రాముని పట్టాభిషిక్తుణ్ణి చేయడం దశరథుని చేతిలోని పని. ఈ విషయంలో మరొకరి ప్రమేయం అవసరం లేదు. అయినా అధికారులను, ప్రజలను, రాజులను, పురోహితులను సంప్రదిస్తున్నాడు దశరథుడు. ఇదే ప్రజాతంత్ర పరిపాలన. ఇదియే నిజమైన ప్రజాస్వామ్యం. ఈనాటికీ, ఆనాటికీ పరిపాలనలో గల తేడాను విజ్ఞులు గుర్తించగలరు. ఈనాడు ప్రజాతంత్రం పేరుతో ఏకఛత్రాధిపత్యం నడుస్తూ ఉంది. ఆనాడు ఏకఛత్రాధిపత్యం క్రింద ప్రజాస్వామ్యం శోభిల్లుతుండేది.

దశరథుని మాటలనాలకించిన రాజులు, పౌరులు దశరథునితో ఇలా పలికారు.

"మహారాజా! నీ కుమారుడైన రాముడు సద్గుణవంతుడు. సురులతో సమానుడు. బుద్ధిమంతుడు. ఆయన సుగుణాలు సర్వులకు సమ్మతములు. సంతోషకరములు.

**బహవో నృప కళ్యాణా గుణాః పుత్రస్య సన్తి తే**

"రాజా! నీ కుమారుడైన రామునియందు అనేక కళ్యాణగుణములున్నాయి;" అని లోకులందరు రాముని గుణానుకీర్తనము చేయసాగారు. ఇక్కడ సుగుణాభిరాముడైన శ్రీరాముడు లోకాభిరాముడయ్యాడు.

"దశరథమహారాజా! రాముడు సత్యపరాక్రమశాలి. ఇక్ష్వాకు వంశమున ఉద్భవించిన రాజులందరికంటెను ఉత్తముడు. రాముడు సత్పురుషుడు. సత్య ధర్మాలను ప్రేమించేవాడు. ధనము, ధర్మము వేరుగాకుండా చూచే నేర్పరి శ్రీరాముడు.

"ప్రజలకు ఆహ్లాదమును కల్గించుటలో రాముడు చంద్రునివంటివాడు. ఓర్పునందు భూదేవివంటివాడు. బుద్ధిలో బృహస్పతివంటివాడు. శౌర్యమున ఇంద్రునివంటివాడు.

"రాముడు స్థిరమైన ఆలోచనలు కలవాడు. ప్రాణులకు ప్రియమైన మాటలు పలుకుతాడు. పెద్దలయెడ ఎనలేని గౌరవము కలవాడు. రాజా! ప్రజల క్షేమమును రాముడు స్వయంగావెళ్ళి తండ్రిలాగా అడిగి తెలుసుకుంటాడు.

"రాజా! మీ పరిపాలనలో మేము ఎన్నడూ దుఃఖపడలేదు. మీ మీద సంశయముతో గాని, మీ మనః ప్రీతికి గాని మేము రాముని వాంఛించుటలేదు. మీలోని కళ్యాణగుణములు మమ్మెంతగానో ఆనందింపజేశాయి. కానీ మీకన్నా అధికంగా రామునిలో కొన్ని శుభలక్షణాలున్నాయి. వాటిచేత మేము సమ్మోహితులమయ్యాము. చెబుతాము. వినండి.

**వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః**
**ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి ॥**

"మాలో ఎవరికైనా ఆపద వచ్చినపుడు రాముడు తీవ్రంగా దుఃఖిస్తాడు. మాకు సుఖం కలిగితే, కుమారుని సౌఖ్యమును చూచి తండ్రి సంతోషించినట్లు రాముడు సంతోషిస్తాడు.

"రాజా! ప్రజలు దుఃఖిస్తే రాముడు అధికంగా దుఃఖిస్తాడు. ప్రజలు సంతోషిస్తే రాముడు అధికంగా సంతోషిస్తాడు. ఇలాంటి రాజు ఎవరికి లభిస్తాడు? అతడు మా పుణ్యాల పంట. మా ప్రార్థనల మూట.

"రాజా! నీ పూర్వపుణ్యావశమున రాముడు నీకు పుత్రుడుగా జన్మించాడు. లోకుల పుణ్యావశమున ఆయన మాకు ప్రభువగుచున్నాడు. దశరథమహారాజా! నీ కుమారుడైన శ్రీరాముడు యౌవరాజ్యాభిషిక్తుడై శోభిల్లుటను చూడాలని లోకమంతా నిరీక్షిస్తూవుంది.

**సుభ్రూరాయ తతాభ్రాక్ష సాక్షాద్విష్ణు రివ స్వయమ్**
**రామో లోకాభిరామోఽయం శౌర్య వీర్య పరాక్రమైః**

"లోకాభిరాముడైన శ్రీరాముడు సుందరమైన కనుబొమలు కలవాడు. విశాలమైన ఎఱ్ఱని నేత్రములు కలవాడు. శౌర్య వీర్య పరాక్రమముల చేత సాక్షాత్తు విష్ణువే అన్నట్లున్నాడు" అని లోకులందరు రాముని లోకాభిరామునిగా కీర్తించారు.

ఇచ్చట అయోధ్యాపురి వాసులైన ప్రజల రాజకీయపాండిత్యమును కూడా మనం గుర్తించి గ్రహించాలి. తమను పరిపాలించే రాజు ఎలాంటివాడైఉండాలి అనేది ప్రజలకు తెలుసు. రాజుకు



ఎలాంటి గుణాలు వుండాలో ఎరిగినవారై ఉన్నారు ప్రజలు అయోధ్యలో. ఈ విషయంలో నేడు మనం ఎంత వెనుకబడిఉన్నామో ఆలోచింపనవసరంలేకనే అవగతమవుతుంది. విద్యాధికులు, మేధావులు అనబడేవారుకూడా ఈనాడు ప్రజ్ఞాహీనులై ప్రవర్తించడం శోచనీయం. సంస్కారం లేని విద్యలు సమాజ శరీరంలో వ్యాధులై మిగిలిపోతాయి.

రామరాజ్యంలో ప్రజలు ధర్మపరులు. కర్తవ్య పరాయణులు. తమలోని నైతిక విలువలతో రాజ్యానికి శోభనిచ్చేవారు. తమకు రాజుకాబోయే రామునియొక్క సుగుణాలన్నీ ప్రజలకు తెలుసు. కానీ ఈరోజుల్లో అనామకుడు ఎన్నికల్లో నిలబడతాడు. అతడ్ని ప్రజలు గెలిపిస్తారు. అతని గుణగణాలు ప్రజలు పట్టించుకోరు."నోటికేం పెట్టించాడు - చేతికేం పట్టించాడు" ఇదే చూస్తున్నారు ప్రజలు. గొర్రెలను కొన్నట్లు ప్రజలను కొనే సమాజం ఎలా ప్రగతిని చూస్తుంది?

ఇక్ష్వాకువంశం పరిపాలించినపుడు నిజమైన ప్రజాస్వామ్యం శోభిల్లింది. మనం బాలకాండలో ఒక విషయాన్ని చూశాం. సగరచక్రవర్తి కుమారుడైన అసమంజుడు రాజు కావడాన్ని ప్రజలు అంగీకరించలేదు. ప్రజాభిప్రాయానికి విలువిచ్చి తన కుమారుని రాజ్యమునుండే తరిమివేశాడు సగరుడు. అదీ ప్రజాస్వామ్యమంటే.

ఈనాడు శ్రీరాముని రాజుగా చేయమని ప్రజలు సహేతుకంగా అభ్యర్థిస్తున్నారు. అందుచేత దశరథుడు అంగీకరిస్తున్నాడు. ఇదీ ప్రజాతంత్ర పరిపాలన అంటే.

రాముని కాలంలో రాజ్యం ఇలా ఉండేది. ప్రజలు అలా ఉండేవారు.

## పట్టాభిషేక ప్రయత్నాలు

రాముని యౌవరాజ్యాభిషిక్తుణ్ణి చేయమని ప్రజలు బద్ధాంజలులై రాజుని ప్రార్థించారు. దశరథుడు వారి అంజలులను అభినందించి ప్రియమైన, హితమైన వచనాలు పలికాడు.

"నా భాగ్యము సాటిలేనిది. నా అదృష్టము చాలా గొప్పది. నాకు ఇష్టుడైన నా పెద్ద కుమారునికి పట్టాభిషేకం జరిపించమని మీరు కోరుతున్నారు. నాకు చాలా సంతోషంగా ఉంది" అనిపలికి వసిష్ఠవామదేవులవైపుతిరిగి దశరథుడు ఇలా పలికాడు.

"ఇది చైత్రమాసం. చాలా రమణీయమైనది. మంగళకరమైనది. వనాలు, అరణ్యాలు చక్కగా పుష్పించి వున్నాయి. ఇది చాలా అనుకూలమైన సమయం. రామపట్టాభిషేకానికి సర్వమూ సమకూర్చండి;" అని చెప్పగనే ప్రజలంతా హర్షధ్వానాలతో పెద్ద కోలాహలం చేశారు.

ఈ సందర్భమున సంత్ తులసీదాసు రామచరిత మానసంలో ఒక విషయాన్ని ప్రత్యేకంగా ప్రస్తావిస్తాడు. రాముని పట్టాభిషిక్తుని చేయుటకు ముహూర్తమును నిర్ణయించమని దశరథుడు వసిష్ఠుని కోరుతాడు. అప్పుడు వసిష్ఠుడు దశరథునితో,

**బేగీ బిలంబు న కరిఅ నృప సాజి఍ సబుఇ సమాజు**
**సుదిను సుమంగలు తబహిఀ జబ్ రాము హోహిఀ జువరాజు ॥**

"రాజా! త్వరపడు. ఆలస్యము చేయకు. వెంటనే సన్నాహములు చేయించుము. శ్రీరాముడు యువరాజుగ పట్టముగట్టిన దినమే సుదినము. సుమంగళము" అంటాడు.

ఈ మాటలో ద్వంద్వార్థము చోటుచేసికొని యున్నది. రేపు సుదినము గనుక పట్టాభిషేకము చేయాలని దశరథుని అభిప్రాయము. రాముడు పట్టాభిషిక్తుడైన రోజే సుదినము

అని వసిష్ఠుని నిర్వచనము. ఈ శుభకార్యము ఎవరి ఆధీనమునందును లేదు అని ఆ మాటలో ధ్వనిస్తున్నది.

రాముని యౌవరాజ్యము కొరకు సన్నాహాలు చేయవలసిందని దశరథుడు ఆదేశించాడు. వసిష్ఠుడు ఆయాపనులకు వ్యక్తులను నియమించి సముచిత సలహాలు ఇచ్చాడు. ఏర్పాట్లు ప్రారంభమై శీఘ్రంగా సాగుతున్నాయి.

దశరథుడు సుమంత్రుని పిలిచి రాముని త్వరగా తీసికొనిరమ్మని చెప్పాడు. సుమంత్రుడు వెళ్ళి రాముని రథములో ఎక్కించుకొని వచ్చాడు.

ఈ సందర్భమున సంత్ తులసీదాసు ఒక విషయం చెబుతాడు.

సుమంత్రుడు దశరథుని ఆజ్ఞను రామునికి తెలుపగనే సీతారాముల భుజములు కదలినాయట. దీనికి శకున ఫలము ఏమై ఉండాలి? అని దంపతులు పరస్పరము చర్చించుకొని, ఒక నిర్ణయానికి వచ్చి ఇలా భాషించుకున్నారట.

**పులకి స ప్రేమ పరసపర కహహిఁ భరత ఆగమను సూచక అహహిఁ**
**భయే బహుత్ దిన్ అతి అవసేరీ సగున ప్రతీతి భేంట్ ప్రియకేరీ**

"ప్రేమపూరితమైన ఈ రోమాంచితము భరతుని ఆగమనమును సూచించునట్లున్నది. భరతుడు మామగారింటికి వెళ్ళి చాలా రోజులైంది. ఈ శకునములు భరతుని కలయికను సూచిస్తున్నాయి" అని ఆనందిస్తారు సీతారాములు.

భరతునిపై సీతారాములకున్న ప్రేమానురాగాలను ఈ సంఘటన విశదీకరిస్తూ ఉంది. శుభాలు, సుఖాలకు సంబంధించి ఏ శకునములు గోచరించినా వాటిని పంచుకోవడానికి భరతుడుండాలి అనిపిస్తుంది రామునికి. ఇది ఆదర్శమైన సోదరప్రేమ.

తల్లిరక్తాన్ని పంచుకొని పుట్టింది, తండ్రి ఆస్తిని పంచుకొనేందుకు కాదు. ప్రేమతో జీవించేందుకు. కష్టసుఖాల్ని సమంగా పంచుకొనేందుకు.

దేవతల నడుమ దేవేంద్రుడు శోభించునట్లు రాజుల మధ్య దశరథుడు ప్రకాశిస్తున్నాడు. రాముడు గంధర్వరాజువలె దశరథుని సమీపించుచుండగా ఎంత చూచినను దశరథునకు తృప్తి కలుగలేదు.

రాముడు తండ్రిని సమీపించాడు. వినమ్రుడై, అంజలిఘటించి, **"రామ వర్మాహం భో అభివాదయే"** అని తన పేరును వినిపిస్తూ తండ్రి పాదాలకు నమస్కరించాడు.

రాముని అంజలిపద్మమును పట్టుకొని దగ్గరకు తీసికొని ప్రేమతో గాఢాలింగనం చేసుకున్నాడు దశరథుడు. ఉత్తమమైన ఆసనముపై రాముని కూర్చుండబెట్టాడు. అచ్చట ఉపవిష్ఠుడైన రాముడు ప్రాతఃకాలమున మేరుపర్వతముపై నిర్మల కాంతితో సూర్యుడు ప్రకాశించినట్లు భాసించాడు. శరత్కాలచంద్రునివలె శోభించాడు.

తన ప్రియపుత్రుడైన రాముని పదే పదే చూస్తూ దశరథుడు ఆనందిస్తున్నాడు. తనను అలంకరించుకొనిన పిదప దర్పణములో స్వరూపమునుగాంచి ఆనందించునట్లు రాముని చూచి మురిసిపోతున్నాడు.



"రామా! నా జ్యేష్ఠభార్య కౌసల్య పరమయోగ్యురాలు. ఆమె గర్భమున జన్మించిన జ్యేష్ఠ పుత్రుడవగు నీవు మహా యోగ్యుడవు. నీ శ్రేష్ఠ గుణముల వలన నీవు నాకు అత్యంత ప్రియుడవయ్యావు.

"రామా! నీ కళ్యాణగుణములచే ప్రజలను మిక్కుటంగా ఆకర్షించావు. నాయనా! నీకు యువరాజ పట్టాభిషేకము చేయాలని సంకల్పించాను. నీవు వినయవంతుడవు. గుణవంతుడవు. అయినా నీపై నాకున్న ప్రేమచేత కొన్ని విషయాలు చెప్పదలచాను. విను.

**భూయో వినయ మాస్థాయ భవ నిత్యం జితేన్ద్రియః**
**కామక్రోధ సముత్థాని త్యజేథా వ్యసనానిచ ॥**

"రామా! వినయాన్ని ఇంకా పెంచుకో. ఇంద్రియాలను సదా నియమించు. కామక్రోధాల వలన ఉత్పన్నమయ్యే వ్యసనాలకు దూరంగాఉండు" అన్నాడు దశరథుడు.

కామము వలన పది వ్యసనములు, క్రోధము వలన ఎనిమిది వ్యసనములు కలుగుతాయని మనుస్మృతి బోధించింది.

కామజనిత వ్యసనములు :- 1. వేట 2. జూదము 3. పగటి నిద్ర 4. పరుల దోషములను లెక్కించుట 5. స్త్రీ సంపర్కము 6. మద్యపానము 7. నృత్యము 8. గీతము 9. వాద్యము 10. దేశదిమ్మరితనము.

క్రోధజనిత వ్యసనములు :- 1. చాడీలు చెప్పుట 2. సాహసము 3. ద్రోహబుద్ధి 4. ఈర్ష్య 5. అసూయ 6. ధనమును అపహరించుట 7. తిట్టుట 8. కొట్టుట.

ఈ పద్దెనిమిది వ్యసనములు రాజైనవాడికి ఉండతగనివి. అందుచేత వీటికి దూరంగా ఉండమని దశరథుడు రామునికి ఉపదేశించాడు.

ఈనాటి పరిపాలకులలో ఇవి పాక్షికంగా ఉన్నాయో, పూర్ణంగా ఉన్నాయో, అసలు లేవో గ్రంథవిస్తరణ భీతితో మీ ఊహకే వదలిపెడుతున్నాను.

రాముని యౌవరాజ్యాభిషిక్తుని గావిస్తున్నట్లు దశరథుడు రామునితో చెప్పిన మాటలను విన్న రాముని మిత్రులు ఆనందంతో ఉరకలేస్తూ వెళ్ళి ప్రియమైన ఈ వార్తను కౌసల్యకు చెప్పారు. ఆ మాటవిని సంతసించిన కౌసల్య వారికి బంగారము, గోవులు, రత్నములను బహూకరించింది.

రాముడు దశరథునికి నమస్కరించి, అందమైన రథమునెక్కి, జనులందరూ నమస్కరించుచుండగా తన భవనానికి వెళ్ళాడు.

రాజ్యాభిషేక వార్త రామునిలో ఏవిధమైన అధికోత్సాహమునుగానీ, సంతోషాతిశయమును గాని కల్పించలేకపోయింది. సుఖాలకు పొంగకుండా స్థిరంగా, స్థిమితంగా ఉండే రాముని మనకు పరిచయంచేస్తాడు వాల్మీకి.

కాని రాముడు ఆ వార్తను విని వ్యధచెందినట్లు తులసీదాస్ వర్ణిస్తాడు.

తండ్రి దగ్గరనుండి రాముడు తిరిగి వస్తున్నాడు. రాముడు ఇలా అనుకుంటాడు.

"ఆహా! భగవంతుడా! ఏమిటీ వైపరీత్యం? మా తల్లులు పాయసమును ఒకే ముహూర్తంలో భుజించారు. అన్నదమ్ములమైన మేము ఒకే సమయాన పెద్ద తేడా లేకుండా జన్మించాము.

భోజనములయందు, శయనమునందు, ఆటలయందు, విద్యాభ్యాసమునందు మేము ఒకరిని విడిచి మరొకరుండలేదు.

"చౌలము, కర్ణవేధము, ఉపనయనము, వివాహము ఇవన్నీ ఒకే ముహూర్తములో మాకు జరిగాయి. ఈ రాజ్యాభిషేకము నాకొక్కడికే జరగడమేమిటి? మా నలుగురికి కలిసి జరగాలి. జ్యేష్ఠునికే జరగాలి అనడము అనుచితము.

**బిమల వంస యేహు అనుచిత ఏకూ**
**బంధు బిహా ఈ బడేహి అభిషేకూ ॥**

"నిర్మలమైన ఈ సూర్యవంశంలో ఒకే ఒక కళంకము ఉంది. సోదరులందరిని విడిచి పెద్దకుమారునికి పట్టాభిషేకం చేయడం" అన్నాడట ధర్మాత్ముడైన రాముడు.

రాముని ఈ ధర్మవచనానికి స్పందించిన తులసీదాస్ మహాత్ముడు ఒక కమ్మని మాట చెప్తాడు.

**ప్రభు స ప్రేమ పఛితాని సుహాయీ**
**హర ఉ భగతమన కై కుటిలాయీ ॥**

"రామచంద్రప్రభువు యొక్క ఈ సుందర ప్రేమపూర్ణ వచనాలు మనలోని కుటిలత్వాన్ని పోగొట్టుగాక !"

'జ్యేష్ఠుడే రాజుకావాలి' అని వసిష్ఠుడు పలికినపుడు రాముడంటాడు "నేను పెద్దవాణ్ణి గనుక నా జ్యేష్ఠత్వము, శ్రేష్ఠత్వము నాకు ఉండనేవుంది. భరతుడు రాజైతే రాజుగా తనూ పెద్దవాడవుతాడు. అప్పుడు ఇద్దరమూ సమానంగా ఉంటాముకదా!" అంటాడు రాముడు.

ఈనాడు ఆస్తికోసం అన్నదమ్ములు ఒకరిఆస్తికలు ఒకరుచూడాలనే ఉబలాటాన్ని కనపరచేవారు, అన్యాయాన్ని ఆశించి న్యాయస్థానాల చుట్టూ తిరిగేవారు, జీవితాంతము ఒకరి ముఖాన్ని మరొకరు చూడకూడదని శపథం చేసి జీవించేవారు-ఇలాంటి వారినే ఎక్కువగా మనం చూస్తున్నాము. పైగా ఇలాంటి ప్రబుద్ధులే రాముని విమర్శిస్తూ ఉంటారు. ఎక్కడ రాముడు? ఎక్కడ మనం? ఇకనైనా రాముడు చూపిన బాటలో చరిస్తాం. రాముడు పంచిన ప్రేమలో రమిస్తాం.

## సంతోషాలు - సంబరాలు

రాముడు వెళ్ళిన తరువాత దశరథుడు మంత్రులతో సమావేశమైనాడు. పుష్యమీ నక్షత్రము గనుక రాముని రేపే యౌవరాజ్యాభిషిక్తుని చేయాలని నిర్ణయించాడు. సుమంత్రుని పిలిచి రాముని మరొకసారి తీసికొనిరమ్మని చెప్పాడు.

సుమంత్రుడు రాముని భవనానికి వచ్చాడు. విషయాన్ని వివరించాడు. రామునికి సందేహం కలిగింది. తనను మళ్ళీరమ్మని తండ్రి ఎందుకు పిలిచాడో చెప్పమని సుమంత్రుని ప్రశ్నించాడు.

"దశరథమహారాజు రమ్మని కబురంపాడు. వెళ్ళుటయా లేక మానుటయా అనేది మీరు నిర్ణయించుకోవలసిన విషయం" అన్నాడు సుమంత్రుడు. రాముడు బయలుదేరి దశరథుని చూచుటకై రాజప్రాసాదానికి వచ్చాడు.



దశరథుడు రాముని ఒక ప్రత్యేక గదిలోనికి పిలిపించుకున్నాడు.రాముడు తండ్రి పాదాలకు నమస్కరించాడు. దశరథుడు రాముని లేవదీసి కౌగిలించుకున్నాడు.

"రామా! దీర్ఘాయువు ననుభవించిన నేను ఇపుడు వృద్ధుడనయ్యాను. నా జీవితములో యజ్ఞాలు,దానాలు విరివిగా చేశాను. నీకు రాజ్యాభిషేకము చేయుటయే నాకు మిగిలియున్న కార్యము. రామా! నిన్ను రేపే యౌవరాజ్యాభిషిక్తుని చేస్తున్నాను. ఇది ప్రజలందరి అభిలాష.

"నాయనా! అంతేకాదు. ఇటీవల అనేకములైన దుస్స్వప్నములను నేను దర్శిస్తున్నాను. పిడుగులతో కూడిన ఉల్కలు పగటియందే రాలుతున్నాయి. ఇవన్నీ అపశకునములు. ఇలాంటి సందర్భాలలో రాజుకు మృత్యువైనా రావచ్చు లేదా ఆపదలైనా సంభవించవచ్చు.

"రామా! నా మనసు మారకముందే నీవు అభిషిక్తుడవుకా! **చలాహి ప్రాణినాం మతిః** మానవుల మనసులు చంచలములు కదా! నా మనస్సు నన్ను తొందరపెట్టుచున్నది. రేపే నిన్ను యౌవరాజ్యాభిషిక్తుని చేస్తాను" అంటూ ఇంకా ఏదో ఏదో చెప్తున్నాడు కుతూహలంతో దశరథుడు.

ఈ సందర్భమున దశరథుని శుద్ధబుద్ధి ఏదో రాబోయే విపత్తును అస్పష్టంగా ఊహిస్తూ వుందని నా మనసుకనిపిస్తున్నది. ఇకముందు చెప్పబోయే విషయాలలో కూడా ఈ విషయం వ్యక్తమవుతూ ఉంటుంది. మీరూ ఆలోచిస్తూ చదవండి.

"రామా! ఈ రాత్రి నీవు నిగ్రహవంతుడవై ఉండు. ఉపవాసము నవలంబించి దర్భాసనముపై పడుకో. శుభకార్యాలకు విఘ్నములు ఎక్కువగా ఉంటాయి. నీ మిత్రులను అప్రమత్తులుగా వుండి నిన్ను రక్షింపమని చెప్పు.

**విప్రోషి తశ్చ భరతో యావదేవ పురాదితః**
**తావ దేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతో మమ**

"నాయనా! భరతుడు అయోధ్యానగరానికి దూరమున ఉండగానే నీకు పట్టాభిషేకము జరుగవలెనని నా అభిమతం.

"నీ తమ్ముడైన భరతుడు ధర్మాత్ముడు. దయాశీలుడు. జితేంద్రియుడు. సన్మార్గ వర్తనుడు. సదా అన్ననే అనుసరించువాడు. రామా! ధర్మనిరతులైనవారి మనసు కూడా చలించే ప్రమాదముందని నా అభిప్రాయము. సరే. ఇక నీవు వెళ్ళు;" అని దశరథుడు పలుకగా శ్రీరాముడు తండ్రికి నమస్కరించి తన భవనానికి వెళ్ళాడు.

ఈ సందర్భమున భరతుని విషయాన్ని దశరథుడు అస్పష్టంగా ప్రస్తావించడం అనేక అనుమానాలకు తావిస్తూ ఉంది. భరతుడు అయోధ్యకు దూరంగా ఉండగనే రాజ్యాభిషేకం జరగాలని దశరథుడు పలకడంలో ఆంతర్యమేమిటి?

భరతుడు కేకయదేశంలో మేనమామ యుధాజిత్తు వద్ద ఉన్నాడు. కేకయదేశం అయోధ్యకు చాలా దూరాన వుంది. అందుచేత భరతుడు వచ్చేందుకు ఆలస్యమవుతుంది. ఈ కారణంగా అలా పలికి ఉంటాడా?

అవును. లేకపోతే భరతుని ధర్మాత్మునిగా, సన్మార్గవర్తనునిగా, జ్యేష్ఠభ్రాతను అనుసరించు వానివిగ దశరథుడు ఎందుకు వర్ణిస్తాడు?

అంతవరకు బావుంది. కానీ అంతగా భరతుని శ్లాఘించిన దశరథుడు చివరగా ధర్మనిరతులైనవారి మనసులుకూడా చలించే ప్రమాదం ఉందని ఎందుకు పలికాడు?

పరస్పర వైరుధ్యముగల ఈ మాటలనుబట్టి చూస్తే మనకు ఏదీ స్పష్టం కావడం లేదు. భరతుని దశరథుడు అనుమానిస్తున్నాడా? లేదా? అనే విషయంలో ఏర్పడే మీమాంసకు సుస్పష్టమైన సమాధానం లభించడంలేదు. కారణమేమిటి? ఈ విషయం దశరథుని మనసులోనే స్పష్టంగా లేదని నా అభిప్రాయము.

రాముని యౌవరాజ్యాభిషిక్తుని గావించి దర్శించాలనేదే ఈనాడు దశరథుని అంతర్యమును పెనవేసుకొనియున్న ప్రగాఢమైన ఏకైక వాంఛ. ఈవాంఛ ఇక ఇరవై నాలుగు గంటలలో నెరవేరబోతూవుంది.

జీవితములో ఆశించిన గొప్పవిషయము ఫలించబోయేముందు మనసు ఆందోళన చెంది అసందర్భపు ఆలోచనలు చేయడం సహజం. దీనికి మనస్తత్వశాస్త్ర ఆమోదం కూడా ఉంది. తాను తలపెట్టిన కార్యము మహోన్నతమైన దైనపుడు ఆమాత్రం ఆందోళన అనివార్యమే మరి. భయం సహజమే.

భయాందోళనలకు లోనైన మనసు అనేక విషయాల్ని నిరాధారంగా ఊహించే ప్రమాదం కూడా ఉంది. కానీ దశరథుని మనసు అలా నిరాధారంగా ఊహించింది అని నేను భావించడం లేదు.

కైకేయితో తన వివాహసందర్భమున దశరథుడు కేకయరాజుకు మాటిచ్చి ఉన్నాడు. అది స్మృతిలోమెదిలుంటుంది. మనస్సు భయపడుతూ ఉంది. తన ప్రియమైన రాముని రాజ్యాభిషేక మహోత్సవానికి అవాంతరాలు, అవరోధాలు అడ్డుతగులుతాయేమోనని మనసు శంకిస్తూ ఉంది.

పుణ్యాత్ములకు రాబోయేవిపత్తులు అవగతమయ్యే అవకాశముంది అనే ఆధ్యాత్మిక సత్యాన్ని మనం తృణీకరించలేము. దశరథుని నిర్మలాంత:కరణము రాబోయే ఆపదను అస్పష్టంగా పసిగట్టి ప్రదర్శించి ఉండొచ్చు.

ఒకవైపు భరతుని శీలంపై ప్రగాఢమైన విశ్వాసం ఉంది. మరొకవైపు మనోగతుల్ని మదింపువేయడం సాధ్యంకాదనే భావనా ఉంది. భరతుని విషయంలోనే గాకుండా తన విషయంలో కూడా దశరథుడు అలాగే ఆలోచిస్తున్నాడు. మనుషుల మనసులు చలిస్తుంటాయి. కనుక తన బుద్ధి మారకముందే రాముడు అభిషిక్తుడు కావాలని చెప్పడంలో దశరథుడు తన మనసును గూడా శంకిస్తున్నట్లు తెలుస్తూనే ఉంది. ఈ పరస్పర విరుద్ధ భావ సంఘర్షణలో రాముని యౌవరాజ్యాభిషేకం తొందరగా రేపే ముగియాలని దశరథుడు ఉబలాట పడుతున్నాడు.

దశరథుని వద్దనుండి సెలవు పుచ్చుకొని తన భవనానికి వెళ్ళిన రాముడు, వెంటనే అక్కడనుండి బయలుదేరి తన తల్లియైన కౌసల్యాదేవి అంత:పురానికి వచ్చాడు.

కౌసల్య పూజామందిరము నందున్నది. పట్టాభిషేక వార్తను వినిన కౌసల్య లక్ష్మీదేవిని ధ్యానిస్తూ వుంది. పట్టువస్త్రములు ధరించి ధ్యానమగ్నయై ఉన్న కౌసల్య సమీపమున సుమిత్ర, లక్ష్మణుడు, సీత కూడా ఉన్నారు. కౌసల్య లక్ష్మీనారాయణులను ధ్యానించింది.



రాముడు కౌసల్యను సమీపించి, "అమ్మా! ప్రజాపరిపాలన బాధ్యతను తండ్రిగారు నాకప్పగించారు. రేపు రాజ్యాభిషేకము జరుగునట్లు నిర్ణయించారు. సీతతోపాటు నన్ను ఈ రాత్రి ఉపవసించమని చెప్పారు," అన్నాడు.

కౌసల్య చిరకాలవాంఛ నేడు తీరుచున్నది. ఆమె హృదయం ద్రవించింది. నేత్రాలు ఆనందబాష్పాలను చిందించాయి. రామునితో కౌసల్య మధురంగా ఇలా పలికింది.

"నాయనా! రామా! చిరంజీవివి కమ్ము. అజాతశత్రువుగా శోభించుము. నీ తండ్రి గారిని సంతోష పెట్టావు. వత్సా! నా పూజలు ఫలించాయి. రాజ్యలక్ష్మి నిన్నాశ్రయింపబోతున్నది;" అని పలికింది కౌసల్య.

తల్లి మాటల నాలకించిన రాముడు ప్రక్కనే వినమ్రుడై అంజలిఘటించి కూర్చుని యున్న లక్ష్మణుని చూశాడు. చిరునవ్వును చిందించాడు.

"లక్ష్మణా! నీవు నా రెండవప్రాణము. కనుక రాజ్యలక్ష్మి నిన్నుకూడా వరించింది. నీవు రాజ్యమునేలు. రాజ్యసుఖముల ననుభవించు.

**జీవితం చ హి రాజ్యం చ త్వదర్థ మభికామయే**

"లక్ష్మణా! ఈ రాజ్యమును నీకొరకే నేను అంగీకరించాను. నాయనా! నా జీవితము కూడా నీకొరకే" అని పలికి తల్లు లిరువురికి నమస్కరించి, సీతను వెంటబెట్టుకొని రాముడు తన భవనానికి వెళ్ళాడు.

## అయోధ్యలో ఆనంద తరంగాలు

వసిష్ఠమహర్షి రాముని భవనానికి వచ్చాడు. రాముడు ఎదురేగి మహర్షికి నమస్కరించాడు. వసిష్ఠుడు సీతారాములచే మంత్రపూర్వకముగా ఉపవాసము చేయించాడు. రాముడు వసిష్ఠుని పూజించాడు.

వసిష్ఠుడు వెళ్ళినపిదప రాముడు తన ఆంతరంగిక మిత్రులతో ప్రియంగా సంభాషించి అంత:పురము లోనికి వెళ్ళాడు. రాముని భవనము విహరించే పక్షులతో, వికసించే కమలములతో నిండిన సరస్సులాగా స్త్రీపురుషులతో కళకళలాడింది.

రాముని భవనమునుండి రథంలో తిరిగివెళ్తున్న వసిష్ఠమహర్షి జనులతో క్రిక్కిరిసి యున్న మార్గాన్ని చూశాడు. ఎచ్చట చూచినా హర్షాతిరేకంతో తరంగములవలె చేరియున్న జనసమూహములే కన్పిస్తున్నాయి.

అయోధ్యలో అన్ని వీధులను తుడిచి నీళ్ళుచల్లారు. అరటి మొదలైన వృక్షములను అందంగా అలంకరించారు. గృహాలపై ధ్వజాలు ఎగురవేశారు. ప్రజలందరు రాముని రాజ్యాభిషేకమును వీక్షించాలనే కుతూహలంతో ఎప్పుడు తెల్లవారునాయని నిరీక్షిస్తున్నారు.

రాజమార్గాలన్నీ జనసందోహంతో సముద్రంలాగున్నాయి. వసిష్ఠుడు జనసంకులమైన రాజమార్గమున రథముపై పయనిస్తూ ఆ జనసముదాయమును రెండు పాయలుగా విభజించు వానివలె కదులుతూ, మెల్లగా రాజభవనం చేరాడు. బృహస్పతి దేవేంద్రుని కలిసినట్లు వసిష్ఠ మహర్షి దశరథుని కలిశాడు.

వసిష్ఠమహర్షి ద్వారా సన్నాహాలు ఎలా జరుగుచున్నవో దశరథుడు తెలుసుకున్నాడు. ఆ తరువాత వసిష్ఠుని అనుమతిని పొంది సింహము పర్వతగుహలోకి వెళ్ళినట్లు దశరథుడు అంతఃపురములోనికి వెళ్ళాడు.

దశరథుని అంతఃపురము దేవేంద్రభవనమువలె శోభించింది. దశరథుడు ప్రవేశించగనే, నక్షత్రములతో నిండిన ఆకాశమున చంద్రుడు ప్రవేశించినట్లు, అంతఃపురము శోభాయమానంగా ప్రకాశించింది.

బ్రహ్మముహూర్తం సమీపించింది. రామునితోపాటు అయోధ్యానగరవాసులందరు మేల్కొన్నారు. రాముడు ప్రాతఃకాల సంధ్యనాచరించి గాయత్రి నుపాసించాడు.

బ్రాహ్మణులు పుణ్యాహవచనము జరిపించారు. శ్రీరాముడు మహావిష్ణువును పూజించాడు.

అయోధ్యానగర ప్రజలు నగరము నంతటినీ శోభాయమానంగా అలంకరించారు. వీధులలో, ఆలయాలమీద, చెట్లమీద, ఎత్తైన భవనాలమీద, కోటబురుజుల పైన రంగు రంగుల పతాకములను ఎగురవేశారు.

రామాభిషేకము సమీపిస్తోంది. నటులు అక్కడక్కడ అభినయించుచుండగా, గాయకులు కొన్నిచోట్ల గానంచేస్తున్నారు. నర్తకులు మనోహరంగా నృత్యం చేస్తున్నారు. ఎక్కడ చూచినా పట్టాభిషేకమునకు సంబంధించిన మాటలే వినిపిస్తున్నాయి. ప్రజలందరు దశరథమహారాజును ప్రశంసిస్తున్నారు. గొప్పమనసుగల వ్యక్తిగా దశరథుని వర్ణిస్తున్నారు. అభిషేక మహోత్సవమును తిలకించుటకు పరిసర ప్రాంతములనుండి వచ్చిన జన సమూహముతో అయోధ్య నిండిపోయింది. అధిక జనసంచారము వలన ఏర్పడిన ధ్వని సముద్ర ఘోషవలె వినిపిస్తూ ఉంది. అయోధ్య అమరావతివలె శోభించింది.

## మధ్యలో మహాపాపి

కైకేయికి మంథర అనే దాసి ఉంది. అది పొట్టిది. గూనిది. క్రూర స్వభావం కలది. పచ్చని సంసారంలో చిచ్చు పెట్టగల కుటిల స్వభావురాలు. కైకేయి పుట్టింటినుండి అరణపు దాసీగా వచ్చి అయోధ్యలో కైకేయివద్ద దాసీగా ఉంటూవుంది.

మంథర అనుకోనివిధంగా అంతఃపురం మేడమీదకెక్కి నిలబడింది. అయోధ్యలో నగరవీధులన్నీ నీళ్ళతో తడిపిఉండడము, పూలు చల్లి ఉండడము చూచింది.

ఎటుచూచినా పతాకాలు రెపరెపలాడుతున్నాయి. ప్రజలందరు శిరఃస్నానము చేసి, పట్టుబట్టలు కట్టుకొని సంచరిస్తున్నారు. విప్రులు వేదఘోషలు పలుకుతున్నారు. అలంకరించిన అశ్వములు, ఏనుగులు ఉత్సాహంతో తిరుగుతున్నాయి. వెల్లవేయుట వలన దేవాలయపు గోడలు తెల్లగా ప్రకాశిస్తున్నాయి. రకరకాల వాద్యాలు శ్రావ్యంగా మ్రోగుతున్నాయి.

ఇంతలో మరొక అంతఃపుర దాసి మంథరను సమీపించింది. "ఏమిటే! ఈరోజు తెల్లని పట్టుచీరతో ముస్తాబయ్యావు. ఏమిటి నగరంలో విశేషం? అయోధ్య వైభవోపేతంగా ప్రకాశిస్తోంది. కారణమేమిటి?



**ఉత్తమే నాభి సంయుక్తా హర్షేణార్థపరా సతీ**
**రామమాతా ధనం కిం ను జనేభ్యః సంప్రయచ్ఛతి ॥**

"రాముని తల్లి ధనముపై ఆసక్తి గలది. అట్టి లుబ్ధురాలు సంతోషంగా దానాలిస్తున్నది. కారణమేమిటి?

"నగరమంతా ఆనందంతో పొంగిపోతూవుంది. ఏమిటిదంతా? రాజేమైనా గొప్ప కార్యము చేయుమన్నాడా?" అన్నది మంథర.

ఇక్కడ కౌసల్యను 'రామమాతా' అని పిలుస్తున్నది మంథర. కౌసల్యపై మంథరకు ఎంత ఈర్ష్య వుందో దీనినిబట్టి గ్రహింపవచ్చు. కౌసల్య పేరును ఉచ్చరించుటకు కూడా మనసు అంగీకరించలేదు. అందుచేత రాముని తల్లి అని సంబోధించింది. పైగా దాసియైన మంథర కౌసల్యను లుబ్ధురాలుగా చిత్రీకరిస్తున్నది.

మంథర మాటలను ఆలకించిన అంతఃపుర పరిచారిక సంతోషంతో ఊగిపోతూ "అదేమిటి? నీకు తెలియదా? మన రాముడికి రేపు ఉదయం యౌవరాజ్యపట్టాభిషేకం" అని చెప్పింది.

ఆమాట విని మంథర మండిపడింది. త్వరత్వరగా మేడదిగి కైకేయి మందిరానికి వెళ్ళింది.

దుష్టులైనవారు గొప్పస్థాయినుండి ఎలా పతనమౌతారో తెలిపేందుకే మంథరను మేడపైనుండి తొందరగా క్రిందికి దింపాడు వాల్మీకి.

మంథర కైకేయి మందిరంలో ప్రవేశించింది. కైకేయి పడుకొని వుంది. మంథర తీవ్ర స్వరంతో, "లే.... లే.... మూర్ఖురాలా! ప్రళయ జలాలవలె దుఃఖాలు ముంచుకొస్తుంటే ఇంకా నిద్రేనా? లే... లే... నిన్ను ఆపదలు చుట్టేస్తున్నాయి. "నా భర్తకు నేనే ప్రియమైన భార్యను. నేనే ఇష్టురాలను" అని గర్వించావు. నీ సౌభాగ్యమంతా వేసవికాలంలో నదీప్రవాహంలాగా అదృశ్యమైపోతోంది;" అని దుఃఖిస్తోంది.

మంథర మాటలు కైకేయికి అర్థం కాలేదు. మంథర మాటలకు కైకేయి దిగులు చెందింది. "మంథరా! ఎందుకు అలా దుఃఖిస్తున్నావు? దిగులుతో నీ ముఖం కుంచుకుపోయి వుంది. విషయమేమిటో చెప్పు. మన క్షేమానికి భంగమేమీ రాలేదుకదా?" అన్నది కైకేయి.

మంథర కైకేయిమనసును పాడుచేసేందుకు ఉద్యమించింది. "క్షేమమడుగుతున్నావా? పిచ్చిదానా! ఇంకేమి క్షేమం? జరగవలసిందంతా జరిగిపోయింది. రేపు ఉదయం రామునికి యువరాజ పట్టాభిషేకం జరుగబోతోంది. నా దుఃఖానికి ఇంతకన్నా మరొక కారణం ఏం కావాలి? నన్ను నిప్పుల్లో వేసినట్లే ఉంది. ఏంచేయాలో అర్థం కావడంలేదు. నీవద్దకు పరుగెత్తుకొంటూ వచ్చాను.

"నీవు సుఖంగా ఉంటే నాకు సుఖం. నీ అభివృద్ధే నా అభివృద్ధి. అలాంటప్పుడు నీ దుఃఖం నా దుఃఖం కాకుండాపోతుందా?

"అయ్యో! నీకు ఎంత ఘోరం జరిగిపోయింది? రాణివైయుండి కూడా రాజుల క్రూరత్వాన్ని తెలుసుకోలేకపోయావు. అమాయకురాలా! నీ భర్త దుష్టుడు. పైకి ధర్మాలు బోధిస్తాడు. ప్రక్కనే

అపకారం చేస్తాడు. తియ్యటి మాటలతో గొంతుకోస్తాడు. నీవు కల్లాకపటం తెలియనిదానివి. అమాయకంగా మోసపోతున్నావు.

"నీ భర్త మోసగాడు. వంచకుడు. లాభంలేని మాటలు చెప్పి నిన్నూరిస్తాడు. కౌసల్య మందిరానికే మోస్తాడు. భరతుణ్ణి మేనమామగారింటికి పంపి, రాముడికి అవరోధం లేకుండా పట్టాభిషేకం జరిపిస్తున్నాడు. అతడు నీకు పతిగాదు. నీ బ్రతుకుకు చితి.

"పిచ్చిదానా! నీ భర్తచేసే మోసాన్ని నీవు గ్రహింపలేకపోతున్నావు. పసిబిడ్డ పామును చేరదీసినట్లు అతడికి తల్లిలాగా హితాన్ని కోరుతున్నావు. ఉపేక్షిస్తే పాము ఏమిచేస్తుందో, శత్రువు ఏంచేస్తాడో, నీ భర్త నీ విషయంలో అదే చేస్తాడు. నీ కుమారుడైన భరతుని విషయంలో అదే చేశాడు.

"మూర్ఖురాలా! నిన్ను బూటకపు మాటలతో ఊరడిస్తూ, ఆ పాపాత్ముడు రామునికి పట్టాభిషేకం చేస్తాడు. అంతా జరిగిపోతుంది. నిన్ను సమూలంగా నాశనం చేస్తాడు. ఆలోచించు. నీవూ, నీ కుమారుడు, నిన్ను ఆశ్రయించినవాళ్ళు అందరూ కూలిపోతారు. జాగ్రత్త!" అంటూ, కైకేయి పుట్టింటినుండి కలిసి వచ్చిన గూనిది చనువుతో శ్రుతిమించి వికారాలను ఒలకబోసింది. వైషమ్యాలను నూరిపోసింది.

మంథర ఎంతగా చెప్పుకపోతున్నా ఆమాటల ప్రభావం కైకేయి మనసుపై పడలేదు. రాముడు యౌవరాజ్యాభిషిక్తుడు అవుతున్నాడు అనే మాటే ఆమె హృదయంలో నిలిచిపోయింది. ఆనందంతో ఆమె మనసు పులకరించింది.

అంతవరకు పడుకొనియున్న కైకేయి శరత్కాల చంద్రరేఖవలె లేచి, "మంథరా! ఎంత ప్రియమైన వార్త చెప్పావు. ఇదిగో! ఈ ప్రియమైన వార్తను వినిపించిననీకు నాకులత్యంత ప్రియమైవ ఆభరణము నిస్తున్నాను. తీసుకో! మంథరా! ఇంకేమన్నా కావాలేమో అడుగు. సంశయించకు.

**రామే వా భరతే వాహం విశేషం నోప లక్షయే**
**తస్మాత్తుష్టాస్మి యద్రాజా రామం రాజ్యేఽభిషేక్ష్యతి**

"మంథరా! నాకు రాముడెంతో భరతుడూ అంతే. వారిరువురికి నాదగ్గర భేదం లేదు. అందుచేతనే రాముని యౌవరాజ్యాభిషేక వార్త నన్నెంతగానో తృప్తిపరచింది.

"మంథరా! నాకు ఇంతకంటె ప్రియమైన వార్త మరొకటుండదు. ఈ వార్తను తెచ్చిన నీకు మంచి వరాన్ని ప్రసాదిస్తాను. కోరుకో;" అన్నది కైకేయి.

కైకేయి మాటలు మంథరను తీవ్ర దుఃఖానికి గురిచేశాయి. మంథర కళ్ళెర్ర జేసింది. తన పండ్లు పటపట కొరికింది. కైకేయి బహూకరించిన ఆభరణాన్ని విసిరి నేలపైకొట్టింది. మెడలోని దండలను లాగి తెంపేసుకుంది. అపస్వరంతో బిగ్గరగా గాండ్రించింది.

"బుద్ధిహీనురాలా! నీవు శోకసముద్రంలో పడియున్నావు. ఈ సత్యం తెలియక అది పాలసముద్రమనుకొని సంతసిస్తున్నావు. మహాదుఃఖము ప్రాప్తించిన సమయాన నీవు వెర్రిదానివై ఆవందిస్తున్నావు. నిన్ను చూచి నవ్వాలో, ఏడ్వాలో నాకర్థం కావడంలేదు.

"కైకేయీ! ఎంత అమాయకురాలివే! నీ బుద్ధిహీనతను గాంచి నేను దుఃఖిస్తున్నాను. సవతికొడుకు అభివృద్ధితో పొంగిపోతుంటే ఏ ఆడదైనా సంతోషిస్తుందా? ఇది మృత్యువును ప్రేమించుట కాదా?



"రాముడు రత్నాల పల్లకీలో ఊరేగుతుంటే నీ కుమారుడు చేతులుకట్టుకొని సేవకుని వలె ప్రక్కన నడిచే అదృష్టం ప్రాప్తించినందుకా ఈ ఆనందము? ఈ సంబరము?

"కైకా! చెబుతున్నాను. విను. దీనివెనుక ఎంతో కుట్ర దాగివుంది. పన్నాగాలు పన్నడంలో కౌసల్య అందెవేసిన చేయి. తన మేలు తాను మరవదు. తన సౌఖ్యానికి అవరోధం కల్గుతుందంటే దానికి కారణమైనవారిని తొలగించకపోదు. వారి బ్రతుకుల్ని కూలగొట్టకపోదు. నా బాధంతా పాపం భరతుని గురించే!

"కైకేయీ! రాముడికి పట్టాభిషేకం జరిగితే భరతుని బ్రతుకేమౌతుందో ఆలోచించావా! రాముడు చాలా తెలివైనవాడు. ఏనాడైన తన చాపక్రిందికి నీళ్ళురావడమంటూ జరిగితే అది భరతునివల్లనే జరుగుతుందని రాముడు ఊహించకపోడు.

"లక్ష్మణుడు రాముని సేవిస్తున్నాడు. అలాగే శత్రుఘ్నుడు భరతుని సేవిస్తున్నాడు. వారిరువురు చిన్నవారైనందున, పైగా సేవాభావతత్పరులైనందున వారివలన రామునికి ఏ అడ్డంకులుండవు. జన్మక్రమాన్ననుసరించి చూస్తే రాముని తరువాత రాజ్యానికి భరతుడే అర్హుడు.

"కైకా! ఇప్పుడాలోచించు. భరతుడు ఉన్నాడనే భయం రామునికి ఉండదంటావా? రామునికి లోకజ్ఞానం పూర్తిగా వుంది. భయంతో బ్రతుకును కొనసాగించుకోవాలని రాముడు ఎప్పుడూ అభిలషించడు.

"మనసులో భరతుడు రామునికి శత్రువౌతాడు. భయంతోనేగదా రాజులు శత్రువుల్ని వధిస్తారు. భయంతోనేగదా మానవులు తేళ్ళు, పాములను చంపుతారు. భరతుని విషయంలో రాముడూ అంతే. రాముడు సింహాసనంపై కూర్చున్న క్షణం నుండి భరతుడు ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకొని కాపాడుకోవలసి ఉంటుంది.

"నాయనా! భరతా! పసిబిడ్డవు. అభంశుభం తెలియని అమాయకుడివి. నీ జీవితం ఏమవుతుందో! రామునివలన నీకు రాబోయే విపత్తు నాకు సుస్పష్టంగా తెలుస్తూ ఉంది. నీ తల్లికేమో పగటిని చూచేందుకు దివిటీ కావాలట!

"కైకేయీ! నీవు ఇంత మూర్ఖురాలవవుతావని నేనెన్నడూ కలగనలేదు. సత్ప్రవర్తన, ధనుర్విద్యాపాటవము నీ బిడ్డలో ముచ్చటగొలుపుతున్నా ఏం ప్రయోజనం? దేవలోకం నుండి అమృతాన్ని తెచ్చి గరికపాదులో పోసినట్లు చేస్తున్నావు. భరతునికి తీవ్రంగా అన్యాయంచేస్తున్నావు.

"కైకా! కౌసల్య భాగ్యవంతురాలు. ఆమె తన కుమారుని యౌవరాజ్యాభిషేకమును రేపుగాంచి మురిసిపోతోంది. రాముడు రాజుకాగానే ఆమె రాజమాత అవుతుంది. నీవు ఆమెవద్ద చేతులుకట్టుకొని నిలబడాలి. నీ కుమారుడు రాముడికి సేవకుడై ఉంటాడు. రాముని భార్య-ఆ సీత ఆనందంతో మురిసిపోతుంటే, నీ కోడలు మూతిముడుచుకొని ఏ సంతోషానికి నోచుకోకుండా మూలపడి ఉంటుంది;" అంటూ మంథర గొప్ప ఉపన్యాసం చేసింది.

మంథర దుఃఖపూరిత వాక్కులను ఆలకించిన కైకేయి ఉదాత్తంగా ఉదారవచనాలు పల్కింది. సముచిత హితోక్తులు వినిపించింది.

"మంథరా! రాముడు ధర్మజ్ఞుడు. కృతజ్ఞుడు. నిర్మల చరితుడు. మచ్చలేని బిడ్డ. దశరథునికి జ్యేష్ఠకుమారుడైన రాముడే యువరాజపట్టాభిషేకానికి అర్హుడు.

"రాముడు సోదరులను, ప్రజలను కన్నబిడ్డల్లాగా పాలిస్తాడు. గూనుదానా! నీకెందుకు దుఃఖం కల్గుతూవుంది? రాముని తరువాత భరతుడే ఉత్తరాధికారి. భరతుడు కూడా రాజ్యాన్ని పరిపాలిస్తాడు.

"మంథరా! మనకు మంచిరోజులు వచ్చాయి. మున్ముందు ఇంకా మంచిరోజులు రాబోతున్నాయి. నీవు అనవసరంగా ఏడవకు. వేడుకలు ఎదురౌతుండగా ఏడుపుల్తో ఆహ్వానం పలుకుతావెందుకు?

**యథా మే భరతో మాన్య స్తథా భూయోపి రాఘవః**
**కౌసల్యా తోऽతిరిక్తం చ సో హి శుశ్రూషతే హి మామ్ ॥**

"మంథరా! నాకు భరతుడు ఎలాంటివాడో రాముడూ అలాంటివాడే. నిజం చెప్పాలంటే రాముడే నాకు అధిక ప్రేమపాత్రుడు. రాముడు కౌసల్యకంటే నన్నే ఎక్కువగా సేవిస్తూ ఉంటాడు.

"రాముడికి రాజ్యముంటే అది భరతునికి కూడా ప్రాప్తించినట్లే. రాముడు రాజయ్యాడా, లక్ష్మణ భరత శత్రుఘ్నులు కూడా రాజులైనట్లే. తనకు, తన సోదరులకు మధ్య రామునికి భేదం తెలియదు;" అని పలికి మంథర మనోగగనంలో ఆవరించియున్న సంశయ మేఘాలను తన ప్రేమవచన మారుతంచే చెదరగొట్టేందుకు ప్రయత్నించింది కైకేయి.

కైకేయి మాటలనాలకించిన మంథరకు దుఃఖం కట్టలు త్రెంచుకుంది. నిట్టూర్పులు విడుస్తూ, "అయ్యో! కూతురా! అన్నెం పున్నెం తెలియక అగాధంలో పడిపోతున్నావు. నిన్నెవరు రక్షిస్తారు? దుఃఖసముద్రంలో మునిగిపోతున్నావు. అయినా నిన్నునీవు రక్షించుకొనే ప్రయత్నాన్ని పూర్తిగా విరమించుకుంటున్నావు.

"కైకేయీ! రాముని తరువాత భరతుడు రాజౌతాడా? ఏమిటే ఈ అమాయక ప్రసంగము! తల్లీ! రాముడు రాజైతే, ఆ తరువాత రాముని కుమారుడు రాజవుతాడుగాని భరతుడు రాజుకాడు. భరతుని నామరూపాలుకూడా మిగలవు. చిరునామాకూడా దొరకదు.

"రాణీ! నీ బిడ్డడు రాజ్యానికి, సుఖాలకు శాశ్వతంగా దూరమవుతాడు. నీ మేలుగోరి నేను చెబుతున్నా. అయినా నీవు అర్థంచేసుకోవడంలేదు.

"నా తల్లీ! ఆలోచించు. బాగా ఆలోచించు. భరతుడు రాజైతే నీవు రాజమాతవవుతావు. "నా చాకిరి నాకు తప్పదు. నీవు చీదరించుకుంటున్న ఈ గూనిదానికి ఈ నేనవుతానా? గొడవంతా ఎందుకు చెప్పు!

"బిడ్డా! కాస్త మనసు నిలిపి ఆలోచించు. యౌవరాజ్యాభిషేకము రేపు జరుగబోతోంది కదా! ఈ క్షణం వరకు నీకు తెలిసిందా! ఈ గూనిది చెప్పడంవల్ల తెలిసిందేగాని రాజుగారు నీతో ఒక్కమాటైనా చెప్పాడా! ఎందుకు చెప్పలేదు? ఇంతటి ప్రధాన విషయాన్ని ముద్దుల భార్యకి ఎవరైనా చెప్పకుండా ఉంటారా! పిచ్చిదానా! ముద్దుల భార్యట.... ముద్దుల భార్య! నీవు మొద్దువని తెలిసే ఈ సుద్దులు పలుకుతున్నారందరు. మాటల్లో ముద్దులు, మురిపాలు. మనసుల్లో మోయలేని మోసాలు! ఆహాః మాయాప్రపంచమా!



"నా చిట్టితల్లీ! ఎంత పిచ్చిదానివే! రామాభిషేకం నీకు తెలియదు. మరి కౌసల్యకు కూడా తెలియదంటావా? కౌసల్యకుకూడా తెలియకపోతే ఆవిడ ఆనందాన్ని ప్రకటిస్తూ బహుమానాలు ఎలా ఇస్తోంది?

"పోనీలే. భరతుడు రాముడు ఇద్దరూ నాకు ఒక్కటే అని నీవు అంటున్నావు కదా! అలాగే కౌసల్య కూడా రాముడు భరతుడు తనకు ఒక్కటే యని భావిస్తుందా? అదే నిజమైతే పట్టాభిషేకవార్తను కౌసల్య నీతో ఆనందంగా ఎందుకు పంచుకోలేదు? రాజ్యంలో అతి ముఖ్యమైన యౌవరాజ్యాభిషేకమును నీకు తెలుపకుండా రహస్యంగా ఉంచడంలో రహస్యమేమిటి?

"ఇంతకీ నాకు సిగ్గులేదు. కందకిలేని దురద కత్తిపీటకెందుకు? నీ దగ్గర పడియున్నదాన్ని. నీ మేలుగోరడం, నీబిడ్డ మేలుగోరడం నాధర్మం. తిన్నింటి వాసాలు లెక్కెట్టడం నాకు తెలీదు.

"రాముడు రాజుకాగానే భరతుని రాముడు అడవులపాలైనా చేస్తాడు. లేదా కర్కశంగా చంపేస్తాడు. ఇది నా నిశ్చితాభిప్రాయం. కనుక భరతుడు మేనమామగారి ఇంటినుండి అయోధ్యకు రావడంకన్నా అరణ్యానికి పోవడమే మంచిదని నా సలహా. పిచ్చితండ్రి! అలాగైనా ప్రాణాల్ని రక్షించుకుంటాడు.

"కైకేయీ! నీ విధివ్రాత ఎలావుంటే అలా జరుగుతుంది. నేను చెప్పగలదాననే గాని చేయగలదానను గాను. ఒక్కమాట మాత్రం గుర్తుంచుకో. అరణ్యంలో సింహము గజరాజును తరిమి తరిమి పట్టుకొనునట్లు రాముడు భరతుని కబళిస్తాడు. నన్ను నీవు ఎలా నిందించినా ఫరవాలేదు. బిడ్డను రక్షించుకో.

"నీవే గొప్ప అదృష్టవంతురాలివని గతంలో విర్రవీగావు. నీ సవతియైన కౌసల్యను అనాదరంగా చూశావు. ఇప్పుడు కౌసల్యవంతు వచ్చింది. జాగ్రత్త.

"రాముడు రాజైననాడు భరతుడు బిచ్చగాడేనని మరువకు. కౌసల్య రాజమాత అయిననాడు నీ బ్రతుకు రాళ్ళపాలేనని గుర్తుంచుకో.

"రాముడు వికాసంతో ప్రకాశిస్తుంటే భరతుడు వినాశంతో పతనమౌతాడు. కౌసల్య కులుకుతుంటే నా కైకేయి కుములుతూ ఉంటుంది," అని బోరున ఏడ్చింది మంథర.

మంథర మత్తుమాటల ముందు కైకేయి పిచ్చిదైపోయింది. అనుకున్నది మంథర సాధించింది. కైకేయి మనసును పిచ్చిమాటలతో పేల్చేసింది. అతికించను వీలులేని రీతిలో మనసును ముక్కలుచేసింది.

రామునిపై దీర్ఘద్వేషాన్ని కైకేయి మనసుకు పట్టించింది మంథర. అంతర్యంలో అనుమాన పందిరి వేసి, ఈర్ష్యాసూయ తీగలను ప్రాకించింది. క్రోధ సర్పాలను అందులో మకాం పెట్టించింది.

చేయవలసిందంతా క్షుణ్ణంగా చేసింది మంథర. జరగవలసిందంతా జరిగిపోయింది. ప్రేమ విరిగిపోయింది. బాంధవ్యం కరిగిపోయింది. అనురాగం చెరిగిపోయింది. ఆప్యాయతలు మరిగి ఆవిరైపోయాయి.

అంతా అయోమయం. అంతా మారణహోమం.

మాయమాటలతో మహేంద్రజాలాన్ని సృష్టించింది మంథర.

కల్లబొల్లి మాటలలోని మర్మాన్ని గ్రహించలేక ఆహుతైపోయింది కైకేయి.

మనుషుల్లో ఎన్ని మాయలు! బయటికి హంసల్లా గోచరిస్తారు. లోపల కాకులై కనిపిస్తారు. మంచిని బయట ప్రదర్శిస్తారు. వంచనను ఆంతర్యంలో దాచుకుంటారు. ఇలా ఎందరో! ఎందరెందరో! మరెందరో! అందరి ప్రతినిధిగా మంథర ఈనాడు మన ముందర నిలిచింది. అంతే.

## మాయలమారి మంథర

మంథర నూరిపోసిన మాయమాటలు కైకేయిపై తీవ్ర ప్రభావాన్ని చూపాయి. ఆమె దేహం కాలిపోతూవుంది. అవయవాలన్నీ వణకుతున్నాయి. శరీరమంతా చెమటతో తడిసిపోయింది.

కైకేయి యజ్ఞపశువుగా తయారైంది. మంథరయొక్క కుటిలవచనములు అనే కత్తికి బలియైపోయింది. చెంచుస్త్రీ పాడే పాటకు మురిసి మృగము ఆస్త్రీని సమీపించి అసువులు బాయునట్లు, మంథర మాటలకు తలవంచిన కైకేయి రాబోయే విపత్తును గ్రహించలేక ఆహుతైపోయింది.

మంథర నిజంగా తన శ్రేయోభిలాషి అని కైకేయి భావించింది. ప్రేమతో మంథరను సమీపించి ఆవిడ భుజంపై చెయ్యివేసింది. అంతే. కైకేయి మనసు చెడిపోయింది. పాపిని ఎన్నడూ ముట్టుకోకూడదు.

“మంథరా! రాముని పీడ ఎలా వదలించుకోవాలి? తక్షణమే భరతునికి పట్టాభిషేకము చేయించే మార్గమేమిటి? ఆలోచించి చెప్పు” అన్నది కైకేయి.

“కైకేయీ! చాలా సంతోషము. నీకు లాభదాయకమైన ఉపాయమును చెప్పమని నన్ను అడుగుచున్నావు. నీవు నీకు తెలిసిన ఉపాయమును మరచి నన్ను అడుగుచున్నావా? లేక తెలియనట్లే అభినయించి నానుండి వినాలని అడుగుతున్నావా? ఏది ఏమైనా నన్ను చెప్పమంటున్నావు కనుక నీ హితముకోరి చెప్పుచున్నాను. విను.



“పూర్వం శంబరాసురునితో నీ భర్త యుద్ధంచేసిన సమయాన నీకు ఆయన రెండు వరాలను ప్రసాదించి యున్నాడు. అవసర సమయాల్లో వాటిని నీవు కోరుతానని భర్తతో చెప్పియున్నావు. దేవీ! ఇదికూడా నేను చూడలేదు. నీవు నాకు చెప్పిన వృత్తాంతమే. నీపై యున్న ప్రేమచే నేను ఆ విషయమును ఈనాటికీ మరువలేదు.



“కైకేయీ! నీకు భర్త ఇచ్చిన రెండు వరాలను ఇప్పుడు కోరు. భరతునికి యౌవరాజ్య పట్టాభిషేకము జరగాలి. ఇది మొదటివరము. పద్నాలుగు సంవత్సరాలు రాముడు సుదూరప్రాంతము వెళ్ళి నివసించాలి. ఇది రెండవ వరము.

“రాముడు పద్నాలుగు సంవత్సరాలు అయోధ్యా ప్రజలకు దూరమవుతాడు. ఈలోగా భరతుడు తన ప్రజ్ఞాపాటవాలచే అయోధ్యావాసుల హృదయాలలో సముచిత స్థానాన్ని సంపాదించుకొని స్థిరపడిపోతాడు.

“కైకేయీ! నీవు కోపించినట్లు కోపగృహములో ప్రవేశించు. దశరథుడు రాగానే నేలపైబడి విలపించు. అతనివైపు చూడకు. మాట్లాడకు. నీవు రాజుకు ప్రియమైన భార్యవు.

**త్వత్కృతే స మహారాజో విశేదపి హుతాశనమ్ ॥**

“నీకొరకు దశరథుడు అగ్నిలో దూకమన్నా దూకుతాడు.

“దేవీ! నీకు మణులు, రత్నాలు, బంగారము, ముత్యాలు ఇచ్చి నిన్ను ప్రలోభపెట్టాలని దశరథుడు ప్రయత్నించవచ్చు. వాటిని అంగీకరించకు. మన పథకం పారితే అలాంటివి నీకాళ్ళక్రింద చాపలై నిలుస్తాయి. జాగ్రత్త” అన్నది మంథర.

కైకేయి స్వాభావికంగా చాలా మంచిది. కానీ ఏంలాభం? మంథర సహచర్యంతో పాడైపోయింది. చెడు సహవాసము బ్రతుకునే చెడిపేస్తుంది.

మంథర మాటలు కైకేయికి బాగా రుచించాయి. మంథర కైకేయి గురువై కూర్చుంది. మంథర మార్గమే తనకు శ్రేయస్సని కైకేయి భావించింది.

“మంథరా! ఎన్ని మంచివిషయాలు చెప్పావు. నీవు ఇంత గొప్పదానివని నేనూహించలేదు. ఈ ప్రపంచంలో బుద్ధిలో నీకు మించిన దాసీలు ఉంటారని నేను భావించను. నీవు నా హితైషిణివి.

“మంథరా! సమయానికి నీవు నా కళ్ళు తెరిపించావు. నా మనసును నడిపించావు. లేనిచో రాజుగారి కుటిలస్వభావము నాకు తెలిసేదా?

“ప్రియ మంథరా! లోకంలో ఎందరో గూనువాళ్ళున్నారు. వాళ్ళంతా వంకరగా భయంకరంగా ఉంటారు. నీవు గాలికి వాలిన కమలంవలె ఉన్నావు. ఎంతో అందంగా ఉన్నావు.

“ప్రియదాసీ! నీ ముఖారవిందము చంద్రప్రకాశాన్ని బోలివుంది. మంథరా! నీవు పట్టువస్త్రాన్ని ధరించి నడుస్తూవుంటే రాజహంసలా కనిపిస్తున్నావు.

“అసురుల ప్రభువైన శంబరాసురునిలో వేయి మాయలుంటాయని చెబుతారు. నీలో ఇంకా వేలకొలది మాయలున్నాయి. నీ తెలివి, నీ మాయలు, నీ సమయస్ఫూర్తి - ఇవన్నీ నీ గూనులో దాగున్నాయి. మంథరా! రాముడు అరణ్యాలకు వెళ్ళి, భరతునకు రాజ్యం సంక్రమిస్తే, చెలీ! నీ గూనుకు బంగారు హారము చేయించి అలంకరిస్తాను. నీవు నొసట ధరించుటకు స్వర్ణ తిలకాన్ని చేయిస్తాను. చంద్రవదనా! ఈనాడు నీవు నాకు సేవ చేయులాగున రేపు అనేకమంది కుబ్జలు నీకు సేవ చేస్తారు;” అని మంథరను విశేషించి పొగుడ్తూ వుంది కైకేయి.

దాసియైన కుబ్జ మంథర ఎక్కడ? అయోధ్యా పట్టపురాణి కైకేయి ఎక్కడ? ప్రలోభం మనిషిని ఇంతగా కృంగదీస్తుందా? స్వార్థం జీవిని అంతగా దిగజార్చుతుందా?

రాగద్వేషాలు మారుతుంటే మనుషులు ఎంత విచిత్రంగా ప్రవర్తిస్తారు? లేకపోతే, గూనుదైన మంథర కైకేయికి రాజహంసలా ఆనుతుందా? రాణి మెచ్చింది కూడా రంభేనా? అన్నిటికీ మనసే మూలం.

మంథర అంటే ఎవరో కాదు. స్వార్థమే మంథర. లోభమే మంథర. స్వార్థానికి, లోభానికి లొంగినవారు ఎక్కడికైనా దిగజారుతారు. తమతోపాటు ఇతరుల్ని కూడా దిగజార్చుతారు.

రావణాసురునికన్నా మంథరే భయంకరమైంది అని చెప్పాలి. రావణసంహారము లంకలో జరిగింది. కాని మంథర సంహారము జరుగలేదు. మంథర ఆనాడే కాదు. ఈనాడు కూడా ఉంది. రేపుకూడా ఉంటుంది. హృదయంలో స్వార్థం, ప్రలోభము కదలినపుడు మంథర వచ్చిందని భావించాలి. మనసు పాడుగాకుండా జాగ్రత్తపడాలి.

కైకేయి ప్రశంసలందుకొనిన మంథర ఇలా పలికింది. "కైకేయీ! నేను నీ శ్రేయోభిలాషిని. నా మాటలు నీకు రత్నాల మూటలను తెచ్చిపెడతాయి. నే చెప్పిన విషయాలన్నీ జ్ఞాపకముంచుకో.

**గతోదకే సేతు బన్ధో న కల్యాణీ విధీయతే !**

"కల్యాణీ! నీరుపోయిన తరువాత గట్టుకట్టి ప్రయోజనముండదు.

"రాజుకు నీ ప్రభావాన్ని చూపు. కార్యాన్ని సాధించి సుఖించు" అని ముక్తాయింపు ఇచ్చింది మాయదారి మంథర.

కైకేయి తన దేహంపైయున్న అమూల్య రత్నహారాలను తీసివేసింది. మంథరతో కూడ కోపగృహంలో ప్రవేశించింది. బంగారులతవలె నేలపై పడింది.

"మంథరా! రాముడు అరణ్యవాసమునకు వెళ్ళాలి. భరతుడు రాజ్యాన్ని పాలించాలి. లేదా నేను ఇక్కడే మరణించాలి.

"నాకు సంపదలతో పనిలేదు. రాముడి ప్రగతియే నా పతనమవుతుంది." అని పలికి కైకేయి దుఃఖిస్తూ నేలపై బడింది. తన అభీష్టము నెరవేరిందని మంథర లోలోన సంతోషించింది.

నీచుల సహవాసం బుద్ధిని నీచంగా మార్చడమేగాక బ్రతుకునే నీచాతినీచంగా మార్చేస్తుంది. మంథర ప్రభావంవల్ల కైకేయి దుష్టఫలాన్ని అనుభవించబోతూవుంది. ఈ సందర్భమున రామచరితమానసంలో ఒక చక్కని ఉపమానాన్ని చెప్తాడు తులసీదాసు.

**బిపతి బీజు బర్షా రితు చేరీ! భు ఇఁ భఇ కుమతి కైకయీకేరీ ।**

**పాఇ కపట జలు అంకురు జామా! బర్ దోఉ దల్ దుఃఖ్ ఫల్ పరినామా!**

"నీచులను ఆదరించుట అనే వృక్షానికి కలహమే బీజము. మంథర మాటలే వర్షఋతువు. పాడైన కైకేయి హృదయమే ఆ బీజానికి క్షేత్రము. కపటము అనే జలము కలహబీజాన్ని తడుపుతుంది. ఆ బీజము బ్రద్దలై రెండు ఆకులు వేస్తుంది. కలహబీజము నుండి పుట్టిన ఈ రెండాకులే కైకేయి కోరే రెండు వరాలు. చివరగా ఈ బీజము వృక్షమై దుఃఖ ఫలాన్నిస్తుంది;" అని రమణీయంగా వర్ణించాడు తులసీ.

ఈ సందర్భమును పురస్కరించుకొని మనమొక సూక్ష్మవిషయాన్ని అర్థం చేసుకోవాలి. ఎంత మంచివారైనప్పటికి ప్రపంచంలో జీవించేటప్పుడు, రాగిని కలపనిదే బంగారుతో నగ తయారుకానట్లు, కొంత లౌకికమునుకూడా అలవరచుకోవాలి.



కౌసల్య ఆపాటి లౌకికాన్ని ప్రదర్శించి ఉండవలసింది. తన దాసీలకు బహుమానాలను పంచిపెట్టింది. కైకేయి దాసీలకు కూడా పంచిపెట్టివుంటే ఈ బాధ ఉత్పన్నమయ్యేది కాదేమో! మంథర అలా విజృంభించేది కాదేమో!

చిన్నబుద్ధులు గలవారి విషయంలో పెద్దగా ఆలోచించకపోతే, ఆ తరువాత పెద్దా, చిన్న తేడాలు తెలియని చిన్నపెద్దల వల్ల మనం చిన్నబోయే పరిస్థితి తలెత్తుతుంది.

ఏదో మాంసపుముక్క పడేసినంత మాత్రాన కుక్క దొంగతనాన్ని మానుతుందని నేను చెప్పడంలేదు. కాస్త ఉపశమనం కలుగుతుందని. అంతే. ఈలోగా మన అదృష్టం బాగుంటే వర్షమొచ్చేలోగా కప్పు సరిచేసుకోవచ్చు.

మంథరకు ముందర నడచిన కథను కూడా తులసీదాసు ప్రస్తావిస్తాడు.

కైకేయి తండ్రియైన కేకయరాజు ఒకనాడు వేటకు వెళ్ళి ఒక మగజింకను చంపుతాడు. భర్త మరణాన్నిచూచి దుఃఖించిన హరిణి ఆ విషయాన్ని తన తల్లికి చెబుతుంది.

తల్లిజింక రాజును సమీపించి, "రాజా! నీవు చంపింది నా అల్లుణ్ణి. నా దగ్గర మృత సంజీవిని లాంటి మూలిక ఒకటుంది. అన్యులెవరైనా చనిపోతే నేను బ్రతికించగలను. నా అండ చూసుకొనే నా అల్లుడు స్వేచ్ఛగా విహరించాడు. మీరువాడ్ని మాకు అప్పగించండి"అన్నది.

వెంటనే కేకయరాజు బాణము నెక్కుపెట్టి ఆ తల్లిజింకను కూడా వధించాడు. అది చస్తూ చస్తూ"రాజా! నా అల్లుడి మరణానికి నీవు కారణమయ్యావు గనుక నీ అల్లుడి మరణానికి నేను కారణమవుతాను" అని చెప్పి మరణించింది. ఆ లేడియే ఈ మంథర. కేకయరాజు అల్లుడైన దశరథుని మరణానికి ఎసరుపెట్టింది.

ఏంచేస్తాం! గతాలిలా వెంబడిస్తుంటాయి. దగ్గరవాళ్ళే దగాచేస్తారా? అని దుఃఖిస్తుంటాము. ఈ దగ్గర ఏ దూరంనుండి వెంబడించి ఉందో? ఎవరికి తెలుసు? దూరాలు వెంబడించినా, ధూర్తులు దూసుకొచ్చినా ధర్మానికి దూరంగాకుండా వుంటే అన్నీకాలంలో సరిపడిపోతాయి. కాదు. సరిపడి ఉంటాయి.

## కోపగృహంలో కైకేయి

రాముని పట్టాభిషేకానికి ఏర్పాట్లు చేయుటకు ఆజ్ఞలొసగి, ఈ సంతోష వార్తను కైకేయికి చెప్పాలని దశరథుడు అంతఃపురములో ప్రవేశించాడు. పెద్ద బరువుదిగి, గొప్పకార్యాలు సాధించి విశ్రాంతి లభించినపుడు మనసు సహజంగా పిచ్చికోరికలవైపు పరుగులెత్తుతుంది.

దశరథుడు మహదానందంలో ఉన్నాడు. తనకు అత్యంత ఇష్టురాలైన కైకేయికి ఈ సంతోషవార్తను తెలిపి, ఆమెతో కలిసి అనురాగ డోలికలలో ఊగిపోవాలని దశరథుడు కైకేయి మందిరానికి వచ్చాడు. తెల్లని మేఘముల మధ్య చంద్రుడు ప్రవేశించినట్లు దశరథుడు కైకేయి మందిరమున ప్రవేశించాడు.

కైకేయి అంతఃపుర మందిరము చాలా మనోహరంగా వుంటుంది. రమణీయమైన తోట, చక్కని పొదరిండ్లు, అక్కడక్కడ వెండితో, బంగారముతో, దంతములతో నిర్మించిన అందమైన అరుగులు, ఫలపుష్పాదులతో నిండిన వృక్షాలు, చక్కగా అలంకరించుకొని యున్న స్త్రీలు కళ్ళను

జిగేలు మనిపిస్తున్నాయి. పిండివంటలు, పానీయాలు ఆయా స్థానాలలో ఉంచబడి ఉన్నాయి. దశరథుడు అందాలు పరచిన అంత:పురములో ఆవేశంతో ఊగిపోతున్నాడు.

**మురిపించేందుకు అన్నీ వున్నాయ్. సరేగాని**
**వాటిని మురిపించే భామిని అగుపించ దదేమని?**

దశరథుని మనసు విచిత్రంగా ప్రశ్నించింది. కైకేయి దశరథునికి సరసాల రాణి. ముద్దుల భార్య. మురిపాల మువ్వ. కోరి తెచ్చుకొనిన కోమలి. వరించి తెచ్చుకొనిన వయ్యారి భామ.

దశరథమహారాజు తన అంత:పురంలో ప్రవేశించగనే ఎదురేగి ఆయనను కవ్వించడం ఆమెకు సహజమైన అలవాటు. ఈరోజు ఆచారం అదృశ్యమయ్యేసరికి దశరథునికి విచారం ప్రారంభమైంది. ఒకవేళ తనను ఉడికించాలని దాగిందేమోనని అటు ఇటు చూశాడు. వెదికాడు. ఎక్కడా కైకేయి కనిపించలేదు. అక్కడ ఒక పరిచారిక కన్పించింది. ఆమెను ప్రశ్నించాడు దశరథుడు.

"మహారాజా! రాణిగారు క్రుద్ధులైఉన్నారు. తీవ్రమైన కోపంతో కోపాగారము లోనికి వెళ్ళారు" అని చెప్పింది దాసి.

దశరథుని ఆంతర్యంలో కల్లోలం ప్రారంభమైంది. వెంటనే కోపగృహంలో ప్రవేశించాడు. ఊహించని విపత్తు ఏదో వచ్చి పడిందని వ్యథ చెందాడు. మహా దు:ఖంతో నేలపై బడియున్న కైకేయిని చూశాడు.

ఆమె ఆ సమయాన పీకిపారేసిన తీగలాగ పడిఉంది. దివినుండి జారి భువిపై పడిపోయిన దేవతాస్త్రీలాగ పడివుంది. బంధింపబడిన జింకవలె పడివుంది.

దశరథుడు కైకేయిని సమీపించాడు. అరణ్యంలో మగఏనుగు ఆడఏనుగును నిమిరినట్లు ఆమెను ప్రేమతో స్పృశించాడు.

"ప్రాణసఖీ! ఎందుకలా ఉన్నావు? నీ బాధకు కారణమేమిటి? ఆరోగ్యం బాగలేదా? మనకు వైద్యులకేం కొరవ? పేరుమోసిన వైద్యులెందరో ఉన్నారు. నీ రోగమేమిటో చెప్పు" అని ప్రేమవచనాలు పలికాడు దశరథుడు.

కైకేయి నిట్టూర్పులు విడుస్తున్నదేగాని మారు పలకడంలేదు.

"ప్రాణేశ్వరీ! నిన్నెవరైనా అనరానిమాటలు అన్నారా? అవమానించారా? చెప్పు. నీకు సర్వశుభములను చేకూర్చుటకు నేనుండగా నీవు నేలపై పరుండవలసిన పరిస్థితి ఏల వచ్చింది?

"హృదయేశ్వరీ! నీవు ఎవరికైనా మేలు చేయాలని సంకల్పించి వుంటే చెప్పు. వెంటనే ఆ కార్యంలో నేను ప్రవేశిస్తాను. లేదా ఎవరినైనా శిక్షింపవలసినా వెనుకాడను. అడుగు రాణీ! ఈ శోకమడుగులో ఎంతకాలం పడిఉంటావు?

"దేవీ! ఏదీ! ఇటుచూడు. ఏడ్చి ఏడ్చి శరీరాన్ని శుష్కింపచేసికోకు. నీకేం కావాలో చెప్పు. అది ఇవ్వగలనో లేదో అని నీకు సందేహము వద్దు.

**ఆత్మనో జీవితే నాపి బ్రూహి యన్మన సే చ్ఛసి**

"ప్రియురాలా! నీ విషయమై నా ప్రాణములు సమర్పించుటకు కూడా సిద్ధంగా వున్నాను;" అన్నాడు.



తన ప్రాణాన్ని ఇస్తానని దశరథుడు ప్రమాణంచేసినా కైకేయి చలించలేదు. పెదవి విప్పి పలకలేదు. ఇక లాభంలేదనుకొని తన ప్రాణం కంటె అధికమైన, విలువైన వస్తువుపై శపథం చేశాడు.

**మమ ప్రాణా త్ప్రియతరో రామో రాజీవ లోచనః**
**తస్యో పరి శపే బ్రూహి త్వద్ధితం తత్కరోమ్యహం ॥**

"సుందరీ! నా ప్రాణాలిస్తానన్నా నీవు పలకడంలేదు. కాబట్టి నా ప్రాణానికన్నా ఎక్కువైన రామునిపై నేను శపథముచేసి చెబుతున్నాను. నీవు కోరినదానిని రాముని ప్రమాణముగ నెరవేర్చుతాను" అన్నాడు దశరథుడు.

దశరథుడు రామునిపై ప్రమాణం చేశాడు. కైకేయి తన చెవులను తానే నమ్మలేక పోయింది. మరొకసారి దశరథునిచే శపథం చేయించింది.

"పిచ్చిదానా! నా కైకేయీ! నా పుత్తడిబొమ్మా! నా హృదయం నీకు తెలియనిది కాదు. సర్వకాలములయందు నేను నీ ఆధీనమునందే ఉన్నాను. అయినా అనవసరంగా నీవు బాధపడి నన్ను బాధపెడ్తున్నావు. నన్ను ఆజ్ఞాపించు. మరుక్షణమే నీ ఆవేదన అంతరిస్తుంది. ఆనందం పల్లవిస్తుంది. నే చేసిన పుణ్యముపై ఒట్టుపెట్టుచున్నాను. నీ అభీష్టమేమిటో చెప్పు" అని ప్రాధేయపడ్డాడు దశరథుడు. లేడి వలలో దూరినట్లు దశరథుడు కైకేయి పన్నిన మాయాపాశములో దూరిపోయాడు.

దశరథుడు రాముడిపై ప్రమాణంచేశాడు కనుక ఇక వరాలు కోరవచ్చని కైకేయి అభిప్రాయపడింది. కానీ ఆమె హృదయంలో ఒకమూల సందేహం పట్టి పీడిస్తూనే వుంది. దశరథుడు రాముని అరణ్యవాసానికి పంపుటకు అంగీకరించడేమో అనే భయం మనసులో చోటుచేసుకుంది.

కైకేయి లేచినిలబడింది. నలుదిక్కుల చూసింది. చేతులు జోడించి అన్నివైపుల నమస్కరించింది. భయంకరమైన విన్నపాన్ని వినిపించింది.

"ఓ దేవతలారా! నా భర్తచేసిన శపథానికి మీరంతా సాక్షులు. ఓ శశిసూర్యులారా! నా భర్త నాకు వరాలిస్తున్నాడు. మీరంతా వినండి. ఓ పంచభూతములారా! మా మధ్య నడిచిన ఈ సంభాషణమునకు మీరే ప్రత్యక్షసాక్షులు;" అన్నది కైకేయి. దశరథుడు రెప్పవాల్చకుండా కైకేయిని చూస్తున్నాడు.

"మహారాజా! ఆనాటి విషయం స్మృతికి తెచ్చుకోండి. దేవాసురయుద్ధంలో అర్ధరాత్రి వేళ ఆ రాక్షసుడు మిమ్మల్ని ప్రాణాలు పోకుండా చితక బాదాడు. అప్పుడు నేను రథ సారథ్యం చేసి మిమ్మల్ని రక్షించాను. ఇలా రెండు మార్లు ఆ యుద్ధంలో నేను మిమ్మల్ని రక్షించాను. "నా ప్రాణాల్ని నీవే కాపాడావు. లేకుంటే నేను మృత్యుఒడిలో చేరుండేవాడిని. నన్ను రెండుసార్లు రక్షించావు గనుక రెండు వరాలు కోరుకో" అని మీరు చెప్పారు.

"నేను ఆ రెండు వరాలను మీవద్దే దాచుకున్నాను. అవసరము వచ్చినపుడు కోరుతానని చెప్పాను. మీకు ఈ విషయం జ్ఞాపకముందా?" అన్నది కైకేయి.

"అదేమిటి? ఆ విషయాన్ని నేనెలా మరుస్తాను? అడుగు. ఆ రెండు వరాలేమిటో చెప్పు. తప్పక తీరుస్తాను" అన్నాడు దశరథుడు.

వేటకొరకు వేటగాండ్రు డేగను పట్టుకొని పోతారు. ఆ డేగను ముసుగులో ఉంచుతారు. పక్షులు కనిపించగనే దాని ముఖంపై నున్న ముసుగును తీసివేస్తారు. అలాగే కైకేయి తన వరాలనే డేగను రాజుపైకి విడిచిపెట్టడానికి సిద్ధపడింది.

రాజుగారి మనోరథములే సుందరమైన వనము. రాజుగారి సుఖమే పక్షులు. కైకేయి నైపుణ్యంగల వేటకత్తె. ఆమె వరాలే డేగ. డేగ ముసుగులోఉన్నట్లు ఆమె వరాలను ఇంతవరకు రహస్యంగా మనసులో ఉంచుకొని వుండింది. సమయంచూసి వేటగాళ్ళు డేగపై ముసుగును తొలగించునట్లు, సందర్భమునుబట్టి వరాలను బయటపెట్టింది అంటాడు తులసీదాస్.

**భూప్ మనోరథ్ సుభగ్ బను సుఖ్ సుబిహగసమాజు**

**భిల్లిని జిమి ఛార్డచహతి బచను భయంకరు బాజు**

**The King's desire represented a fair forest and the joy stood for a flock of happy birds. Queen Kaikeyi, who resembled a Bhil huntress, sought to loose the fierce falcon of her piercing words.**

"మహారాజా! అయితే వినండి. రాముడిపై శపథం చేశారు. దేవతలు, సూర్యచంద్రులు దానికి సాక్షులు. ప్రతిజ్ఞను నిలబెట్టుకొని వంశప్రతిష్ఠను, కులప్రతిష్ఠను వృద్ధిచేయండి. శీలవంతులై ప్రకాశించండి.

**పరత్ర వాసే హి వద న్త్యనుత్తమం తపోధనాః సత్యవచో హితం నృణామ్**

"పరలోక సాధనకు సత్యముకంటె మించిన సాధన లేదని తపోధనులైన మహర్షులు చెబుతారు.

"మాట తప్పరనే విశ్వాసంతో రెండు వరాలు అడుగుతున్నాను. రాముడికి పట్టాభిషేకము చేయుటకు సిద్ధపరచిన సంభారాలతోనే భరతునికి పట్టాభిషేకం చేయించు. ఇది నేను కోరిన మొదటివరం. ఇక రెండవ వరం వినండి. పద్నాలుగు సంవత్సరాలు రాముడు నార చీరలు ధరించి, మునివృత్తి నవలంబిస్తూ దండకారణ్యంలో జీవించాలి.

"ఇవే నా రెండు కోరికలు. ఈ రెండే మీరీనాడు నాకు ప్రసాదించాల్సిన వరాలు" అని పలికింది కైకేయి.

సుఖదుఃఖ మిళితమైన ఈ వెలుగునీడల ప్రపంచంలో కొందరి వరాలే మరి కొందరికి శాపాలవుతాయి. కాలరూప ప్రవాహంలో కష్టాల సుడిగుండాలు ఎక్కడుంటాయో, ఎప్పుడెదురౌతాయో ఎవరికి తెలుసు? కర్మఫలాల్ని ప్రారబ్దం ఎప్పుడు వడ్డిస్తుందో ఎవరికి తెలుసు?

## దశరథుని దీనాలాపము

భయంకరమైన కైకేయి మాటలను విని దశరథుడు క్షణకాలము తీవ్రంగా తపించి పోయాడు.

"ఇది కలా! నిజమా! నాకు చిత్తభ్రాంతి కలగలేదుగదా! నా బుద్ధి నశించిందా? లేక నా మెదడుకు ఏదైనా వ్యాధి సంక్రమించిందా?" అని పరితపిస్తూ మూర్ఛిల్లాడు దశరథుడు.



కొంతసేపటికి తెలివి వచ్చింది. పెద్దపులిని చూచిన లేడిలాగ కైకను చూచి భీతి చెందాడు. మంత్రములచే కట్టివేయబడిన కాలసర్పంవలె దీర్ఘ నిట్టూర్పులు విడిచాడు. బాధతో "అయ్యో - ఛీ ఛీ" అని అప్రయత్నంగా పలికి మరల మూర్ఛపోయాడు దశరథుడు.

మళ్ళీ కొంతసేపటికి తేరుకొని లేచాడు. భరింపరాని కోపంతో ఊగిపోయాడు. అగ్నికణాలవలె చూపులను విరజిమ్ముతూ కైకేయిని దూషించాడు.

"క్రూరాత్మురాలా! దుష్టురాలా! కులనాశినీ! నా రాముడు నీకు ఏ అపకారం చేశాడు? నేను నీకు ఏ అపకారం చేశాను? రాముడు నిన్ను కన్నతల్లిలాగా భావించాడు. అట్టి రాముడికి అనర్థాన్ని తలపెట్టావా?

"నీ దుష్టస్వభావం తెలియక, నీవు దారుణమైన విషనాగువని గ్రహించక నిన్ను తీసికొని వచ్చి ఇంట్లోపెట్టుకున్నాను.

"ప్రజలంతా రాముని సౌశీల్యమును, సుగుణాలను కీర్తిస్తున్నారు. అతనిలో ఏ తప్పును చూచి నేను అరణ్యాలకు పంపేది? కౌసల్యనైనా, సుమిత్రనైనా, రాజ్యాన్నైనా, చివరకు నా ప్రాణాలనైనా విడుస్తానుగాని పితృభక్తిపరాయణుడైన రాముణ్ణి విడువలేను.

"రాముణ్ణి చూడగనే నాకు పరమానందం కల్గుతుంది. అతడ్ని చూడకపోతే నాకు మతిపోతుంది. సూర్యుడు లేకుండా ప్రపంచం ఉండొచ్చు. నీరు లేకుండా సస్యములుండొచ్చు.

**న తు రామం వినా దేహే తిష్ఠేత్తు మమ జీవితమ్**

"రాముడు లేకపోతే నా శరీరంలో ప్రాణం నిలువదు.

"పాపాత్మురాలా! ఇంత భయంకరమైన ఆలోచన నీకెందుకు కల్గింది? భరతునిపై నాకున్న ప్రేమను పరీక్షించాలని అలా అన్నావా?

"రాముడే నా పెద్దకుమారుడు. ధర్మజ్యేష్ఠుడైన రామునికే రాజ్యాధికారము పొందే అర్హత, హక్కు ఉంది అని పూర్వము అనేకసార్లు నీవే చెప్పావు. అలాంటి నీవు ఇలా ఎందుకు మారిపోయావు? నిన్ను అలా మార్చిందెవరు? నన్నెందుకిలా బాధిస్తున్నావు?

"కైకేయీ! నీవు ఇంతవరకు నన్ను బాధపెట్టి ఎరుగవు. ఈనాడు నీ బుద్ధి పాడైపోయింది. దానివల్ల ఇక్ష్వాకువంశానికే ముప్పు వాటిల్లుతోంది.

"రాముడు నాకు భరతునితో సమానుడు" అని పూర్వం నీవు ఎన్నో ప్రియమైన విషయాలు పలికేదానివి. అందుచేత ఈనాడు నీవు పలికిన దారుణమైన మాటలను నేను నమ్మలేకపోతున్నాను.

"రాముని పద్నాలుగు సంవత్సరాలు వనవాసం చేయమని చెప్పుటకు నీ మనసెలా అంగీకరించింది? సుకుమారుడు, ధర్మజ్ఞుడైన రాముడు భయంకరమైన అరణ్యాలలో నివసించాలని కోరుతున్నావా?

"కైకేయీ! అంతఃపురములో ఎందరో దాసీలున్నారు. అయినా మాతృభక్తితో రాముడు నీకు సేవ చేసేవాడు. భరతుని కంటే రాముడే నీకు ఎక్కువగా సేవ చేశాడు. అట్టి సుగుణాల రాముని అడవికి పంపాలని ఎందుకు కోరుకుంటున్నావు?

"రాముని ప్రజలందరూ ప్రేమిస్తున్నారు. అతనిపై ఏ అపవాదమూ లేదు. ఏ అభియోగమూ లేదు. అతనిని ద్వేషించువారు లేనేలేరు.

"దానములిచ్చి దీనులకు చేరువయ్యాడు. సేవలు చేసి గురువులకు ప్రియుడయ్యాడు. పరాక్రమవంతుడై శత్రువుల్ని జయించాడు. కల్మషము లేనివాడు. కల్లాకపటం తెలియనివాడు. దైవ సమానుడు. మహర్షులవంటి తేజస్సు గలవాడు. అట్టివానియందు నీకు పాపపు బుద్ధి ఎలా పుట్టింది?

"రాముడు అందరితో ప్రియంగా మాట్లాడుతాడు. నా రాముడు ప్రేమమూర్తి. అప్రియమైన మాటను పొరపాటునకూడా పలకడు. అట్టి రాముని విషయంలో నీవు ఇంత కఠినంగా ఎలా పలుకుతున్నావు?

"కైకేయీ! నేను ముసలివాణ్ణి. నా జీవితగ్రంథంలో చివరిపుట ఒక్కటే మిగిలుంది. నేను దీనుడను. బలహీనుడను. నాపై దయచూపు. సాగరపర్యంతము నీవు ఏది కోరినా నీకు ఇస్తాను. నన్ను నీ కోపానికి బలిచేయకు.

**అంజలిం కుర్మి కైకేయి పాదౌ చాపి స్పృశామి తే**
**శరణం భవ రామస్య మాఽధర్మో మామిహ స్పృశేత్**

"కైకేయీ! చేతులు జోడించి నీకు నమస్కరిస్తున్నాను. నీ పాదాలు పట్టుకొని వేడుకొంటున్నాను. రాముని రక్షించు. నేను అధర్మపరుడను అనే అపవాదు నాకు రానీయకు;" అని ప్రాధేయపడ్డాడు దశరథుడు.

మతి చలించిన వానివలె అల్లాడిపోతూ, దు:ఖంతో క్రుంగిపోతున్న దశరథునితో కైకేయి క్రూరంగా పలికింది.

"మహారాజా! వరాలు కోరమన్నావు. తీరా కోరింతర్వాత ఇలా దు:ఖిస్తున్నావు. ఆడిన మాట తప్పి ప్రపంచంలో ధార్మికుడుగా ఎలా చెలామణి కాగలవు? రేపు ఋషులు నిన్ను ప్రశ్నిస్తే వారికేమి సమాధానము చెప్తావు? ఏ కైకేయి తన ప్రాణాలొడ్డి యుద్ధభూమిలో నన్ను రక్షించిందో ఆవిడకి మాటఇచ్చి మోసం చేశాను అని చెప్పుకుంటావా?

"వరాలిస్తానని పలికి, మరల ఇలా మాట్లాడుతున్న నీవు రాజవంశానికే కళంకాన్ని తెచ్చిపెడుతున్నావు. ఒక పక్షిని రక్షించేందుకు తన శరీరంలోని మాంసాన్ని కోసిచ్చాడు శైబ్యుడు. అంధుడైన బ్రాహ్మణునికి ఇచ్చిన మాటను నిలబెట్టుకొనేందుకు అలర్కుడు తన నేత్రాలనే దానం చేశాడు. అలాంటి రాజులతో నిన్ను పోల్చుకోగలవా?

"దేవతలకు ఇచ్చిన మాటను పాటిస్తూ సముద్రము చెలియలికట్టను దాటలేదు. ఇవన్నీ జ్ఞాపకంచేసుకో. చేసిన ప్రతిజ్ఞను నిలబెట్టుకో.

**స త్వం ధర్మం పరిత్యజ్య రామం రాజ్యేఽభిషిచ్య చ**
**సహ కౌసల్యయా నిత్యం రన్తు మిచ్ఛసి దుర్మతే**

"దుష్టుడా! ధర్మానికి తిలోదకాలిచ్చి, రాముని రాజ్యాభిషిక్తుని చేసి, సదా కౌసల్యతో క్రీడించాలని ఉబలాటపడుతున్నావు.



"నేను కోరింది ధర్మమా? అధర్మమా? సత్యమా? అసత్యమా? అనే మీమాంసకు ప్రస్తుతం అవకాశంలేదు. నీవు నాకిచ్చిన మాటను నిలబెట్టుకోవాలి.

"రామునికి పట్టాభిషేకం జరిగితే నేను ప్రాణాలతో జీవించను. విషం త్రాగి ఇక్కడే మరణిస్తాను. కౌసల్యకు నమస్కరించుటకంటే శ్మశానానికి చేరడమే మంచిది.

"రాజా! మళ్ళీ చివరగ చెప్తున్నా. నాపైన, భరతునిపైన ఒట్టుపెట్టి మరీ చెబుతున్నా. రాముని అరణ్యవాసము పంపుటతప్ప మరొక విషయంతో నేను సంతోషపడను;" అని ఖచ్చితంగా చెప్పింది.

కైక మాటలు విని దశరథుడు నిర్ఘాంతపోయాడు. ఆ మాటలు అతనికి పిడుగుపాట్లు వలె ధ్వనించాయి. ఆమె పెట్టిన ఒట్టును తలచుకొంటూ, "రామా!" అంటూ నిట్టూర్పు విడిచి నరికిన చెట్టులాగా నేలపై వాలిపోయాడు.

దశరథుడు అయోమయంగా తయారయ్యాడు. మతిచలించిన ఉన్మాదునివలె మారిపోయాడు. విషజ్వరంవచ్చిన రోగిలా కన్పిస్తున్నాడు. శక్తిహీనమైన పాములాగా గోచరిస్తున్నాడు.

దశరథుడు శక్తిని కూడగట్టుకొని కైకేయితో పలుకుతున్నాడు.

"మంచిదిలా కనిపించే ఈ చెడును నీకు ఎవరు నూరిపోశారు? దయ్యంపట్టినట్లు మాట్లాడుతున్నావు. సిగ్గులేదూ! నీ చిన్నతనంలో నీలో ఇంత దుష్టస్వభావము ఉన్నట్లు నేను చూడలేదు. ఈ వైపరీత్యాన్ని ఇప్పుడే చూస్తున్నాను.

"కైకేయీ! ఈ భయంకరమైన వరాలు కోరడానికి నీకు ఎవరివల్ల భయం కలిగింది? క్రూరాత్మురాలా! పాపాత్మురాలా! నీచురాలా! నాలో నీకు ఏ లోపం కన్పించింది? రామునిలో ఏ దోషం గోచరించింది? నీ భర్తకు, భరతునికి, లోకానికి కీడు కలుగరాదని నీవు భావించేటట్లయితే వెంటనే ఈ వరాలు త్యజించు.

**న కథంచి దృతే రామా ద్భరతో రాజ్యమావసేత్**
**రామాదపి హితం మన్యే ధర్మతో బలవత్తరమ్ ॥**

"రాముని కాదని భరతుడు ఎన్నడూ రాజ్యాన్ని అంగీకరించడు. ధర్మము విషయంలో రామునికంటెను భరతుడే ఎక్కువ పట్టుదల కలవాడని నా అభిప్రాయము.

"పండితులతో, రాజులతో ఆలోచించిన తరువాతే రాముని పట్టాభిషేకాన్ని నిర్ణయించడం జరిగింది. ఇప్పుడు తిరస్కరిస్తే రాజులందరు నన్నేమనుకుంటారు? "మూర్ఖుడైన ఈ దశరథుడు ఇంతకాలం ఎలా పరిపాలించాడు?" అని నవ్వరా?

"గుణవంతులు వచ్చి "రాముడెక్కడ?" అంటే నేను ఏమి సమాధానం చెప్పేది? పండితులైన పెద్దలరుదెంచి "రాముడేడి?" అని అడిగితే నేను ఏముఖం పెట్టుకొని వారి ముందు నిలబడేది?

"రాముని అరణ్యానికి పంపేస్తే కౌసల్య నన్ను ఎలా భావిస్తుంది? కౌసల్య ఉత్తమురాలు. ప్రియమైన స్వభావం కలది. అట్టి కౌసల్య ప్రియంగా నాదగ్గరికి వచ్చినపుడు నీకు కోపం వస్తుందేమోనని ఆమెను ఆదరించలేకపోయేవాడిని.

"నీకెంతో మేలు చేశాను. అదంతా రోగికి పాయసం పోసినట్లే అయింది. నీ చెడుబుద్ధి చెడుకార్యాలకు ఉద్యమించింది.

"నేను చేసిన అపకారానికి రాముడు అరణ్యవాసం వెళ్తే సుమిత్ర నన్ను విశ్వసిస్తుందా? నన్ను అసహ్యించుకోదా?

"రాముడు అరణ్యానికి వెళ్తే నేను జీవించి యుండగలనా? రాముని వనవాసము, నా మరణము - ఈ రెండు వార్తలను సీత భరించగలదా? పర్వత ప్రాంతాల్లో కిన్నరుని పోగొట్టుకొనిన కిన్నరివలె సీత నా ప్రక్కనవుండి దుఃఖిస్తూఉండగా నా ప్రాణములు ఆకాశంలో కలిసిపోతాయి.

"కైకా! నా మరణానంతరము, నీవు వైధవ్యాన్నిపొంది నీ కుమారునితో కలిసి రాజ్యమేలుకో. రాముడు లేక నేను జీవించడం కల్ల. మంచిదనుకొని విషం కలిపిన మద్యాన్ని మానవుడు త్రాగినట్లు నీవు మంచిదానివని భావించి మోసపోయాను.

"ప్రజలందరు నన్ను రేపు చెడ్డవానివిగా భావిస్తారు. బిడ్డను అమ్ముకున్న కసాయి వానిగా చిత్రిస్తారు. మద్యపానము చేసిన విప్రుని నిందించినట్లు నిందిస్తారు.

"అయ్యో! ఎంత కష్టము వాటిల్లింది? ఏమి దుఃఖము వచ్చిపడింది? కైకా! నేను నీకు చేసిన మేలుకు నీవు నామెడలో ఉరిత్రాడు తగిలిస్తావా?

"నీవు మృత్యువని గ్రహించలేక ఇంతకాలం నీతో విహరించాను. పసిబాలుడు తెలియక త్రాచుపాముపై చేయివేసినట్లు నిన్ను స్పృశించాను. ఫలితాన్ని అనుభవిస్తున్నాను.

"మహాత్ముడైన రామునికి దురాత్ముడనైన నేను తండ్రినా? కాదు. కాదు. నాకా అర్హతలేదు. "కామానికి తలవంచి, స్త్రీలోలుడై మూర్ఖుడైన ఈ దశరథుడు ప్రియమైన రాముని అరణ్యాలకు పంపాడు" అని లోకం నన్ను దూషించకపోదు.

"బాల్యమునుండి రాముడు నియమనిష్ఠలతో కష్టపడ్డాడు. గురువులు చెప్పినట్లు శ్రమించినాడు. సుఖపడవలసిన సమయం ఈనాడు చేరువైనా మళ్ళీ కష్టాల ఊబిలోకి ప్రవేశిస్తున్నాడు.

"రామా! నీవు అరణ్యానికి వెళ్ళు! అని నేను చెప్పగనే నామాటను శిరోధార్యంగా భావించి రాముడు బయలు దేరుతాడు. కానీ "నేనుపోను" అని రాముడు పలికితే నాకెంతో సంతోషము కల్గుతుంది. కానీ ధర్మపరాయణుడైన నా రాముడు ఎప్పుడూ అలా అనడు.

"రాముడు అడవికి వెళ్ళగానే యముడు క్షమార్హుడుకాని నన్ను యమలోకానికి తీసికొని పోతాడు. రాముని, నన్ను పోగొట్టుకున్న కౌసల్య జీవించలేక మరణిస్తుంది.

"కైకేయీ! నన్ను, కౌసల్యా సుమిత్రలను, ముగ్గురు పుత్రులను నరకతుల్యమైన బాధలలో పడేసి నీవు ఆనందంగా జీవించు. మరి భరతుడు రాముని వనవాసాన్ని అంగీకరిస్తాడా?

**ప్రియం చే ద్భరతస్యైత ద్రామ ప్రవ్రాజనం భవేత్**
**మా స్మ మే భరతః కార్షీత్ ప్రేతకృత్యం గతాయుషః**

"రామ వనవాసము భరతునికి కూడా ఇష్టమైతే, నేను చనిపోయిన తరువాత భరతుడు నాకు ప్రేతకర్మచేయకూడదు.



"ఓసీ! అనార్యురాలా! ఇంతకాలం రాజపుత్రివలె నీవు అంతఃపురములో వసించావు. నీ మూలాన నాకు అపఖ్యాతి, పరాభవము తప్పవు. సర్వులూ నన్ను పాపాత్మునిగా భావిస్తారు.

"ఇంతవరకు రాజకుమారుడుగా రథాలమీద, గజములమీద, అశ్వముల మీద ఎక్కి సంచరించిన నా ముద్దుల కుమారుడు, నా రాముడు భయంకరమైన అరణ్యాలలో పాదచారియై ఎలా తిరుగుతాడో?

"రాజభవనంలో చక్కగా అలంకరించుకొని, శుచీభూతులైన వంటవాళ్ళు "నేను ముందు-నేను ముందు" అని రామునికి కమ్మని వంటకాలు వడ్డించడానికి పోటీపడేవారు. అట్టి నా తండ్రి అడవిలో వగరు, చేదు, పులుపుగా ఉండే ఆకులు, కందమూలాదులు తిని ఎలా జీవిస్తాడో?

"విలువైన వస్త్రాలు ధరించి, పట్టుపరుపులపై పవ్వళించే నాబిడ్డ కాషాయ వస్త్రాలు ధరించి, నేలపై ఎలా పడుకుంటాడో?

"ఓసీ! దుష్టురాలా! పిశాచీ! రాముడు అరణ్యానికి వెళ్ళాలి అనే ఆలోచనను నీకు కల్పించిందెవరు? క్రూరాత్మురాలా! నన్ను క్షోభకు గురిచేయాలనే ఈ నిర్ణయం తీసుకున్నావా?

"రాముడు కష్టపడితే ప్రజలు సహించలేరు. రాముని కష్టాన్ని అయోధ్యాపుర వాసులు భరించలేరు. ప్రజలందరూ విప్లవాత్మకంగా స్పందిస్తారు. భార్యలు భర్తలను త్యజిస్తారు.

**వినాపి సూర్యేణ భవేత్ప్రవృత్తిః అవర్షతా వజ్రధరేణ వాపి**
**రామం తు గచ్ఛన్త మితః సమీక్ష్య జీవేన్నకశ్చి త్త్వితి చేతనా మే**

"సూర్యుడు లేకపోయినా ప్రపంచం మనగల్గుతుంది. ఇంద్రుడు వర్షాన్నివ్వకపోయినా లోకం నడుస్తుంది. కానీ నా రాముడు అరణ్యానికి వెళ్ళడం కళ్ళారా చూచినవాడు మాత్రం ప్రాణాలతో జీవించలేడు.

"కైకా! నీవు నా వినాశాన్ని కోరేదానివి. నాకు చెడుచేసేదానివి. వాస్తవానికి నీవు నాశత్రువే. ఈ సత్యం తెలియక ఇంతకాలం నీతో కలిసి జీవించాను. గొప్ప విషముగల ఆడసర్పాన్ని తెలియక చాలాకాలం ఒడిలో ఉంచుకున్నాను. దాని ఫలితంగా ఈరోజు మృత్యుముఖంలో ప్రవేశిస్తున్నాను.

"నీవూ భరతుడూ కలిసి ఈ అయోధ్యానగరాన్ని పాలించండి. నా శత్రువులకు సంతోషాన్ని కల్గించండి.

"ఏమే.... కఠినాత్మురాలా! భర్తను తిరస్కరించి ఇంత భయంకరంగా మాట్లాడుతున్నావే, నీ దంతాలు ఇంకా వేయి ముక్కలు కాలేదెందుకని?

"దుష్టురాలా! కేకయవంశానికే నీవల్ల కళంకం ఏర్పడింది. నువ్వు ఏడిస్తే ఏడువు. కాలితే కాలిపో. చస్తే చావు. నీవేమైనా నాకు బాధలేదు. నీమాట నేను వినను. నీ కోర్కెలు నేను తీర్చను.

"శత్రువైనదానా! నీవు పదునైన కత్తివంటి దానవు. తియ్యగా మాట్లాడుతావు. నీదంతా కుట్రే. కపటమే. నీవు దుష్టురాలవు. ఎప్పుడూ చెడునే ఆలోచిస్తూ ఉంటావు. నీవు కులనాశినివి. మనసును ఛిద్రం చేయడానికి, హృదయాన్ని రుద్రభూమిగా మార్చడానికి కంకణం కట్టుకున్న దరిద్ర దేవతవు. నీవు బ్రతికిఉండడం నాకిష్టంలేదు.

**న జీవితం మేఽస్తి పునః కుతః సుఖమ్ వినాత్మజే నాత్మవతః కుతోరతః**
**మమాహితం దేవి న కర్తు మర్హసి స్పృశామి పాదావపి తే ప్రసీద మే**

"రాముడు లేకుండా నేను జీవించలేను. నాకు జీవితమే లేదు. ఇక సుఖాలేమిటి? ఆనందాలేమిటి? ఓ దేవీ! నాకు చెడ్డదైన కార్యాన్ని తలపెట్టకు. నీ కాళ్ళు పట్టుకుంటాను. నన్ను కరుణించు;" అంటూ కైకేయి పాదాలు పట్టుకొనేందుకు దశరథుడు ముందుకు నడచాడు. కైకేయి నిర్దాక్షిణ్యంగా పాదాలను దూరం చేసింది. ప్రయత్నించి పాదాలుచేరలేక మధ్యలోనే గాలికి చెట్టుపడినట్లు నేలపై కూలిపోయాడు.

## దశరథుని దీనస్థితి

దశరథుడు దీనుడై నేలమీద పడివున్నా కైకేయి హృదయం కరగలేదు. నిస్సంకోచంగా మళ్ళీ పాడినపాటే పాడింది.

"మహారాజా! "నేను సత్యవంతుణ్ణి. మాట తప్పనివాణ్ణి" అని గొప్పలు చెప్పుకుంటావే, మరి నన్నెందుకు మోసం చేస్తావు? ఇచ్చిన మాటను ఎందుకు కాదంటున్నావు?" అని సూటిగా ప్రశ్నించింది కైకేయి.

ఆ మాటలకు రెచ్చిపోయిన దశరథుడు కైకను ఛీ కొట్టాడు. చీదరించుకున్నాడు.

"హే పాపీ! నీచురాలా! రాముడు అరణ్యానికి వెళ్ళిపోతాడు. నేను ఈ లోకాన్నే విడిచిపెట్టి పోతాను. అప్పుడు నువ్వు కులుకుదువుగానీ!

"అయ్యో! నేను మరణించి స్వర్గానికి వెళ్తే,అక్కడ దేవతలు "రాముడు కుశలమా?" అంటే నేనేమి చెప్పేది? సంతాన హీనుడనైన నేను ఎంతోశ్రమించి పుత్రులను పొందాను. శ్రేష్ఠుడైన నా రాముని విడిచి నేనెలా జీవించేది? రాముని అరణ్యాలకు పంపడం నాకు సాధ్యమా?

"సుఖాలకు అలవాటుపడ్డ రాముడు అరణ్యాలలో కష్టాలకు గురికావడాన్ని నేను సహించగలనా? రాముడికి బాధలు ప్రాప్తించకముందే నేను మరణిస్తే నాకు సుఖం కల్గుతుంది," అంటూ దశరథుడు బిగ్గరగా ఏడుస్తుండగా సూర్యాస్తమయం జరిగింది. రాత్రి అయింది.

దశరథుడు తలఎత్తి ఆకాశంవైపు చూశాడు. నక్షత్రాలచే ప్రకాశించు గగనాన్ని వీక్షించాడు. దుఃఖము కట్టలుత్రెంచుకొని ప్రవహించింది. హృదయం శోకసముద్రంగా మారిపోయింది.

"ఓ రాత్రీ! నీవు నిష్క్రమించకు. నువ్వు తెల్లవారకు. నన్నుకరుణించు. నా ప్రార్థన ఆలకించు. నీకు దోసిలొగ్గి చెప్పుకుంటున్నాను. అలా కాదంటావా? అయితే త్వరగా తెల్లారిపో. నిర్దయకు, క్రూరత్వానికి ప్రతిరూపమైన ఈ కైకను చూడడం నాకేమాత్రమూ ఇష్టంలేదు;" అనిపలికి మరల కైకేయివైపు తిరిగి ఆవిడను బ్రతిమాలుతున్నాడు దశరథుడు.

"దేవీ! శుభప్రదా! నేను మంచిని నమ్ముకొని జీవించినవాణ్ణి. దీనుణ్ణి. ముసలివాణ్ణి. రాజునైనా నిన్నాశ్రయించుకొని వున్నవాణ్ణి. నన్నుకరుణించు.



"సుశ్రోణీ! వింటున్నావా? నా మాటలన్నీ గాలిలో కలిసిపోవుట లేదుగదా? బాలా! నీవు సహృదయురాలవు. సుందరీ! నన్ను అనుగ్రహించు. రాజ్యాన్ని రామునికి నీవే ఇవ్వు. నీకు గొప్ప పేరు లభిస్తుంది. కీర్తి సిద్ధిస్తుంది.

"సుందరవదనా! చారునేత్రీ! ఈ పని మనస్ఫూర్తిగా చెయ్యి. అది నాకు, భరతునికి, రామునికి, లోకానికి, ఆచార్యులకూ కూడా ప్రియమైన కార్యము;" అని అశ్రువులను ధారగా క్రుమ్మరించాడు దశరథమహారాజు.

దశరథుని కన్నీళ్ళు కైకేయి కఠినహృదయాన్ని కరిగించలేకపోయాయి. రాముడు అరణ్యానికి వెళ్ళవలసిందే నంటున్నది కైకేయి. దుఃఖితుడైన దశరథుడు మళ్ళీ నేలమీద పడి మూర్ఛిల్లాడు. బాహ్యంలో అంధకారం - ఆంతర్యంలో తీవ్రమైన ఆవేదన, ఆ రాత్రంతా దశరథునికి అలాగే గడిచిపోయింది.

దశరథుడు వేదవిదుడు. బుద్ధిమంతుడు. ధీశాలి. సత్యవ్రతుడు. మహారాజు. ఇన్నిసుగుణాలున్న రాజు బాధల్ని కొనితెచ్చుకోవడం మనం రామాయణంలో స్పష్టంగా చూడవచ్చు.

దశరథునిలో ధీశక్తికి తోడు ఋజుత్వము, సౌజన్యము, సరళమైన జీవనము, సున్నితమైన ప్రేమతత్త్వము చోటుచేసికొని ఉన్నాయి. వీటి ఫలితంగా భావావేశముతో అపుడపుడు స్పందిస్తూ వుంటాడు. అలాంటి సందర్భాలలోనే ముందూవెనుక లాలోచించకుండా వరాలు ఇచ్చేస్తుంటాడు. అవి మ్రింగలేని వెలగకాయలవలె గొంతుకు అడ్డంపడుతుంటాయి. అలాంటివి ఏమిటో కొన్ని చూద్దాం.

1. అందమైన అమ్మాయి, పైగా తాను ప్రేమించిన యువతి కైకేయిని తనకు భార్యగా ఇచ్చాడనే భావావేశంలో కైకేయి పుత్రుని యువరాజును చేసేటట్లు కేకయరాజుకు వరమివ్వడం.

2. యుద్ధంలో తనను రక్షించింది అనే భావావేశంలో కైకేయికి రెండువరాలను అనుగ్రహించడం.

3. విశ్వామిత్రుడు వచ్చినపుడు ఏదికోరినా ఇవ్వడానికి సంతోషంగా వున్నట్లు భావావేశంతో పలకడం.

4. రామునికి యౌవరాజ్య పట్టాభిషేకం జరుగుచున్నదనే ఆనందంలో భావావేశ ముప్పొంగి, కైకేయి ఏమి కోరుతుందా అనే ఆలోచన ఏమాత్రం లేకుండా వరాలను అమలు చేయడానికి రామునిమీద ప్రమాణంచేసి అంగీకారాన్ని తెలియజేయడం.

పై సన్నివేశాలన్నిటిలో జరిగిందేమిటి? అంటే ఎవరిని వదలి తాను ఒక్కక్షణం జీవించలేడో అట్టి రాముని దూరంచేసుకోవడమే జరిగింది.

క్షణికోద్రేకాలు, తాత్కాలిక భావావేశాలు జీవితంలో అతిముఖ్యమైన లక్ష్యసిద్ధికి అవరోధాలై నిలుస్తాయని దశరథుని జీవితాన్ని చూసి మనం నేర్చుకోవచ్చు. పూర్వాపరాలు ఆలోచించకుండా తొందరపడి క్షణాల్లో తీసుకొనే నిర్ణయాలవల్ల ఏర్పడే దుష్పరిణామాలు జీవితాంతం వెంటాడుతూనే ఉంటాయి అని గ్రహించాలి. ఆచరణలో వేగాన్ని పుంజుకోవచ్చు గాని ఆలోచనలో మాత్రము నిదానమే ప్రధానమని మరచిపోకూడదు.

**The superior man is slow in his words and earnest in his conduct.**

"మాటల్లో మెల్లగా, చేతల్లో ఉత్సుకతతో చరించువాడే మహోన్నతవ్యక్తి" అని తత్వవేత్త కన్ఫూషియస్ అభిప్రాయపడ్డాడు.

## ధర్మమీమాంస

మానవుడు వాంఛించే ప్రయోజనాలన్నీ సత్యము, ధర్మము అనే రెండు పదాల్లో ఇమిడి వున్నాయి. ఈ రెండిటిని విడదీయలేము. ఒకటి అలౌకికము. మరొకటి లౌకికము. ఏ ఒక్కటి లోపించినా మనిషిలో పూర్ణత్వం దెబ్బతింటుంది.

సమాజపరంగా అభిలషించి ఆచరించేది ధర్మం. అట్టి సమాజములో వ్యక్తికూడా ఒక భాగమే గనుక ధర్మజీవనంలో వ్యక్తియొక్క సుఖం, ప్రయోజనం చోటుచేసుకుని ఉంటాయి. సమాజంలోని ఈ ధర్మజీవన వ్యవస్థనే అభ్యుదయము అంటారు. ఏ సమాజంలో ధర్మం చతుష్పాదాలతో ప్రభవిస్తుందో అట్టి సమాజం అభ్యుదయమార్గాన పయనిస్తున్నదని భావం.

దేశకాలపరిస్థితులనుబట్టి ధర్మం మార్పుచెందుతూ వుంటుంది. మారే పరిస్థితులకు అనుగుణంగా ధర్మాన్ని మార్చుకోవచ్చు. ఈనాడు ఒకవిధంగావున్న ధర్మం, కొన్నిశతాబ్దాల తరువాత మరోవిధంగా గోచరించవచ్చు. ఇప్పుడు చేసింది అప్పుడు చేయాలనే నియమం లేదు. ఇప్పుడు చేయనిది అప్పుడు చేయకూడదనేది లేదు. ఇది కేవలం పురుషుని విచక్షణపై, ఆయా కాలాలలో నియమింపబడిన ధర్మాలపై ఆధారపడి ఉంటుంది. అందుచేతనే దీనికి సంబంధించిన జ్ఞానాన్ని పురుషతంత్రజ్ఞానమన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీశంకరాచార్యుల వారు.

**కర్తుమ్, అకర్తుమ్, అన్యథా కర్తుమ్ శక్యతే పురుష తంత్రవత్ ఏవ**

"చేసినా, చేయకపోయినా, మరోవిధంగా చేసినా అది పురుషతంత్రమే."

ధర్మాన్ని గూర్చి తెలుసుకున్నాం. ఇది పురుషతంత్రం. రెండవది సత్యం. ఇది వస్తుతంత్ర జ్ఞానానికి సంబంధించింది అంటారు శ్రీశంకరాచార్యులు.

మారేది ధర్మమయితే, మారనిది సత్యము. మార్పుచెందే ధర్మము వ్యక్తికి వ్యక్తికి, కాలానికి కాలానికి, దేశానికి దేశానికి మారుతూ వుంటుంది. సత్యము అలా మారేదికాదు. అది అందరికీ సంబంధించింది. దేశంచేత, కాలంచేత, పరిస్థితులచేత చెదరగొట్టబడనిది.

ప్రస్తుతం దశరథమహారాజు ఎదుర్కొంటున్న సమస్యలో గొప్ప మీమాంస చోటు చేసికొని వుంది. ఇది ధర్మానికి, సత్యానికి మధ్యనిలిచిన సంఘర్షణ. దీనిని చక్కగా విశ్లేషించి అర్థం చేసుకోకపోతే పాత్రలు అపార్థాల ఊబిలో చిక్కుకుపోతాయి.

దశరథుడు ప్రేమించి కైకేయిని వివాహమాడాడు. అప్పుడు కైకేయితండ్రి ఒక షరతు పెట్టాడు. తన కుమార్తె బిడ్డడే యువరాజు కావాలని చెప్పాడు. దశరథుడు అంగీకరించి కైకేయిని పరిణయమాడాడు.

రఘుకులంలో జ్యేష్ఠపుత్రుడే రాజుకావాలి. యోగ్యుడైన జ్యేష్ఠపుత్రుని విస్మరించుటకు వీలులేదు. ఈ విషయం దశరథునికి తెలియదా? కుటుంబధర్మానికి, కులధర్మానికి



తిలోదకాలిచ్చి కైకేయిని వివాహమాడాడా? ఎలాగైతే నేమి? మాటిచ్చాడు. అదే ఈనాడు దశరథునికి ప్రక్కలో బల్లెమై నిలిచింది.

తాను మాటఇచ్చాడని కుటుంబనీతిని త్రోసిపుచ్చుతాడా? అలా చేయలేడు. చేయలేని పరిస్థితి ఏర్పడినప్పుడు భరతుడు రాజవుతాడుగాని రాముడెలా అవుతాడు?

సత్యమనే కోణంనుండి చూస్తే దశరథుడు మాటిచ్చాడుగనుక భరతుడు రాజు కావల్సిందేగాని రాముడు రాజు కాలేడు. కానీ రాముని రాజుచేయాలని దశరథుని అభిమతం. యోగ్యుడు, జ్యేష్ఠుడు అయిన రాముడు రాజయితే వంశప్రతిష్ఠ నిలుస్తుంది. సత్యంయొక్క దృక్పథంలో రాముడు రాజు కాలేడు గనుక ధర్మమనే ముసుగులో రామునికి కిరీటం పెట్టాలని యోచించాడు దశరథుడు. భరతుడు అయోధ్యలో లేనపుడే పట్టాభిషేకాన్ని శీఘ్రంగా జరిపించడంలో అంతర్యం కూడా అదే.

ఒకవేళ రాముడికి యౌవరాజ్యాభిషేకమే జరిగుంటే దశరథుడు ఇచ్చినమాట తప్పినట్లేకదా? వ్యక్తిధర్మం అడుగంటినట్లే కదా?

దశరథుడు తన మనోభిప్రాయాన్ని కైకేయికి, భరతునికి చెప్పి, వారి ప్రేమపూరిత అనుమతితో రామునికి పట్టాభిషేకం చేసుంటే ఉభయతారకంగా ఉండేది. అటు సత్యానికి దెబ్బ తగిలేది కాదు. ఇటు ధర్మానికి భంగం వాటిల్లేది కాదు.

భరతుడూ ఎలాగూ అయోధ్యలో లేడు. పోనీ కైకేయికి ముందుగానే చెప్పివుంటే ఈ గొడవ వచ్చేది కాదేమో? పైగా రాముడే రాజుకావాలని గతంలో అనేకసార్లు కైకేయి తనతో అన్నట్లు దశరథుడే చెప్పాడు గదా! ఆ మాటనే ఉపయోగించి కార్యాన్ని అనుకూలంగా మార్చుకొని ఉండవచ్చు. కానీ దశరథుడు ఆపని చేయలేదు.

సాధారణ సమయాల్లో ఎన్నయినా మాట్లాడవచ్చు. విశేష సమయం ఆసన్నమయినపుడు వ్యక్తులు విచిత్రంగా వర్తించడం మనం లోకంలో చూస్తూనే ఉన్నాం. అలాగే కైకేయి ఆనాడిచ్చిన మాట ప్రసక్తి తెస్తే కథంతా తారుమారైపోతుంది. ఈ సందేహం మనసును పట్టిపీడిస్తూ ఉండడం వల్లనే ఇంటివద్దనేవున్నా దశరథుడు కైకేయితో సంప్రదించలేదు.

దశరథుడు తనతండ్రికి ఇచ్చినమాట కైకేయికి తెలీనే తెలీదు. నిజానికి తనకు తెలిసి వుండి మరచిందేమో? అలా అనుకునేందుకు కూడా వీల్లేదు. తనకు తెలిస్తే మంథరకు చెప్పకుండా ఉండేదికాదు. మంథరకు తెలిసుంటే కైకేయి మరువగలదేమోగాని మంథర మరచిపోదు. పైగా దశరథుడిచ్చిన రెండు వరాల సంగతి మంథరే జ్ఞాపకంచేసింది. అప్పుడుకూడా కేకయరాజుకి ఇచ్చిన మాట విషయం కైకేయి ప్రస్తావించనూలేదు. మంథర జ్ఞాపకం చేయనూలేదు.

భరతుడు తాతగారి ఇంటివద్ద ఉన్నప్పుడే రాజ్యాభిషేకం జరగాలని దశరథుడు రామునితో కూడా చెప్పినాడుకదా? భరతుడు ధర్మాత్ముడే గాని ఎంతటివారి బుద్ధులైనా మారే అవకాశముంది అనికూడా అన్నాడు కదా!

కనుక కైకేయిగాని, భరతుడుగాని ఈ ప్రస్తావన తెస్తారేమో అనే భయాందోళనలు దశరథునికి లేకపోలేదు. ఈ కారణంగానే కేకయరాజుకు, జనకమహారాజుకు ఆహ్వానం కూడా పంపలేదు. తరువాత తెలుసుకుంటారని సరిపెట్టుకున్నాడు.

కేకయరాజుని ఆహ్వానిస్తే వివాహంనాడు ఇచ్చిన మాట ప్రకారం తన మనుమడైన భరతుని యౌవరాజ్యాభిషిక్తుని చేయమంటాడేమోనని భీతి చెందాడు. కేకయరాజుని వదలి భరతశత్రుఘ్నులను ఎలా పిలిపిస్తాడు? అందుకని రామునికి ప్రాణతుల్యమైన సోదరులను కూడా దూరంగాపెట్టి పట్టాభిషేకాన్ని జరిపించాలని యత్నించాడు.

కేకయరాజు విషయంలో దశరథుడు భయపడివుండొచ్చు. మరి జనకమహారాజుని ఎందుకు ఆహ్వానించలేదు?

తాను కేకయరాజు కుమార్తెను పరిణయమాడాడు. తన కుమారులు జనకమహారాజు అల్లుళ్ళైనారు. ఒకరిని పిలిచి మరొకరిని పిలవకుండా ఎలా వుండగలడు? కేకయరాజుని మనస్ఫూర్తిగానే ఆహ్వానించదలచుకోలేదు. ఇక జనకునికూడా ఆహ్వానించకూడదని భావించాడు. తన ప్రియపుత్రుడు రాజుకావడమే తనకు ముఖ్యమని నిర్ణయించుకున్నాడు.

దశరథుడు ప్రజాభిప్రాయాన్ని సేకరించి రామునికి పట్టాభిషేకం చేస్తున్నాడు. సత్యం అనే విషయంలో తాను బలహీనంగా వున్నాడు. అందుచేత ప్రజాభిప్రాయం, కులధర్మం అనే ధర్మఛత్రం క్రింద రాముని రాజుచేయాలని సంకల్పించాడు.

వంశధర్మాన్ని పాటించాలని తానిచ్చిన మాటను విస్మరించి రామునికి పట్టాభిషేకం చేయ సంకల్పించాడు. అదే జరిగివుంటే మాటతప్పినవాడుగా దశరథుడు నిందలపాలు కాడా? ఈమాత్రం దశరథునికి తెలియదా? తెలుసు.

ఆనాడు కేకయరాజుకు మాటిచ్చాడు. ఆమాటప్రకారం వర్తిస్తే కుటుంబధర్మం దెబ్బతింటుంది. కుటుంబప్రతిష్ఠ దెబ్బతినకూడదని భావించాడు. తన ప్రతిష్ఠ దెబ్బతినినా ఫరవాలేదు అనే నిర్ణయానికివచ్చిన ఉదారపురుషుడు, త్యాగమయుడు దశరథుడు.

ధర్మం తప్పలేదు - అబద్ధం చెప్పలేదు. ఇది దశరథుని మానసిక సంఘర్షణ. ఏ సత్యాన్ని దశరథుడు ప్రేమిస్తున్నాడో ఆ సత్యం నీడలోనే నాకూ న్యాయంజరగాలి అని పట్టుబట్టింది కైకేయి. ఇచ్చినమాట నిలబెట్టుకోకపోతే సత్యం భంగమవుతుందని ఇంకా బెదిరిస్తుంది కూడా. సత్యం కనుమరుగైనపుడు నూనెలేని దీపంలా ధర్మం అదృశ్యమవుతుందని వాదిస్తుంది. ఆమె ప్రశ్నకు దశరథుడు ఏమి సమాధాన మిస్తాడు? ఇంతకీ ఈ ధర్మ మీమాంసలో వీరి నిజస్వరూపాలేమిటి? ఎవరికి న్యాయంజరగాలి? ఎలా జరగాలి? వారిని అధ్యయనం చేసి మనబ్రతుకుల్ని మనమెలా సంస్కరించుకోవాలి? కాస్త నడవండి. చూద్దాం.

## కసి తీర్చుకున్న కైకేయి

రాత్రంతా దశరథమహారాజు దుఃఖిస్తూ గడిపాడు. తెల్లవారుతోంది. వైతాళికులు వచ్చి సుప్రభాతం పాడారు. వద్దని వారించాడు దశరథుడు.

ప్రపంచంలో తెల్లవారింది. తన బ్రతుకుకూడా తెల్లారిపోయినట్లేనా అని దుఃఖిస్తూ నేలపైబడి దొర్లుతున్నాడు దశరథుడు.



కైకేయి వచ్చింది. "ఏమిటీ పొర్లడాలు, దొర్లడాలు? నాకిచ్చిన వరాల మాటేమిటి? తప్పించుకోవాలని చూడకు. సంపాదించుకున్న వైభవమంతా మంటగలసిపోతుంది.

**ఆహుః సత్యం హి పరమం ధర్మం ధర్మవిదో జనాః**

**సత్య మాశ్రిత్య హి మయా త్వం చ ధర్మం ప్రబోధితః**

"ధర్మజ్ఞులైనవారు సత్యమే ధర్మమని చెబుతారు. నేనుకూడా సత్యాన్ని ఆశ్రయించే నిన్ను ధర్మం విషయములో ప్రశ్నిస్తున్నాను" అన్నది కైకేయి.

ధర్మాన్ని ఆశ్రయించి సత్యాన్ని మరుగుపరచి కార్యాన్ని సాధించుకోవాలి అని దశరథుడు ప్రయత్నించాడు. సత్యాన్ని ఆశ్రయించి, ధర్మాన్ని విస్మరించి తన పనిని పూర్తి చేసికోవాలని కైకేయి ఆలోచించింది. కైకేయి అంతటితో విడిచిపెట్టలేదు.

**సత్యం సమనువర్తస్వ యది ధర్మే ధృతా మతిః**

**స ఫలః స వరో మేఽస్తు వరదో హ్యసి సత్తమ ॥**

"శ్రేష్ఠుడైన రాజా! ధర్మంమీద నీకు నమ్మకముంటే సత్యాన్ని పాటించు. నా కోర్కెలు తీర్చు. వరాలిచ్చింది నీవుగావా?

"నీవు ధర్మాన్ని రక్షించుకో. ఆ విషయంలో నేనుకూడా నీకు సహకరిస్తూనే ఉన్నాను. రాముని వెంటనే అడవికి పంపు. నీవు ఇచ్చినమాట తప్పినచో నేను నీఎదుటే ప్రాణాలు విడుస్తాను" అన్నది కైకేయి.

సత్యాన్ని ప్రతిపాదిస్తూ కైకేయి ప్రసంగించినపుడు దశరథుడు ఆమె దయను ధర్మం కోసం అర్థిస్తాడు.

చివరికి ఏం జరిగింది? ఇద్దరూ విఫలులయ్యారు.

సత్యాన్ని విడిచిన ధర్మం మనలేదని దశరథుడు గ్రహిస్తే, ధర్మానికి దూరమై సత్యం మనలేదని కైకేయి గ్రహించింది. సత్యధర్మాలనేవి బండికి రెండు చక్రాలవలె బ్రతుకుకు అత్యావశ్యకములని, ఏ ఒక్కటి వక్రించినా బ్రతుకు కుంచుకుపోతుందని మనం గ్రహించాలి.

కైకేయి తొందరపెడుతూవుంది. బండి చక్రానికి, కాడికి మధ్యపడి నలిగిపోతున్న ఎద్దువలె దశరథుడు వ్యథచెందుతున్నాడు. అతని ముఖం నిద్రలేక పాలిపోయిఉంది. వ్యాకులముగా వున్న కళ్ళతో ఏమీ చూడలేకపోతున్నాడు. అతికష్టంమీద నాలుగుమాటలు పలికాడు.

"పాపిష్టిదానా! అగ్నిసాక్షిగా, మంత్రపూర్వకంగా నిన్ను పాణిగ్రహణం చేశాను. నేను పట్టిన ఆ చేతిని, నిన్ను, నీ పుత్రునికూడా త్యజిస్తాను. కైకా! తెల్లవారిపోయింది. రామునికి పట్టాభిషేకం చేయవలసిందని వసిష్ఠ వామదేవాది గురువులు నన్ను తొందరపెడతారు. నేను రామునికి పట్టాభిషేకం చేయుటకు బదులుగా రాముడే నాకు ఉత్తరక్రియలు చేస్తాడు. నిన్నటివరకు ఎంతో ఆనందంగా కనిపించిన ప్రజల్ని ఈరోజు దుఃఖంతో నేను చూడలేను;" అన్నాడు దశరథుడు.

"మహారాజా! విషపూరితమైన మాటలద్వారా నన్ను బాధిస్తున్నావు. ఎందుకొచ్చిన ఆలస్యం? నీ కుమారుడైన రాముని పిలిపించు. నా కుమారునికి రాజ్యాన్ని అప్పగించు.

రాముని అడవికి నడిపించు. అలా జన్మను సార్థకం చేసుకో;" అన్నది కైకేయి కొరడాతో కొట్టినట్లు.

"కైకా! ధర్మపాశానికి నేను కట్టుబడిపోయాను. నా బుద్ధి నీరసించిపోయింది. నా ప్రియమైన రాముణ్ణి చూడగోరుతున్నా!" అని పలికాడు దశరథుడు. దుర్భర దుఃఖాన్ని భరించలేక దశరథుడు రాముణ్ణి చూడాలని కోరాడు. కైకేయి కామానికి ప్రతీక. కామదర్శనంతో ఏర్పడిన దుఃఖాన్ని రామదర్శనంతో పోగొట్టు కోవాలి. మనం కూడా జీవితంలో ఏ కష్టమొచ్చినా, నెత్తినోరు మొత్తుకొని ఏడ్వడం గాకుండా ఆలయానికి వెళ్ళి భగవంతుని మూర్తిని దర్శించడం, లేదా భగవత్సంబంధమైన గ్రంథాలను పఠించడం, లేదా భగవన్నామసంకీర్తన చేయడం అలవరచుకోవాలి. ఈవిధంగా దుఃఖమయ పరిస్థితులలో శాంతినిపొంది సుఖించాలి.

**మోర్ మనోరథు సురతరు ఫూలా**

**ఫరత్ కరిని జిమి హతెఉ సమూలా**

"నా మనోరథమనే కల్పవృక్షము పుష్పించి ఫలించే సమయంలో కైకేయి ఏనుగువలె ఆవృక్షాన్ని పెకలించివేసింది" అని భావించాడు దశరథుడు అంటుంది రామచరిత మానసము.

ఒక్కసారి పెకలించబడిన తరువాత వృక్షము మళ్ళీ తిరిగి కన్పించదు. ఆవిధంగా దశరథుని సుఖాన్ని హరించాలని చూచింది కైకేయి.

భరతుడికి రాజ్యాన్ని వాంఛించడం బావుంది. కానీ రాముడు అరణ్యావాసం పోవాలని ఎందుకు వాంఛించింది? ఇది మంథర చేసిన కుట్ర.

భరతునికి రాజ్యం సంక్రమించినా రాముడు అయోధ్యలోనే ఉంటే రామునికి రాజ్యకాంక్ష ఏర్పడవచ్చు. అందుకని అరణ్యాలకు పంపింది.

రాముణ్ణి అరణ్యాలకుమాత్రమే ఎందుకు పంపాలి? దూరదేశానికి పంపమనవచ్చు గదా! లేదా జనకపురికి పంపవచ్చుగదా!

అరణ్యానికి పంపి, అక్కడ మునివృత్తిలో రాముడు జీవించేటట్లు చేస్తే రామునిలో రజోగుణ ప్రవృత్తి నశించి సత్త్వగుణము ఏర్పడుతుంది. సత్త్వగుణ ప్రధానుడు ఆత్మవిచారము నందు ఆసక్తిచూపునేగాని రాజ్యకాంక్షను కలిగియుండడు. ఈవిధంగా రాముని శాశ్వతంగా సింహాసనానికి దూరం చేయాలని సంకల్పించుటచేత రాముని వనవాసమునకు పంపమని కైకేయి కోరింది.

ఈ విధంగా రాముడు రాజుకావాలని యోచించే తన మనోరథమనెడి కల్పవృక్షము ఫలప్రదమవుతున్న సమయంలో కైకేయి ఏనుగువలె ప్రవేశించి దాన్ని పెకలించివేసింది అని తలపోసుకుంటున్నాడు దశరథుడు.

మరి రాముని చూడాలని దశరథుడు ఎందుకు భావిస్తున్నాడు? పశ్చాత్తాపంతో హృదయం కుమిలిపోతూవుంది కనుక. అంతేకాదు, ప్రేమతో గుండె చలించిపోతూవుంది.

దీనితోపాటు మరొక కారణం కూడా ఉంటుందేమో! తానెంత చెప్పినా మారని కైకేయి రాముని ముఖంచూసి మారకపోతుందా? అనే ఆశకూడా ఉండివుంటుంది.



అయోధ్య వీధులన్నీ అందంగా అలంకరించబడ్డాయి. రంగురంగుల పతాకాలు రెపరెపలాడుతున్నాయి. జనులందరూ ఆనందోత్సాహాలతో అటూ ఇటూ తిరుగుతున్నారు. రామునికోసం అందరూ ఉత్కంఠతో నిరీక్షిస్తున్నారు.

వసిష్ఠుడు సంతోషంతో అంతఃపురములో ప్రవేశించాడు. ఇంతలో సచివుడు, సారథియైన సుమంత్రుడు కనిపించాడు.

"సుమంత్రా! నేను వచ్చియున్నానని రాజుగారికి చెప్పు. పట్టాభిషేకానికి సర్వమూ సిద్ధంచేయబడిఉంది. రాజుగారిని తొందరపెట్టు;" అన్నాడు వసిష్ఠమహర్షి.

సుమంత్రుడు శయనమందిరంలోనికి ప్రవేశించాడు. మంగళవచనాలు పలికాడు.

" ఓ రాజా! సూర్యోదయమున సాగరుడు ఆనందించునట్లు నీవూ ఆనందించు. మాతలి ప్రాతఃకాలమున ఇంద్రుని స్తుతించినట్లు నిన్ను నేను స్తుతిస్తున్నాను. సురులందరూ తమకు సహకరించెదరుగాక!

"రాజా! పెద్దలు, అధికారులు, అధిపతులు తమకొరకు నిరీక్షిస్తున్నారు. రాత్రి సెలవు తీసుకుంది. ఉదయం మిమ్ములను ఆహ్వానిస్తున్నది. రాజా! మంగళవేషము ధరించి మేరు పర్వతమునుండి భానుడు లేచినట్లు పురజనులకు దర్శనమివ్వండి. వసిష్ఠాది మహర్షులు మీకొరకు వేచియున్నారు" అని పలికాడు సుమంత్రుడు.

దశరథుడు తలఎత్తి సుమంత్రుని చూడలేకపోయాడు. ఈలోగా కైకేయి కల్పించుకొని మాట్లాడసాగింది.

"సుమంత్రా! రాత్రంతా రామపట్టాభిషేకానికి సంబంధించిన ఉత్సాహముతో రాజు గారు నిద్రపోలేదు. ఇపుడు అలసి నిద్రిస్తున్నారు. నీవు తొందరగా వెళ్ళి రాముని వెంట బెట్టుకొనిరా!" అని పలికి సుమంత్రుని రామునివద్దకు పంపింది కైకేయి.

సుమంత్రుడు రామునిమందిరానికి విచ్చేశాడు. రామునికి నమస్కరించాడు. "రామా! నీ తండ్రి, రాణియైన కైకేయి నిన్ను చూడవలెనని కోరుతున్నారు. బయలుదేరండి;" అన్నాడు.

రాముడు సీతవైపుతిరిగి ఇలా పలికాడు: "సీతా! మా తండ్రి, మా తల్లి కైకేయి నన్ను గూర్చి, నా రాజ్యాభిషేక విషయమునుగూర్చి చర్చించుకుంటూ వుంటారు. నన్ను చూడాలని మా అమ్మే తొందరపెట్టి ఉంటుంది. కైకేయి చాలా మంచిది. ఆమెకు భరతునికంటే కూడా నేనంటేనే ప్రేమ. సదా నా క్షేమమే కోరుతూఉంటుంది. నేను వెళ్ళొస్తాను. నీవు చెలికత్తెలతోగూడి మాట్లాడుతూవుండు " అని చెప్పి రాముడు సుమంత్రునితో కలసి బయలు దేరాడు. లక్ష్మణుడు రాముని అనుసరించాడు.

రాముడు దశరథుని భవనంలోకి ప్రవేశించాడు. పాలిపోయిన ముఖంతో దశరథుడు దీనుడై కనిపించాడు. రాముడు తండ్రికి, కైకేయికి పాదాభివందనం చేశాడు.

దశరథుడు "రామా!" అని ఒక్కమాట మాత్రమే అనగలిగాడు. అంతే. అతని కళ్ళు అశ్రుపూర్ణాలయ్యాయి. దీనుడై తలవంచాడు. నోరు మాట్లాడలేకపోయింది. కళ్ళు చూడలేకపోయాయి.

ఈత రానివాడు భయంకర నదీప్రవాహములో పడి కొట్టుకుపోయే సమయాన మాటలు, చూపులు ఎలా కరువవుతాయో దశరథుని పరిస్థితి అలాగే తయారైంది అంటాడు తులసీదాసు.

**పాప పహార్ ప్రగట్ భఇ సోఈ ! భరీ క్రోధ్ జల్ జాఇ న జోఇ**
**దోఉ బర్ కూల్ కఠిన్ హఠ్ ధారా! భవఁర్ కూబరీ బచన్ ప్రచారా**
**టాహత్ భూప్ రూప్ తరుమూలా! చలీ బిపతి బారిధి అనుకూలా!**

కైకేయి క్రోధము ఒక నదిలాంటిది. అది పాపమనే కొండల్లో పుడుతుంది. వంకర టింకరగా పయనిస్తుంది. క్రోధమే దాని జలము. రెండు వరాలే రెండు తీరాలు. మూర్ఖత్వమే దాని ప్రచండ ప్రవాహము. మంథర దుర్వచనాలే దానిలోని సుడిగుండాలు. దశరథ మహారాజు ఒడ్డున నిలిచియున్న చెట్టు. నదీప్రవాహము చెట్టును పడదోయునట్లు, కైకేయి క్రోధమనే ఈ నదీప్రవాహము దశరథుని అమాంతం పడదోసింది. నోటిని కట్టేసింది. కంటిని మూసేసింది.

రాముడు పూర్వము ఎన్నడూ చూడనివిధంగా తండ్రియొక్క రూపమునుజూచి దిగ్భ్రాంతి చెంది సర్పమును తొక్కినవానివలె భయపడ్డాడు.

దశరథుడు గ్రహణంపట్టిన సూర్యునిలాగా, అబద్ధము పల్కిన ఋషిలాగా, కాంతిహీనమై గోచరిస్తున్నాడు. రాజుకు కలిగిన దుఃఖమేమిటో అర్థంగాక పున్నమినాడు సాగరములాగ రాముడు కలతచెందాడు.

"ఏమిటి? ఈనాడు మా తండ్రిగారు నాతో సంతోషంగా మాట్లాడడం లేదు. పూర్వం కోపంగా ఉన్నప్పుడుకూడా నన్ను చూడగనే మా తండ్రి ప్రసన్నంగా కన్పించేవాడు. ఈనాడు నన్ను చూచి దుఃఖిస్తున్నాడు. కారణమేమిటి?" అని చింతించి, దీనుడై, దుఃఖార్తుడైన రాముడు కైకేయిని సమీపించాడు.

"అమ్మా! నావల్ల ఏమైనా అపరాధం జరిగిందా? నాపై తండ్రికి కోపం ఎందుకొచ్చిందో నీవైనా చెప్పు. అజ్ఞానంతో నేను తండ్రికి బాధను కల్గించానా?

"నాన్నగారి ఆరోగ్యం బాగున్నదా? మానసిక చింతలేవీ లేవుకదా? **'దుర్లభం హి సదా సుఖమ్'** సుఖమనేది ఎల్లప్పుడూ ఉండదు.

"అమ్మా! భరతశత్రుఘ్నులు, నా తల్లులు అందరూ క్షేమమేగదా? మా నాన్నకు కోపము వచ్చినా, దుఃఖం వచ్చినా నేను క్షణంకూడా భరించలేను. తండ్రియేకదా తనయునికి ప్రత్యక్షదైవము.

"తల్లీ! నీవు కోపంలో తండ్రిని బాధపెట్టలేదుకదా! పూర్వము ఎన్నడూ చూడని బాధ ఈనాడు మా తండ్రి ముఖంలో గోచరిస్తూవుంది. నిజంచెప్పమ్మా! నీ రాముడు అడుగుచున్నాడు. నిజంచెప్పు;" అని రాముడు కైకేయిని ప్రశ్నించాడు.

స్వార్థపూరితురాలగు కైకేయి లజ్జకూడా లేనిదై, నిర్భయంగా పలికింది. "రామా! రాజుగారికి కోపమూ లేదు. కష్టమూ లేదు. ఆయన మనసులో వున్న విషయాన్ని నీకు చెప్పడానికి సంశయిస్తున్నాడు. అంతే.

"ప్రియుడవైన నీకు అప్రియమైన విషయాన్ని ఎలాచెప్పాలా అని ఆలోచిస్తున్నాడు. మీ నాన్న నాకు మాట ఇచ్చివున్నాడు. దానిని నీవు నెరవేర్చాలి.



"రామా! మీ నాన్న పూర్వము నాకు ఒక వరము ఇచ్చి ఉన్నాడు. అలా వరమిచ్చినందుకు ఇప్పుడు సామాన్యునిలాగా చింతిస్తున్నాడు. మాట తప్పాలనికూడా ప్రయత్నిస్తున్నాడు.

"చూడు రామా! సత్యము సర్వధర్మములకు ఆలంబనమని పెద్దలు చెప్పియున్నారు. మాటతప్పడంకన్నా మరణమే మేలంటారు. చూడు. నీ కారణంగా మీ తండ్రిగారు సత్యమును త్యజించకూడదు.

"రాజుగారు చెప్పేది ఇష్టమైనా, కష్టమైనా నేను తప్పకపాటిస్తాను అని నీవు మాట ఇస్తే ఆ విషయం నేనే నీకు చెప్తాను. మీ తండ్రిగారు చెప్పే స్థితిలో లేరు " అన్నది కైకేయి.

కైకేయి మాటలు రాముని తీవ్రంగా బాధించాయి. "అమ్మా! ఈ బాధంతా నా వల్లనేనా? నేనేనా ఈ దుఃఖానికి కారణం? ఛీ! ఎంత కష్టము! ఎంత కష్టము!

"దేవీ! నా విషయంలో మీకు సందేహం అవసరంలేదు. తండ్రిగారు ఇష్టపడితే అగ్నిలో దూకడానికికూడా నేను సిద్ధమే. భయంకరమైన విషాన్ని పానంచేయుటకు కూడా వెనుకాడను. సముద్రంలో దూకమన్నా ఈక్షణమే దూకుతాను.

"దేవీ! రాజుగారి ఆజ్ఞ ఏమిటో చెప్పు. తప్పకచేస్తాను.

**'కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభి భాషతే '**

"ప్రతిజ్ఞచేసి మరీ చెబుతున్నాను. రాముడు రెండుమాటలు పలకడు;" అని నమస్కరించాడు రాముడు.

పాపాత్మురాలైన కైకేయి రామునితో ఇలా దారుణంగా పలికింది.

"రామా! పూర్వము శంబరాసురుడనే రాక్షసుడు దేవదానవ సంగ్రామంలో మీ తండ్రి గారిని తీవ్రంగా హింసించాడు. అప్పుడు నేను ప్రక్కనేఉండి మీ నాన్నగారిని రక్షించాను. అందుకు సంతోషించిన మీ తండ్రి నన్ను రెండు వరాలు కోరుకోమని చెప్పారు. నేను వాటిని అవసరము వచ్చినపుడు ఉపయోగించుకొంటానని చెప్పాను.

"ఆ రెండు వరాలను ఇప్పుడు మీ నాన్నగారి అనుమతిపై అడిగాను. భరతునికి యౌవరాజ్యాభిషేకం చేయడం నేను కోరిన మొదటి వరం. నీవు నేడే బయలుదేరి దండకారణ్యం వెళ్ళి, అక్కడ పద్నాలుగుసంవత్సరాలు వసించడం రెండవవరం.

"రామా! ఇవీ వరాలు ! అర్థమైందా! ఈ మాట నీకు ఎలాచెప్పాలో తెలియక మీ నాన్నగారు బాధపడుతున్నారు. తండ్రిమాటను నిలపడం నీ కర్తవ్యం. తండ్రిఆజ్ఞ పాలించు.

"నీ అభిషేకానికి ఏర్పాటుచేసిన సంభారాలతో భరతునికి పట్టాభిషేకం చేయించు. నీవు జడలూ, అజినాలు ధరించి పద్నాలుగుసంవత్సరాలు అరణ్యంలో వుండు. తెలిసిందా! నీ తండ్రి నిన్నెందుకు చూడలేకపోతున్నాడో అర్థమైంది కదూ!" అన్నది కైకేయి.

**ఇతీవ తస్యాం పరుషం వదన్త్యాం న చైవ రామః ప్రవివేశ శోకమ్ ॥**

"ఆమె అలా కర్కశంగా మాట్లాడుతున్నా రామునికి కించిత్తైనా మనసు కలత చెందలేదు."

"అమ్మా! నీవు చెప్పినట్లే జరుగుతుంది. రాజుగారి ఆజ్ఞానుసారము నేను జడలు ధరించి అరణ్యంలో వసిస్తాను. దేవీ! నీవు ఈ విషయంలో సంకోచింపకు. నీ మాట వింటాను. రాజుగారి ఆజ్ఞ పాలిస్తాను. నీవు సంతోషించు.

"తండ్రి కోరినదానిని నేను చేయకుండా ఉంటానా? భరతుడు నాకు ప్రాణతుల్యుడు. భరతునికోసం నేను సర్వస్వాన్ని సమర్పిస్తాను. అంతకుమించిన ఆనందం నాకు మరొకటుండదు. భరతుని కివ్వడానికి ఒకరు చెప్పనవసరం లేదు. అది నాకే సంతోషదాయకం. అందులో నా తండ్రి ఆజ్ఞకూడా తోడైంది. ఇక నేను ఆలస్యం చేస్తానా?

"కానీ ఈ విషయాన్ని నాతో చెప్పడానికి మా తండ్రిగారు ఎందుకు సంకోచిస్తున్నారు? అదే నాకు అర్థంగాక గుండెను పిండుతూవుంది. తన అభీష్టాన్ని ఆయన నాతో స్వయంగా చెప్పవచ్చుకదా! నేను ఆయనకు సేవకుడ్నేకదా! ఆయన ఆజ్ఞను పాలించడంకన్నా సంతోషమైన విషయం నాకు వేరొకటుంటుందా? ఎందుకని రాజుగారు ఆవైపుతిరిగి కన్నీళ్ళు కారుస్తున్నారు?

"ఏది ఏమైనా, నా తండ్రి ఆజ్ఞలోని యుక్తాయుక్తములను పరీక్షించకుండా దండకారణ్యంలో పద్నాలుగు సంవత్సరాలు నివసించడానికి ఇప్పుడే నేను బయలుదేరుతాను. భరతుని మేనమామగారి ఇంటినుండి రప్పించండి;" అన్నాడు రాముడు.

వనవాసవార్త రామునిలో ఏ విధమైన విచారాన్ని చూపలేకపోయింది. ఈవార్త రామునికి చాలా ఆనందాన్ని కల్పించింది అంటాడు రామచరితమానసంలో తులసీదాస్. దానికి కారణాలు ఇలా వివరిస్తాడు. వనవాసమువల్ల కలిగే ప్రయోజనాలను ఈవిధంగా రాముడు భావించాడట.

1. వనవాసమువల్ల సత్సాంగత్యము లభిస్తుంది. సాధనకు ఉపయుక్తమైన యవ్వనంలో సత్పురుషుల సాంగత్యభాగ్యం లభించడం దుర్లభము.
2. పితృవాక్పరిపాలనము అనెడి వ్రతము ఫలప్రదమవుతుంది. తల్లిదండ్రుల ఆజ్ఞచే అరణ్యాలకువెళ్ళి తపస్సుచేసుకొనే భాగ్యం కలిగింది.
3. ప్రాణ సమానమైన భరతునికి రాజ్యం లభిస్తూ ఉంది. ఇంతకన్నా భాగ్యము మరొకటిలేదు.
4. తల్లియైన కైకేయి మనోరథమును నెరవేరుతుంది.

"అమ్మా! ఇంత చక్కని అవకాశము కోరకుండా లభించినపుడు నేను వనాలకు వెళ్ళకుండా నిరాకరిస్తే నా అంతటి మూర్ఖుడు మరొకడుంటాడా? ఈ అవకాశాన్ని ఎవరు జారవిడుచుకుంటారు?

**సేవహిం అరండు కలప్ తరు త్యాగీ పరిహరి అమృత్ లెహిం బిషుమాగీ**

**తేవు న పా ఇ అస్ సమఉ చుకాహీం దేఖు బిచారి మాతు మఁ మాహీం.**

"తల్లీ! మంచితరుణము వచ్చినపుడు దానిని పోగొట్టుకొనువాడు కల్పవృక్షమును విడిచి ఆముదపుచెట్టును ఆశ్రయించువంటివాడు. అమృతమును విడిచి విషమును పానము చేయు వంటివాడు. అట్టివాడు విలపించకపోడు. విచారించకపోడు" అన్నాడు రాముడు.

కైకేయికి ఇప్పుడు ధైర్యం కుదిరింది. రాముడు అరణ్యానికి తప్పక వెళ్తాడు అనే విశ్వాసం ధృవపడింది. ఆమె హృదయం సంతోషంతో పొంగిపోయింది. రాముని ప్రయాణానికి తొందర పెట్టసాగింది.



"రామా! నీవు చెప్పినట్లు దూతలు ఇప్పుడే బయలుదేరి వెళ్ళి, భరతుని మామగారి ఇంటినుండి వెంటబెట్టుకొని వస్తారు. నీవు ఇక ఆలస్యంచేయడం మంచిదికాదని నా అభిప్రాయము. నీవు వెంటనే అడవికి బయలుదేరు.

"రామా! నీవు ఈ పట్టణము విడచి పోనంతవరకు మీ నాన్నగారు స్నానం చేయరు. ఆహారం ముట్టరు;" అన్నది.

ఆ మాటలు వినగానే "ఛీ! ఏమిటీ దుర్భర దుఃఖము" అనిపలికి దశరథుడు మూర్ఛపోయాడు. రాముడు దశరథుని లేవదీశాడు. కైకేయి మళ్ళీ రాముని తొందరపెట్టింది. దారుణమైన ఆమెమాటలు వినిన రాముడు ఏమాత్రం విచారము లేనివాడై కైకేయితో ఒక మాటన్నాడు.

**నాహ మర్థ పరో దేవి లోకమా వస్తు ముత్సహే**

**విద్ధి మా మృషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్ ॥**

"దేవీ! నాకు ధనమునందు ఆసక్తి లేదు. లోకధర్మాన్ని పాటించుటే నా వాంఛ. కేవలం ధర్మాన్ని ఆశ్రయించుకొనియున్న నేను ఋషిసమానుడనని తెలుసుకో.

"పూజ్యుడైన నా తండ్రికి ప్రియమైన కార్యమును చేయుటలో ప్రాణాన్ని సమర్పించుటకుకూడా నేను వెనుకాడను. తండ్రిని సేవించుటకన్నా, ఆయన ఆజ్ఞను పాలించుటకన్నా మించిన ధర్మమేమున్నది.

**గురువచన పితృవచన సాధుజ్జన ఆజ్ఞాపన**

**ఉల్లంఘీతో అభాగి పూర్ణ తో పాషాణ నరదేహా**

"గురువచనాన్ని, పితృవాక్యాన్ని, సత్పురుషుల ఆజ్ఞను ఉల్లంఘించువాడు అభాగ్యుడు. అట్టివాడు మానవరూపంలో తెలిసే పాషాణము " అని భావార్థ రామాయణంలో రామునిచే పలికిస్తాడు సంత్ఏక్‌నాథ్.

"తల్లీ! మా తండ్రిగారు చెప్పకపోయినా, నీ మాట ప్రకారము కూడా నేను పద్నాలుగు సంవత్సరాలు అరణ్యములో ఉండిపోతాను.

"దేవీ! నా స్వభావం నీకు తెలియంది కాదు. నన్ను శాసించే అధికారం నీకుంది. భరతుని పట్టాభిషేకం కోసం ఈ గొడవంతా ఎందుకు? దీనికోసం తండ్రివద్దనుండి నీవు వరాలు పొందాలా? భరతునికోసం ప్రాణం ఇవ్వడానికికూడా నేను సిద్ధమే. ఇంత అశాంతి ఎందుకు సృష్టించావమ్మా! దీనినిబట్టి నా స్వభావంపై నీకు విశ్వాసములేదని స్పష్టమవుతోంది.

"మంచిది. నేను నా తల్లి నుండి సెలవు తీసికొని, సీతను ఓదార్చి, వెంటనేఅరణ్యాలకు వెళ్తాను. భరతుడు రాజ్యమును పాలిస్తూ, తండ్రిని సేవించేలా చూడు;" అని పలికాడు రాముడు.

రాముని మాటలు విన్న దశరథుడు నోట మాట కదపలేక బోరున ఏడ్చాడు. రాముడు తండ్రి పాదములకు, మూర్ఛురాలైన కైకేయి పాదాలకు నమస్కరించి, వారిరువురికి ప్రదక్షిణం చేసి బయటికి వచ్చేశాడు.

సుమిత్రానందనుడైన లక్ష్మణుడు క్రుద్ధుడై, అశ్రుపూరిత నయనాలతో అన్నను అనుసరించాడు. రాముడు గొప్ప సౌందర్యవంతుడు. చంద్రుని సౌందర్యమును రాత్రి హరించలేనట్లు, రాముని శోభను రాజ్యనాశము హరించలేకపోయింది.

అరణ్యాలకు వెళ్ళేందుకు సిద్ధమవుతున్న రామునిలో చింత ఏమియును గోచరించ లేదు. సుఖదుఃఖాలకు అతీతుడైన యోగివలె శోభిస్తున్నాడు అంటాడు వాల్మీకిమహర్షి.

అది స్థితప్రజ్ఞుని లక్షణం. సమదర్శనయోగి వైభవం.

**దుఃఖే ష్వనుద్విగ్న మనా స్సుఖేషు విగత స్పృహః**

**వీతరాగ భయక్రోధః స్థిత ధీ ర్ముని రుచ్యతే**

"దుఃఖములయందు దిగులుచెందని మనసుకలవాడు, సుఖములయందు స్పృహలేనివాడు, అనురాగము, భయము క్రోధములనుండి విడిపడినవాడు, నియమించిన బుద్ధి గలవాడు ముని యని చెప్పబడ్డాడు" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత సాంఖ్యయోగంలో బోధించారు.

యౌవరాజ్యాభిషేక వార్తను దశరథుడు చెప్పినపుడు రాముడు పొంగిపోలేదు. అరణ్యానికి పద్నాలుగు సంవత్సరాలు వెళ్ళమని కైకేయి చెప్పినపుడు రాముడు కృంగిపోనూ లేదు. రాముడు స్థిరబుద్ధిగలవాడు. అయోధ్యలో వున్నా తాను అరణ్యాలలో ఋషులతో సమానుడే. కనుకనే **"విద్ధిమాం ఋషిభిస్తుల్యం"** అని రాముడే దాచుకోలేక తన స్వరూపాన్ని కైకేయికి ప్రకటించాడు. ఏం లాభం? చెవిటితనం బలంగా ఉండాలేగాని శంకు ఏం చేస్తుంది? పిడుగు ఏం పాడుస్తుంది? అభాగ్యులకు అరచేతిలోని అమలకం కూడా అగుపించదు. కైకేయి ఆ స్థాయికి టీసి పోయేదికాదు.

## తల్లి సన్నిధిలో తనయుడు

రామలక్ష్మణులు నిష్క్రమించుటను చూసి అంతఃపురములోని స్త్రీలు బిగ్గరగా రోదించారు. " రాముడు పుట్టినది మొదలు తల్లియైన కౌసల్యను ఎలా ప్రేమిస్తున్నాడో మనల్ని కూడా అలాగే ప్రేమించాడు. రాముడు కోపము నెరుగడు. ఎవరైనా కోపగిస్తే వారిని ఓదార్చేవాడు. అలాంటి రాముడు అడవికి పోతున్నాడు.

దశరథుడు బుద్ధిహీనుడు. సర్వులు ప్రేమించే రాముని అరణ్యానికి పంపి సర్వులను హింసిస్తున్నాడు;" అంటూ అంతఃపురములోని స్త్రీలు దూడలను పోగొట్టుకున్న గోవులవలె దుఃఖించారు. అది విని దశరథుడు మళ్ళీ మూర్ఛపోయాడు.

రాముడు లక్ష్మణునితోకూడి తల్లి అంతఃపురమున ప్రవేశించాడు. పుత్రుని కొరకు రాత్రంతయు జాగారం చేసిన కౌసల్య ఉదయాన్నే విష్ణుదేవుని పూజిస్తోంది. తెల్లని పట్టుచీర ధరించి, మంత్రపూర్వకంగా అగ్నిలో హోమం చేస్తోంది.

కౌసల్య రాముని చూసి, సంతోషించి, ఆడగుఱ్ఱం తన పిల్లను సమీపించునట్లు రామునికి ఎదురేగి కౌగిలించుకొని శిరసును మూర్కొనింది. రాముడు తల్లి పాదములను స్పృశించి నమస్కరించాడు.



పొంగిపొరలుతున్న సంతోష తరంగాలను ఆపుకొంటూ, "నాయనా! నీవు పూర్ణ ఆయుర్దాయముతో శోభించు. దివ్యమైన కీర్తితో ప్రకాశించు. వంశధర్మాన్ని పాటించు.

"నీ తండ్రి దశరథుడు ఆడినమాట తప్పడు. ధర్మాత్ముడైన నీ తండ్రి ఈరోజు నిన్ను అభిషేకిస్తాడు. నాయనా! ఈ ఆసనంపై కూర్చో. భోంచేద్దువుగాని " అని ప్రేమతో పలికింది కౌసల్య.

తల్లి చూపిన ఆసనమును స్పృశించి, వినమ్రుడై తల్లికి నమస్కరిస్తూ తన ప్రవాసమునుగూర్చి చెప్పుటకు రాముడు ఉపక్రమించాడు.

"తల్లీ! ఒక గొప్ప ఆపద ఈనాడు మనముందు నిల్చి ఉంది. అది నీకు తెలియదు. నీకు, సీతకు, లక్ష్మణునకు అది చాలా దుఃఖాన్ని కల్గించే విషయం.

"అమ్మా! నాకు ఆసనమెందుకు? నేను దండకారణ్యమునకు వెళ్తున్నాను. నేను దర్భాసనముపై శయనించవలసిన సమయం వచ్చింది. కాయలు, దుంపలు, పండ్లు, తేనె నారగిస్తూ జీవించవలసిన కాలం సమీపించింది. తల్లీ! నీకు బాధను కల్గించే వార్త ఒకటి తెచ్చాను. దుఃఖాన్ని దిగమ్రింగి నన్ను ఆశీర్వదించు.

"ఈ రాజ్యాన్ని తమ్ముడు భరతుడు పరిపాలించాలి. నేను జడలు ధరించి, మునివలె పద్నాలుగు సంవత్సరాలు దండకారణ్యంలో జీవించాలి. ఇవి తండ్రిగారి నిర్ణయాలు.ఆదేశాలు." అన్నాడు రాముడు.

రాముని మాటలు వినగానే కౌసల్య మొదలునరికిన సాలవృక్షంలాగా, స్వర్గంనుండి జారిపడిన దేవతలాగా, కత్తితో నరికిన అరటిచెట్టులాగా నేలమీద పడింది. ఆమె శరీరం దుమ్ముతో నిండింది. రాముడు ఆమెను పట్టిలేపి, చేత్తో నిమిరి, దుమ్ము పోగొట్టాడు.

"అయ్యో! నే విన్నది సత్యము కాదుగదా! కారడవులు, కడగండ్లు కల్లాకపటం తెలియని నా రామునికా?" అని ముఖం దోసిటనింపుకొని బోరున విలపించింది.

**యది పుత్ర న జాయేథా మమ శోకాయ రాఘవ**

**న స్మ దుఃఖ మతో భూయః పశ్యేయమహ మప్రజాః**

"రామా! నేను గొడ్రాలిగా వుండుంటే ఈ దుఃఖముండేది కాదు. నన్ను దుఃఖ సాగరములో ముంచేందుకే నీవు జన్మించావు.

"కుమారా! గొడ్రాలికి బిడ్డలు లేరనే బాధ ఒక్కటే. ఈ దుర్భరమైన దుఃఖాలు ఉండవు గదా! ఈనాడు నాకు ప్రాప్తించిన దుఃఖముకంటే మించిన దుఃఖము స్త్రీకి మరొక టుంటుందా?

"కైకేయిమీద వున్న ప్రత్యేక ప్రేమతో మీ తండ్రి నన్ను అనేక విధాల నిగ్రహించాడు. నిరాదరంగా, స్వేచ్ఛలేకుండాకూడా నేను జీవించాను.

**న దృష్ట పూర్వం కల్యాణం సుఖం వా పతి పౌరుషే**

**అపి పుత్రేపి పశ్యేయ మితి రామాస్థితం మయా ॥**

"రామా! భర్త అధికారంలో ఉండగా నేను ఏ సుఖానికీ నోచుకోలేదు. ఏ శుభాన్ని కోరుకోలేదు. బిడ్డ రాజైన తరువాత ఆలోచించవచ్చు అనుకొనేదాన్ని.

"నీవు వున్నప్పుడే నా స్వేచ్ఛ అంతమాత్రంగా వుంది. రేపు నీవు లేవని తెలిసి ఈనాడు నన్ను సేవించువారు కూడా సేవించరు. చిరుబుర్రుమని ఈసడించుకొనే కైకేయివద్ద నేను నానామాటలు పడవలసివుంటుంది.

"రామా! నీ పట్టాభిషేకాన్ని చూడాలని ఇంతకాలం ఓపికపట్టి నిరీక్షించాను. నాయనా! నీవు లేనిచోట నేను జీవించలేను. నాకు దీనికన్నా మరణమే నయం. దుర్భరమైన ఈ దుఃఖమును వృద్ధాప్యంలో నేను భరించలేను. నీకు దూరమై దైన్య జీవనమును గడపలేను.

"నాయనా! దైవం కూడా నన్ను చిన్నచూపు చూసింది. నేను చేసిన ఉపవాసాలు, జపధ్యానాలు, వ్రతాదులు ఇందుకేనా? అవన్నీ వృథా అయినట్లేనా?

"రామా! క్రొత్తనీరు వచ్చినపుడు నదీతీరాలు బ్రద్దలౌతుంటాయి. దారుణమైన ఈ వార్తవిని నా గుండె ఎందుకు బ్రద్దలుకాలేదు? అది గుండేనా? లేక బండా! లేకఇనుమా!

"ఏడుస్తున్న లేడిని సింహము వధించునట్లు రోదిస్తున్న నన్ను ఆ యముడు ఎందుకు చంపడం లేదు? యమలోకంలోకూడా నాకు చోటులేదా! ఇక నాకు మరణం లేనట్లేనా?

**ధృవం హ్యా కాలే మరణం న విద్యతే**

"అకాలమునందు మరణం రాదు."

"నే చేసిన తపస్సంతా ఊషరక్షేత్రమున నాటిన విత్తనమువలె వృథా అయింది. మృత్యువులో మనిషికి స్వేచ్ఛవుంటే ఈ క్షణాన్నే నేను మరణించివుండేదాన్ని.

"రామా! నీవు లేని బ్రతుకు వ్యర్థం. అది నిష్ప్రయోజనం. బలంలేని ఆవు దూడను అనుసరించునట్లు అనాథనైన నేను నీవెంట అరణ్యాలకు వస్తాను. కాదనకు తండ్రీ!" అంటూ కౌసల్య విలవిలలాడిపోయింది.

## వీరావేశంలో లక్ష్మణుడు

దుఃఖవదనయై శోకిస్తున్న కౌసల్యనుచూచి దీనుడైన లక్ష్మణుడు ఇలా పలికాడు.

"అమ్మా! పుణ్యచరితా! దుఃఖించకు. ఒక ఆడదాని మాటలకు తలవంచి, రాజ్యలక్ష్మిని కాలదన్ని, కానలకేగడం నాకు సుతరామూ ఇష్టంలేదు.

"రాజు వృద్ధుడు. భోగజీవి. కామాసక్తుడు. బుద్ధివైపరీత్యంలో కైకేయికి తలవంచి ఏదయినా చెప్పవచ్చు. అతనిమాటలు పట్టించుకోనవసరం లేదు.

"రామునిలో ఏ దోషముందని అయోధ్యనుండి వెళ్ళగొట్టాలి? ఏ అపరాధముందని అడవికి పంపాలి? నాకు ఏ కారణము గోచరించుటలేదు. పైగా, శత్రువుకూడా రాముని పరోక్షంగా నిందించడం నేను ఇంతవరకు చూడలేదు. వినలేదు.

"ప్రేమమయుడు, నిష్కపటి, జితేంద్రియుడు అయిన రాముని ధర్మజ్ఞుడైనవాడు ఎవ్వడైనా త్యజిస్తాడా?

"విపరీతబుద్ధితో, మనోచాంచల్యముతో మళ్ళీ బాల్యమును పొందినట్లు పలవరించే ఈ రాజుగారి మాటల్ని రాజధర్మము తెలిసిన ఏ పుత్రుడైనా అంగీకరిస్తాడా?



"అన్నయ్యా! ఈ విషయాలు బయట పొక్కకమునుపే రాజ్యాన్ని హస్తగతం చేసుకోవడం మంచిది. ధనుర్ధారినై నేను నీప్రక్క నిలిచియున్నాను. నిన్ను ఎదిరించే శక్తి ఎవరికుంది? అయోధ్య నీకు ఎదురుతిరిగితే దానిని నిర్జనప్రదేశంగా మార్చేస్తాను. భరతుని పక్షీయులుంటే వారిని వధిస్తాను. భరతుని హితము కోరువారిని తక్షణమే ఖండిస్తాను.

**మృదుర్హి పరిభూయతే**

"మెత్తని వానిని జనులు తిరస్కరిస్తారు.

"ఇక మెత్తదనం పనికిరాదు. ఈ చెత్తదనం మనకవసరంలేదు. కైకేయి మాటలను విశ్వసించి తండ్రి మనకు ఎదురుతిరిగితే నిర్దాక్షిణ్యంగా ఆయనను బంధిస్తాను. అవసరమైతే వధించడానికికూడా వెనుకాడను. మంచిచెడులు తెలియనివానిని శిక్షించినా దోషం లేదు.

"ఎవరి అండ చూసుకొని ఇతడు నిన్ను రాజ్యానికి దూరం చేయాలని సంకల్పించాడు? భరతునికి రాజ్యమివ్వడానికి ఇతడెవ్వడు?" అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడు రాజుగారి ఆజ్ఞను, అర్హతను ఎందుకు ప్రశ్నిస్తున్నాడు? వంశధర్మాన్ని దృష్టిలో పెట్టుకొని ఇలా మాట్లాడుతున్నాడు. జ్యేష్ఠకుమారుని రాజ్యార్హతను నిరాకరించడానికి దశరథునికి హక్కుందా? అని ప్రశ్నిస్తున్నాడు. రాముని రాజ్యానికి దూరంచేయడం ఎలా రాజనీతికి విరుద్ధమో, రాముడుండగా భరతుని రాజ్యాభిషిక్తుని చేయాలని చూడడం కూడా ధర్మవిరుద్ధమే.

రాజు ధర్మంతప్పితే ప్రజలు ధర్మాన్ని ఎలా పాటిస్తారు? ప్రజలు ధర్మాచరణకు వెన్ను చూపితే సమాజంలో అభ్యుదయం ఎలా సాధ్యం? అభ్యుదయాన్ని సాధించాల్సిన రాజు అధఃపతనాన్ని సృష్టిస్తూవుంటే చూస్తూ వూరుకోవడం అధర్మమే అవుతుంది అని లక్ష్మణుని వాదం. అందుచేతనే "ఈ రాజుగారి మాటల్ని రాజధర్మం తెలిసిన ఏ పుత్రుడైనా అంగీకరిస్తాడా?" అని ముందే ప్రశ్నించాడు లక్ష్మణుడు.

సత్యం పంచన నిలబడి దశరథుని ధర్మనిరతిని కైకేయి నిలదీస్తే, ధర్మం పంచనే నిలబడి దశరథుని రాజనీతిని సవాలు చేస్తున్నాడు లక్ష్మణుడు.

"అమ్మా! నామాట విను. నా అన్నగారైన రామునిపై నేను సత్యమైన ప్రేమానురాగాలు గలవాడ్ని. సత్యంమీద ఒట్టుపెట్టి చెబుతున్నాను. ధనుర్బాణాలమీద, యాగదానాల మీద ప్రమాణంచేసి చెబుతున్నాను.

**దీప్తమగ్నిం మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి**
**ప్రవిష్టం తత్ర మాం దేవి త్వం పూర్వ మవధారయ**

"తల్లీ! రాముడు ప్రజ్వలించుచున్న అగ్నిలో దూకవలసివస్తే ముందుగా నేను అగ్నిలో దూకుతాను. రాముడు అరణ్యములో ప్రవేశించవలసివస్తే ముందుగా నేను ప్రవేశిస్తాను. ఇందులో రెండవమాట లేదు.

"అమ్మా! నా పరాక్రమాన్ని చూడండి. నా వీరత్వాన్ని వీక్షించండి. ఉదయభానుడు అంధకారాన్ని అదృశ్యం చేయునట్లు నా పరాక్రమాన్ని చూపి నీ శోకాన్ని పోగొడ్తాను;" అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలు విన్న కౌసల్య చింతాక్రాంతురాలై ఏడుస్తూ రాముణ్ణి చూసింది. "రామా! లక్ష్మణుడు చెప్పింది విన్నావుగదా! నీ తమ్ముడు చెప్పింది నీకిష్టమైతే తరువాత చేయతగిన కార్యాన్ని రూపొందించుకో. అధర్మపరురాలైన నా సవతి మాటలకు విలువిచ్చి నన్ను విడిచి వెళ్ళకు. రామా! నీవు ధర్మమూర్తివి కదా! తల్లికి సేవ చేయడంకన్నా ఉత్తమమైన ధర్మం మరొకటుంటుందా? అట్టి ఉత్తమధర్మాన్ని త్యజించి వెళ్తావా నాయనా!

"రామా! పూర్వము కాశ్యపుడు ఇంటియందే ఉండి తల్లికి సేవచేసి, తత్ఫలితంగా స్వర్గాన్ని చేరాడు.

**యథైవ రాజ్యా పూజ్యస్తే గౌరవేణ తథాహ్యహమ్**
**త్వాం నాహ మనుజానామి న గన్తవ్యమి తో వనమ్**

"నీకు తండ్రి ఎలా పూజ్యుడో తల్లినైన నేనుగూడ పూజ్యురాలినే. నేను నీకు అనుమతి నివ్వడం లేదు. నా మాటనుగూడ విని అరణ్యానికి వెళ్ళకు.

"రామా! నీవు దూరమైతే నాకీ జీవితమెందుకు? ఈ సుఖాలెందుకు? నీతోపాటు ఉండి గడ్డితినైనా హాయిగా జీవించగలను. నీవు వెళ్తే నేను ఆహారపానీయాలు త్యజిస్తాను.

"రామా! పిప్పలాదమహర్షి విషయంలో అధర్మంగా ప్రవర్తించిన సముద్రుడు గతంలో బాధలు అనుభవించినట్లు, నన్ను బాధిస్తే నీకు దుఃఖం తప్పుతుందా! నేను ప్రాణత్యాగం చేస్తే దాని ఫలితం నిన్ననుసరించదా!" అంటూ విలపిస్తున్నది కౌసల్య.

లక్ష్మణుని ఆవేశవచనములు విన్నతరువాత కౌసల్యాదేవి మాట్లాడిన మాటల్లో ఒక విషయాన్ని మనం సూక్ష్మంగా గ్రహించాలి. "రామా! నీ తమ్ముడు చెప్పినది నీకు ఇష్టమైతే **(రోచతే యది)** ఆ తరువాత కార్యక్రమాన్ని నిర్ణయించుకో " అన్నది.

వీరావేశంతో లక్ష్మణుడు చెప్పినదానిని గ్రుడ్డిగా కౌసల్య సమర్థించడంలేదు. నీకిష్టమైతేనే నిర్ణయించుకో అన్నది. లక్ష్మణుని నిర్ణయాన్ని రాముడు అంగీకరించడని కౌసల్యకు తెలుసు. ప్రేమకొరకు ధర్మాన్ని వ్యతిరేకించడానికి లక్ష్మణుడు సిద్ధమయ్యాడు. కానీ ధర్మంకొరకు ప్రేమల్ని ఆహుతి చేయడానికికూడా రాముడు వెనుకాడడు. ఆయన ధర్మమూర్తి. అవసరమైతే ధర్మరక్షణలో ప్రాణాన్నికూడా తృణప్రాయంగా చూస్తాడు.

కౌసల్య మాటల్లో మరొక భావనకూడా ఉంది. ఇతరుల సలహాలను, అభిప్రాయాలను ఆలకించడంలో తప్పులేదు. కానీ స్వధర్మాచరణములో తనకంటూ స్వీయభావాలు, స్వీయ నిర్ణయాలు ఉండాలి. అన్యుల భావ మారుతంలో కొట్టుకపోయేవారు స్వధర్మంలో స్థిరంగా నిలవలేరు. కనుక దుర్భరమైన దుఃఖాన్ని అనుభవిస్తున్న దశలో కూడా బిడ్డకు ధర్మవిషయంలో సముచిత సూచనలను కౌసల్య అందిస్తూనే వుంది. బిడ్డల విషయంలో తల్లులందరు కౌసల్యలు కాగలిగితే ప్రతి ఇంట్లో రాముడున్నట్లే. దేశంలో రామరాజ్యం వచ్చినట్లే.

దీనురాలై దుఃఖిస్తున్న తల్లినిచూసి రాముడు ధర్మప్రవచనం చేశాడు.

"అమ్మా! తలవంచి నిన్ను వేడుకుంటున్నాను. తండ్రిమాటను అతిక్రమించే శక్తి నాకు లేదు. నేను అరణ్యానికి వెళ్ళకతప్పదు. ధర్మజ్ఞుడు, తపస్వి అయిన కండుమహర్షి తండ్రి మాటకు తలవంచి గోవును వధించాడుకదా!



"మన వంశీయులైన సగరకుమారులు తండ్రియాజ్ఞచే భూమిని త్రవ్వుతూ దుర్మరణము ననుభవించారా లేదా! తండ్రియైన జమదగ్ని మాటకు తలవంచి మహానుభావుడైన పరశురాముడు తన తల్లి రేణుకను గొడ్డలితో నరికి చంపాడు కదా!

"తల్లీ! నేనుకూడా తండ్రి ఆజ్ఞను పాలించదలచాను. అందరూ నడచిన బాటనే నేను అనుసరించుచున్నాను.

**నా హం ధర్మ మపూర్వం తే ప్రతికూలం ప్రవర్తయే**
**పూర్వైరయ మభిప్రేతో గతో మార్గోఽను గమ్యతే ॥**

"అమ్మా! పూర్వులందరు అంగీకరించి, అనుసరించిన ధర్మమునే నేను అనుసరిస్తున్నాను. నూతనధర్మాన్ని నేను అవలంబించుట లేదు;" అన్నాడు ధర్మాత్ముడైన రాముడు.

ఇది రాముని మాట. ఇదియే రాముని బాట, శ్యాముని బాట. మన పూర్వీకులు ఋషులు. సత్యద్రష్టలు. వారి బాటలో చరించి, సంచరించి ఎందరో తరించారు. తరిస్తున్నారు. తరించబోతున్నారుకూడా.

సనాతనధర్మ స్రవంతిలో ఈదలేనివారు మరొకరిని చేదుకోలేరు. వాదాలతో, పిడివాదాలతో, వడివడిగా చరించాలని, తరించాలని క్రొంగొత్త మార్గాలంటూ ప్రవేశపెట్టి, కొందరు తమ అనుయాయుల్ని సుడిలో తోస్తున్నారేగాని గుడిలో ప్రవేశపెట్టలేకపోతున్నారు. హృదయగుడిలోకి పంపలేకపోతున్నారు.

సాక్షాత్తు ధర్మమూర్తి, భగవంతుని అవతారంగా మనము పూజించే రామచంద్రుడు కూడా సనాతనధర్మ మార్గాన్నే అనుసరిస్తున్నట్లు సగర్వంగా చెప్పుకుంటున్నాడు. **"ఏష ధర్మ స్సనాతనః"** అంటూ ఋషిపుత్రులైన మనమంతా మహర్షులు చూపిన బాటలో నడవాలి. మాయమాటలకు, మోహజాడ్యాలకు మన పవిత్రమైన మనసులలో చోటివ్వకుండా జీవించెదముగాక!

ధర్మబద్ధమైన తన నిర్ణయాన్ని తల్లికి చెప్పిన తరువాత రాముడు వీరావేశంతో ఊగిపోతున్న లక్ష్మణునివైపు తిరిగాడు.

"లక్ష్మణా! శుభలక్షణా! నాపై నీకున్న ప్రేమ నాకు తెలియనిదిగాదు. నీ శక్తిసామర్థ్యాలు, నీ తేజస్సు నేనెరుగనివి కావు. సత్యముయొక్క స్వరూపము తెలియకపోవుటచేత, శాంతి యొక్క రహస్యము అర్థంగాకపోవుటచేత నా తల్లి దుఃఖిస్తూవుంది.

**ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్**

"లోకములో ధర్మమే శ్రేష్ఠమైనది. సత్యము ధర్మమునందే ప్రతిష్ఠితమై ఉంది.

"తండ్రి చెప్పిన విషయముకూడా ధర్మసంబంధమైనదే అనే సత్యాన్ని నీవు గ్రహింపలేకున్నావు. తండ్రి వచనానుసారమేగదా కైకేయి నన్ను వనాలకు వెళ్ళమన్నది!

" నా మాట విను. ధర్మాన్ని ఆశ్రయించు. క్రౌర్యాన్ని విడిచిపెట్టు. నీ ఆలోచనలు క్షత్రియధర్మానికి విరుద్ధంగా ఉన్నాయి. నా మనసును అనుసరించు," అని పలికి, ఆ తరువాత తల్లివైపుతిరిగి నమస్కరిస్తూ ఇలా పలికాడు.

"తల్లీ! వనాలకు పోవుటకు నేను నిశ్చయించుకున్నాను. నాకు అనుజ్ఞనిమ్ము. నా ప్రయాణం అనివార్యం. ఇది నా ప్రాణాలపై ఒట్టు. ప్రయాణానికి సంప్రదాయమార్గంలో నన్ను సిద్ధంచెయ్యి.

"పూర్వము యయాతి స్వర్గమును విడిచివచ్చి తిరిగి మళ్ళీ స్వర్గమును చేరినట్లు, ఇచ్చిన మాటను నిలబెట్టుకొని నేను తిరిగి అయోధ్యానగరానికి వస్తాను.

"నీవు, నేను, సీత, లక్ష్మణుడు, మా పిన్నమ్మ సుమిత్ర అందరూ తండ్రిమాటను అనుసరించాలి. ఇది మన ధర్మము.

**శోక స్సంధార్యతాం మాతః హృదయే సాధు మా శుచః**

"తల్లీ! దుఃఖాన్ని నీ హృదయంలోనే అణచుకో. విచారించకు " అన్నాడు రాముడు. తండ్రి మాటను అనుసరించాలి మనమంతా' అని చెబుతూ సీత, లక్ష్మణ, కౌసల్య, సుమిత్రలతో తనను కలుపుకొని చెప్పాడు రాముడు. కానీ కైకేయి మాటను ప్రస్తావించలేదు. కైకేయి తండ్రి మాటను తిరస్కరించి, తండ్రిచే ఈ నిర్ణయం చేయించింది. ఆమె తండ్రిమాటను అనుసరించలేదు. అందుచేత ఆమెను ఈ సందర్భంలో రాముడు ఉపేక్షించాడు.

మరి భరతశత్రుఘ్నులను ఎందుకు ప్రస్తావించలేదు? అంటే, ప్రస్తుతం వారు అయోధ్యలో లేరు. మేనమామగారింట్లో ఉన్నారు. వారి మనోభిప్రాయాలు వెల్లడి కావాలి. అదియునుగాక, భరతుడు కైకేయి కుమారుడు. శత్రుఘ్నుడు భరతుని అనుయాయుడు. కైకేయి నిర్ణయాల ప్రభావం వారి మనసులపై ఎలా ఉంటుందో తెలియదు.

భరతుని శీలాన్ని, ధర్మనిరతిని గూర్చి రామునికి తెలుసుగదా! అలాంటప్పుడు భరతుణ్ణి ఎలా ఉపేక్షించగలిగాడు?

భరతుడు ధర్మాత్ముడు అని రామునికి తెలుసు. అంతేగాదు. కైకేయి కూడా ఇంతవరకు ప్రేమమూర్తియే గదా! మరి అట్టి కైకేయి క్షణంలో ఎలా మారిపోయింది? తల్లి ప్రభావం భరతునిపై ఎలా ఉంటుందో వేచిచూడడం సముచిత నిర్ణయం.

ఇక్కడ మీకొక సామాన్య సంశయం రావచ్చు. రాముడు దేవుడే గదా! ఆ మాత్రము భరతుని ఆంతర్యాన్ని గ్రహించలేడా! అని. ఈ ఆలోచనే సరియైనది కాదని బాలకాండము ప్రారంభంలోనే మీకు సెలవిచ్చాను. రాముడు దేవుడని భావించి రామాయణం చదివేవారి అవస్థ ఇలాగే ఉంటుంది. రాముడు మానవుడని చదవండి. రాముడెలా దేవుడో తెలిసి వస్తుంది అన్నాను. అదే మళ్ళీ పునరుక్తిగా ఇక్కడ ఉదహరిస్తున్నాను.

అలాగే, ఈ సందర్భంలో "అమ్మా! విచారించకు. **'దుఃఖాన్ని నీ హృదయంలోనే అణచుకో'** అనే వాక్యాన్ని మరచిపోకండి. రాముని శీలధనాగారాన్ని తెరవడానికి ఈ వాక్యం తాళం చెవి. ముందుముందు రాబోయే కథలో ఈ వాక్యాన్ని ఉదహరించి వివరిస్తాను.

రాముని తుదినిర్ణయాన్ని కౌసల్య ఆందోళన లేకుండా ప్రశాంతంగా ఆలకించింది. పునర్జన్మనెత్తినట్లు నేలపైపడివున్న కౌసల్య లేచి కూర్చున్నది.

"కుమారా! నీ ధర్మవచనాలు ఆలకించాను. తండ్రి గురువులాంటివాడు. తల్లికూడా గురువే. మీ తండ్రి నిన్ను అడవికి పొమ్మన్నాడు. తల్లిగా నేను పోవద్దంటున్నాను. అంతే.



"దుఃఖితురాలైన నన్ను విడిచివెళ్ళకు. నీవు లేకుండా నేను జీవించలేను. నాకు స్వర్గ సౌఖ్యాలు వద్దు. ఇహలోక భోగాలు వద్దు. ఇహపరాలు ప్రసాదించలేని సుఖం నీ సన్నిధిలో నాకు లభిస్తుంది. నా మాటగా చెబుతున్నా. నీవు వెళ్ళకు," అని కౌసల్య ఖచ్చితంగా చెప్పింది.

ఏనుగులను పట్టుటలో నిపుణులైన మావటివాళ్ళు కొరివి కట్టెలతో బాధిస్తూ అడ్డుకున్నా మావటివాని ఏనుగు తనదారిన ఎలా పోతుందో, కౌసల్యాలక్ష్మణులు ఎంత అడ్డుకున్నా అరణ్యాలకు పోవాలనే తన నిర్ణయాన్ని రాముడు మార్చుకోలేదు. కొరివిలతో అడ్డుకున్నప్పుడు ఏనుగు బాధపడునట్లు, తల్లి మాటలకు రాముడు పరితపించాడు.

ఎంతచెప్పినా వినని తల్లికి ఇంకెలా చెప్పాలా అని ఆలోచిస్తున్న రాముడు ముందుగా లక్ష్మణునివైపు తిరిగి, ఆ తరువాత తల్లిని ఉద్దేశించి ధర్మప్రసంగం చేశాడు. ఈ ప్రవచనం రాముడే చేయగలడు అంటాడు వాల్మీకి.

**ధర్మిష్ఠితో ధర్మ్యమువాచ వాక్యం యథా స ఏవార్హతి తత్ర వక్తుమ్**

" ఆ సమయాన ధర్మసంబంధమైన ఈ మాటలు చెప్పుట రామునికే సాధ్యము" అని మహర్షి అంటాడు. వినండి.

"లక్ష్మణా! నాయందు నీకున్న భక్తిని, నీ పరాక్రమాన్ని నేనెరుగుదును. కానీ ఈ సమయావ నీవు నా అభిప్రాయాన్ని గ్రహింపకుండానే తల్లితోచేరి నన్ను బాధిస్తున్నావు.

"ధర్మము ననుసరించువానికి సర్వఫలములు సిద్ధిస్తాయనే విషయంలో నమ్మకమున్న వాణ్ణి నేను. ధర్మవిరుద్ధమైన కార్యములో కాలుమోపకూడదనే నియమమున్నవాణ్ణి. అర్థ కామాలు ప్రశస్తమైనవి కావు. అర్థాన్ని నమ్ముకున్నవాడు లోకంలో అనర్థాల నెదుర్కొం టాడు. వ్యర్థజీవిగా మిగిలిపోతాడు. ధర్మమార్గాభిలాషికి అర్థకామాలు గుఱ్ఱాన్ని బండి అనుసరించునట్లు అనుసరిస్తాయి.

"మన తండ్రి పూజ్యుడు. పైగా వృద్ధుడు. ఆపైగా రాజు. కోపంతోగాని, ఆనందంతో గాని, కామంవల్లగానీ ఆయన ఆజ్ఞాపించిన కార్యాన్ని ధర్మజ్ఞుడైన బిడ్డ చేయకపోతాడా! క్రూరుడు మాత్రమే చేయకుండా ఉండగలడు.

"నాయనా! లక్ష్మణా! ఆవేశాన్ని వీడి ఆలోచించు. తండ్రి ఆజ్ఞను నేను ఉల్లంఘించలేను. మనిద్దరిని శాసించే హక్కు ఆయనకుంది. ఆయన మనకు తండ్రేగాదు. గురువు కూడా.

"మన తల్లియైన కౌసల్యాదేవికికూడా ఆయన పతి. గతి. ధర్మము. భర్త తనదైన ధర్మమార్గంలో వర్తిస్తూ ఉండగా, తల్లియైన కౌసల్యాదేవి భర్తలేని స్త్రీవలె నగరాన్ని విడిచి నాతోపాటు రావడాన్ని ఏ ధర్మం సమర్థిస్తుంది?" అని లక్ష్మణుని దిగ్భ్రాంతిలో నిలిపి, తల్లివైపు తిరిగాడు ధర్మమూర్తియైన రాముడు.

"అమ్మా! ఈ జీవితం బుద్బుదం. క్షణికం. తుచ్ఛమైన రాజ్యంకొరకు ధర్మవిరుద్ధంగా ప్రవర్తించడం నీ బిడ్డకు ఇష్టంలేదు. ధర్మపథంలో పయనించేలా నన్ను ఆశీర్వదించు. రాజ్యంకొరకు కీర్తిని పోగొట్టుకోమంటావా! తల్లీ! నాకు స్వస్తివచనాలు పలుకు. మంగళాశీస్సులను ప్రసాదించు;" అని పలికి, తల్లిని ఊరడించి, తమ్ముని సముదాయించి, నిర్భయంగా, ఒంటరిగా దండకారణ్యంలో ప్రవేశించడానికి నిర్ణయించుకొనిన ధర్మాత్ముడైన రాముడు, చేతులు జోడించుకొని నమస్కరిస్తూ తల్లికి ప్రదక్షిణం చేశాడు.

# లక్ష్మణుని ప్రతాపము

రాముని ధర్మవచనాలు లక్ష్మణుని తృప్తిపరచలేకపోయాయి. దైన్యంతో, ఉద్వేగంతో నాగేంద్రునివలె బుసలు కొడుతున్నాడు లక్ష్మణుడు. రాముడు లక్ష్మణుని సమీపించి, సముదాయిస్తూ భాషించాడు.

"లక్ష్మణా! రోషాన్ని, దుఃఖాన్ని విడిచిపెట్టు. అవమానాన్ని మరచిపో. ధైర్యంగా ఉండు. ఇంతవరకు నా అభిషేకానికి చూపిన ఉత్సాహాన్ని ఇకమీదట దానిని జరగకుండాచూచుటలో ప్రదర్శించు.

"నాయనా! తల్లులకుగాని, తండ్రికిగాని నావల్ల తెలిసిగాని, తెలియకగాని అపచారం జరిగినట్లు నాకు గుర్తులేదు. సత్యవాదియైన తండ్రిమాటలు వృథా కాకూడదు. తండ్రి నిర్భయుడై ఉండాలి.

**తస్యాపి హి భవే దస్మిన్ కర్మ ణ్యప్రతి సంహృతే**
**సత్యం నేతి మనస్తాప స్తస్య తాప స్తపేచ్ఛ మామ్ ॥**

"ఈ పట్టాభిషేకము ఆగకపోతే తానిచ్చినమాట అసత్యమైనట్లు తండ్రిగారు మనస్తాపానికి గురిఅవుతారు. ఆయన మనస్తాపము నాకు తీవ్ర పరితాపాన్ని కల్గిస్తుంది.

"తండ్రిని బాధించడం నాకు ఇష్టంలేదు. నేను అరణ్యానికి వెళ్తాను. కైకేయికి మనశ్శాంతి కల్గుతుంది. ఇక్కడ ఒకవిషయాన్ని జాగ్రత్తగా పరిశీలించు.

"ఈ విషయంలో దైవం ప్రధాన పాత్రధారి అయినట్లు నేను భావిస్తున్నాను. కైకేయికి దైవప్రేరణ లేనిచో నన్ను బాధించాలనే సంకల్పం ఆమెకు ఎందుకు కల్గుతుంది?

"ఇంతవరకు నాకు తల్లులవిషయంలో భేదభావము లేదని నీకు తెలుసు. కైకేయికి నా విషయంలోను, భరతుని విషయంలోను ఎలాంటి భేదభావం లేదనికూడా నీకు తెలుసు. అలాంటి తల్లి నా అభిషేకాన్ని నిలిపివేసి, కఠోరమైన వచనాలు పలికి నన్ను వనవాసానికి పంపాలని యోచిస్తున్నదంటే దానికి దైవం తప్ప మరొకకారణం నాకు కనిపించడంలేదు.

"దైవ ప్రభావము మానవులు ఊహించలేనిది. పక్షపాతం తెలియని దైవాన్ని ఎవరూ తిరస్కరించలేరు. ఇపుడు మనవిషయంలో దైవము అలా ప్రవర్తిస్తూ ఉంది. దైవమునకు అనుకూలంగా ప్రవర్తించడంతప్ప మరొక మార్గం లేదు. ఆరంభించిన పనికి అవరోధం కలిగితే అది దైవశాసనమేననుకో. ఈ అవగాహనవల్ల నేను దుఃఖం లేకుండా వున్నాను. నీవూ అలాగే వుండు.

"పట్టాభిషేకానికి తెచ్చిన నదీజలాలతో నేను వనవాస వ్రతస్నానం చేస్తాను. తప్పు.తప్పు. ఈ ఘటాలలో నిండియున్న జలం కూడా రాజద్రవ్యమే. ఇక దానివిషయంలోకూడా నాకు అర్హతలేదు. నేనే నీరుతోడుకుని స్నానంచేస్తాను. లక్ష్మణా! అభిషేకము విఘ్నమైందని మన తల్లియైన కైకేయిని దూషించకు.

**రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః**



"రాజ్యమా! వనవాసమా! ఏది శ్రేష్ఠమైనది? అని ఆలోచిస్తే వనవాసమే మేలైనది.

రాముడు "దైవం" అనే పదాన్ని ఏ ఉద్దేశ్యముతో పలికాడో, ఏ అర్థంలో వాడాడో గమనించడం చాలా ముఖ్యం. దైవమంటే పరమాత్మ అనే భావంతో వాడలేదు. ఎందుకంటే నిర్వికారుడైన పరమాత్మకు కర్తృత్వాన్ని ఆపాదించడం శాస్త్రసమ్మతం కాదు.

మనమెన్నో కార్యాలు ప్రారంభిస్తూ వాటిని సాధించలేక విఫలంకావడం చూస్తూవుంటాం. ఇలా విఫలం కావడానికి కారణమేమిటి? అని ఆలోచించినపుడు మనంకాదని మాత్రం రూఢిగా తెలుస్తోంది. ఎందుకంటే, తాను తలపెట్టిన కార్యాన్ని పాడుచేసుకోవాలని ఎవడు సంకల్పిస్తాడు? కనుక ఈ అవరోధాల వెనుక మానవాతీతశక్తి ఏదో పనిచేస్తున్నట్లు అర్థమవుతుంది. ఇది తర్కానికి అందని అంశము. ఊహాతీతమైనది. దీనినే 'అదృష్టము' అని, 'విధి' అని, 'పూర్వకర్మ ఫలరూపక శక్తి' అని పిలుస్తుంటారు. **'పూర్వ జన్మ కృతం కర్మ తద్దైవ మితి కథ్యతే'** అని శాస్త్రవచనము. దీనినే దైవమంటారు.

మనం ఇల్లుకట్టే ప్రయత్నం చేయవచ్చు. కానీ ఆ ఇంటిలో నివసించలేకపోవచ్చు. భార్యమెడలో తాళికట్టి సంసారముచేయనివాళ్ళు, సన్యాసాన్ని స్వీకరించి సంసారులైన వాళ్ళు, చెట్టును పెంచి పండ్లారగించనివాళ్ళు ఇలా ఎందరినో మనం చూస్తున్నాం. ఇదంతా దైవ విలసితం.

కాలమనే సరోవరంలో ఱాయివిసరడమే మానవుని కర్తవ్యము. దానివలన జనించిన అల గట్టును తాకడము బహుశ మనము చూడకపోవచ్చు. గతంలో ఎన్నోచేసిన మనం ప్రస్తుతం అన్నీ మనచేతిలో ఉన్నాయని విర్రవీగడం అవివేకం. గతంలో ఆచరించిన సర్వకర్మల ఫలితము మనకు తెలియకనే మనజీవితాన్ని నడుపుతూపోతుంది. ఈ మానవాతీత శక్తియే ఇచ్చట దైవముగా రామునిచేత చెప్పబడింది. ఈ విషయమును భగవద్గీత కూడా ధృవపరుస్తుంది.

**అధిష్టానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్**
**వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చై వాత్ర పంచమమ్**

1. కర్మస్థానము 2. కర్త 3. కార్యసాధనాలు 4. వివిధ ప్రయత్నాలు 5. దైవము. ఈ అయిదును మానవుడాచరించు కర్మలకు కారణములని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత-మోక్షసన్యాసయోగములో తెలిపినాడు. ఇక్కడ ఐదవలక్షణము దైవమని చెప్పడం జరిగింది. ఈ 'దైవ' శబ్దాన్నే రాముడు ప్రయోగించాడని నా అభిప్రాయము.

రాముని మాటలు విన్న లక్ష్మణుడు మిశ్రమభావాలతో సతమతమయ్యాడు. ఒకవైపు రాముని ధర్మనిష్ఠకు సంతసిస్తూ, మరొకవైపు రాజ్యత్యాగానికి పరితపిస్తూ ఊగిసలాడాడు. చివరికి అతడు కనుబొమ్మలు ముడిచి పగబట్టిన కోడెత్రాచు బిలంలో బుసకొట్టునట్లు నిట్టూర్పులు విడుస్తూ, కోపించిన సింహంలాగా భయంకరంగా చూస్తూ, ఏనుగు తొండమువలె చెయ్యిని జాడిస్తూ, తలను ఎగరవేస్తూ, అన్నవంక ఓరచూపులు చూస్తూ

"జ్యేష్ఠభ్రాతా! శ్రేష్ఠపురుషా! తండ్రిమాట కాదంటే అధర్మం అవుతుందనే భయంవల్ల, లోకం విమర్శిస్తుందనే సంకోచంవల్ల నీవు సంభ్రమంతో ఈ నిర్ణయానికి రావడం సముచితం కాదు. దైవం బలవత్తరమని నీలాంటి వీరుడు పలకడం భ్రాంతియేగాని మరొకటి కాదు.

"అన్నా! దుర్బలమైన దైవాన్ని దుర్భేద్యంగా వర్ణిస్తావెందుకు? పాపాత్ములైన కైకేయి దశరథులను సందేహించవెందుకని? స్వార్థపరులైన వారిరువురు ధర్మ ముసుగులో నిన్ను వంచిస్తున్నారనే సత్యాన్ని నీవు గ్రహించలేకపోతున్నావు.

"ఇది కుట్ర కాకపోతే ఎప్పుడో ఇచ్చిన వరాలు అప్పుడే ఎందుకు తీర్చలేదు? అభిషేక ప్రయత్నాలు చేయకముందే ఎందుకు అమలుపరచలేదు? ఇదంతా మోసం. దగా. కుట్ర. నీకుతప్ప అన్యులకు రాజ్యాభిషేకం జరగడం ధర్మవిరుద్ధం. దానిని నేను సహించను. నన్ను క్షమించు.

"వారిరువురు నిన్ను మోసగిస్తున్నా నీవు తెలుసుకోవడంలేదు. అదే నా బాధంతా. వారు తల్లిదండ్రుల రూపంలో మసలే శత్రువులు. వారి సంకల్పం దైవవిలసితం అని నీవు సరిపెట్టుకోవచ్చు. కానీ ఆ భావంతో నేను సరిపడి వుండలేను.

"దైవానికి జడవాల్సిన పనిలేదు. పురుష ప్రయత్నముతో దైవాన్ని నిగ్రహింపవచ్చు. నిలబెట్టవచ్చు. నీ పట్టాభిషేకమును ఎదుర్కొనిన దైవాన్ని నేనెలా ఎదుర్కొంటానో ప్రజలే చూస్తారు.

"కట్లు త్రెంచుకొని పరుగెత్తే మదగజాన్ని అంకుశముచే బంధించునట్లు,ఆ దైవాన్ని నేను పురుషప్రయత్నముతో నిరోధిస్తాను.

"అన్నా! నీ అభిషేకాన్ని ముల్లోకాలు ఏకమైనా, దిక్పాలకులు ఎదురైనా ఆపలేరు. ఇక ఈ రాజు విషయమెందుకు? నిన్ను అరణ్యాలపాలు చేయాలని రహస్య మంతనాలు నడిపినవారే అడవుల్లో నివసించడం జరుగుతుంది. నీవు దీర్ఘకాలము రాజ్యాన్ని పాలించి, తపస్సుకై అరణ్యాలకు వెళ్ళినతరువాత ఈ రాజ్యాన్ని నీ బిడ్డలు పరిపాలిస్తారు.

"సాగరతీరము సాగరాన్ని రక్షించునట్లు నేను నీ రాజ్యాన్ని కాపాడుతాను. నీవు రాజ్యాభిషిక్తుడవుకా. అడ్డొచ్చిన వారిని నేను ఎదుర్కొంటాను.

"నా బాహువులు ఉండేది సౌందర్యానికి కాదు. నా ధనుస్సు అలంకారానికి కాదు. ఖడ్గము నడుముకు వడ్డాణము కాదు. బాణాలు సోమరులవలె పడియుండుటకు కాదు. ఇవన్నీ శత్రువులను దండించుటకే.

"నాకు శత్రువైనవాడు బ్రతికి బట్టగట్టడు. ఇంతవరకు అలంకారాలకు, దానధర్మాలకు ఉపయోగపడిన నా చేతులు ఈరోజు నీ అభిషేకమును అడ్డుకొనువారిని ఛేదించుటకు వినియోగింపబడుతాయి. అన్నా! నన్ను అనుమతించు. ఆజ్ఞాపించు. నేను నీ దాసుణ్ణి. నీ సేవకుణ్ణి. నీ బిడ్డను" అంటూ విలపించాడు లక్ష్మణుడు.

రాముడు లక్ష్మణుని కన్నీళ్ళు తుడిచాడు. చల్లని మాటలతో శాంతపరచాడు. చివరగా "నాయనా! లక్ష్మణా! నేను తండ్రిగారి మాటకే తలవంచియున్నాను. ఇదియే సరైన మార్గము. ఇదే ధర్మం. దీనివైపే నా నిర్ణయం" అన్నాడు రాముడు.

## పతిసేవయే పరమధర్మము

తండ్రి ఆజ్ఞను పాలించి రాముడు అరణ్యాలకు వెళ్ళుటకు స్థిరనిశ్చయముతో ఉన్నట్లు కౌసల్య గ్రహించింది. తనలోతాను మాట్లాడుకుంటోంది.



రాముడు ధర్మాత్ముడు. ప్రేమాస్పదుడు. కష్టాలెరుగడు. అట్టి రాముడు ఉంఛవృత్తితో జీవించాలా? రామునికి సేవకులైనవారు రుచికరమైన ఆహారం తింటూవుండగా, రాముడు కందమూలాలు భుజించాలా? రాముడు సుగుణవంతుడు. సర్వులకు ప్రియుడు. అట్టి రాముని రాజు వనవాసమునకు పంపుచున్నాడంటే ఎవరు నమ్ముతారు? రామునే అడవికి పంపిన రాజు మమ్మల్నిమాత్రం బాధించకపోతాడా? అని జనులు భీతిచెందరా? ఈవిధంగా ఆలోచిస్తూ తనలోతాను ఉన్మాదినివలె అస్పష్ట సంభాషణము గావించిన కౌసల్య రామునితో ఇలా పలికింది.

"రామా! నీవు లోకాభిరాముడవు. నీవే వనవాసము చేయవలసివచ్చిందంటే దైవం చాలా బలవత్తరమని స్పష్టమవుచున్నది. పుత్రా! నీవు వెళ్ళాక నా దేహంలో నిశ్వాసాయాసాలతో జనించే శోకాగ్ని నీ వియోగము ప్రజ్వలింపచేయు వాయువుగా, విలాపదుఃఖాలు సమిధలుగా, కన్నీళ్ళే ఆహుతులుగా, చింతాబాష్పాలు ధూమముగాను వృద్ధిపొంది నన్ను కృశింపచేసి, గ్రీష్మమునందు దావాగ్ని డొంకలను తగలబెట్టునట్లు కాల్చకుండా ఉంటుందా? కుమారా! లేగదూడవెంట తల్లిఆవు వెళ్ళునట్లు నీవు ఎక్కడికిపోతే నేనక్కడికి వస్తాను;" అని కౌసల్య రామునితో చెప్పింది.

తల్లిమాటలనాలకించిన రాముడు "అమ్మా! కైకేయి మా నాన్నను వంచించింది. నీవు కూడా ఆయనకు సేవలు చేయకుండా విడిచిపెడితే ఆయన జీవించలేడు.

"స్త్రీ భర్తను త్యజించుట చాలా నికృష్టమైన కార్యము. పాపభూయిష్ఠమైన కార్యము. నీవు అట్టి కార్యాన్ని మనసులోకూడా భావించకు. తండ్రి జీవించియున్నంత వరకు నీవు ఆయనను సేవించాలి. ఇదే సనాతనధర్మము;"అన్నాడు రాముడు.

రాముని ధర్మబోధ కౌసల్యకు సంతోషాన్నిచ్చింది. "అలాగే చేస్తాను" **(తథేతి)** అన్నది. తల్లి అలాపలికి తీవ్రంగా ఆవేదనచెందుట చూచి రాముడు మళ్ళీ తల్లితో మాట్లాడాడు.

"తల్లీ! మనిద్దరము తండ్రి మాటను ఆచరించాలి. అతడు సర్వులకు రాజు. పోషకుడు. పూజ్యుడు. శ్రేష్ఠుడు. అధిపతి. శాసనకర్త. ఆయన ఉండగా మనము ఎప్పుడూ అనాథులము కాము.

"అదియును గాక భరతుడు ధర్మాత్ముడు. సర్వులకు ప్రేమాస్పదుడు. ధర్మాసక్తుడు. నిన్ను బాగా చూసుకుంటాడు. నేను వెళ్ళిన తరువాత పుత్రశోకముచే నీవు రాజును కష్టపెట్టకు. భర్తను అనుసరించని స్త్రీకి సద్గతి ఉండదు. దేవతలను సేవించకపోయినా భర్తసేవ చేయువారు ఉత్తమగతిని పొందుతారు. శ్రుతులు, స్మృతులు ఈ విషయాన్ని నొక్కి వక్కాణిస్తున్నాయి.

**జీవన్త్యా హి స్త్రియా భర్తా దైవతం ప్రభురేవచ**

"స్త్రీ జీవించి యున్నంత వరకు భర్తయే ఆమెకు దేవత. భర్తయే ఆమెకు ప్రభువు" అని పలికి దుఃఖించుచున్న తల్లినిచూచి రాముడుకూడా విలపించాడు. రాముని చూచి కౌసల్యామాత ఇలా పల్కింది.

"రామా! అలాగేకానీ! వెళ్ళాలి అనే నీ నిశ్చితాభిప్రాయాన్ని నేను మార్చలేను. "**నూనం కాలో దురత్యయా** " కాలాన్ని ఎవ్వరూ దాటలేరు. నాయనా! అలాగే వెళ్ళిరా! నీకు క్షేమం కలుగుగాక! నీవు వనమునుండి తిరిగివచ్చే రోజుకై వేయికళ్ళతో నిరీక్షిస్తుంటాను. కానీ ఆరోజు

ఈరోజే అయితే ఎంత బావుండును" అని పలికి రామునికి మంగళాశీస్సుల నిచ్చేందుకు సిద్ధమౌతున్నది కౌసల్య.

"రామా! నిన్ను ఆపుట ఇక నాకు సాధ్యంకాదు. వెళ్ళి శుభంగా తిరిగిరా. సత్పురుషులు చరించిన మార్గాన చరించు.

**యం పాలయసి ధర్మం త్వం ధృత్వా చ నియమేన చ**
**న వై రాఘవ శార్దూల ధర్మస్త్వా మభిరక్షతు**

"రామా! నీవు ఏ ధర్మాన్ని ధైర్యంతో, నియమంతో ఆచరిస్తున్నావో ఆ ధర్మమే నిన్ను రక్షిస్తుంది;" అంటూ మంగళం పలికింది కౌసల్య.

## తత్తే భవతు మంగళమ్

కౌసల్యామాత రామునకు పలికిన స్వస్త్యయనవాచక శ్లోకాలు ముఖ్యంగా నాలుగున్నాయి. అవి ఎంతో భావగర్భితమైన శ్లోకాలు. వాటిలోని సూక్ష్మాంశాలను పరిశీలిస్తాం.

**1. యన్మంగళం సహస్రాక్షే సర్వదేవ నమస్కృతే**
**వృత్రనాశే సమభవత్ తత్తే భవతు మంగళమ్**

"వృత్రాసుర సంహార సమయాన సర్వదేవతావంద్యుడైన ఇంద్రునకు ఏ మంగళము కలిగెనో అట్టి మంగళము నీకు కలుగుగాక!" కౌసల్య చేసిన మంగళాశీస్సు శ్లోకాలలో ఇది ప్రథమశ్లోకము.

**'తత్తే భవతు మంగళమ్' - తత్ మంగలమ్=ఆ శుభము, తే=నీకు, భవతు= కలుగుగాక!** అట్టి శుభము నీకు కలుగుగాక! ఎట్టి శుభమనగా వృత్రాసుర సంహార సమయాన దేవేంద్రునకు కలిగిన శుభము.

రాముడు అరణ్యానికి బయలుదేరే సమయంలో మంగళాశీస్సుల నందించే సందర్భంలో వృత్రాసురసంహార ప్రసక్తి ఎందుకు చేయవలసివచ్చింది?

"వృత్రాసురుడు" ఎవరు? త్రాసదాయకమైన వృత్తియే వృత్రాసురుడు. అదియే అంతర్ముఖ వృత్తి. అరణ్యములో మునివృత్తిలో జీవించు రామునకు సంకల్ప నిరోధము జరిగి, తపస్సుద్వారా ఆత్మానందము కలుగవలెనని భావించుటే ఈ వృత్రాసుర సంహార ప్రసక్తిని వ్యక్తం చేయుటలోని అంతర్భావము.

అదియును గాక, వృత్రాసురుడు రాక్షసుడు. ఇంద్రుడు వృత్రాసురుని వజ్రాయుధంతో ఖండించాడు. అలాగే అరణ్యములో నీవుకూడా రాక్షససంహారము చేయుమని చెప్పుట ధ్వనిస్తున్నది. ఈ మాటకూడా దైవవిలసితమేనని చెప్పుకోవాలి.

రాముడు క్షత్రియుడు. ధనుర్బాణములను ధరించినవాడు. రాక్షస సంహారము గావించి సాధువులను రక్షించు బాధ్యత గలవాడు.

పైగా ఈ కార్యమును రాముడు ఇంతకుమునుపే ప్రారంభించియున్నాడు. విశ్వామిత్రునితో వెళ్ళి రాక్షససంహారం చేసి యాగసంరక్షణ గావించాడు.



రామా! ఆనాడు యాగసంరక్షణ సమయంలో రాక్షసులను వధించావు. తత్ఫలితంగా జనకపురిలో నీ కళ్యాణవైభవమును చూడగలిగాము. అలాగే ఈనాడు వనవాససమయములో కూడా క్రూరులైన రాక్షసులను వధించు. తత్ఫలితంగా నీ పట్టాభిషేకవైభవంలో లోకకళ్యాణాన్ని వీక్షించగలం అని కౌసల్య భావించినట్లు కూడా ధ్వనిస్తూవుంది. ఎంత చక్కని మంగళాశీస్సు! ఇక రెండవ శ్లోకం చూస్తాం.

**2. యన్మంగళం సువర్ణస్య వినతా కల్పయత్పురా**
**అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్**

**పురా=పూర్వము,అమృతమ్=అమృతమును, ప్రార్థయానస్య= ఆశించిన, సుపర్ణస్య= గరుడునకు, వినతా=వినత, యత్ మంగళమ్= ఏ శుభమును, అకల్పయత్=కల్పించెనో, తత్ మంగళమ్= ఆ శుభము, తే =నీకు, భవతు=అగుగాక!**

"పూర్వము అమృతమును సంపాదించుటకు గరుత్మంతుడు వెళ్ళునపుడు వినత యేశుభము పలికినదో అట్టి శుభము నీకు కలుగుగాక!"

మొదటి శ్లోకములో రాముని తపస్సును, లోకకళ్యాణమును కాంక్షిస్తూ స్వస్తి వచనమును పలికిన కౌసల్య ఈ రెండవ శ్లోకములో స్వవిషయమును నివేదించుకుంటున్నది.

సవతియైన కైకేయివలన కౌసల్య అనేకబాధలకు గురియైనది. స్వేచ్ఛలేకుండా కౌసల్య దాసివలె జీవించింది. బాధలన్నీ మనసులో దాచుకుంది.

వినత మంగళాశీస్సు పలకగా అమృతమును తీసికొనివచ్చుటకు గరుత్మంతుడు వెళ్ళాడు. వినతలాగా తానుకూడా శుభం పలుకుతున్నాను అంటుంది కౌసల్య. గరుత్మంతుడు కద్రువవలన వినతకు బాధను తొలగించినట్లు, కైకేయివలన తనకు కలిగే బాధల్ని రాముడు నివారిస్తాడు అని పలుకుతున్నది కౌసల్య.

సవతిపోరు మరణసదృశము వంటిది. అది మృతజీవనము. గరుత్మంతుడు అమృతమును తీసికొనివచ్చాడు. వినతను ఉద్ధరించాడు. అలాగే రాఘవా! నీవు తిరిగి నగరానికి వస్తున్నావనే అమృతసందేశముద్వారా మాకు మృతజీవనాన్ని దూరంచేయి అనికూడా భావము.

అంతేగాక, రామచంద్రా! వినతకు గరుత్మంతుడెలాగో నాకునూ నీ వలాగే. ఈనాడు కోరలు తెరచిన విషనాగులవలె రాగద్వేష కోరలుచాచియున్నారు కైకేయాదులు.

గరుడుని చూడగనే పాములు పడగలు ముడిచి పడివుంటాయి. రామా! నీవు తిరిగి రాగానే ఈ అసూయాపరులందరు చేష్టలుడిగి పడిఉంటారు. మాకు శాంతి లభిస్తుంది; అనే భావముకూడా కౌసల్య అంతర్యమున ఇమిడిఉంది. ఇక మూడవ శ్లోకం.

**3. అమృతో త్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్ర ధరస్య యత్**
**అదితి ర్మంగళం ప్రాదాత్ తత్తే భవతు మంగళమ్ ॥**

**అదితిః=అదితి, అమృతోత్పాదనే=అమృతము ఉద్భవించు సమయాన, దైత్యాన్= దైత్యులను, ఘ్నతః=చంపుచున్న,వజ్ర ధరస్య=వజ్రాయుధమును ధరించిన ఇంద్రునకు, యత్**

మంగళమ్=ఏమంగళమును, ప్రాదాత్=ఇచ్చెనో, తత్ మంగళమ్=ఆ మంగళము, తే=నీకు, భవతు=అగుగాక!

అమృతావిర్భావ సమయాన రాక్షసులను సంహరించుటకు ఉపక్రమించిన ఇంద్రునకు తల్లియైన అదితి ఏ మంగళము నొసగెనో నీకునూ ఆ మంగళమే అగుగాక!

వనవాసమును పూర్తిచేసుకొని రాముడు నగరానికి తిరిగివచ్చే వార్త అమృత సందేశముగా, రామదర్శనము అమృతపానముగా రెండవ శ్లోకములో అవగతమైంది.

అమృతము పుట్టేముందు రాక్షససంహారము జరగాలి. అందుకై కశ్యపుని ధర్మపత్ని యైన అదితి తన కుమారుడైన ఇంద్రునకు స్వస్తిపలికింది.

పట్టాభిషేకమనే అమృతమయ సన్నివేశమునకు ముందు నీవుకూడా రావణాసురుని వధించాలి. అజ్ఞానమనే రావణుడు వధించబడినపుడే బ్రతుకు అమృతమయంగా మారుతుంది.

అమృతోద్భవానికి ముందు హాలహలం పుట్టాలి గదా! ఆ విషఘుడియలే ఈ వనవాసపు రోజులు. త్యాగియైన శంకరుడు విషాన్ని సునాయాసంగా పానంచేశాడు. త్యాగమూర్తివైన నీవు కూడా వనవాస విషాన్ని హాయిగా దిగమ్రింగి, రావణుని వధించి, అమృత జీవనమును అనుభవిస్తావు అని నిండుమనసుతో దీవిస్తూఉంది కౌసల్యామాత. చివరగా చివరి శ్లోకం.

**4. త్రీ న్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమిత తేజసః**

**యదాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళమ్ ॥**

**రామ=ఓ రామచంద్రా!, త్రీన్=మూడు, విక్రమాన్=అడుగులను, ప్రక్రమతః=పెట్టుచున్న, అమిత తేజసః=గొప్ప తేజస్సు గల, విష్ణోః= విష్ణువునకు, యత్ మంగళమ్=ఏ మంగళము, ఆసీత్=ఆయెనో, తత్ మంగళమ్=అట్టి మంగళము, తే=నీకు, భవతు=అగుగాక!**

రామా! మూడడుగులు వేసి, ముల్లోకములను ఆక్రమించు సమయాన, అసమాన తేజోవంతుడగు విష్ణువునకు ఏ మంగళము కలిగెనో అది నీకు కలుగుగాక!

శ్రీమహావిష్ణువు వామనమూర్తియై దానమడుగుటకు బలిచక్రవర్తి వద్దకు వెళ్ళినపుడు అదితి ఏ శుభము పలికెనో ఆ శుభమునే నేనూ నీ విషయంలో పలుకుతున్నాను అంటున్నది రామమాత.

కౌసల్య పలికిన మంగళాశీస్సు శ్లోకాలలో ఇది చివరిశ్లోకం. చరమశ్లోకం. కనుకనే ఇది జీవి గమ్యాన్ని నిర్దేశిస్తూ వుంది.

శ్రీమహావిష్ణువే వామనమూర్తిగా అవతరించాడు. చక్కగా సేవింపదగినవాడైనందున వామనుడని కీర్తించబడినాడు.

**మధ్యే వామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే**

"హృదయ కుహర మధ్యమున ఆసీనుడైవున్న వామనుని విశ్వదేవతలు ఉపాసిస్తున్నారు" అని కఠోపనిషత్ ప్రవచించింది.

వామనుడు, రాముడు ఒక్కరే అనే ధ్వని ఇక్కడ విన్పిస్తూవుంది. తనకు తెలియకనే ఈ సత్యాన్ని కౌసల్య ప్రకటించింది.



అంతేగాక వామనుని త్రివిక్రముడుగా పేర్కొంది. అంటే ముల్లోకాలు ఆక్రమించువాడు అని అర్థము. బలిచక్రవర్తిని దానము అడిగినపుడు వామనుడు పొట్టివాడుగా కన్పించాడు. దానం ఇవ్వగనే ముల్లోకాలు ఆక్రమించాడు.

అలాగే, వనవాస గమన సమయంలో రామా! నీవు సామాన్య రాజకుమారునివలె తెలియవచ్చు. తిరిగివచ్చే సమయానికి త్రివిక్రముడైన వామనునివలె నీ కీర్తి ముల్లోకములు వ్యాపిస్తుంది అని భావము.

అదియును గాక, రామా! నీవు మూడు కార్యాలను నిర్వర్తించుటకు అవతరించావు. 1. సాధు రక్షణము 2. దుష్ట శిక్షణము 3. ధర్మ సంస్థాపనము. ఈ మూడు కార్యాలను చక్కగా నెరవేర్చగలవు అనే ధ్వనికూడా వినిపిస్తూవుంది.

ఈవిధంగా ధర్మాత్ముడైన కుమారుడగు రాముని దీవించింది కౌసల్య. మంత్రాలతో అభిమంత్రించింది. రాముని గాఢంగా కౌగలించుకుంది. సర్వకార్యసిద్ధిని వాంఛిస్తూ ఆరోగ్యవంతుడవై తిరిగిరమ్మని దీవించింది.

మంగళాశీస్సులను ముగించి, రక్షార్థమై రాముని చుట్టూ తిరిగి మరలమరల రాముని ఆలింగనం చేసికొని, శిరస్సును మూర్కొనింది కౌసల్య.

రక్షాప్రదక్షిణములు పూర్తికాగానే తేజోవంతుడైన శ్రీరాముడు మళ్ళీమళ్ళీ తల్లి పాదాలపైబడి నమస్కరించాడు.

## సాధ్వీమతల్లి సీతమ్మ

పట్టాభిషేక సమయం సమీపించింది. ప్రజలంతా కోలాహలంగా ఎదురుచూస్తున్నారు. ఊహించని ఈ ఆలస్యం ఏమిటో, ఎందుకు జరుగుచున్నదో ఎవ్వరికీ అంతుపట్టడం లేదు. రాముడు కౌసల్యామందిరమునుండి బయలుదేరి ప్రశాంతంగా తన నివాసగృహానికి వచ్చాడు.

ఇంతవరకు జరిగిందంతా సీతమ్మకు తెలీదు. పూజాది కార్యక్రమాలు పూర్తిచేసికొని రామునికోసం నిరీక్షిస్తోంది సీతమ్మ. రాముడు ప్రవేశించి సీతను చూశాడు. ఇంతవరకు ఎవ్వరికీ తెలియకుండా తనలోనే దాచుకొనిన బాధను ఈ క్షణంలో ఆపుకోలేకపోయాడు. దుఃఖముతో వ్యథ చెందుతూ విచారగ్రస్తుడై కనిపించాడు. ముఖమంతా పాలిపోయివుంది. దేహమంతా చెమటలు పోశాయి. రాముణ్ణి ఈ స్థితిలో చూడవలసివస్తుందని సీతమ్మ కలనైనా ఊహించలేదు. భర్తను చూసి వణకిపోయింది.

"ప్రభూ! అదేమిటి? అలా ఉన్నారేమిటి? ఏం జరిగింది? ఈ పట్టాభిషేక సంతోష సమయంలో మీరు శోకవదనులై కన్పించుటకు కారణమేమి? మీలో ఏవిధమైన ఉత్సాహము లేదు," అన్నది సీతమ్మ.

బాధపడుతున్న సీతను చూచి రాముడు ఇలా పలికాడు. "సీతా! నీవు ఉత్తమమైన జన్మగలదానవు. ధర్మము తెలిసినదానవు. యుక్తాయుక్త విచక్షణాశక్తి కలదానవు. నేను చెప్పే విషయాన్ని అవధానంతో ఆలకించు.

"నాకు యౌవరాజ్యాభిషేకము జరుగుటలేదు. దానికి బదులుగా నన్ను దండకారణ్యం వెళ్ళి వనవాసము చేయవలసిందిగ పూజ్యుడైన మా తండ్రి ఆజ్ఞాపించాడు.

"ఇలా ఎందుకు జరిగింది అని ఆలోచిస్తున్నావుగదూ! పూర్వము మా తల్లియైన కైకేయికి ధర్మాత్ముడైన మా తండ్రి రెండు వరాలిచ్చియున్నాడు. వాటిని ఈసమయంలో ప్రస్తావించి, వాటిని ప్రసాదించమని ఆమెకోరింది.

"వాటి ఫలితంగా భరతునికి యౌవరాజ్యాభిషేకము, నాకు పద్నాలుగు సంవత్సరాలు వనవాసము నిర్ణయించబడింది. నేను వనవాసానికి బయలుదేరుతూ నిన్ను చూసి వెళ్దామని ఇక్కడికి వచ్చాను.

"నేను నీకు కొన్ని సలహాలు ఇవ్వదలచాను. నీ వెప్పుడూ భరతుని ఎదుట నా ప్రశంస తీసుకురావద్దు. నా గుణాల్ని పొగడవద్దు.

**బుద్ధి యుక్తాహి పురుషా న సహన్తే పరస్తవమ్**

"సంపన్నులైనవారు, ఎవరైనా ఇతరులను ప్రశంసిస్తే సహించరు.

"నిన్ను పోషించవలసిన బాధ్యత భరతునిపై లేదు. అతను నిన్ను పోషించడమనేది నీ ప్రవర్తనపై ఆధారపడి ఉంటుంది. రాజుగారి అనుగ్రహము, యువరాజు అనుగ్రహము నీకు చాలా అవసరము.

"నేను అరణ్యానికి వెళ్తున్నాను. నీవు ధైర్యంగా వుండు. పూజాది వ్రతాలు మానకు. దశరథునికి రోజూ నమస్కరించు. దుఃఖముతో కృశిస్తున్న నా తల్లిని జాగ్రత్తగా చూసుకో. నీకు తల్లులందరూ సమానులే. నీవు అందరినీ సమానంగా గౌరవించు. భరతశత్రుఘ్నులను బిడ్డలవలె చూసుకో.

"భరతుని ఎన్నడూ కష్టపెట్టకు. ధర్మనిరతురాలివై రాజుకు సంతోషాన్ని కల్గించు. లేనిచో ప్రభువులకు కోపంవస్తుంది;" అన్నాడు రాముడు.

ప్రభువులమాట అలా ఉంచి ముందుగా రాముని మాటలకు సీతమ్మ కుపితురాలైంది.

"ప్రభూ! ఏమిటి మీరు చెప్పుచున్నది? మీ మాటలు అర్థరహితంగా ఉన్నాయి. అపహాస్యంగా ఉన్నాయి. నాకు బోధపడుటలేదు.

"ఆర్యపుత్రా! తండ్రి, తల్లి, సోదరుడు, కోడలు మొదలైన వారంతా ఎవరి పుణ్యఫలాలను వారు అనుభవిస్తూ వుంటారు. ఒకరి పాప పుణ్య ఫలాలను మరొకరు అనుభవించరు.

"భార్య ఒక్కతె భర్తయొక్క భాగ్యాన్ని పంచుకుంటుంది. మిమ్మల్ని వనవాసానికి వెళ్ళమంటే మీ ధర్మపత్నియైన నన్నుకూడా వెళ్ళమనియే భావము. స్త్రీకి తండ్రి, తల్లి, కుమారుడు, చెలియలు గారు గమ్యము.

**ఇహ ప్రేత్య చ నారీణాం పతిరేకో గతిః సదా**

"ఇహపరములందు భర్తఒక్కడే స్త్రీకి ఉత్తమ గమ్యము.

"రామా! నీతోపాటు నేను అరణ్యానికి వస్తాను. నేను నీకు ముందుగా నడుస్తూ రాళ్ళను, ముళ్ళను తొలగిస్తూ పోతాను. నీ ప్రయాణం సుగమం చేస్తాను.





"నాథా! నీమాట వినలేదనే బాధ నీకుండవచ్చు. పానం చేసిన తరువాత మిగిలిన నీటిని పారబోయునట్లు, నాపై కలిగిన బాధను, కోపాన్ని త్యజించి నన్ను మీవెంట తీసికొని పొండి. నాలో ఏ దోషమూ లేదు. పైగా నేనది కష్టముగానూ భావించను. నన్ను విశ్వసించండి.

"మేడలకన్నా భర్త పాదచ్ఛాయలో వసించడమే భార్యకు-విశిష్టము. ఈ ముల్లోకముల యందు నాకు దేనిమీదను ఆశలేదు. పతిసేవాభాగ్యంలో అరణ్యాన్ని పుట్టిల్లుగా భావించి హాయిగా జీవిస్తాను.

**అనుశిష్టా చ మాత్రా చ పిత్రా చ వివిధాశ్రయమ్**
**నాస్తి సంప్రతి వక్తవ్యా వర్తితవ్యం యథామయా ॥**

"అనేక విషయాలనుగూర్చి నా తల్లిదండ్రులు నాకు పూర్వమే చెప్పియున్నారు. నా ప్రవర్తన విషయంలో ఒకరి ప్రమేయం అవసరం లేకుండానే నేను ప్రవర్తించగలను." అంటుంది.

**ఆత్మబంధువులారా !**

రామాయణ రచనా తపస్సులో ఈ క్షణాన నేనెంతో భావోద్వేగంతో కలం కదిలిస్తున్నాను. కానీ నా కలం ముందుకు నడవడంలేదు. సీతమ్మ పలికిన పై శ్లోకంతో నా, గుండె ద్రవించిపోయింది. అంతర్ముఖమైన నా మనస్సు పవిత్రమైన ఈ సనాతన ధర్మ జీవన బాటలో నన్ను ఎక్కడికో నడిపించుకొని పోతున్నది. ముందుచూపును అందించాలని నన్ను వెనుకకు మరలించుకొని పోతున్నది. నా కళ్ళముందు ఏవో అపురూప దృశ్యాలను పరుస్తూ వుంది. నా చెవుల్లో అమృతమయ నాదాలను నింపుతోంది. భారతీయ స్త్రీమూర్తి ఔన్నత్యాన్ని దర్శించిన నా పేద మనసు పసిబిడ్డై మాటలురాక మూగబోతోంది.

మాతృగృహంలో తల్లిదండ్రులు చేసిన ఉపదేశాలు తన ప్రవర్తనకు మరొకరి అవసరాన్ని లేకుండా చేశాయని, భిన్నపరిస్థితులలో అద్వితీయ తేజంతో ప్రవర్తించే జ్ఞానాన్ని ప్రసాదించాయని సీతమ్మ చెబుతూవుంది. పైగా ధర్మస్వరూపుడైన రాముని ఎదుట మాట్లాడింది. ఎంత విశ్వాసం? ఎంత విజ్ఞానం? ఎంత అనుభవం? ఇవన్నీ పూర్వము కన్యలకు తల్లిగారింట్లో లభించేవి.

ఈనాడు మన అక్కలకు, చెల్లెళ్ళకు ఈ భాగ్యం ఉందా? ఏ చిన్న సమస్యకైనా కదిలిపోయే, కుమిలిపోయే సోదరీలనే ఈనాడు మనం ఎక్కువగా చూస్తున్నాం. పైపెచ్చు లేని సమస్యలను తయారు చేసికొని 'రజ్జు సర్పభ్రాంతి' లా దుఃఖించే వాళ్ళను కూడా వీక్షిస్తున్నాం.

భావస్ఫూర్తి, వాక్శుద్ధి మహిళకు ముఖ్యాభరణాలు. ఈ అలంకరణలతో ప్రకాశించే స్త్రీ గృహాన్ని ప్రతిభావంతంగా ప్రభావితం చేస్తుంది. అందుచేతనే గృహిణిని గృహలక్ష్మిగా కీర్తించింది ఆర్షసంస్కృతి.

**న గృహం ఇత్యహుః గృహిణీ గృహం ఉచ్యతే**

'గృహం అంటే ఇల్లు లేదా భవనము కాదు. గృహం అంటే గృహిణియే' అని మహాభారతం నిర్వచించింది.

ఈరోజు వృద్ధిచెందుతున్న నాగరికతకు అనుకూలంగా ఇంటిని సుందరంగా అలంకరించడం మనం అలవరచుకున్నాం. రంగురంగుల గోడలు, సోఫాలు, పూలకుండీలు, ఆధునిక అలంకరణలు- అన్నిటినీ అమర్చుకుంటున్నాం. అంతా బావుంది. ఆ తర్వాత ఏం చేస్తున్నాం? అందులో కూర్చుని ఏడుస్తున్నాం. మూలుగుతూ మూల్యం చెల్లిస్తున్నాం.

ఎందుకో తెలుసా! బాహ్యాకర్షణలు, అందాలు బ్రతుకులో ఆనందాన్ని ప్రసాదించలేవు. అంతర్యాన్ని ఎలా అలంకరించుకోవాలో తెలియని వారు బాహ్యసౌందర్యంతో తృప్తి చెందలేరు. భావసంయమనం లేనివారు భవనాలలో జీవించినా దుఃఖాన్ని తప్పుకోలేరు.

భర్త అనుగ్రహచ్ఛాయలో జీవించగలిగితే, భవనాలకన్నా వనాలే సుఖప్రదములని సీతమ్మతల్లి చెప్పే ఈ జీవనసత్యాన్ని ఎందరు జీర్ణించుకోగలరు?

స్త్రీకి, భార్యగాకంటే, తల్లిగా ఎక్కువ ప్రాధాన్యతనిచ్చింది భారతీయ సంస్కృతి. 'మాతృదేవోభవ' అని ఎలుగెత్తి కీర్తించింది. భార్యత్వంలో భావసంయమనం చోటు చేసుకుంటే, ఆ సంయమనశక్తి పెరిగి పెరిగి ఆధ్యాత్మిక పరిమళాన్ని పులుముకొని మాతృత్వంగా ప్రకాశిస్తుంది.

అడిగి తీసుకోవడం ఆలికి తెలిస్తే అడిగడిగి పెట్టడం అమ్మకు తెలుసు. కాలాన్ని చూసి పెట్టడం కళత్రానికి తెలిస్తే కడుపుచూసి పెట్టడం కన్నతల్లికి తెలుసు. చదువు రాని వాళ్ళు ఇలా చెప్పుకోవడం నేను చిన్నతనాన విన్నాను.

తల్లిగా పరిణతిచెందింది ఎవరు? ఒకనాడు భార్యగా రాణించిన ఇల్లాలేగదూ! ఆలోచించండి. మాతృత్వం భార్యత్వంమీద ఆధారపడినట్లే, భార్యత్వం కన్యత్వంమీద ఆధారపడి ఉంది.

కమ్మని భావాలతో కన్యజీవితం కళకళలాడితే బాధ్యతలతో భార్యత్వం రాణిస్తుంది. ప్రేమలో మాతృత్వం శోభిస్తుంది. ఇది జరిగిననాడు దివిని భువి నిలదీస్తుంది.

**'కన్యేయం కులజీవితం'**

'కన్యయే కులానికి శోభ' అన్నాడు కాళిదాస్.

**" Frailty! Thy name is woman"** "దౌర్బల్యమా! నీ పేరు స్త్రీ" అని, నేను ఎవరిని ఋషిగా భావించి, ప్రేమిస్తానో అట్టి ఆంగ్లకవి నుండి వినాల్సివచ్చింది. ఇవియే సంప్రదాయాలు అందించిన వరాలూ, శాపాలూను.

"స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ అభ్యుదయం, స్త్రీ అభివృద్ధి, స్త్రీ సంక్షేమం" ఇలాంటి ఎన్నో శబ్దాలు ఈనాడు మన చెవుల్లో ప్రవేశిస్తున్నాయి. వీటి అర్థాల్ని, భావాల్ని ఎందరు అందుకొంటున్నారు?

ఇవన్నీ ఒకనాడు ఆర్షసంస్కృతిలో భాసించినవే. విద్యార్జనసమయంలో బాలురకు మల్లే బాలికలకుగూడ ఉపనయనాలు జరిగేవి. స్త్రీలు గాయత్రీమంత్రం జపించేవారు. ఇది ప్రాచీన వేదకాలసంస్కృతి. ఈ సంస్కృతినుండి చీలి ప్రత్యేకంగా రూపుదిద్దుకున్న పార్శీ మతస్థులలో



ఈరోజుకూడా చాలామంది బాలికలకు ఉపనయన సంస్కారం ఉన్నట్లు చూస్తున్నాం. వింటున్నాం.

కాలక్రమేణ స్త్రీసమాజంలో మార్పు వచ్చింది. ముఖ్యంగా పాశ్చాత్య ప్రభావం పడినప్పటి నుండే ఈ దురదృష్టం ప్రారంభమైంది. మహిళలు విద్యకు దూరమై భర్తలపై ఆధారపడి జీవించడం ప్రారంభించారు. మరోవైపు బాల్యవివాహాలు మహిళాభ్యుదయాన్ని దెబ్బతీశాయి.

అదలా ఉంచండి. ఈ రోజు విద్య స్త్రీలకు చేరువైంది. బాల్యవివాహాలు నిషేధింపబడ్డాయి. ఈ తరుణంలో పూర్వపుశోభ మళ్ళీ తొంగిచూసుండాలి. కానీ అది జరగడంలేదు. ఆధునిక విజ్ఞానం అలవడుతున్నదేగానీ పవిత్రమైన ప్రాచీన సంస్కృతి అందడంలేదు. ఇంతవరకు తల్లుల్ని కాలం మోసం చేసింది. ఈనాడు విద్య మోసం చేస్తూవుంది. వాస్తవానికి దానిని అక్షరాస్యత అనాలేగాని విద్య అనగూడదు.

భారతీయ మహిళలు మేల్కొనవలసిన సమయం ఆసన్నమైంది. సీత, సావిత్రి, దమయంతి మొదలైనవారిని కళ్ళముందు చూపాల్సిన తరుణం చేరువైంది.

దానికి ఒక్కటే మార్గం. భౌతిక అవసరాలు తీర్చే ఈ కూటివిద్యలు, కుటిలవిద్యలతో పాటు, బౌద్ధిక అవసరాలను, ఆధ్యాత్మిక అవసరాన్ని తీర్చే ఆర్షవిజ్ఞానాన్ని సముపార్జించుకోవాలి. సంయమనంతో గృహంలో, సమాజంలో సంస్కార బీజాలను నాటే కార్యక్రమాన్ని తక్షణం చేపట్టాలి. సీతమ్మచూపిన ఆదర్శమార్గాన్ని అనుసరించాలి. ఆ మార్గాన్ని విస్మరించి మహిళాభ్యుదయాన్ని కాంక్షించడం అనూహ్యం అంటారు స్వామివివేకానంద.

**' Sita has gone into the very vitals of our race. She is there in the blood of every Hindu man and woman. We are all children of Sita. Any attempt to modernize our woman, if it tries to take our women away from that ideal of Sita, is immediately a failure, as we see every day. The women of India must grow and develop in the footprints of Sita, and that is the only way.'**

"సీతమ్మ మన జాతి నాడీప్రవాహంలో కలిసిపోయింది. ఆమె ప్రతిహిందూ స్త్రీ పురుషుల రక్తంలో మిళితమై ఉంది. మనం సీతమ్మబిడ్డలం. మనం ప్రతిరోజా చూస్తున్నట్లుగా, మన స్త్రీలను ఆధునికంగా తీర్చిదిద్దే ప్రయత్నంలో సీత అనే ఆదర్శమూర్తికి దూరంగా తీసికెళ్ళే ప్రయత్నం చేసినప్పుడంతా మనం ఓటమినే చవిచూశాము. భారతీయ మహిళలంతా సీతమ్మ అడుగుజాడల్లోనే పెరిగి అభివృద్ధిని సాధించాలి. ఇదొక్కటే స్త్రీ అభ్యుదయానికి ఏకైక మార్గం " అంటారు వివేకానందస్వామి.

ఇక సీతమ్మతల్లి దగ్గరకు పోదాంపదండి.

సీతమ్మ చెబుతోంది. "రామా! నీతోపాటు నేను అరణ్యంలో సంచరిస్తాను. ఫలమూలాదులను మాత్రమే భుజించి జీవిస్తాను. మిమ్మల్ని ఎన్నడూ బాధకు గురిచేయను. నేను సదా సంతోషంతో ఉంటాను.

"మీరు లేనిది స్వర్గమైనను నాకు రుచించదు. నీకు దూరమై జీవించవలసివస్తే నేను మరణించడానికే నిర్ణయించుకున్నాను. నాథా! నీతోపాటు నన్ను తీసికొనిపో. నీ పాదములనే పట్టుకొని పుట్టింట నున్నట్లు ఆనందంగా ఉంటాను," అన్నది సీతమ్మ.

సీతమ్మను అడవికి వెంటబెట్టుకొని వెళ్ళడం రామునికి ఇష్టంలేదు. అందువల్ల వనవాసంలో ఉండే బాధల్ని వివరించడానికి ఉపక్రమించాడు శ్రీరాముడు.

"సీతా! నీవు ఉత్తమ సంజాతవు. నీవు అయోధ్యలో వుండి, స్వధర్మాన్ని ఆచరించడమే నాకు సమ్మతము. అరణ్యంలో జీవించుట అందరికీ సాధ్యమయ్యే పని కాదు.

"సీతా! అడవిలో అనేక బాధలుంటాయి. అరణ్యము అగచాట్లకు, ఆవేదనలకు నిలయము. సెలయేళ్ళ శబ్దాలు, సింహగర్జనలు, క్రూరమృగ సంచారము, కంటకములు పరచినట్లున్న డొంకలు, ఉన్నపళంగా వీచే పెనుగాలులు, అలుముకొనే గాఢాంధకారము, మార్గమున ప్రాకే విషసర్పాలు, ముసిరే ఈగలు, దోమలు, కీటకాలు - ఇది అరణ్యమంటే.

"జానకీ! నా మాటవిను. నీవు అరణ్యానికి రావద్దు. అది నివాసయోగ్యమైన ప్రదేశము కాదు. కష్టాలకు నిలయము. కన్నీటికి ఆలవాలము;" అన్నాడు శ్రీరాముడు.

రాముని మాటలు విన్న సీతమ్మ ధారగా కన్నీటిని విడుస్తూ, "ప్రభూ! మీరు చెప్పినదంతా వాస్తవమే. నేను కాదనను. కానీ కాంతారములోని కష్టాల వెనుక నిలిచియున్న మీ అప్రమేయ ప్రేమలో నాకు ఆ కష్టాలు సుఖాలుగా మారిపోతాయి.

**త్వయా చ సహ గన్తవ్యం మయా గురుజనాజ్ఞయా**

"రామా! పెద్దల ఆజ్ఞ ప్రకారముగూడ నీతోపాటు నేను అరణ్యానికి వెళ్ళక తప్పదు" అన్నది సీతమ్మ.

జనకపురిలో సీతారామకళ్యాణ సమయంలో **"ఛాయేవానుగతా పతిమ్"** "నిన్ను మా అమ్మాయి ఛాయవలె అనుసరిస్తుంది" అని పలికి జనకమహారాజు రామునికి కన్యాదానం చేశాడు. ఆ విషయాన్ని పరోక్షంగా ప్రస్తావిస్తూ రామునితోపాటు అరణ్యానికి వెళ్ళడానికి పెద్దల అనుమతి ఉంది అని చెప్తూవుంది సీత.

సీతమ్మ ఇంకా చెప్తోంది.

"రామా! నన్ను తృణీకరించకు. వనవాసములో అనేక బాధలుంటాయని నాకు తెలుసు. దుఃఖములుంటాయని తెలుసు. అవి ధైర్యం లేనివారి కొరకే. రామా! నిన్ను విడిచి నేను జీవించలేను. **భర్తాహి మమ దైవతమ్** భర్తయే నా దైవము;" అని బిగ్గరగా రోదించింది సీతమ్మ. అయినా ఆమెను వనవాసమునకు గొనిపోవుట ఇష్టంలేని రాముడు సీతను ఓదార్చాడు. వద్దని వారించాడు. సీతమ్మకు దుఃఖం పెల్లుబికి కోపంగా మారింది. ధర్మాత్ముడైన శ్రీరాముని నిశితంగా విలదీసి మరీ ప్రశ్నించింది.

## కుపితగా సీత

"రామా! నీవు పురుషాకారంలో గోచరిస్తున్న స్త్రీగా తెలుస్తున్నావు. అట్టి నిన్ను మా తండ్రిగారు ఏమిచూచి అల్లుడిగా గ్రహించాడో నాకు తెలియుటలేదు.

"రాఘవా! నీలో ప్రకాశములేదని ఎవరైనా శంకిస్తే వారు సూర్యప్రకాశమును శంకిస్తున్నారనే భావించాలి. నీవు నన్ను అంగీకరించకపోవుటకు మరేదో బలమైన కారణం వుండిఉండాలి.



"నీవు నన్ను వెంటబెట్టుకొని వెళ్ళుటకు భీతి చెందుతున్నావు. కారణమేమిటో చెప్పు. నేను నిన్ను బాధించే స్త్రీని కాను. వంశానికి కళంకము తెచ్చే స్త్రీని గాను. నేను నీ పత్నిని. పతియే గతి అని నమ్మిన సతిని.

"నీ చేతులమీదుగా లభించింది పత్రమైనా, దుంపైనా, ఫలమైనా అది నాకు అమృత తుల్యంగా ఉంటుంది. అరణ్యములో నీచెంత వసించే నేను పుట్టింటివారిని తలవను. బెంగపెట్టుకోను. నావల్ల అలాంటి కష్టాలుకూడా నీకుండవు."

**ఖగమృగ పరిజన నగరు బను బల్కల్ బిమల దుకూల్**
**నాథ సాథ్ సుర్ సదన్ సమ పరన్సాల సుఖ్మూల్**

"నాథా! మీ సహచర్యములో ఖగమృగాలే నా బంధువులు. వనమే పట్టణము. వల్కలములే పట్టుబట్టలు. పర్ణశాలయే స్వర్గధామము" అంటుంది సీతమ్మ తులసీరామాయణంలో.

"నీవు నన్ను విడిచి వెళ్ళినచో నేను మరుక్షణమే విషంత్రాగి మరణిస్తాను. ప్రభూ! నీవు నన్ను వదలి వెళితే, కొంతకాలానికైనా వియోగమును భరించలేక నేను మరణించుట తథ్యము. అలాంటప్పుడు వెంటనే మరణిస్తే ఏమైంది?

"రామా! నీ ఎడబాటును క్షణం భరించలేని నేను పద్నాలుగు సంవత్సరాలు దూరమై జీవిస్తానా? " అని బిగ్గరగా రోదిస్తూ సీతమ్మ రాముని కౌగిలించుకున్నది. ఆమె నయనాల నుండి స్రవించిన స్వచ్ఛమైన అశ్రువులు కమలమునుండి నీరు జారినట్లున్నాయి.

రాముని హృదయం ద్రవించింది. వెంటనే మూర్ఛిల్లినట్లున్న సీతను రాముడు తన బాహువులతో కౌగిలించుకున్నాడు. తన హృదయాన్ని తెరచి ముచ్చటించాడు.

"సీతా! నీ దుఃఖాన్ని నేను చూడలేను. నాకు ఎవరినుండికూడా భయంలేదు. నీ అభిప్రాయమును పూర్తిగా గ్రహించకుండా నిన్ను తీసికెళ్ళడం ఇష్టంలేకనే అలా మాట్లాడాను.

"సీతా! నాతో వనవాసము చేయుటకే బ్రహ్మదేవుడు నిన్ను సృష్టించాడేమో! అభిమానవంతుడు కీర్తిని ఎలా విడవడో నేను నిన్ను అలా విడవను.

"జానకీ! నీ ధీరవచనములను విన్న తరువాత నాతోపాటు వచ్చుటకు నిన్ను అనుమతిస్తున్నాను. అలాగే. ప్రయాణంకా! నాకు సహధర్మచారిణివికా!

"సీతా! చక్కని నిర్ణయం తీసుకున్నావు. ఇది పుట్టింటికి, అత్తింటికి కీర్తిని తెచ్చిపెట్టే నిర్ణయము. వెంటనే ప్రయాణానికి సిద్ధపడు.

"ఉన్నవన్నీ పరులకిచ్చేయ్. విలువైన నీ వస్తువులన్నీ అర్హులకు దానంచెయ్యి. కాలం అట్టే లేదు" అన్నాడు సీతాపతి.

భర్తమాటలు విన్న సీతమ్మ అభీష్టము సిద్ధించినందుకు తృప్తిచెంది వెంటనే దానములిచ్చుట ప్రారంభించింది.

## స్వామిభక్తి పరాయణుడు

సీతారాముల సంవాదమును అంతకుముందే అక్కడికివచ్చిన లక్ష్మణుడు ఆలకించి, భరించలేని దుఃఖముతో కన్నీరుకార్చుతూ రామునిపాదాలకు నమస్కరించి ఇలా పలికాడు.

"సోదరా! జంతువులతోనిండిన అరణ్యానికి వెళ్ళాలనేదే నీ నిశ్చయమైతే, నేనుకూడ ధనుర్ధారినై ముందు నడుస్తూ నీతోపాటు వనాలకు వస్తాను. నీతోకలసి వనవాసం చేస్తాను.

"నీవు లేకుండా త్రిలోకాధిపత్యము ప్రాప్తించినా నాకు రుచించదు;" అని పలికిన లక్ష్మణుని వారించి, ఓదార్చి వనాలకు రావద్దని చెప్పాడు రాముడు. కానీ లక్ష్మణుడు రాముని మాట వినలేదు. పైగా రాముని విచిత్రంగా ప్రశ్నించాడు.

**అనుజ్ఞాతశ్చ భవతా పూర్వమేవ యదస్మ్యహమ్**
**కి మిదానీం పునరిదం క్రియతే మే నివారణమ్**

"నీవు నాకు ఇంతకుపూర్వమే అనుమతి నొసగినావుకదా! ఇపుడు రావద్దని పలుకుతున్నావెందుకు?

"నేను నీతో రావాలని భావిస్తున్నాను. నన్ను నీవు ఎందుకు నివారిస్తున్నావో నాకు అర్థంకావడంలేదు" అన్నాడు లక్ష్మణుడు.

ఇక్కడ లక్ష్మణుడు పలికినమాటలు విచిత్రంగా వున్నాయి. వనాలకు రమ్మని రాముడు లక్ష్మణునితో చెప్పినట్లుగాని, లేదా అనుమతి ఇచ్చినట్లుగాని ఇంతవరకు నడచిన కథలో మనమెక్కడా చూడలేదు. విచిత్ర మేమిటంటే సందర్భానుసారంగా సీతమ్మతో భాషించినపుడు రాముని నోటినుండి వెలువడిన కొన్నిమాటలను పట్టుకొని వాటిని వ్యాఖ్యానిస్తూ తనకు అనుకూలంగా మలచుకుంటాడు లక్ష్మణుడు. ఆయన స్వామిభక్తి అలాంటిది.

**భ్రాతృ పుత్ర సమౌ చాపి ద్రష్టవ్యౌ చ విశేషతః**
**త్వయా భరత శత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ**

" ముఖ్యంగా నీవు నాప్రాణంతో సమానులైన భరతశత్రుఘ్నులను సోదరులలాగా, బిడ్డలలాగా చూచుకోవాలి."

ఈ మాటను రాముడు సీతమ్మతో అంటాడు. లక్ష్మణుడు ఆ క్షణంలోనే అనుమతి లభించినట్లు భావిస్తాడు. భరతశత్రుఘ్నులను రక్షించమని సీతమ్మకు చెప్పాడేగాని తనపేరు చెప్పలేదు. తనను వనాలకు తీసుకొనిపోతున్నాడు గనుకనే చెప్పలేదు. ఈవిధంగా సీతమ్మ కంటే ముందుగానే పరోక్షంగా అనుమతిలభించినట్లు నిశ్చయించుకుంటాడు లక్ష్మణుడు.

ఇపుడు లక్ష్మణుడు "నీవు నాకు పూర్వమే అనుమతిని ప్రసాదించావు" అన్నప్పుడు కాదని, లేదని రాముడు అనలేదు. లక్ష్మణుని భావాన్ని తన మౌనంద్వారా రాముడు సమర్థించినట్లే అయింది.

రామలక్ష్మణుల సోదరప్రేమ అగాధమైనది. పరస్పరం వారిమధ్యనడచే ప్రేమ ప్రవాహంలో ఏవైపు నుండి ప్రవహించే ప్రవాహం లోతెక్కువో మనం నిర్ణయించలేము. అనుభవంతో పట్టుకోవాలేగాని ప్రమాణాన్ని అందించలేము. అలాకాకపోతే సీతమ్మను వనాలకు రావద్దని పలికిన రాముడు ముందుగనే లక్ష్మణుని వెంటబెట్టుకొని వెళ్ళుటకు నిర్ణయించుకుంటాడా? లక్ష్మణుని స్వామిభక్తి వర్ణనాతీతం.

అయోధ్యలో ప్రభవించిన నలుగురు సోదరులలో ఒక్క లక్ష్మణునిమాత్రమే లక్ష్మణ స్వామి అని పలకడం వాడుకలో ఉంది. తక్కిన ముగ్గురు సోదరులకు ఆ ప్రయోగం లేదు.



రామస్వామి అనిగాని, భరతస్వామి అనిగాని, శత్రుఘ్నస్వామి అనిగాని మనం ఎక్కడా వినలేదు. చదవలేదు. లక్ష్మణుడు స్వామిభక్తి పరాయణుడు గనుక ఆయనకు ఆ పేరు దక్కింది.

అలాఅంటే, తక్కినవారికి స్వామిభక్తి లేదా అనే శంక మీకు రావచ్చు. ఉంది. అది ఎవరూ కాదనలేరు. కానీ లక్ష్మణుని స్వామిభక్తి ప్రత్యేకమైంది. రాముని వదలి జీవించలేని స్వామిభక్తి అది. మున్ముందు ఆవిషయాన్ని ప్రస్తావించి వ్యాఖ్యానిస్తాను. లక్ష్మణుని స్వామిభక్తికి ఉదాహరణ చెప్పాలంటే, రామునికి తనమీదకన్నా లక్ష్మణునిమీదనే ప్రేమ ఎక్కువ అని స్వయంగా సీతమ్మే చెప్పే స్థాయికి చేరుకుంది.

**మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః**

"రామునికి నాకంటే సోదరుడైన లక్ష్మణుడే ప్రియుడు " అని సీతమ్మ సుందరకాండలో హనుమంతునితో చెబుతుంది.

లక్ష్మణుడు ధనుర్ధారియై వనాలకు వెళ్ళుటకు ముందే సంసిద్ధుడై ఉండుట చూసి రాముడు ఇలా పలికాడు.

"లక్ష్మణా! నీవు స్నేహపాత్రుడవు. ధర్మనిరతుడవు. వీరుడవు. సదా సన్మార్గవర్తనుడవు. అన్నిటికన్నా మించి నాకు ప్రాణతుల్యుడవు. నీవు నా ఆజ్ఞానువర్తివై చరించు సోదరుడవే కాదు. మిత్రుడవు కూడా.

"నాయనా! నీవు నాతోపాటు వనాలకివస్తే మన తల్లులైన కౌసల్యాసుమిత్రలను ఎవరు పోషిస్తారు? వరాలివ్వడంలో మన తండ్రిగారు వర్షించే మేఘానికి తీసిపోరు. లక్ష్మణా! కైకేయివల్ల మన తల్లులు అనేక కష్టాలు భరించవలసి వస్తుందేమో! నీవు ఇక్కడ వుండి వారిని రక్షించడం యుక్తము.

"వత్సా! ఈ పనివల్ల నీవు నన్ను సంతోషపెట్టగలవు. అలాగే పెద్దలను సేవించినట్లు కీర్తిని పొందగలవు;" అని రాముడు నేర్పును ప్రదర్శించి పలికాడు. రాముని మాటలను విన్న లక్ష్మణుడు అతి నేర్పుతో సమాధానమిచ్చాడు.

"సోదరా! నీ పరాక్రమానికి భయపడి భరతుడు కౌసల్యను, సుమిత్రను చక్కగా పోషిస్తాడు. ఈ విషయంలో సందేహము అనవసరం. అదియునుగాక సహస్రగ్రామాలు కౌసల్య ఆధీనంలో ఉన్నాయి. నాలాంటి వెయ్యిమందిని ఆమె పోషించగలదు. మా తల్లినికూడా పోషించగలదు.

"రామా! నన్ను నీ అనుచరునిగా తీసికొనిపో. ఇది ధర్మవిరుద్ధం కాదు. నేను కృతార్థుడనవుతాను. నీ కార్యముకూడా సిద్ధిస్తుంది.

"ధనుర్బాణములతో పాటు, గునపము, చిన్న గంపను తీసికొని నీముందు నడుస్తూ వుంటాను. కందమూలాలు, ఫలపుష్పాదులు తెచ్చి సమర్పిస్తూ ఉంటాను. నీ పనులన్నీ భక్తితో చేసిపెడతాను," అని పసిబిడ్డలాగా అమాయకంగా వేడుకున్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలువిని సంతసించిన రాముడు, " నాయనా! లక్ష్మణా! అలాగే. వెళ్ళి నీ మిత్రులవద్ద సెలవుతీసికొని రా. నా ధనాన్నంతా నేను పేదలకు, పండితులకు దానం

చేయదలచాను. పండితులలో శ్రేష్ఠుడు, వసిష్ఠుని కుమారుడైన సుయజ్ఞునికూడా వెంటబెట్టుకొని రా " అన్నాడు రాముడు. లక్ష్మణుడు అమితానందముతో నిష్క్రమించాడు.

అరణ్యాలకు రావద్దని సీతను రాముడు ఎంతగానో వారించాడు. సీత కుపితగా మారనంతవరకు రాముడు నిరాకరిస్తూనే వచ్చాడు. కానీ లక్ష్మణుని విషయం చూశారా! ఎంత తేలికగా అంగీకరించాడో? అదే లక్ష్మణుని స్వామిభక్తి. ఒకవేళ "నేను కూడా వస్తాను" అని లక్ష్మణుడు అడగకుండా వుంటే రాముడు ఏమి చేసుండేవాడు? ఈ విషయాన్ని ఆలోచించమని మీకే వదిలేస్తున్నాను.

**ఆత్మబంధువులారా !**

కొన్ని క్షణాలు కథనుండి మిమ్మల్ని దూరంగా తీసికొనిపోతున్నాను. క్షమించండి. మీకు అనివార్యంగా వచ్చే సందేహాన్ని నివారించాలనే ఆలోచనేగాని అధికప్రసంగం సాగించడం కాదని మాత్రం సవినయంగా మనవిచేసుకుంటున్నాను.

సీతారాములు అరణ్యవాసం వెళ్తున్నారు. వారికి సేవచేయడానికి లక్ష్మణుడు వెళ్తున్నాడు. మరి లక్ష్మణుని భార్య ఊర్మిళ ఏమైంది? ఆమె వనవాసానికి భర్త వెంట ఎందుకు వెళ్ళలేదు? ఆమెకు సమ్మతం కాకనా? లేక లక్ష్మణుడు అంగీకరించకనా?

రామునితోపాటు వనవాసానికి వెళ్ళడం తన హక్కుగా ధర్మముయొక్క ఛాయలో నిలబడి సీతమ్మ వాదించింది. మరి అదే ధర్మము ఊర్మిళ కెందుకు వర్తించదు? ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానమేమిటి?

నేను మాత్రం ఏం చెప్పేది? ప్రామాణికంగా వ్రాయడానికి ఆధారాలు లేవు. ఆమె విషయాన్ని రామాయణకర్తలెవ్వరూ స్పృశించలేదు. ఇది అన్యాయం అని కొందరు విమర్శించారు. ఊర్మిళ కావ్యంలో ఉపేక్షింపబడింది అని కొందరు వ్యాఖ్యానించారు. సీత పాత్రపై వుండే మక్కువలో వాల్మీకిచే ఊర్మిళ కావ్యంలో ఉపేక్షింపబడింది అని విశ్వకవీంద్రుడైన రవీంద్రుడు సర్దిచెప్పాడు. ఎవరెలా చెప్పినా ఎవరూ సంతృప్తిపడ్డట్లు తెలియడంలేదు. ప్రామాణికంగా విషయము అందని కారణాన మహాత్ములు చెప్పగా విన్నవి, చదివినవి కొన్నింటిని స్మృతికితెచ్చుకొని వివరిస్తున్నాను. దీనికి ప్రమాణం లేదని నేనే చెప్తున్నందున నేను మీ ప్రకోపానికి, ప్రతాపానికి గురికావలసిన అవసరంలేదని భావిస్తాను. ప్రమాణం కాకపోయినా ఇక్కడ మీకు లభించే భావస్ఫూర్తి, ఊర్మిళ విషయంలో మీ హృదయాన్ని శాంతపరచగలిగితే ఇలా దారితప్పడంలో తప్పులేదని గ్రహించి తృప్తి చెందుతాను. వినండి.

వనవాసము విషయాన్ని చెప్పడానికి లక్ష్మణుడు ఊర్మిళ గదికి వెళ్తాడు. ఆ సమయానికి కళాతపస్వినియైన ఊర్మిళ చిత్రలేఖనమునందు నిమగ్నమై ఉండింది. "ఊర్మిళా!" అని లక్ష్మణుడు పిలవగానే విస్మయంతో భర్తను సమీపించుటకు శీఘ్రంగా లేచింది. ఆ ప్రక్కనేఉన్న రంగులు ఒలికి చిత్రముపై బడ్డాయి. చిత్రము పాడైపోయింది. ఊర్మిళ గాబరాపడింది. ఏం జరిగిందని లక్ష్మణుడు ప్రశ్నిస్తాడు.

రంగులొలికి తను వేయుచున్న చిత్రము పాడైందని చెబుతుంది ఊర్మిళ. "ఊర్మిళా! నీవు గీసేది ఎవరిబొమ్మ?" అని ప్రశ్నించాడు లక్ష్మణుడు.



"సీతారాముల చిత్రము. ఈరోజు రామపట్టాభిషేకం కదా? సీతారాములు సింహాసనంపై ఆసీనులైఉంటే ఎలాఉంటారో ఊహించుకొని ఈ చిత్రాన్ని గీస్తున్నాను. దీనిని జనకపురికి పంపితే మా తల్లిదండ్రులు చూచి సంతోషిస్తారని భావించాను. ఈలోగా మీరు పిలిచారు. హడావుడిగా రావడంలో రంగులు ఒలికిపోయాయి. చిత్రం పాడైపోయింది" అన్నది లక్ష్మణునితో ఊర్మిళ.

"ఊర్మిళా! నిజమైన పట్టాభిషేకచిత్రము కైకేయివల్ల ఇదివరకే పాడైపోయింది. ఇపుడు నీవు గీసే ఈ అనిత్య రంగులచిత్రము నావల్ల పాడైంది. విచారించకు. ఆటబొమ్మలు పాడు గాకుండాపోతాయా? మట్టికుండలు పగిలిపోకుండా ఉంటాయా?

"ఊర్మిళా! సీతారాములు వనాలకు వెళ్తున్నారు. వారికి సేవచేసేందుకు నేను వెళ్తున్నాను. పద్నాలుగు సంవత్సరాల తరువాతే మళ్ళీ కనిపించడం" అన్నాడు లక్ష్మణుడు.

ఊర్మిళ నిశ్చేష్టురాలై నిల్చుండిపోయింది. నేత్రాలు మేఘరూపం ధరించి వర్షించాయి. తనవెంట అడవికిరమ్మని లక్ష్మణుడు పిలవనూలేదు. వస్తానని ఊర్మిళ అననూలేదు.

సేవ చేయడానికి వెళ్తున్నట్లు లక్ష్మణుని నోటినుండి వెలువడిన వాక్యము ఆమె గొంతుకు అడ్డంపడి, మాటలను బహిర్గతం కానీకుండా ఆపింది.

"ప్రభూ! నేను అయోధ్యలోనే ఉంటాను. సీతారాములను శ్రద్ధాభక్తులతో సేవించండి. కానీ నాదొక మనవి. ఈ పద్నాలుగు సంవత్సరాలలో ఏ క్షణంలోకూడా నేను మీకు జ్ఞాపకం రాకూడదు.

"మీరు సీతారాములసేవ అనే తపస్సులో ఉంటారు. పతి తపస్సుకు సతి ఆటంకము కాకూడదు. నావల్ల మీకు వ్రతభంగం కాకూడదు. కనుక క్షణంకూడా మీ మనసులోకి నన్ను రానివ్వకండి.

"నాథా! ఒకవేళ వచ్చినా ప్రయోజనమేమిటి? మీరక్కడ! నేనిక్కడ! నదిలో సుడిలాగా మనసులో సంకల్ప సుడిగుండాన్ని సృష్టించుకోవడమే గాని మరొక ప్రయోజనం లేదు.తపస్సులో సంకల్పనిరోధమును సాధించాలేగాని సంకల్పముద్వారా తపస్సు నిరోధింపబడకూడదుకదా! నావల్ల మీ సాధన భగ్నం కాకూడదు. మీరు అదృష్టవంతులు. తృప్తిగా సీతారాముల సేవ చేసుకోండి" అంటుంది భర్తతో ఊర్మిళ.

ఇలాంటి మహాతల్లిని, త్యాగమయిని గూర్చి ఎవరు వ్రాయగలరు? వ్రాయాలని సంకల్పించి కలం చేతధరించేసరికి వారి చేతినుండి కలం జారిపోయేదట. వ్రాయడానికి కలమే కష్టపడుతూ క్రిందపడిపోతుంటే కరుణామయులైన మహాత్ములు ఎలా వ్రాయగలరు? అందుచేతనే ఆమెచరిత్ర ఎవ్వరూ వ్రాయలేదని చెబుతారు.

తులసీదాస్ మహాత్ముడు మాత్రం హృదయస్పందనతో "తల్లీ! నీ చరిత్ర వ్రాసే శక్తి నాకు లేదు. నీకు వందనం చేయడంకన్నా నేను ఏమీ చేయలేను " అని నమస్కరించాడంటారు. కరుణాంతరంగచిత్తులైన పూర్వీకులగు మహాత్ములందరు ఉపేక్షించిన ఈ సాధ్వీమతల్లి విషయాన్ని, వ్రాయలేక విడిచిపెట్టిన ఈమె జీవితాన్ని, కఠినాత్ముడ నైనందున, కలియుగ కల్మషాలమధ్య జీవిస్తున్నవాడ నైనందున కర్కశహృదయుడనై ఈమాత్రం సమీక్షిస్తున్నాను.

కలం జారిపోయేటంతటి సున్నితమైనవాడ్ని కానందున, జారిపోని కలాన్ని కఠినంగా పట్టుకొని ఈ నాలుగుమాటలు వ్రాస్తున్నాను.

ఊర్మిళ త్యాగము మాటలకందనిది. ఆమె శరణాగతి అనూహ్యమైనది. ఆమెలోని సమర్పణభావం అనిర్వచనీయమైనది. ఆమె త్యాగపూరిత వచనాలకు భర్తే నిశ్చేష్టుడై పోయాడట. మెల్లగాకదిలి సీతారాములచెంతకు వెళ్ళిపోయాడట.

ఇక పద్నాలుగు సంవత్సరాలు సీతారాముల దర్శనం లభించదు కనుక నీవు వెళ్ళి దర్శనంచేసుకో అనిగాని, లేదా అంతఃపురానికి వెళ్ళమనిగాని చెప్పకుండా లక్ష్మణుడు వెళ్ళిపోయాడట. మాటలు పెగలని దుఃఖంలో లక్ష్మణుడు వెళ్ళిపోతే, తనను అక్కడే ఉండమని భర్త అభిమతమేమోనని భావించి పద్నాలుగు సంవత్సరాలు ఊర్మిళ ఆ గదిలోనే నిలబడో, నిద్రపోయో ఉండిపోయిందంటారు.

ఈ సందర్భమున ఊర్మిళకు సంబంధించి మహాత్ములు చెప్పే మరొక విషయాన్ని కూడా ప్రస్తావించి, ఆ తరువాత ప్రధానస్రవంతిలో కలుస్తాం.

అది యుద్ధకాండ. రామరావణుల మధ్య భయంకరంగా పోరాటం సాగుతోంది. లక్ష్మణుడు మూర్ఛిల్లాడు. హనుమంతుడు సంజీవినీపర్వతాన్ని తీసుకొనివస్తున్నాడు. హనుమంతుడు నందిగ్రామ సమీపానికి రాగానే భరతుడు చూచి, రాక్షసుడేమోనని భావించి బాణప్రయోగంచేసి పర్వతముతోకూడా పవనసుతుని క్రిందికి దించాడు.

ప్రజలందరూ చుట్టూమూగి హనుమంతుని దర్శించారు. లక్ష్మణుని ఆపదను చెప్పగానే ప్రజలంతా రోదించారు. రాణులందరూ రోదిస్తారు. కౌసల్య విలపించింది. ఆ సమయంలో దుఃఖించకుండా ఇద్దరు వ్యక్తులు కన్పిస్తారు. వారెవరో తెలుసా? ఆపదలో చిక్కుకున్న లక్ష్మణుని మాతృమూర్తి సుమిత్ర. ధర్మపత్ని ఊర్మిళ.

రోదిస్తున్న కౌసల్యతో సుమిత్ర చెబుతుంది. "అక్కా! దుఃఖించకు. ధర్మాత్ముడైన రామునికి ఏ ఆపద రాదు. ఒకవేళ నాబిడ్డ లక్ష్మణుడు మరణిస్తే రాముడు యుద్ధంలో ఏకాకిగా మిగిలిపోతాడని ఎవరూ భావించకండి. అలా జరిగితే, వెంటనే నా రెండవబిడ్డ శత్రుఘ్నుని రాముని సేవకు పంపుతాను" అని సుమిత్ర చెప్పగానే మాటలను కదిలించలేని కౌసల్య చేతుల్ని కదిలించి సుమిత్రను గాఢంగా హృదయానికి హత్తుకుంటుంది. ఎవరు చెప్పగలరు ఈ మాటలు సుమిత్ర తప్ప!

సుమిత్రయొక్క త్యాగపూరిత వచనాలు ఆలకించి నిశ్చేష్టుడైన హనుమంతుడు కన్నీళ్ళు కారుస్తాడు. భరతుడు హనుమంతుని తీసికొని ఊర్మిళమందిరానికి వెళ్ళి ఊర్మిళను హనుమంతునికి పరిచయం చేశాడట. హనుమంతుడు ఊర్మిళకు నమస్కరిస్తాడు.

తిరిగి వెళ్ళేటప్పుడు భరతుని అనుమతితో హనుమంతుడు ఊర్మిళను ఒక విషయమై ప్రశ్నించాడట. "తల్లీ! యుద్ధభూమిలో లక్ష్మణుడు మూర్ఛపడి ఉన్నాడు. నేను ఈ సంజీవినీ పర్వతాన్ని సూర్యోదయంలోగా అక్కడికి చేర్చాలి. అలా కానిచో లక్ష్మణుడు జీవించే అవకాశం లేదు. నీ మాంగల్యము ప్రమాదంలో చిక్కుకొనివుంది. ఇది తెలిసి అందరూ ఇక్కడ విలపిస్తున్నారు. కానీ లక్ష్మణుని ధర్మపత్నివైన నీవు మాత్రం ఏ శోకమూ లేకుండా కనిపించడం నాకు దిగ్భ్రాంతిని గొల్పుతున్నది," అంటాడు హనుమంతుడు.



ఊర్మిళ సమాధానం ఎలా ఉంటుందా? అని అక్కడున్న వారంతా శ్వాస పీల్చుకోకుండా చెవులప్పగించారు.

ఊర్మిళ హనుమతో ఇలా పల్కింది.

"హనుమా! విలపించవలసిన విషయం ఇక్కడేముంది? నా భర్తనుగూర్చి నాకు బాగా తెలుసు. నా నాథుని శరీరములో మాంసాణువులన్నీ మంత్రాణువులే. ఆయనకు రాముడు తప్ప రెండవ వస్తువు తెలియదు. ఆయన రోమ రోమము నందు రామనామమే నిండి ఉంటుంది. రాక్షసులు విసిరే శరాలు రోమాలయందు, మాంసాణువులయందు నిండియున్న రామునికి తగుల్తాయేగాని, నిగూఢంగా వెళ్ళి నా భర్తకు తగలవు.

"హనుమా! అదలాఉంచు. ఇంతకీ లంకలో ఏమి జరుగుతూ వుంది?" అని ప్రశ్నించిందట ఊర్మిళ.

"తల్లీ! లక్ష్మణుడు కళ్ళుమూసుకొని మూర్ఛిల్లియున్నాడు. రాముడు అతని ప్రక్కనే కూర్చుని ఏడుస్తున్నాడు" అంటాడు హనుమంతుడు.

"చూశావా! హనుమా! అర్థమయిందా? బాణాలు తగలడంవల్ల రాముడు ఏడుస్తున్నాడు. బాణాలు స్పృశించనందున నాభర్త హాయిగా నిద్రిస్తున్నాడు. రామునికి శరణాగతుడైన నా భర్తను రాక్షసుల శరాలు తాకలేవు" అంటుంది ఊర్మిళ.

ఆమె మాటలు విని హనుమంతుడు కన్నీళ్ళను ఆపుకోలేకపోయాడు. "ఆహా! ఏమి ఈ రఘుకులముయొక్క వైభవము. ఈనాడు ఈ పవిత్రాత్ములను చూచి నేను ధన్యుడనయ్యాను.

"తల్లీ! నాకు అనుజ్ఞ ఇవ్వు. తెల్లవారేసరికి నేను రామలక్ష్మణులను సమీపించాలి. లేకపోతే ప్రమాదం ముంచుకొస్తుంది" అన్నాడట హనుమంతుడు.

ఊర్మిళ హనుమంతునితో అంటుంది. "హనుమా! ఆవేదన చెందకు. దశరథునికోడలు, జనకునికూతురునైన ఊర్మిళను చెప్తున్నాను. నీవు వెళ్ళి, నా భర్త మూర్ఛనుండి బహిర్గత మయ్యేవరకు సూర్యోదయం కాదు.

"రఘుకులానికి మూలపురుషుడు సూర్యుడు. తాను ఉదయించడంవల్ల తన సంతానము అస్తమించే ప్రమాదముందని తెలిసి సూర్యుడెలా ఉదయిస్తాడు? భీతి చెందకు. నీ కార్యక్రమము పూర్తి అయిన తరువాతే సూర్యుడుదయిస్తాడు" అని చెప్పగనే హనుమంతుడు కన్నీళ్ళతో ఆమెకు నమస్కరించి వెళ్ళాడట.

చూశారా! ఉదాత్తమైన ఊర్మిళచరిత్ర ఇలా శోభిస్తూవుంది. ఊర్మిళకు వాల్మీకి ఏదో అన్యాయం చేశాడని, రామాయణ రచయితలందరూ అన్యాయం చేశారని ఏవేవో విమర్శలు చేస్తుంటారు.

హృదయాల్ని ద్రవీభవింపజేసే ఆ త్యాగమయి గాథని వ్రాసే సాహసం చేయలేక మహాత్ములు వదలిపెట్టారేగాని, అన్యాయాలు చేసేందుకు వారు అలవాటుపడిగాదు.

సరే .... ఊర్మిళాతల్లికి మనమూ వందనమాచరించి, పునీతులమై ప్రధానస్రవంతి వైపు వెళ్దాం. పదండి.

# పరిపోషణము - పరిహాసము

లక్ష్మణుడువెళ్ళి సుయజ్ఞుని వెంటపెట్టుకొని వచ్చాడు. సీతాసమేతుడై రాముడు సుయజ్ఞునికి నమస్కరించాడు. విలువైన బంగారుఆభరణాలను, మణులను సుయజ్ఞునకిచ్చాడు రాముడు. సీతమ్మ కూడా సుయజ్ఞుని భార్యకు బంగారు సూత్రము, సువర్ణ హారాలు, వడ్డాణము మొదలైనవి సమర్పించింది. గజాశ్వములనుకూడా రాముడు సుయజ్ఞునకిచ్చాడు. సుయజ్ఞుడు సీతారాములను ఆశీర్వదించాడు.

యజ్ఞమనగా సమాజ అభ్యుదయానికి చేసే కార్యము. అట్టి కార్యమును చక్కగా చేయువాడు సుయజ్ఞుడు. యజ్ఞభావంతో జీవించేవారికి పూర్వము గొప్పగా దానాలిచ్చేవారు. అలా గ్రహించిన విత్తాన్ని సముచితకార్యాలకు, లోకకళ్యాణానికి వినియోగించేవారు.

వితరణశీలత్వం వంటబట్టని ఆర్థికవ్యవస్థ ఏ సమాజాన్నైనా పాడుచేస్తుంది. కేవలం ఉత్పత్తియేగాకుండా వినియోగంవైపు ముఖ్యంగా ఆలోచించాలి. సద్వినియోగంపై సముద్ధరణము ఆధారపడి ఉంటుంది. కోసలరాజ్యంలో ఆర్థికవ్యవస్థ పూర్ణత్వాన్ని సిద్ధించుకున్నది.

సుయజ్ఞునకు సమర్పించిన పిదప మహర్షులను ఆహ్వానించి వారికి ధనము నొసగినాడు రాముడు. అలాగే పురోహితులకు విశేషముగా దానములిచ్చి వారినికూడా సంతోషపరచాడు.

సారథులను, సాధువులను, పేదలను పిలిపించి వారికికూడా దానములిచ్చారు. ఈ సందర్భమున రాముడు లక్ష్మణునితో ఒకమాట అంటాడు. దీనిని మనం బాగా ఆలోచించాలి.

**యే చేమే కఠకాలాపా బహవో దణ్డ మాణవాః**
**నిత్య స్వాధ్యాయ శీలత్వా న్యత్కుర్వన్తి కించన**
**అలసాః స్వాదు కామాశ్చ మహతాం చాపి సమ్మతాః**
**తేషా మశీతి యానాని రత్నపూర్ణాని దాపయ**

"లక్ష్మణా! పలాశదండధారులై, కఠకలాపశాఖలకు చెందిన ఎందరో బ్రహ్మచారులు నిత్యము వేదాన్నిమాత్రమే వల్లెవేస్తూ, ఏ పనులు చేయకుండా ఉంటారు. వారు సోమరులు **(అలసాః)**. తీపి పదార్థముల నారగించుటయందు అభిలాష గలవారు. **(స్వాదుకామాశ్చ)**. వేదపఠనము చేయుటచేత వీరిని పెద్దలుకూడా గౌరవిస్తూ ఉంటారు. వీరికి ఎనభై బండ్లతో రత్నాలు ఇవ్వు" అన్నాడు రాముడు.

సుయజ్ఞుడుకూడా వేదాధ్యయన తత్పరుడే. ఈ బ్రహ్మచారులుకూడా వేదాధ్యయనం చేస్తారు. సుయజ్ఞునిలోలేని విశేషాలు కొన్ని వీరిలో ఉన్నాయి. సోమరులు. తిండిబోతులు. అందుచేత సుయజ్ఞునికిచ్చిన దానికన్నా అధికంగా వీరికిచ్చాడు ప్రేమమూర్తియైన రాముడు.

వేదాధ్యయనపరులు సోమరులు కాకూడదు. యజ్ఞభావాన్ని ఆవిష్కరించే వేదాన్ని పఠించేవారు సోమరులు ఎలా కాగలుగుతారు? అర్థరహితంగా, భావశూన్యంగా చిలకలవలె వల్లిస్తూ, తలలను బావి గిలకలవలె తిప్పడంచేత. భావరహిత అధ్యయనాలు అలసత్వాన్ని పెంచుతాయేగాని అభ్యుదయాన్ని సృష్టించలేవు.



అర్థంగాని విషయమేమిటంటే, ఈ మహితాత్ములు రాముని కాలంలో కూడా ఉన్నట్లేనా? ఉండకపోతే ఎందుకు వ్రాస్తారు? ఉంటారు. ఈనాడు సత్యద్రష్టలైన మహాత్ములలాగా, ఆరోజుల్లో వీరుకూడా అరుదుగా ఉంటారు.

రాముడిచ్చే దానాలను చూసి కౌసల్య ఎంతగానో సంతోషించింది. ఆ రోజుల్లో బిడ్డలు దానంచేస్తే తల్లిదండ్రులు సంతసించేవారు. ఈ రోజుల్లో దగాచేసైనాసరే ధనాన్ని సంపాదిస్తే సంతోషిస్తున్నారు.

ఆ తరువాత రాముడు తన భవనంలో పనిచేసే నౌకరులను, పరిచారికలను పిలిచి, వారికి విశేషంగా ధనములిస్తూ అందరినీ ప్రేమతో పలకరించాడు. ఈవిధంగా తన ధనాన్నంతా వృద్ధులకు, పేదలకు, దీనులకు రాముడు దానంచేశాడు.

అప్పుడు అక్కడ త్రిజటుడు అనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు వృద్ధుడు. భార్య యౌవనవతి. అతడు గొడ్డలి, గునపము దగ్గరఉంచుకొని, వనములో త్రవ్వుకుంటూ జీవించేవాడు. చాలా పేదవాడు. భార్యప్రేరణతో రాముని యాచించేందుకు త్రిజటుడు రాముని వద్దకు వస్తాడు.

భాగవతంలో భార్యప్రేరణతో కుచేలుడు శ్రీకృష్ణుని ఆశ్రయించునట్లు, త్రిజటుడు రాముని ఆశ్రయిస్తాడు. సహాయంచేసి ఆదుకోమని ప్రార్థిస్తాడు. కానీ ఇక్కడ ఒక ఆసక్తికరమైన సన్నివేశముంది. ఇందులో అరుదైన రామునిస్వభావము మనకు గోచరిస్తుంది.

"రామా! నేను పేదవాణ్ణి. అధికంగా సంతానం కలవాణ్ణి. నిత్యము శ్రమించి జీవిస్తున్నాను. నన్ను కనికరించు" అంటాడు త్రిజటుడు.

అప్పుడు రాముడు విచిత్రంగా ఒకమాట చెబుతాడు. "త్రిజటుడా! ఒక పనిచేద్దాం. నీవు చేతిలోని కఱ్ఱను ఎంతదూరం విసురుతావో అంతవరకుగల ప్రదేశములో ఎన్నిగోవులు ఉంటాయో అవన్నీ నీకిస్తాను" అంటాడు.

త్రిజటుడు సంతోషపడ్డాడు. వస్త్రఖండాన్ని తీసి నడుముకు బిగించాడు. కఱ్ఱను చేతపట్టుకున్నాడు. ముందుకు వెనక్కి రెండుమూడుసార్లు దయ్యంపట్టిన వాడులా ఊగాడు.



చివరగా కఱ్ఱను తలపై వలయాకారంగా రెండుచుట్లు త్రిప్పి, బలమంతా వినియోగించి విసిరాడు. అతడు విసిరిన దండము సరయూనదిని దాటి, ఆవులున్న మందలో ఆబోతు దగ్గర పడింది. ఆ మధ్యనున్న గోవుల సమూహమునంతా త్రిజటునకిచ్చాడు రాముడు.

అసలిదంతా రాముడు ఎందుకు చేశాడు? హాస్యానికే చేశాడు. పరిహాసానికే చేశాడు. శక్తిహీనులుగా కనపడుతున్నా, ధనసంపాదనలో లేనిశక్తిని జనులు ఎలా వెలికితీస్తారో చూడాలని రాముడు

అభిప్రాయపడ్డాడు. అంతే. ఇలాంటి తమాషాలు మనంకూడా చేస్తూవుంటాం. రాముడు కూడా అదే చేశాడు. కానీ ఇక్కడ మనకు, రామునికి ఉండే వ్యత్యాసాన్ని మనం గ్రహించాలి.

గోవులను త్రిజటునకిచ్చిన పిమ్మట రాముడు త్రిజటుని ప్రాధేయపడతాడు. "త్రిజటుడా! నన్ను క్షమించు. నాపై కోపించకు. నేను ఇలాచేసి ఉండవలసింది కాదు. కేవలం పరిహాసానికి ఇలా చేశాను" అంటూ బ్రతిమాలుతాడు **(అభిసాన్త్వయన్)**.

తనచేత దానము గ్రహించిన పేదబ్రాహ్మణుని ప్రాధేయపడే ప్రేమమూర్తి రాముడు. అంతేగాదు. ఆ పేదబ్రాహ్మణుని, శ్రీకృష్ణుడు కుచేలుని ఆలింగనం చేసుకున్నట్లు, శ్రీరాముడు కౌగలించుకుంటాడు **(పరిష్వజ్య)**.

"త్రిజటుడా! నీవు గొప్ప పరాక్రమవంతుడివి. అది చూడాలనే నేను నీకు పరీక్షపెట్టాను. ఇంకేమైనా కోరికలుంటే అడుగు. నా ధనమంతా మీలాంటి మంచివారి కొరకే;" అంటాడు రాముడు.

ఇదీ రాముని వ్యక్తిత్వం. కొన్ని సమయాల్లో మనం ఎలాగైతే కొందరిని పరిహసిస్తూ ఉంటామో, రాముడుకూడా త్రిజటుని విషయంలో అలాగే చేశాడు.

మనం ఎవరినైనా పరిహసిస్తే మళ్ళీ దానిని పట్టించుకోము. మరచిపోతాము. కానీ రాముడు తాను చేసింది తప్పని గ్రహిస్తాడు. చేసిన తప్పిదానికి పెద్ద చిన్న అనే తారతమ్యం లేకుండా, రాజు పేద యనే తేడాను చూడకుండా తనను క్షమించమని త్రిజటుని ప్రాధేయపడతాడు. తాను పరిహాసానికి అలా చేసినట్లు బహిరంగంగా ఒప్పుకుంటాడు. ఇదే రామునికి మనకు తేడా!

ఆకస్మికంగా, ఉన్నపళంగా రాజ్యాభిషేకము ఆగి, వనవాసానికి వెళ్తున్న దారుణ పరిస్థితులలోగూడా రాముడు త్రిజటునితో హాసంతో, పరిహాసంతో, మందహాసంతో వ్యవహరించాడంటే, అరణ్యావాసముయొక్క ప్రభావంగానీ, ఆగిపోయిన రాజ్యాభిషేకము యొక్క ప్రభావంగాని రాముని మనసుపై ఉందేమో విజ్ఞులు ఆలోచించాలి. అదే రాముని విశిష్టత.

## చివరి చూపులు

ద్విజులను, మిత్రులను, భృత్యులను, యాచకులను దానాదుల ద్వారా తృప్తిపరచిన సీతారామలక్ష్మణులు చివరగ దశరథుని దర్శించుటకు బయలుదేరారు.

పట్టాభిషేకమును చూచుటకు వచ్చిన ప్రజలతో నగరమంతా క్రిక్కిరిసి ఉంది. రాముడు పాదచారియై వీధులగుండా వెళ్తుండగా రాముని చూచుటకు జనులు పెద్దపెద్ద భవనాలను, మేడల శిఖరాలను ఎక్కారు. పాదచారియై వెళ్తున్న రామునిచూచి దుఃఖాన్ని ఆపుకోలేక పోయిన ప్రజలు పలుపలువిధాల చెప్పుకుంటున్నారు.

"రాముడు బయలుదేరితే ఆయనవెనుక చతురంగసైన్యము వెళ్తూవుండేది. ఈ రోజు రాముడు ఒంటరిగ వెళ్తుండగా ఆయనవెంట సీతాలక్ష్మణులు నడుస్తున్నారు.

"రాజు రాముడికి చాలా అన్యాయం చేశాడు. అయినా ధర్మాత్ముడుగనుక రాముడు తండ్రి ఆజ్ఞను పాలిస్తూ అరణ్యాలకు వెళ్తున్నాడు. పూర్వము సీతమ్మను దర్శించడం



సామాన్యులకు సాధ్యమయ్యేది కాదు. అట్టి సుకుమారిని ఈనాడు రాజవీధుల్లో అందరూ చూస్తున్నారు.

"ఈ రాజును భూతమేదో పట్టుకోనుంది. లేకుంటే రాముడులాంటి సుపుత్రుని ఊరినుండి ఎవరైనా వెడలగొడ్తారా? రాముడు లేని రాజ్యంలో మనం మాత్రం ఎందుకు? మనం కూడా భార్యాపుత్రులతో కలిసి అయోధ్యనువదలి లక్ష్మణునివలె రాముని అనుసరించి వెళ్తాము.

"ధర్మాత్ముడైన రామునివెంట మనం వెళ్ళగానే ఇళ్ళన్నీ కరువుప్రాంతంవలె కాంతిహీనమవుతాయి. వీధులు తుడిచేవారుండరు. ఎలుకలు ఇళ్ళన్నీపాడుచేస్తాయి. ఊరంతా పాములు చేరుతాయి. పుట్టలు పెడతాయి. ఎక్కడచూసినా కూలిన ఇళ్ళు, పడిన గోడలు, పగిలిన కుండలే కనిపిస్తాయి.

**"వనం నగరమే వాస్తు"** రాముడు వెళ్తున్నాడు గనుక వనమే నగరంగా మారిపోతుంది. ఈ అయోధ్య అడవిగా మారిపోతుంది. మనమంతా రామునివెంట వెళ్దాం పదండి. మనల్నిచూచి సర్పాలు బిలములను, పక్షులు వృక్షములను, మృగాలు గుహలను వదలిపోతాయి. అవన్నీవచ్చి అయోధ్యలో చేరిపోతాయి.

"ఇకమీదట కైకేయి పశుపక్ష్యాదుల్ని, క్రిమికీటకాదుల్ని, క్రూరమృగాల్ని పరిపాలిస్తుంది. మనమంతా వనంలో రాముని సన్నిధిలో హాయిగా జీవిద్దాం;" ఇలా జనులు మాట్లాడుతున్నా రాముడు నిర్మలంగా, నిర్వికారంగా ప్రశాంతవదనుడై రాజగృహమున ప్రవేశించాడు. అక్కడ దీనుడై నిలబడియున్న సుమంత్రుని చూశాడు.

రామునిచూడగనే రాజభవనములోని వారందరు దుఃఖాక్రాంతులయ్యారు. కానీ రాముడు ఏమాత్రము చలించకపోవుటేగాక, వారిని చూచి మందహాసం చిందించాడు. దుఃఖిస్తూ నిలబడియున్న సుమంత్రుని పిలిచి తనరాకను తండ్రికి తెలుపవలసిందిగా కోరాడు.

సుమంత్రుడు లోనికి వెళ్ళి, గ్రహణంపట్టిన సూర్యునిలా, నివురుకప్పిన నిప్పులా, నీరులేని సరస్సులా కాంతిహీనుడైఉన్న దశరథుని చూశాడు.

సుమంత్రుడు రాజుకు నమస్కరించి, "మహారాజా! మానవశ్రేష్ఠుడైన శ్రీరాముడు తన ధనమంతయు దానముచేసి, అందరిని వీడ్కొలిపి మీ దర్శనానికై ద్వారమువద్ద వేచియున్నాడు;" అన్నాడు. రాజుగారి ఆజ్ఞమేరకు సుమంత్రుడు సీతారామలక్ష్మణులను లోనికి తీసికొనివెళ్ళాడు.

నమస్కరిస్తూ లోనికి ప్రవేశిస్తున్న రామునిచూడగనే దశరథుడు వెంటనే దుఃఖితుడై, ఆసనమునుండి లేచి, రామునికి ఎదురుగ పరుగెత్తి, రాముని చేరకముందే నేలపైబడి మూర్ఛిల్లాడు.

రామలక్ష్మణులు పరుగెత్తి రాజును సమీపించారు. అదే సమయానికి "అయ్యో - రామ- ఎంతకష్టం తండ్రీ!" అంటూ అంతఃపుర స్త్రీల ఆర్తనాదము విన్పించింది. సీతారామలక్ష్మణులు దశరథుని బాహువులపైకి తీసికొని దుఃఖిస్తూ ఆసనంపై కూర్చోబెట్టారు.

కొద్దిక్షణాలు ఆగి తరువాత రాముడు రాజుగారితో ఇలా పలికాడు. "మహారాజా! నేను దండకారణ్యానికి బయలుదేరి వెళ్తున్నాను. నన్ను చల్లగ దీవించండి. నాతోపాటు లక్ష్మణుడు,

సీత కూడా వస్తున్నారు. వద్దని నేనెంత వారించినా వారు వినడంలేదు. వారికి కూడా ఆజ్ఞ ప్రసాదించండి;" అన్నాడు రాముడు.

రాముని మాటలువిన్న దశరథుడు రామునితో ఇలా పలికాడు. "రామా! పూర్వము నేనిచ్చిన వరాలను ముందు పెట్టుకొని కైకేయి నన్ను మోసంచేసింది. రామా! నన్ను నిగ్రహించి నీవు రాజ్యాన్ని ఆక్రమించుకో" అన్నాడు దశరథుడు.

రాముడు దశరథునికి నమస్కరించి, "మహారాజా! ఈ రాజ్యాన్ని మీరు పరిపాలించాలి. నేను అరణ్యములో నివసిస్తాను. నావల్ల మీరు అసత్యవాది కాకూడదు. పద్నాలుగు సంవత్సరాల వనవాసం పూర్తికాగానే నేను తిరిగివచ్చి మీ పాదాలకు నమస్కరిస్తాను."

ఈలోగా కైకేయి రాజుగారి సమీపంగాచేరి 'రాముణ్ణి త్వరగా పంపేయండి' అని రహస్యంగా పలకనారంభించింది. అపుడు దశరథుడు తీవ్రంగా దుఃఖిస్తూ, "నాయనా! నీకు శ్రేయస్సు కలుగుగాక! నీ మార్గము మంగళకరమై, శోకరహితమై, నిర్భయమై ఉండుగాక! నీవు సత్యసంధుడవు. ధర్మ నిరతుడవు. నీ బుద్ధిని మరల్చుట నాకు శక్యముగాదు.

"కుమారా! ఈ ఒక్కరాత్రి ఉండి రేపు వెళ్ళిపో. ఈ రోజంతా నిన్నుచూసుకొని తృప్తి చెందుతాను. నాయనా! నా మేలుగోరి అందరిని విడచి అడవికి వెళ్తున్నావు. ఈ త్యాగము అనన్యసామాన్యము.

"రామా! నీవు అరణ్యవాసము వెళ్ళడము నాకు సుతరామూ ఇష్టంలేదు. సత్యముపై ప్రమాణంచేసి చెబుతున్నాను. నివురుగప్పిన నిప్పులా వున్న ఈ కైకేయి నన్ను వంచించింది.

"వంశచరిత్రను మంటగలిపి కైకేయి నన్ను మోసం చేసింది. ఈ వంచననుండి నన్ను కాపాడేందుకు నీవు శ్రమిస్తున్నావు;" అని తండ్రి విలపిస్తుండగా రామలక్ష్మణులుకూడా కంట తడిబెట్టారు.

రాముడు తండ్రికి నమస్కరిస్తూ, "పూజ్యులైన తండ్రీ! నన్ను క్షమించండి. ఈనాడు ఉండినా రేపు నేను వెళ్ళవలసిందే. నేడు వెళ్ళడమే మంచిదని భావిస్తున్నాను. నేను అయోధ్యను విడచి వెళ్తున్నాను. దీనిని నా తమ్ముడు భరతునికివ్వండి.

"నాన్నా! మీరు విచారించకండి. ప్రజల కన్నీటిని తుడిచే ప్రభువులు మీరు. మీరు కన్నీళ్ళు కార్చగూడదు. నదులకు గతియైన సాగరము క్షోభిస్తుందా?

"తండ్రీ! నన్ను వనవాసానికి వెళ్ళమని కైకేయి కోరింది. నేను అంగీకరించాను. సత్యమును పాలించుటే మన వంశధర్మము. నిర్దోషివైన రాజా! తండ్రిమాటను నిలబెట్టుటయే ఈనాడు నా ముందున్న ఏకైక ధర్మము. అది నాకు ప్రాణంకంటె ప్రియమైనది. నన్ను క్షమించండి. ఇక నేను ఒక్కక్షణమైనా నగరంలో ఉండను," అని రాముడు గంభీరంగా పలికాడు.

ఆ మాటలువిన్న దశరథుడు తీవ్ర దుఃఖంతో స్పృహతప్పి పడిపోయాడు. కైకేయి తప్ప మిగిలిన రాణులందరూ పెద్దగా రోదించారు. సుమంత్రుడుకూడా విలపిస్తూ క్రిందపడ్డాడు. భవనమంతా హాహాకారాలతో, ఏడుపులతో ప్రతిధ్వనించింది.

ఒక్క బీజమువల్ల ఉత్పన్నమైన చెట్టులో ఎన్ని కాయలు? ఒక్క వ్యక్తి స్వార్థంవల్ల జనించిన కష్టంలో ఎందరికి కన్నీళ్ళు?

జీవిత చదరంగంలో చెడుకు ఓటమి లేదా?



# కఠిన శిలలు కరుగుతాయా?

సుమంత్రుడు నిట్టూర్పునువిడుస్తూ, అశ్రుపూరితనయనాలతో నిలబడ్డాడు. దంతములు కొరుకుచు, చేతినిచేతిలోవేసి పిండుకొంటూ, క్రుద్ధుడై, కైకేయి హృదయాన్ని కంపింప చేయుచు, వజ్రాయుధమువంటి మాటలతో దశరథుని సమక్షంలో కైకేయిని నిందించాడు.

"కైకేయీ! ధర్మాత్ముడు, ప్రభువు అయిన దశరథమహారాజునే నీవు తృణీకరించావు. ఈ లోకంలో నీవు ఏ పనైనా చేయగలవు.

"ఇంద్రునివలె దశరథుడు అజేయుడు. పర్వతమువలె ధీరుడు. సాగరునివలె క్షోభ నెరుగనివాడు. అట్టి భర్తను నీ దుష్కర్మలచే బాధిస్తున్నావు. వధిస్తున్నావు. కులనాశానికి కూడా సిద్ధపడ్డావు.

"రాణీ! స్త్రీకి కోటిమంది పుత్రులకంటె భర్త అధికుడు. వంశాచారము ననుసరించి రాముడు రాజు కావాలి. వంశగౌరవాన్ని కాలదన్ని భరతుని రాజు చేయాలని యత్నిస్తున్నావు.

"భరతుడు రాజు కావచ్చు. కానీ మేమంతా రాముడున్నచోటే ఉంటాము. ఈ రాజ్యములో సజ్జనులు మిగలరు. జనులులేని రాజ్యాన్ని ఏమిచేసుకుంటావు?

"ఇంత కర్కశంగా నీవు ప్రవర్తిస్తూవుంటే భూమి ఎందుకు బ్రద్దలుకాలేదు? నిన్ను తనలో ఎందుకు కలుపుకోలేదు?

**ఆమ్రం ఛిత్వా కుఠారేణ నిమ్బం పరిచరేత్తు యః**
**యశ్చైనం పయసా సించే న్నై వాస్య మధురో భవేత్**

"మామిడిచెట్టును గొడ్డలితో నరికి, వేపచెట్టుకు ఎవడైనా మేలుచేసినా, లేదా దానిని పాలతో తడిపినా అది తడిపినవానికికూడా తియ్యదనాన్ని పంచదు. మామిడివృక్షాల వంటి కౌసల్యాదులను త్యజించి, వేపమానులాంటి నీకు దశరథుడు ఎంతో ఉపకారము చేశాడు. అయినా నీ చేదు అతన్ని బాధిస్తూనేఉంది.

"ఇది నీకు తల్లిచాలు అని భావిస్తున్నాను. నీ తల్లికూడా ఇలాంటి స్వభావమే గలది. **"న హి నిమ్బాత్ స్రవేత్ క్షౌద్రమ్"** "వేపచెట్టునుండి తేనె కారుతుందా" అనే సామెత లోకంలో ఉంది.

"కైకేయీ! నీ తల్లికి ఎంత చెడ్డ పట్టుదలఉండేదో గతంలో మేమువినియున్నాము. ఆ లక్షణాలే నీకు సంక్రమించినట్లు ఈరోజు చూస్తున్నాము.

"మీ నాన్నగారికి ఒక మహాపురుషుడు వరములు ప్రసాదించాడు. వాటి ఫలితంగా సర్వప్రాణుల భాషలను మీనాన్న అర్థంచేసుకోగలడు.

"ఒకనాడు జృంభణమనే చీమ ఏదో మాట్లాడుచుండగా అది విని మీతండ్రి నవ్వాడు. అక్కడేవున్న మీతల్లి భర్త తనను పరిహసిస్తున్నాడేమోనని భావించి, అతని నవ్వుకు కారణం చెప్పమని బలవంతపెట్టింది.

"ఆ విషయం అంత ముఖ్యమైనది కాదని, అది చెబితే తనకు మరణం ప్రాప్తిస్తుందని మీతండ్రి భార్యతో చెప్పాడు. "నీవు జీవిస్తేజీవించు. లేదా మరణిస్తేమరణించు. నాకు మాత్రము చెప్పక తప్పదు," అని మీతల్లి మూర్ఖంగా పట్టుపట్టింది.

"మీతండ్రి వరప్రదానంచేసిన మహాపురుషుని సలహా కోరాడు. "రాజా! నీ భార్య గతించినా పరవాలేదు. నీవు మాత్రము ఆ రహస్యాన్ని చెప్పకు" అని మహాత్ముడు ప్రబోధించాడు. ఆ దివ్యాత్ముని మాటననుసరించి మీతండ్రి భార్యను తిరస్కరించి, తాను ఆనందంగా జీవిస్తున్నాడు.

"పాపదర్శినీ! నీవుకూడా నీ తల్లివలె మొండిపట్టుపట్టి దశరథుని ప్రాణాలతో క్రీడిస్తున్నావు. కొడుకులకు తండ్రిగుణాలు, కూతుళ్ళకు తల్లిగుణాలు వస్తాయనే మాట లోకంలో ఉంది. అది నిజమేనేమో అని నేడు నేను భావిస్తున్నాను.

"కైకేయీ! నీ తల్లివలె చెడుదారిలో చరించకు. రాజును సుఖపెట్టు. పాపాత్ముల మాటలు విని చెడిపోకు. రాజు సత్యసంధుడు. ఆయన నీకిచ్చిన మాటను వెనక్కితీసుకోడు. కనుక నీవే నీ అభిప్రాయాన్ని అవగాహనతో మార్చుకోవాలి.

"రామునికి పట్టాభిషేకము జరిగేలాచూడు. రాముడు తండ్రికిదూరమై అరణ్యాలకు వెళ్తే లోకం నిన్ను నిశితంగా విమర్శిస్తుంది. నీవు గొప్ప అపవాదానికి గురవుతావు. నామాట విను. మంచిరోజుల్ని దూరం చేసుకోకు;" అని నిష్ఠూరంగా, కఠినంగా, సహేతుకంగా పలికి చివరగ రెండుచేతులుజోడించి నమస్కరించాడు.

ఎంతో చెప్పాడు సుమంత్రుడు. కైకేయిలో ఇసుమంతైనా మార్పురాలేదు.
వానజల్లు పడినంత మాత్రాన గండుశిలలు కరుగుతాయా?
మంచిమాట విన్నంత మాత్రాన రాతిగుండెలు మారుతాయా?
నీరు పల్లంగా ప్రవహిస్తుంది. అగ్ని ఊర్ధ్వంగా పయనిస్తుంది. స్వభావాలంతేనేమో!

## వనవాసమా? విలాసమా?

బాష్పములు నిండిన నేత్రాలతో దశరథుడు సుమంత్రుని చూశాడు. బరువైన గుండెను భరించలేక, దీనుడై సుమంత్రునితో ఇలా పలికాడు.

"సుమంత్రా! రామునివెంట వెళ్ళుటకు చతురంగసైన్యమును సిద్ధంచెయ్యి. అధికమైన ధాన్యకోశాన్ని, అంతులేని ధనకోశాన్ని వెంటపంపు. శ్రేష్ఠమైన ఆయుధాల్ని, అరణ్యాలలో అలవాటుగా సంచరించే బోయవారినికూడా పంపు. భరతుడు రాజ్యమును పాలిస్తుంటాడు. అరణ్యంలో ఏ కొరత లేకుండా జీవించునట్లు రామునికి సమస్తమైన ఏర్పాట్లు చెయ్యి;" అన్నాడు దశరథమహారాజు.

రాజు మాటలు వినిన కైకేయి నిర్ఘాంతపోయింది. ఆమె ముఖం పాలిపోయింది. ముఖంలో భయం స్పష్టంగా తెలుస్తూ ఉంది. రాజువైపు తిరిగి కైకేయి ఇలా పలికింది.

"భలే! రాజా! చాలా చక్కగా సెలవిచ్చారు. జనాన్ని, ధనాన్ని రామునివెంట పంపి, భరతుని నిర్జనప్రదేశంలో నిర్ధనుడుగా ఉంచదలచారా? నిస్సారమైన రాజ్యం భరతునికి అక్కర్లేదు;" అని నిర్లజ్జయై పల్కింది.



కైకేయి మాటలకు దశరథమహారాజు క్రుద్ధుడయ్యాడు. "దుష్టురాలా! నన్ను పశువులాగ కాడికి బంధించావు. నేను బాధతో లాగుతున్ననూ, పైపెచ్చు ముల్లుకర్రతో పొడుస్తున్నావు. రాముణ్ణి వనవాసం చేయమన్నావేగాని ఏమీ పట్టుకెళ్ళకూడదని చెప్పావా?" అన్నాడు దశరథుడు.

రాజుకోపాన్ని చవిచూసిన కైకేయి రెట్టింపుక్రోధంతో గర్జించింది. "ఆపండి మీ మోసపు మాటలు. ఇది వనవాసమా! లేక విలాసమా! అరణ్యాన్ని అయోధ్యలామార్చి, అయోధ్యను వనంగాచేసి నా భరతునికి ఇవ్వాలని చూస్తున్నారా? అదేం కుదరదు. అరణ్యాల్లో వసించినపుడే అది అరణ్యవాసం అవుతుంది. అనవసరంగా ఆలోచించి ఆరోగ్యం పాడుచేసుకోకండి.

"రాజా! ఇది మీ వంశాచారమే. పూర్వం సగరుడనే రాజు తన జ్యేష్ఠపుత్రుడైన అసమంజునికి రాజ్యం లేకుండాచేసి వెళ్ళగొట్టాడు. ఈ రాముడుకూడా అలాగే వెళ్ళాలి" అన్నది కైకేయి.

"ఛీ....ఛీ.... ఎంత మాటన్నావే" అని ఒక్కమాటే అనగలిగాడు దశరథుడు. అక్కడున్న వారిలో కొందరు బాధపడ్డారు. కొందరు సిగ్గుపడ్డారు. కొందరు ఆశ్చర్యపడ్డారు. కానీ కైకేయి మాత్రం ఏమీ పడలేదు, నైతికంగా క్రిందపడడం తప్ప.

కైకేయి మాటలను అక్కడేవుండి వింటున్న సిద్ధార్థుడనే మంత్రి తీవ్రంగా చలించిపోయాడు. కైకేయిని నిరోధిస్తూ ఇలా పలికాడు.

"రాణీ! మీరు ప్రసంగించిన విషయం దుర్భరంగా ఉంది. అసమంజుడు చిన్నపిల్లలను సరయూనదిలో విసిరేసి ఆనందించేవాడు. ప్రజలందరూ రాజును ప్రతిఘటించారు. విషయాన్నంతా వివరించి ప్రజలు కావాలో,పుత్రుడు కావాలో తేల్చుకోమని జనులు ప్రభువును అర్థించారు. సగరుడు ధర్మవృక్షంక్రింద నిలబడి అసమంజుని బహిష్కరించాడు.

"పాపియైన అసమంజుని ధర్మాత్ముడైన సగరుడు యావజ్జీవ దేశబహిష్కారము గావించాడు. రాముడు ఏ పాపం చేశాడని అరణ్యాలకు పంపాలి? రాముడు నిర్దోషి. చంద్రుని వలె నిర్మలమైనవాడు. రామునియందు మీకేదైనా దోషము గోచరిస్తే చెప్పండి. ఆ తరువాత మీరు చెప్పినట్లే వనవాసమునకు పంపవచ్చు.

"నిర్దోషులను, ధర్మాత్ములను త్యజించుట మంచిపనిగాదు. అది అశుభమును కల్గిస్తుంది. ఇంద్రుని ఐశ్వర్యమును కూడా హరిస్తుంది. కైకేయీ! రాముని వైభవానికి నీవు అడ్డు నిలవకు. కోరి చెడ్డపేరు తెచ్చుకోకు;" అన్నాడు సచివుడైన సిద్ధార్థుడు.

సిద్ధార్థుని ధర్మవచనాలుకూడా కైకేయిని మార్చలేకపోయాయి. తన సంకల్పం జరిగి తీరాలి అన్నట్లు దృఢచిత్తంతో నిలబడింది కైకేయి. అదిచూచిన రాజుగారి ఆశాలత వాడిపోగా కైకేయితో ఇలా పలికాడు.

"పాపాత్మురాలా! సిద్ధార్థుని మాటలుకూడా నీవు పెడచెవినపెట్టావు. దుర్మార్గురాలివైన నీవు అధర్మమార్గాన సిగ్గువిడిచి చరిస్తున్నావేగాని మంచియేదో, చెడుయేదో గ్రహించలేక పోతున్నావు. నీ హితమునుగాని, నా హితమునుగాని ఊహించలేకపోతున్నావు. నేను ఈ రాజ్యాన్ని, ధనాన్ని, సుఖాన్ని విడచి రామునితో కలసి వనాలకు వెళ్తాను. నీవు, నీ కుమారుడు రాజ్యాన్ని పాలిస్తూ హాయిగా జీవించండి," అని చివరగ పలికాడు దశరథుడు.

అప్పుడుకూడా కైకేయి మనసుమార్చుకోలేదు.ధర్మాత్ముడైన రాముడు తక్షణ కర్తవ్యాన్ని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు.

## నారచీరలు

జరిగిందంతా చూసి, వినవలసిందంతా విన్నాక రాముడు దశరథునికి నమస్కరిస్తూ ఇలా పలికాడు.

"మహారాజా! నేను సర్వసంగపరిత్యాగిని. భోగత్యాగిని. వనాల్లో వసించే నాకు ఈ పరివారమెందుకు? ఈ ధనధాన్యాలెందుకు?

**యోహి దత్త్వా ద్విప శ్రేష్ఠం కక్ష్యాయాం కురుతే మనః**
**రజ్జుస్నేహేన కిం తస్య త్యజతః కుంజరోత్తమమ్**

"ఉత్తమమైన ఏనుగును ఇచ్చేసి, దానిని బంధించిన త్రాటిని ఎవడైనా ఆశిస్తాడా? శ్రేష్ఠమైన ఏనుగునే ఇచ్చేసినవానికి త్రాటియందు ఆసక్తి ఎందుకు?

"రాజా! నాకు కూడా ఈ భోగాలయందు, ధనరాశులయందు, సేనయందు ఆసక్తిలేదు. ఇవన్నీ భరతునికే. నాకు ధరించడానికి నారచీరలు మాత్రం చాలు. అడవిలో నివసించే నాకు కావలసినవి రెండే వస్తువులు. ఒకటి గునపము. రెండు గంప" అన్నాడు రాముడు.

ఈలోగా కైకేయి తానే స్వయంగా నారచీరలు పట్టుకొచ్చి "ఇదిగో.... కట్టుకో" అని రామునికిచ్చింది. రాముడు వాటిని తీసికొని, తాను ధరించియున్న సున్నితమైన వస్త్రమును త్యజించి నారబట్టలు ధరించాడు. లక్ష్మణుడుకూడా నారబట్టలు ధరించాడు.



కైకేయి సీతమ్మకు కూడా నారచీరలు అందించింది. వాటిని గ్రహిస్తూ వలను చూచిన జింకవలె సీతమ్మ భయపడింది. సదా పట్టు చీరలనే ధరించు సీతమ్మకు నారచీరలు ఎలా ధరించాలో తెలియలేదు. రామునివైపు తిరిగి, "మునులు ఈ నారచీరలనుఎట్లు ధరిస్తారో" అని పలికి కట్టుకోను చేతగాక అలా ఉండి పోయింది.

తనలోతాను ఊహించుకొని సీతమ్మ ఒక నారచీరను మెడపై వేసుకొని, మరొక దానిని చేతపట్టుకొని ఎలాధరించాలో తెలియక సిగ్గుపడుతూ నిలబడింది.

అది గ్రహించిన రాముడు సీతమ్మను సమీపించి ఆమె కట్టుకొనియున్న పట్టుచీర పైననే నారచీరను కట్టి చూపాడు. రాముడు సీతమ్మకు నారచీర కడుతూఉండగా అంతః పురములోని స్త్రీలందరు బిగ్గరగా విలపించారు.



"రామా! సీతను వనవాసానికి వెళ్ళమని ఎవరూ ఆజ్ఞాపించలేదుగదా! ధర్మమునందు ఆసక్తిగల నీవు ఎలాగూ వెళ్ళడానికే నిర్ణయించుకున్నావు. సీతమ్మను మావద్ద ఉంచి వెళ్ళు. నీవెంట లక్ష్మణుడు ఉంటాడు;" అని రాణులు చెబుతున్నా, రాముడు సీతకు నారచీర కట్టాడు.

సీతమ్మ నారచీరను ధరించుటను వసిష్ఠమహర్షి భరించలేకపోయాడు. కట్టుకోవద్దని సీతమ్మను వారించి, కైకేయివైపుతిరిగి ఇలా పలికాడు.

"దుర్బుద్ధీ! కైకా! అతిగా ప్రవర్తిస్తున్నావు. కులమును అపవిత్రం చేశావు. రాజును మోసం చేశావు. ఆచారవ్యవహారాల్ని కూడా మంట గలుపుతున్నావు.

"సీత వనాలకి ఎందుకు వెళ్ళాలి? ఆమె ఇక్కడే ఉంటుంది. అంతేగాదు. రాజ్యభారాన్ని వహిస్తుంది. భార్య భర్తకు ఆత్మవంటిది. రామునికి బదులుగ సీత రాజ్యాన్ని పరిపాలిస్తుంది.

"సీతకూడా వనాలకు వెళ్ళాలని నిశ్చయించుకుంటే ఆమెతోపాటు మేము కూడా వెళ్తాము. నగరమంతా రామునివెంట నడచి పోతుంది. భరతశత్రుఘ్నులు ఇక్కడ ఉంటారని భ్రమిస్తున్నావేమో! వారుకూడా నారచీరలు ధరించి అక్కడే ఉంటారు. నీవు ఒక్కదానివే ఇక్కడుండి చెట్లను పాలించవలసి వస్తుంది.

"భరతుడు వంశప్రతిష్ఠను కాపాడుతాడేగాని నీ పుత్రునిలా ప్రవర్తించడు. నీవు చెప్పినట్లు వినడు. కైకేయీ! రాముడు కదలగనే పశువులు, ఏనుగులు, గుఱ్ఱాలు, పక్షులు రామునివెంట నడుస్తుండగా, చెట్లు రామునివైపు తిరిగి చూడడాన్ని నీవు ఇప్పుడే చూడగలవు.

"నామాటవిను. సీతమ్మకు నారచీరలు తొలగించి చక్కని ఆభరణాలు ఇవ్వు. నీవు వనవాసమును కోరింది రామునికి మాత్రమే. సీత అలంకారములను, ఆభరణాలను ధరించి రామునితోపాటు వనంలో ఉంటుంది;" అని రాజగురువైన వసిష్ఠమహర్షి పలికాడు.

సీతమ్మ నారచీరలు ధరిస్తూ ఉండగా జనులందరూ "ఛీఛీ" అని దశరథుని నిందించారు. జనుల ఆర్తనాదాలు విన్న దశరథుడు జీవించాలనే ఆశనుకూడా విడిచాడు. దశరథుడు తెప్పరిల్లి కైకేయితో ఇలా పలికాడు.

'కైకేయీ! దుష్టురాలా! సీత నారచీరలు ధరించుటను నేను అంగీకరించను. సీత సుకుమారి. సుఖాలకు అలవాటుపడిన బాల. మాయలుమర్మాలు తెలియని బేల. ఆవిడ విషయంలో కూడా ఏమిటి నీగోల? జనకచక్రవర్తి కుమార్తె సన్యాసినివలె నారచీర ధరించడమా? దౌర్భాగ్యురాలా! సీత నీకు ఏమి అపకారం చేసింది? సీతను బాధిస్తే నీకు నరకమే ప్రాప్తిస్తుంది. నేను ఆజ్ఞాపిస్తున్నాను. సీత ఆభరణాలతో వెళ్తుంది" అని దుఃఖిస్తూ నేలపై వాలాడు దశరథుడు.

నేలపై కూర్చుని తలవంచుకొనియున్న దశరథునితో శ్రీరాముడు చివరగ ఇలా పలికాడు.

"మహారాజా! ధర్మాత్ముడా! నాతల్లి కౌసల్య వృద్ధురాలు. పవిత్రురాలు. ఏనాడు నిన్ను బాధించి ఎరుగదు. నేను దూరమగుటచే ఆమె దుఃఖసముద్రంలో మునిగిపోతుంది.

"మీ ఆదరణలో ఆమె నన్ను మరచి హాయిగా జీవించాలి. లేకుంటే ఆమె జీవిస్తుందనే నమ్మకం లేదు. ఆమె ప్రాణాలు ఇక్కడే ఉండేలా మీరు చూడాలి" అన్నాడు రాముడు.

శోకసంతప్తుడైన దశరథుడు తలఎత్తి రాముని చూడలేకపోయాడు. రామునితో పలుకుటకు అతని నోరు మూగపోయింది. తనలోతాను భాషించుకుంటున్నాడు దశరథుడు.

"నేను గతంలో ఎందరో బిడ్డలను తల్లిదండ్రులనుండి వేరుచేసి ఉంటాను. లేదా ప్రాణులను చంపి ఉంటాను. అందుకే ఈ ఆపద ఆగంతుకంగా వచ్చిపడిందని భావిస్తున్నాను.

"మరణకాలం రానిదే ఎవరికీ ప్రాణాలుపోవని భావిస్తున్నాను. కైకేయి ఇలా బాధిస్తున్నా, అగ్నితుల్యుడైన బిడ్డ నారచీరలు ధరించి అడవికి వెళ్తున్నా నేను మరణించకుండా బ్రతికే ఉన్నాను.

"స్వార్థపరురాలైన ఒక్క కైకేయి మూలంగా ఎందరు బాధపడుతున్నారు;" అని తనలో తాను మాట్లాడుకుంటూ "రామా!" అని ఒక్కసారి పలికి మాట్లాడలేక ఊరకున్నాడు దశరథుడు.

కొంతసేపటికి తేరుకుని దశరథుడు సుమంత్రునితో ఇలాపలికాడు. "సుమంత్రా! నీవు వెళ్ళి రథమును తీసికొనివచ్చి రాముని అరణ్యాలలో వదలిపెట్టు. సన్మార్గుడు, సుగుణవంతుడు అయిన బిడ్డను తల్లిదండ్రులు ఈనాడు వనవాసము పంపుతున్నారు. మంచిగా జీవించేవారికి ఫలం ఇదే కాబోలు" అని బరువుగా పలికాడు దశరథుడు.

సుమంత్రుడు వెళ్ళి రథమును తీసికొనివచ్చాడు. రామునకు నమస్కరించి "రథము సిద్ధంగాఉంది" అని పలికాడు. అమూల్యమైన వస్త్రములు, ఆభరణములు సీతమ్మకు ఇచ్చి పంపమని దశరథుడు కోశాధికారికి చెప్పాడు. రాజాజ్ఞ ప్రకారము అతడు వాటినన్నిటిని తీసికొనివచ్చి సీతమ్మకిచ్చాడు. సీతమ్మ వాటిని అలంకరించుకుంది.

ఈ దుర్భర, దారుణ పరిస్థితులలోగూడ దైన్యములేకుండా సంతోషంగా కన్పిస్తున్న సీతమ్మను కౌసల్య కౌగిలించుకొని శిరస్సుని మూర్కొనింది.

కౌసల్య సీతమ్మతో ఇలా పల్కింది. "అంతవరకు ఎంత సుఖపెట్టినా, ఎన్ని కోర్కెలు తీర్చినా, భర్త కష్టదశలో కాలూనగనే దుష్టరాండ్రు భర్తను లెక్క పెట్టరు. అవసరమైతే త్యజిస్తారు. ఇది దుష్టస్త్రీల స్వభావము.

"చెడుఆలోచనలుగల స్త్రీలకు శీలముండదు. వికృతంగా ప్రవర్తిస్తారు. అబద్ధాలు చెబుతారు. క్షణంలో భర్తపై ప్రేమను కోల్పోతారు. స్త్రీల హృదయం చంచలం. వారు కులము చూడరు. చేసిన మేలు గుర్తించరు. చదువును లెక్కపెట్టరు.

"కానీ, జానకీ! శీలవంతులు, సత్యమునందు విశ్వాసముగలవారు, ధర్మ మార్గమున చరించువారు, మనోనిగ్రహముగల స్థిరచిత్తులైన స్త్రీలకు ఒక్క భర్తే పరమదైవంగా తెలుస్తూ ఉంటాడు.

"నా కుమారుని నీవు బాధించకు. ధనవంతుడా? ధనహీనుడా? అని చూడకు. స్త్రీలకు పతియే ప్రత్యక్షదైవం" అని కౌసల్య పలికిన మాటలువిని సీతమ్మ ఇలా చెప్పింది.

"అత్తగారూ! మీరు చెప్పినట్లే ప్రవర్తిస్తాను. భర్తవిషయంలో ఎలా నడచుకోవాలో నాకు తెలుసు. నీవు పూజ్యురాలవు. నన్ను మరోలా భావించకు. చంద్రిక చంద్రుని విడువనట్లు నేను ధర్మమును విడువను.



**నా తన్త్రీ వాద్యతే వీణా నా చక్రో వర్తతే రథః**
**నా పతిః సుఖమేధేత యా స్యాదపి శతాత్మజా!**

"తీగలులేని వీణ మ్రోగదు. చక్రములేని రథము నడవదు. వందమంది కొడుకులున్నా భర్తలేని స్త్రీ సుఖంగా జీవించలేదు.

"తల్లిగాని, తండ్రిగాని, బిడ్డగాని స్త్రీకి ఇవ్వగలిగింది పరిమితమే. స్త్రీకి సమస్త కోరికలు ఫలించేది భర్తదగ్గరే. అట్టి భర్తను ఏ స్త్రీ గౌరవించదు?

"పతియే దైవమని నమ్మినదానను. ఇలాంటి ఎన్నో ధర్మాలను శ్రవణంచేసిన దానను. నా భర్తను నేనెలా కష్టపెడతాను?" అని సీతమ్మ పలికిన మాటలు విన్న కౌసల్య ఆనందంతో పరవశించి అశ్రువులురాల్చింది.

రాముడు తల్లిని సమీపించి ఆమెకు ప్రదక్షిణము చేసి, నమస్కరించి, "తల్లీ! దుఃఖించకు. నాన్నగారిని కనిపెట్టుకొనివుండు. వనవాసము తొందరగా అయిపోతుంది. అదొక కలలా కరిగిపోతుంది. నేను వెంటనే వచ్చి నీ పాదాలకు నమస్కరిస్తాను;" అనిపలికి కౌసల్యవలె దుఃఖిస్తున్న అంతఃపుర స్త్రీలను,రాణులను చూచి, నమస్కరించి ధర్మవాక్యాన్ని పలికాడు.

**సంవాసా త్పరుషం కించి దజ్ఞానా ద్వాపి యత్కృతమ్**
**తన్మే సముప జానీత సర్వాశ్చా మన్త్ర యామివః**

"కలిసి జీవించుటవలన గాని, అజ్ఞానమువలన గాని నేనేదైనా అపరాధము చేసిఉంటే నన్ను మనసారా క్షమించండి.నాకు సెలవు ప్రసాదించండి" అని బరువుగా పలికాడు రాముడు.

రాముడు అలా పలుకగనే రాణివాసపు స్త్రీలు, అంతఃపురములోని వారందరు క్రౌంచ పక్షులు అరచినట్లు దుఃఖించారు. ఇంతవరకు స్వస్తివచనాలతో, మంగళవాద్యాలతో మారుమ్రోగిన రాజభవనము రోదనలతో దద్దరిల్లింది.

## ప్రవాసానికి ప్రయాణం

సీతారామలక్ష్మణులు రాజుగారి పాదములను స్పృశించి, నమస్కరించి ప్రదక్షిణము చేశారు. కౌసల్యకు నమస్కరించారు. లక్ష్మణుడు తల్లులకు నమస్కరిస్తూ సుమిత్రపాదాలను స్పృశించాడు. సుమిత్ర దుఃఖిస్తూ లక్ష్మణునిశిరస్సును మూర్కొని, ఇలా హితవచనాలు పల్కింది.

"నాయనా! బ్రహ్మదేవుడు నిన్ను వనవాసానికే సృష్టించాడు. క్షణంకూడా విడువకుండా రాముని రక్షిస్తూ వుండు. కుమారా! కష్టాల్లోవున్నా, సుఖాల్లోవున్నా రాముడే నీకు పరమగతియని మరచిపోకు. పెద్దన్న తండ్రిలాంటివాడు. అన్న ననుసరించుట శ్రేష్ఠమైన ధర్మము. ఆనందంగా వెళ్ళిరా.

**రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్**
**అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్**

"రాముడే దశరథుడని భావించు. సీతే నేనని సంభావించు. అరణ్యమే అయోధ్యయని గ్రహించు. సుఖంగా వెళ్ళిరా నాయనా!" అన్నది జ్ఞానమయి సుమిత్ర.

తనకుమారుని సుఖానికి రాముని వనవాసం పంపుతున్నది కైకేయి. రాముని సుఖాన్ని వాంఛించి తనబిడ్డను ఆశీర్వదించి అరణ్యానికి పంపుతున్నది సుమిత్ర. ఇద్దరూ దశరథునికి భార్యలే. కౌసల్యకు సవతులే. రామునికి సవతితల్లులే. సందర్భాలు, సమయాలే సంస్కారాల్ని వెలికితీస్తాయి.

భావార్థ రామాయణంలో అయోధ్యాకాండమును ప్రారంభిస్తూ సంత్ ఏకనాథ్ మహరాజ్ ఒక చక్కనివిషయాన్ని చెబుతారు.

**కౌసల్య తే సువిద్య**
**సుమిత్రా తే శుద్ధమేధా**
**కైకేయి తే అతి అవిద్యా**
**మంథర కువిద్య తీపాసీ**

కౌసల్య సువిద్య. సుమిత్ర శుద్ధవిద్య. కైకేయి అతి అవిద్య. మంథర కువిద్య.

సుమంత్రుడు రాముని సమీపించి, "రామా! నీకు క్షేమమగుగాక! రథమును అధిరోహించు. ఎక్కడికి తీసుకెళ్ళమని ఆజ్ఞాపిస్తావో అక్కడికి తీసికొనిపోతాను.

సీత రథమునెక్కింది. రామలక్ష్మణులుకూడా ఎక్కారు. సీతారామలక్ష్మణులు రథమును అధిరోహించగనే నగరమంతా శోకసముద్రంలా తయారైంది. ప్రజలంతా నిర్బలులై, దుర్బలులైనట్లు కనిపించారు.

ఏనుగులు మదించి ఘీంకరించాయి. గుఱ్ఱములు బిగ్గరగ సకిలించాయి. పట్టణంలోని ప్రజలందరు ఎండకు బాధపడువారు ఛాయవైపు పరుగిడునట్లు, దప్పికగొన్నవారు నదివైపుపోవునట్లు రామునివైపు పరుగెత్తారు. జనులు పలుపలువిధాల మాట్లాడుతున్నారు.



"సారథీ! కళ్ళెములను మెల్లగాలాగు. రథాన్ని మెల్లగానడుపు. మేము రాముని ముఖారవిందాన్ని చూడాలి. ఇక మేమెప్పుడు చూస్తాము మా రాముణ్ణి?" అని కొందరు,

"దేవుడులాంటిబిడ్డ అరణ్యానికి పోతున్నా కౌసల్య జీవించేవుంది. ఆమె గుండె బ్రద్దలు కాలేదు. అది ఇనుప గుండె ఏమో?" అని మరికొందరు,

**కృతకృత్యాహి వైదేహీ ఛాయే వానుగతా పతిమ్**

"జానకి కృతకృత్యురాలు. భర్తను ఛాయవలె అనుసరిస్తున్నది" అని ఆవైపు కొందరు,

పాణిగ్రహణము సమయాన జనకపురిలో జనకుడు పలికిన మాటనే జనులు పలుకుతున్నారు.

"ఓ లక్ష్మణా! ఓ లక్ష్మణా! ఇటుచూడు. నీ జన్మ ధన్యం. నీ అదృష్టమే అదృష్టం. దేవుడైన అన్నకు సేవచేస్తున్నావు. చిరంజీవిగా వర్ధిల్లు" అని ఈవైపు కొందరు,



ఈవిధంగా అయోధ్యాపురివాసులు రోదిస్తూ, కన్నీరుకార్చుతూ రాముని అనుసరిస్తున్నారు.

"నా రాముణ్ణి చూస్తాను. నా రాముణ్ణి చూస్తాను," అని శోకార్తులైన రాణులతో కలసి దశరథుడు బయటకువచ్చాడు. దశరథుడు చక్కని ప్రకాశముకలవాడైనా, ఆసమయంలో గ్రహణంపట్టిన చంద్రునిలా కనిపిస్తున్నాడు.

రాముడు రథంపై ధీరుడై శోభిస్తున్నాడు. **"సూతం త్వరితం వాహ్యతామ్"** "తొందరగా నడిపించు" అని సూతుని ఆదేశించాడు. **"తిష్ఠేతి"** "ఆగు" అని ప్రజలు సూతుని ఆదేశించారు. పోవాలో, నిలవాలో సూతునికి బోధపడలేదు.

రాముడు బయలుదేరుచుండగా, జనుల తొక్కిడికి రాజవీధిలో రేగిన దుమ్ము వారు కార్చే కన్నీటికి అణగిపోయింది. కొందరు బిగ్గరగా ఏడుస్తున్నారు. కొందరు "అయ్యో - అయ్యో - వెళ్తున్నాడు - రాముడు వెళ్తున్నాడు" అని అరుస్తున్నారు. మరికొందరు వీధుల్లోనే పడి మూర్ఛపోతున్నారు.

చేపల తాకిడికి చలించిన పద్మములనుండి జలబిందువులు రాలినట్లు, స్త్రీల నేత్రాల నుండి కన్నీళ్ళు రాలుతున్నాయి.

ఈవిధంగా క్షోభకు గురియై విలపిస్తున్న పౌరులనుచూచి దుఃఖితుడైన దశరథుడు నిలబడలేక మొదలునరికిన చెట్టులాగా పడిపోయాడు. అదిచూచి "అయ్యో! రామా! రాజుగారు" అంటూ కొందరు, "అయ్యో! రామమాతా! రాజుగారు" అంటూ మరికొందరు అరచిన అరుపులు రాముని చెవికిచేరాయి.

రాముడు వెనక్కి తిరిగి చూశాడు. దుఃఖిస్తూ తనవెంట వస్తున్న తల్లిదండ్రులు కన్పించారు. పాశముచే బంధించబడిన గుర్రపుపిల్ల తనతల్లిని సరిగ చూడజాలనట్లు, ధర్మపాశబద్ధుడైన రాముడు తల్లిదండ్రులను సరిగ చూడలేక ఓరకంట మాత్రమే చూశాడు.

సదా సుఖాలకే అలవాటుపడ్డవారు, దుఃఖంతెలియనివారు అయిన తల్లిదండ్రులు కాలినడకతో నడచి వస్తూవుండటం చూసి సారథివైపు తిరిగి, **"శీఘ్రం యాహి"** "తొందరగా వెళ్ళు" అన్నాడు రాముడు. తల్లిదండ్రుల దుఃఖాన్ని చూడలేక అంకుశముచే పీడింపబడిన ఏనుగులాగ పరితపించిపోయాడు రాముడు.

లేగదూడయందు ప్రేమగల ఆవు ఇంటికి తిరిగివచ్చి, మరల పాశబద్ధమైన లేగదూడవైపే పరుగెత్తునట్లు కౌసల్య రామునివైపు పరుగెత్తింది. సీతారామలక్ష్మణులకై కన్నీరు కార్చుతూ, నాట్యము చేస్తున్నట్లు అప్రయత్నంగా అటూ ఇటూ ఊగిపోతూ, "రామా! లక్ష్మణా! సీతా!" అని అరుస్తూ వెంబడిస్తున్న కౌసల్యను రాముడు మాటిమాటికి చూశాడు.

ఈలోగా దశరథుడు సుమంత్రుని ఉద్దేశించి **'తిష్ఠేతి'** 'ఆగు' అని అరచాడు. వెంటనే రాముడు **"యాహి యాహి"** "వెళ్ళు....వెళ్ళు" అన్నాడు. సుమంత్రునికి రెండుచక్రాల మధ్యపడి నలిగిపోతున్నట్లు అనిపించింది.

**నాశ్రౌషమితి రాజాన ముపాలబ్ధోఽపి వక్ష్యసి**
**చిరం దుఃఖస్య పాపిష్ఠ మితి రామస్త మబ్రవీత్**

"సుమంత్రా! ఈ దుఃఖాన్ని ఎక్కువసేపు నేను చూడలేను. "రథమును ఎందుకు ఆపలేదు?" అని రాజుగారు నిన్ను తిడితే, "నాకు వినిపించలేదు" అని చెప్పవచ్చు. పద" అన్నాడు రాముడు సుమంత్రునితో.

రాముడు అబద్ధము చెప్పమని సుమంత్రుని ప్రోత్సహించుటచేత శ్రీరాముడు అసత్యవంతుడు అని కొంతమంది విమర్శిస్తుంటారు.

ఒకవ్యక్తి అబద్ధంచెప్పాలని భావించినపుడు 1. అతనికి స్వలాభమన్నా ఉండాలి 2. తాను ఆపదనుండి విముక్తుడయ్యేందుకన్నా అయివుండాలి.

బాగా ఆలోచించండి. రాముని విషయంలో ఈ రెండు విషయాలు తారుమారై ఉన్నాయి. సుమంత్రునిచేత ఈమాట చెప్పించడముచేత రామునికి స్వలాభమేముంది? అయోధ్యలో ఉండాలని రాముడు భావించినపుడు స్వలాభమవుతుందేమోగాని, రాముడు వనాలకు తొందరగా వెళ్ళాలనే ప్రయత్నంలో సుమంత్రునిచేత ఇలా పలికిస్తున్నాడు.

ఇకపోతే, సుమంత్రుడు ఈమాట చెప్పినందువల్ల రామునికి ఆపద ఏమైనా తొలగుతుందా? ఆపదంటూవుంటే వనాలకు వెళ్ళడంవలన ఏర్పడుతుందేగాని, అయోధ్యలో ఉండడంవల్ల కాదు. తాను కష్టాల నెదుర్కొనేందుకు అబద్ధాలు చెప్పాల్సిన, చెప్పించవలసిన అవసరమేముంది?

దశరథుడు కైకేయికి వరాలిచ్చాడు. అనువైన సమయంలో రాజువద్దనుండి మాట తీసికొని వరాలను కోరింది కైకేయి. దశరథుని సత్యవ్రతము చెడకుండా ఉండాలంటే రాముడు అరణ్యాలకు వెళ్ళడంకన్నా మరోమార్గం లేదు. కనుక రాముడు త్యాగియై వనాలకు వెళ్తున్నాడు.

పుత్రప్రేమతో కుమిలిపోతున్న దశరథుడు రథాన్ని ఆపమని సుమంత్రునితో చెప్పున్నాడు. ఒకవేళ సుమంత్రుడు రథాన్ని పోనివ్వకుండా ఆపితే జరిగేదేమిటి? దశరథునికి ఒరిగే దేమిటి? రాముడు వనాలకు వెళ్ళకుండా నిలుస్తాడా? ఇవేవీ జరిగేవికావు. కాకపోతే, ఇంక కొంతసేపు ఏడవవచ్చు. అది రామునికి ఇష్టంలేదు. కనుకనే, **'చిరం దుఃఖస్య పాపిష్ఠం'** "దుర్భరమైన **(పాపిష్ఠమ్)** దుఃఖముయొక్క **(దుఃఖస్య)** చిరకాల దర్శనము **(చిరం)** సహింపరానిది" అని రాముడు సుమంత్రునితో అంటున్నాడు.

"ఈ దుఃఖాన్ని ఇలా కొనసాగించడం నాకు ఇష్టంలేదు" అని రాముడు సుమంత్రునితో స్పష్టంగా చెప్తున్నాడు. ఇది అబద్ధమవుతుందా? కొన్ని సందర్భాలలో వ్యాపారపద్దులవలె పదముయొక్కఅర్థం మాత్రమే గ్రహిస్తే సరిపోదు. ఆ పదాన్ని పలికిన వ్యక్తియొక్క మనోభావాల్ని కూడా పరిశీలించి సత్యనిర్దేశము చేయవలసి వుంటుంది.

ధర్మప్రభువైన దశరథుడు వరాలను కైకేయికి ఇచ్చి, పుత్రవాత్సల్యంతో ధర్మచ్యుతికి పాల్పడే ఆలోచనకు అవకాశమిస్తున్న తరుణంలో తన సౌఖ్యాన్ని బలిచేసి వనాలకేగుతున్న రామునిమాటల్లో అబద్ధాలను దర్శించే ప్రయత్నానికి అవకాశముందా? రాముడు పలికింది అసత్యం అవడానికి లేదు. ఇది సత్యానికి పట్టాభిషేకంచేసే సన్నివేశం. రాముడు సందర్భాన్ని దృష్టిలో ఉంచుకొని తమసానదీ తీరమునకూడా ప్రజల్ని వదలి వెళ్ళేటప్పుడు సుమంత్రునితో ఇలాగే చెబుతాడు. ఆ విషయాన్ని అక్కడ వివరిస్తాను.



సుమంత్రుడు రాముని ఆజ్ఞను శిరసావహించి, గుఱ్ఱాలు పరుగెత్తుతున్నా వాటిని ఇంకా వేగంగా తోలాడు. జనులంతా రామునికి నమస్కరించి, రథము కనిపించనంతవరకు చూచి వెనుదిరిగారు. కానీ వారి మనసులుమాత్రం వెనుదిరగలేదు. వారి కన్నీళ్ళు ఆగలేదు.

**యమిచ్ఛే త్పునరా యాన్తం నైనం దూరమను వ్రజేత్**

"ఎవరు తిరిగిరావాలని మనం కోరుకుంటామో వారిని ఎక్కువదూరం సాగనంప కూడదు" అని మంత్రులు దశరథునితో పలికారు.

దశరథుని ముఖం వాడిపోయింది. శరీరమంతా చెమటలుపోశాయి. మంత్రులు అలా చెప్పగానే కాలు ముందుకు కదపకుండా రాముడు వెళ్తున్న రథాన్ని రెప్పవేయకుండా చూస్తూ నిలబడిపోయాడు. రథం కనుమరుగైపోయింది. కౌసల్యాదశరథులకు ప్రపంచమంతా శూన్యంగా గోచరించింది.

దశరథుని ఆశలు అడియాసలయ్యాయి. అంతా శూన్యంగా గోచరిస్తూవుంది. పాదాల నంటి ప్రార్థించినా కైకేయి దయచూపలేదు. రాముడుకూడా నిర్దయుడై వెళ్ళిపోతున్నాడా? పాపమెవరిది? తాపమెవరికి? పరితాపమెవరికి? దశరథుని హృదయపరితాపాన్ని వివరిస్తూ తనను కరుణించమని త్యాగరాజస్వామి కీర్తిస్తారు.

**రామచంద్ర నీదయ ఏల రాదయా ॥**

**కాననంబు తాపమో - కైకమీద కోపమో**

**నేను చేయు పాపమో - నీకు శక్తి లోపమో ॥**

**ఆడదన్నరోసమో - అలనా దుపాసమో**

**మేడలేని వాసమో - మేము సేయు దోసమో ॥**

**కల్లనైన నేయ మా - కంటె నీకు హేయమా**

**తల్లడిల్ల న్యాయమా - త్యాగరాజ గేయమా!**

అరణ్యానికి వెళ్ళవద్దని ఎంతప్రాధేయపడినా రాముడు వినలేదని బాధపడుతూ, అలా నిర్దయకు కారణమేమిటి అని దశరథుడు ప్రశ్నలవర్షం కురిపిస్తున్నాడు.

వనవాసము వెళ్ళమని చెప్పిన మాటవలన ఏర్పడిన తాపమా? ఈ దుర్భర సన్నివేశమును కల్పించిన కైకేయిమీద కోపమా? గతంలో చేసిన పాపమా? ఏ బిడ్డనైనా వారి తల్లిదండ్రుల నుండి వేరుచేసిన పాపమేదైనా ఉన్నదేమో! లేక,

ధర్మానికి విరుద్ధంగా చరించలేని నీ శక్తి లోపమా? కైకేయి దారుణవచనాలకు రోషం వచ్చిందా? లేక నీవు పురుషాకృతిలో వున్న స్త్రీవని తెలియక మానాన్న నన్ను నీకిచ్చాడని సీతమ్మ పలికిన కోపవచనాలకు రోషమొచ్చిందా?

యౌవరాజ్యాభిషేకానికి ముందురాత్రి ఉపవాసంచేయుమని చెప్పుట జరిగింది. ఉపవాసము చేయించి రాజ్యమునివ్వకుండా వనవాసము పంపుతున్నందుకు కోపమా?

అంతఃపురములో శయనించువానిని అడవులకు పంపుతున్నామనా? లేక మేము ఇంతవరకు చేసిన దోషాలన్నీ అడ్డు తగిలినవా? అని దశరథుడు రామదర్శనానికి తల్లడిల్లి పోతున్నట్లు త్యాగరాజస్వామి రామదర్శనానికి తపించిపోతున్నాడు.

## అంతఃపురంలో అల్లకల్లోలం

రథాన్ని అధిరోహించి అందరికీ నమస్కరిస్తూ నిష్క్రమించిన శ్రీరాముని రూపం అందరి హృదయాలలో చెదరని చిత్రంగా నిలిచి పోయింది. అంత:పురములోని స్త్రీలందరూ దు:ఖార్తులై ఏడ్వసాగారు. వారంతా దీనులైనట్లు, దుర్బలులైనట్లు, గతిలేని వారైనట్లు మాట్లాడుకొంటున్నారు.

"అయ్యో! మేమంతా దిక్కులేని వారమయ్యాము. రాముడు ధర్మాత్ముడు.కోపము ఎరుగడు. కోపమొచ్చే పనులు చేయడు. కోప్పడేవారిని సముదాయించేవాడు. అందరి సుఖదు:ఖాలు తనవిగా భావించేవాడు.

"తన తల్లియైన కౌసల్యను ఎలా చూసుకొనేవాడో మమ్మల్నికూడా అలా చూసుకొనేవాడు. అలాంటి రాముని దశరథుడు అరణ్యానికి పంపాడు. ఈ రాజుకు బుద్ధిలేదు;" అంటూ బిగ్గరగా ఏడుస్తున్నారు అంత:పురములోని స్త్రీలు.

ఈ మాటలన్నీ దశరథునికి వినిపిస్తున్నాయి. అతని దు:ఖము రెట్టింపు అవుతూవుంది. ఊరంతా చిన్నబోయింది. బ్రాహ్మణులు అగ్నిహోత్రములు చేయలేదు. ఏ ఇంట్లోకూడా పొయ్యి మండలేదు. ప్రజలు పనులు విస్మరించారు. ఆకాశంలో సూర్యుడు కూడా కాంతిహీనంగా గోచరిస్తున్నాడు.

ఆవులు దూడలకు పాలివ్వడం మానేశాయి. మొదటిబిడ్డ పుట్టినా తల్లులు ఆనందించడం లేదు. అందరూ ఆహార విహారాలు విసర్జించారు. సంతోషించేవాడుగాని, దు:ఖించనివాడు గాని రాజవీధిలో ఒక్కడుకూడా కనిపించలేదు.

చెట్లు చలించడం మానేశాయి. అందువలన చల్లని గాలి ప్రజలకు కరువైంది. తల్లులకు బిడ్డల విషయంలో వాత్సల్యం ఉండకపోగా, భర్తలకు భార్యలయందు అనురాగం క్షీణించింది. సోదరులమధ్య ఐకమత్యము తగ్గింది. అందరూ రామునిగూర్చే ఎవరికివారుగా ఏకాంతంలో ఆలోచించుకుంటున్నారు. రాముని స్నేహితులు కృంగినవారై పడకలను ప్రాణాలవలె పట్టుకుని పడుకున్నారు.

రాముడులేని అయోధ్య ఇంద్రుని పోగొట్టుకొనిన అమరావతివలె కాంతిహీనమైంది. ఎక్కడ చూచినా భయశోకాదులే గోచరిస్తున్నాయి.

## దశరథుని దురవస్థ

దు:ఖాతిశయముచే దీనుడై విలపిస్తున్న దశరథుడు నిలవలేక క్రిందపడ్డాడు. అతనిని లేవదీయుటకు కౌసల్య కుడిప్రక్కకు రాగా భరతునియందు ప్రేమగల కైకేయి వామ పక్షాన నిలిచింది.

దశరథుడు కైకేయినిచూచి విలపిస్తూ "ఛీ! దుష్టురాలా! నా దేహాన్ని ముట్టకు. నీవు పాపివి. నీ ముఖం చూడడం నాకిష్టం లేదు. నీవు నా భార్యవుకావు. బంధువుకూడా కావు.



"నీ అనుచరులు కూడా నాకు ఏమీకారు. ధర్మాన్ని మంటగలిపి, ధనమునందే మక్కువ కలిగియున్న నిన్ను నేను త్యజిస్తున్నాను. అంతేగాదు. రాజ్యప్రాప్తి కలిగినందుకు భరతుడు సంతోషిస్తే అతడు నాకు తర్పణంకూడా ఇవ్వకూడదు;" అని రోదిస్తున్న మహారాజుని లేవదీసి, ఆసనముపై కూర్చోబెట్టి కౌసల్య తన అంత:పురానికి వెళ్ళింది.

వనవాసానికి వెళ్ళిన రాముని పదేపదే తలచుకొంటూ, బ్రహ్మహత్య చేసినవానివలె దశరథుడు భయపడుతున్నాడు. చేతితో నిప్పును స్పృశించినట్లు వ్యథ చెందుచున్నాడు. ఈలోగా రాముడు నగరాన్నిదాటాడనే వార్త దశరథుని చెవినిపడింది.

దుర్భరమైన దు:ఖంతో దశరథుడు కుమిలిపోతూ, "రామా! వెళ్ళావా తండ్రీ! అదిగో రాముడు వెళ్ళిన మార్గము! నా రాముని తీసికొనివెళ్ళిన అశ్వముల అడుగుజాడలు కనిపిస్తున్నాయిగాని, నా రాముడు కనిపించడే?

"ఇంతవరకు పట్టుపరుపులపై, మెత్తని తలగడాలపై శయనించిన రాముడు నేటినుండి చెట్టుక్రింద విశ్రమిస్తాడా? కర్రనో, రాయినో తలగడాగా పెట్టుకొని శయనిస్తాడా?

"ఆజానుబాహుడైన నా రాముడు అనాథుడులాగా అరణ్యంలో చరిస్తూవుంటే అడవి జనులు చూచి నిజంగా అనాథుడే అని భావిస్తారా?

"బాల్యమునుండి బాధలు తెలియని సీత అరణ్యంలో ఎలా చరిస్తుంది? ఎప్పుడూ సుఖాలకే అలవాటుపడిన జానకి ముండ్లబాటలో ఎలా పయనిస్తుంది?

"అడవులకు అలవాటుపడని సీత క్రూరమృగాల భయంకర అరవులకు భీతి చెందుతుందేమో! కలవరపడుతుందేమో!

"పాపదర్శినీ! కైకేయీ! నీ కడుపు చల్లారిందా? నీ వాంఛ నెరవేరిందా? ఇక అఘోరించు. వైధవ్యాన్నిపొంది వైభవంగా రాజ్యాన్ని పాలించు. రాముడు లేకుండా నేను జీవించ లేను;" అని పలికి సూర్యుడు మబ్బులలోనికి వెళ్ళినట్లు దశరథుడు లోనికి ప్రవేశించాడు. దు:ఖమేఘములచే ఆవరింపబడ్డాడు.

అయోధ్య జనశూన్యంగా గోచరిస్తూఉంది. ఎవరి బలవంతం లేకుండా అంగళ్ళను మూసేశారు. ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా చాకిరీవాళ్ళు వీధులుచిమ్మడం మానేశారు.

"నన్ను కౌసల్య మందిరానికి తీసికొనిపొండి. ఈ ఆరాటాన్ని నేను తట్టుకొని బ్రతకలేను. నాకు మరెక్కడా ఊరట లభించదు" అన్నాడు దశరథమహారాజు. ద్వారపాలకులు రాజును పట్టి తీసికొనివెళ్ళి కౌసల్య అంత:పురంలో పడుకోబెట్టారు. అయినా రాముడులేని ఆ గృహం దశరథునికి చంద్రుడులేని ఆకాశంలా తెలుస్తూవుంది.

ఆ గృహాన్ని చూచి పిడికెడంత గుండెలో దు:ఖకడలిని నింపుకొని "అయ్యో! రామా! నన్ను దూరం చేసేశావా? నాయనా! పద్నాలుగుసంవత్సరాల తరువాత జీవించి నిన్ను చూచువారే భాగ్యవంతులు. నేను అంతవరకు ఉండలేనే రామా!" అని విలపించాడు దశరథుడు.

దశరథుడు రోదిస్తూనే ఉన్నాడు. 'నాకేమి సంబంధంలేదు' అన్నట్లు రాత్రి గడచిపోతూనే వుంది. అర్ధరాత్రి అయింది. దశరథుడు రామమాతతో ఇలాపలికాడు.

"కౌసల్యా! నాచూపు రాముని వెంబడించి వెళ్ళింది. ఇంకా తిరిగి రాలేదు. నువ్వు నాకు సరిగా కన్పించడం లేదు. నీ చేత్తో నన్ను ముట్టుకో. నన్ను అలా పట్టుకో" అంటున్న రాజుయొక్క దురవస్థను చూచి కౌసల్య డగ్గుత్తికతో విలపించింది.

## క్రుంగిపోయిన కౌసల్య

కౌసల్య దుఃఖిస్తున్న దశరథునిచూచి కన్నీటిని వర్షిస్తూ ఇలా పలికింది.

"కైకేయి అనుకున్నది సాధించింది. సర్పములాగా వక్రమార్గానచరించే కైకేయి నా రాముడికి విషంపెట్టింది. ఇక కుబుసమువిడిచిన త్రాచులాగా ప్రవర్తించగలదు.

"రాముని వనవాసానికి పంపిన ఈ కైకేయి ఇక మీదట గృహంలో సంచరించే సర్పమే. ప్రతిక్షణమూ ఇక నన్ను కాటేసేందుకే ప్రయత్నిస్తూవుంటుంది.

"నా రాముణ్ణి ఆవిడకు సేవకుడుగా నియమించినా బాగుండేది. ఆవిడకి సేవచేస్తూ నగరంలో భిక్షాటనచేసి జీవించినా నాకళ్ళముందు మెదుల్తూ ఉండేవాడు.

"రాజా! ఆ దుష్టురాలి మాటలువిని నువ్వు రాముని క్రిందపడేశావు. దేవతల కివ్వవలసిన హవిర్భాగాలను రాక్షసులకిచ్చినట్లు రాముని రాజ్యాన్ని భరతుని కిచ్చావు.

"ఈపాటికి సీతాలక్ష్మణసమేతుడై రాముడు అరణ్యంలో ప్రవేశించిఉంటాడు. ఏ కష్టమూ తెలియని ఆ ముగ్గురిని కైకమాటలువిని అడవిపాల్జేశావు. భయంకరమైన అరణ్యంలో వాళ్ళెలా వున్నారో?

"ఆనందంగా భోగాలను అనుభవించాల్సిన కాలంలో ఆవేదనతో బాధలను ఆరగించమని వాళ్ళను అడవికి పంపావు. యువకులైన వారు కాయలు పండ్లూ తింటూ, కడగండ్లతో, కన్నీటితో కానలలో ఎలా జీవిస్తారో?

"రాముడు తిరిగివచ్చి కళకళలాడుతూ కనిపించే రోజును నేను చూడగలనా? రాముడు తిరిగివచ్చాడనే ఆనందవార్త నాలకించి పొంగిపోయే అయోధ్యాప్రజలను నేను ఆనందంతో చూస్తానా?

"నా రామునిరాకను గాంచి పున్నమినాటి సాగరమువలె అయోధ్యలో జనసముద్రము పొంగేదెప్పుడో?

"వీరుడైన నా రాముడు వృషభము గోవును ముందు ఉంచుకొని వచ్చునట్లు, సీతను రథముపై కూర్చుండబెట్టుకొని అయోధ్యలో ప్రవేశించేది ఎప్పుడు?

నా కుమారులైన రామలక్ష్మణులు సూర్యచంద్రులవలె ప్రకాశిస్తూ నగరంలో ప్రవేశిస్తూ వుండగా వేలకొలది ప్రజలు వారిపై పుష్పాలుచల్లేది ఎప్పుడో?

"మహారాజా! నేను క్రూరాత్మురాలిని. పాపాత్మురాలిని. పూర్వజన్మలో పాలుత్రాగాలని దూడలు ధేనువులను సమీపిస్తూ వుండగా, నేను వాటి తల్లుల స్తనాలు కోసేసి వుంటాను. ఇందులో సందేహం లేదు.

**సాహం గౌరివ సింహేన వివత్సా వత్సలా కృతా**
**కైకేయ్యా పురుష వ్యాఘ్ర బాలవత్సేవ గౌర్బలాత్**



"రాజా! లేగదూడపై ధేనువుకు ఎంతప్రేమో నా రాముడంటే నాకు అంతప్రేమ. సింహము దూడనుండి గోవును దూరంచేసినట్లు కైకేయి రామునికి నన్ను దూరంచేసింది.

"సౌందర్యరాశి, సుగుణాల వారాశి అయిన నా ప్రియపుత్రుని చూడకుండా నేను జీవించలేను. రాముని విడచి బ్రతికేశక్తి నాకు లేదు. గ్రీష్మఋతువునందు సూర్యుడు తన దారుణ కిరణజాలముచే భూమిని కాల్చివేయునట్లు, పుత్రశోకము వలన కలిగిన ఈ దుఃఖాగ్ని నా బ్రతుకును కాల్చివేస్తూ వుంది;" అంటూ దుర్భర దుఃఖముతో కుమిలి కుమిలి ఏడుస్తోంది కౌసల్య. క్రుంగిపోయి నిలబడలేక క్రిందబడింది. విలపిస్తున్న కౌసల్యను సమీపించి ధర్మబోధ చేసింది సుమిత్ర.

## మిత్రవాక్యం

పుత్ర వియోగ దుఃఖంతో కుమిలిపోతున్న కౌసల్య శోకాన్ని గాత్రవైభవంతో అదృశ్యం చేసిన అమోఘమైన పాత్ర రామాయణంలో సుమిత్ర. ఆమె వచనామృత ప్రవాహంలో పయనించడమే వాస్తవానికి ఒక దివ్యమైన విజ్ఞానయాత్ర. అస్త్రము లేని, శాస్త్ర మెరుగని ధర్మవిలసితమైన ఆమె భావయాత్రలో కొన్ని నిముషాలు ప్రయాణం చేసిన కౌసల్య రోజంతా తనను పట్టి పీడించిన దుర్భర శోకమునుండి సునాయాసంగా బయటపడింది. మిత్ర జీవనానికి అద్దంపట్టే పాత్ర సుమిత్ర. పవిత్ర భావసంయమనానికి ప్రతిరూపమే సుమిత్ర.

"అక్కా! కౌసల్యా! నీ వెందుకిలా దుఃఖిస్తున్నావు? దైన్యంతో బాధపడుతున్నా వెందుకు? రాముడు సకల గుణాభిరాముడు. పురుష శ్రేష్ఠుడు. ఇహపరములయందు కీర్తిని ప్రసాదించే ధర్మాన్ని వదలని పుణ్యచరితుడు. రాముణ్ణిగూర్చి నీవు దుఃఖించాల్సిన పని ఏముంది?

"రాముడు ధర్మచేతస్కుడై అడవికి వెళ్ళాడేగాని చేతగానివాడై కాదు. తండ్రిని అసత్యవాదినిచేయలేక తాను బాధల్ని కొనితెచ్చుకున్నాడు. అలాంటి ధర్మాత్ముడైన బిడ్డ విషయంలో ఇలా దుఃఖించడం సబబేనా?

"రామునికి ఏ లోటుందని నీవు బాధపడుతున్నావు? రాముని తండ్రిలా సేవిస్తూ, కంటికి రెప్పలా కాపాడే నాబిడ్డ లక్ష్మణుడు తోడుగావెళ్ళాడు. అరణ్యాలలోని కష్టాలన్నీ బాగా తెలిసిన సీత సేవాధర్మంతో భర్తను అనుసరించి వెళ్ళింది.

**కీర్తి భూతాం పతాకాం యో లోకే భ్రమయతి ప్రభుః**
**ధర్మ సత్యవ్రత పరః కిం న ప్రాప్త స్తవాత్మజః**

"ధర్మ సత్యాలే ధనమని భావించిన సమర్థుడైన నీబిడ్డ తన కీర్తిపతాకాన్ని ఈ లోకంలో ఎగురవేస్తున్నాడు. అతనికి కొరత ఏమిఉన్నది? అతనికి అందని ఫలమేముంది?" అన్నది సుమిత్ర.

ఈ శ్లోకంలో సుమిత్ర భావగర్భితముగ, దివ్యమైన భాష్యం చెప్పింది. ప్రభువు అనే పదానికి నూతన నిర్వచనాన్నిచ్చింది. కీర్తిపతాకాన్ని ఎగురవేసేవాడే ప్రభువని నిర్ణయించింది. స్ఫూర్తిలేక, కీర్తిలేక, దీప్తినెరుగని రాజు వాస్తవానికి ప్రజలపాలిటి దురదృష్టమేనని ఆమె అభిప్రాయం.

కౌసల్య రాముని కొరకు దుఃఖిస్తుంటే, అది సముచితం కాదని సుమిత్ర నిర్ద్వంద్వంగా ఖండిస్తూవుంది. రాముడి కొరకు కౌసల్య దుఃఖించడ మెందుకు? పట్టాభిషేకం భంగమైందని కొడుకు రాజు కాలేదని. అంతేకదూ!

సుమిత్రవాదం వేరు. అసలుపట్టాభిషేకం భంగం కాలేదంటుంది సుమిత్ర. నిజానికి రాముడే ప్రభువు అని వాదిస్తూ వుంది. ఎందుకంటే అతని కీర్తిపతాకం రెపరెపలాడుతున్నది అంటున్నది.

రాముడు రాజయ్యుంటే ఒక కోసల రాజ్యానికే పరిమితం ఆయన కీర్తి. కానీ,వనవాసము వల్ల ఆ దివ్యాత్ముని కీర్తి లోకమంతా వ్యాపించింది అంటూవుంది సుమిత్ర. అంతేకాదు ఈ కీర్తి కాలానికి, దేశానికి పరిమితం గాకుండా యుగయుగాలుగా నిలిచిపోతుంది అని ఆమె భావన. ఇంతటి కీర్తి లభించే సమయంలో దుఃఖపడడం అసమంజసమని కౌసల్యకు హితవు చెప్తూవుంది.

రాముని కీర్తిపతాకము ఎగురుతున్నది గనుక అతను ప్రభువే. రాజ్యము లేనంత మాత్రాన కొరతలేదు. ఇక బాధెందుకు? ధనహీనుడయ్యాడనా? ఆ విషయాన్ని కూడా సుమిత్ర సమ్మతించడంలేదు. సత్యధర్మాలే రాముని ధనమని చెప్తూవుంది.

రాజ్యమువల్ల లభించే ధనం స్థిరంకాదు. రాముడు సాధించిన ధనమే అక్షయధనము. ఆయనవద్దవున్నది సత్యధనము, ధర్మధనము అంటున్నది సుమిత్ర.

"సత్యంవద- ధర్మంచర" ఈ రెండు వ్రతాలలో సమస్తవ్రతాలు ఇమిడిఉన్నాయి. ఈ విధంగా వ్రతధనము నార్జించియున్న వానికి లౌకికసంపదల అవసరమేమిటి?

కౌసల్య దుఃఖము సమంజసముకాదని, రాజ్యమనే కోణమునుండి, సంపద అనే కోణము నుండి యథోచితమైన విమర్శను విశ్లేషించి మరీచెప్పింది సుమిత్ర. అయితే కౌసల్యకు ఈ సందర్భంలో ఒక సంశయము కలిగే అవకాశముంది. దానివల్ల కొరత ఏర్పడే పరిస్థితి వుంది. అదేమిటంటే -

కీర్తిపతాకము ఎగురుతున్నందున రాజ్యము పోలేదని, సత్యధర్మాలు చేతికందిన వ్రతాలై ఉన్నందున ధనక్షయం కలుగలేదని సుమిత్ర ఈ శ్లోకంలో వాదించింది. అంతేకాదు. నెగ్గింది కూడా. కానీ రాముడు అయోధ్యలో ఉంటే పౌరులంతా సేవచేసేవారు. ఈనాడు ఒంటరిగా అరణ్యంలో ఉన్న రామునికి సేవలెలా అందుతాయి? అనే సంశయం కౌసల్యకు ఏర్పడవచ్చు. దానినికూడా నివారణగావిస్తూ మూడుశ్లోకాల్లో రామునికి ప్రకృతి ఎలా సేవచేస్తుందో ముచ్చటగా చెప్పింది సుమిత్ర.

"అక్కా! పవిత్రమైన శీలంకలవాడు రాముడు. రామునివైభవాన్ని తెలిసినవాడేగనుక సూర్యుడు తనకిరణములచే రామునిశరీరాన్ని తపింపచేయడు.

రాముని ధర్మనిరతినిగూర్చి తెలిసిన వాయుదేవుడు సమశీతోష్ణంగాచరిస్తూ రామునికి ఆహ్లాదాన్ని కలిగిస్తాడు.

"రాత్రిపూట బయటపడుకొని నిద్రిస్తున్న రాముని చంద్రుడు తనకిరణాలచే తాకి, తండ్రి బిడ్డను కౌగలించుకున్నట్లు రాముని ఆలింగనంచేసికొని ఆనందింపచేస్తాడు. అంతేకాదు,

**యాశ్రీః శౌర్యం చ రామస్య యా చ కల్యాణ సత్వతా**
**నివృత్తారణ్య వాసః స్వం క్షిప్రం రాజ్య మవాప్స్యతి ॥**



"రామునియందు లక్ష్మి, శౌర్యము, కళ్యాణప్రదమైన బలము ఉన్నాయి. ఏ సంకోచము లేకుండా అరణ్యవాసమును పూర్తిచేసికొని త్వరగా రాజ్యమును రాముడు పొందుతాడు;" అన్నది సుమిత్ర.

రామునితోపాటు లక్ష్మి కూడా వెళ్ళింది అంటుంది సుమిత్ర. ఇక్కడ లక్ష్మి అంటే సంపద. దానిని కీర్తిపతాకంగా సుమిత్ర వర్ణించింది. కానీ సీత ఎవరోకాదు. లక్ష్మీదేవియే సీత. సీతారాములు లక్ష్మీనారాయణులే గనుక వారికొరకు దుఃఖించడం సముచితంకాదని కౌసల్యను హెచ్చరించడంకూడా ఇక్కడ ధ్వనిస్తూవుంది.

సుమిత్ర తిరిగి ప్రారంభించి చెప్తూవుంది. "రామమాతా! కౌసల్యా! రాముడు సూర్యునకు సూర్యుడు. అగ్నికి అగ్ని. ప్రభువుకు ప్రభువు. సంపదకు సంపద. కీర్తికి కీర్తి. ఓర్పుకు ఓర్పు. దేవతలకు దేవత. అట్టి రామునికి అయోధ్య అయితేనేమి? అరణ్యమైతేనేమి?

**పృథివ్యా సహ వైదేహ్యా శ్రియా చ పురుషర్షభ**
**క్షిప్రం తిస్సృభి రేతాభిః సహ రామోఽభిషేక్ష్యతే ॥**

"పురుషోత్తముడైన రామునకు భూమి (**పృథివ్యా**), సీత (**వైదేహ్యా**), లక్ష్మి (**శ్రియా**) అను ఈ ముగ్గురితో కలిసి రాజ్యాభిషేకం జరుగుతుంది" అన్నది సుమిత్ర.

ఇక్కడ శ్రీరాముడు సాక్షాత్తు నారాయణుడే అని ధ్వనించేలా ప్రసంగించింది. భూమితో, సీతతో, లక్ష్మితో కలిసి రాజ్యాభిషేకం జరుగుతుంది అంటే, భూదేవితో, శ్రీదేవితో శోభించిన నారాయణుడు సీతతోకూడా కలసి అయోధ్యలో కొలువైయుంటాడని భావము. తన ధర్మప్రవచనాన్ని ధారాప్రవాహంగా సాగిస్తోంది సుమిత్ర.

"అక్కా! వనవాసమును పూర్తిచేసికొని రాముడు క్షేమంగా తిరిగివస్తాడు. నీవు శోకమోహాదులను విడిచిపెట్టు. నేను సత్యము చెప్పుచున్నాను. నీ కుమారుడు ఉదయించిన చంద్రునివలె వచ్చి నీపాదాలకు నమస్కరించడముచూసి నీవు పొంగిపోతావు. ఆనందాశ్రువుల్ని విడుస్తావు.

"కౌసల్యా! రామునికి అమంగళము ఎన్నటికీ జరుగదు. నీవు దుఃఖించడం మానేయి. నీవు ఇతరులను ఓదార్చడానికి బదులుగ నీవు ఇలా దుఃఖించడం న్యాయమా?

"రామునివంటి పుత్రునికి జన్మనిచ్చిన నీవు పామరులవలె ఇలా విలపించకూడదు. రామునివంటి ధర్మప్రవర్తన గలవారు ఈలోకంలో మరొకరు లేరు.

"నామాట నమ్ము. రాముడు తప్పక తిరిగివస్తాడు. అతడువచ్చి నీపాదాలకు నమస్కరిస్తుండగా తన్మయత్వంచెందిన నీవు వర్షాకాలములో మేఘాలు పర్వతమును తడిపినట్లు ఆనందాశ్రువులతో రాముని తడుపుతావు" అని మాటలుచెప్పి ఓదార్చుట యందు నేర్పరియైన సుమిత్ర కౌసల్యను శాంతపరచింది.

ఇది వాల్మీకిమహర్షి సుమిత్రకు అందించిన యోగ్యతాపత్రము.

**"వాక్యోపచారే కుశ లానవద్యా"** మాటలద్వారా ఉపచారము చేయుటలో కౌశల్యము గల సుమిత్ర దోషరహితమైనది (**అనవద్యా**).

కౌసల్యను ఓదార్చే ఈ సందర్భములో రాముడు తప్పక తిరిగివస్తాడు అనే వాక్యాన్ని అవసరాన్ని దృష్టిలో పెట్టుకొని, పునరుక్తి అనే విషయాన్ని ప్రక్కకునెట్టి, అనేకసార్లు ప్రయోగించింది సుమిత్ర.

అదే సుమిత్ర తనకుమారుడైన లక్ష్మణుడు వెళ్ళేటప్పుడు సందేశాత్మక ఆశీర్వచనము నందిస్తూ **"గచ్ఛ గచ్ఛ"** వెళ్ళు వెళ్ళు అన్నదే గాని "వెళ్ళిరా" అని చెప్పలేదు.

రాముని మాత్రమే నమ్ముకొని జీవిస్తున్న లక్ష్మణుడు రాముని ఆస్తివంటివాడు. యజమాని ప్రయాణంచేసి తిరిగిరాగానే ఆయనతోపాటు ఆయన పెట్టెకూడా వచ్చునట్లు, రాముడు వనవాసము పూర్తిచేసికొని అయోధ్యకు తిరిగివస్తే వెంట లక్ష్మణుడు తప్పక వస్తాడు. కనుక లక్ష్మణుని ప్రత్యేకించి "వెళ్ళిరా" అని చెప్పాల్సిన అవసరం లేదు. "ఏనుగు పాదంలో అన్ని జీవాల పాదాలున్నట్లే" అనే భావంతో మాట్లాడింది సుమిత్ర.

అదియునుగాక, తన అధీనంలోఉన్న తనకుమారుని పంపడంవరకే తన బాధ్యత. వెళ్ళిన తరువాత లక్ష్మణుడు రాముని అధీనంలో ఉంటాడు. తిరిగి రావడం రాముని ఆజ్ఞపై ఆధారపడి ఉంటుంది. కనుక 'గచ్ఛగచ్ఛ' వెళ్ళు వెళ్ళు అన్నదేగాని "వెళ్ళిరా" అని అనలేదు. ఈవిధంగా మాట్లాడే నేర్పరితనము, జ్ఞానము వున్నందున నేర్పరి **(కుశలా)** అని వాల్మీకిచే యోగ్యతాపత్రాన్ని పొందింది.

"గచ్ఛ గచ్ఛ" అంటూ రాముని అనుసరించమని చెప్పడంలో ఇది కేవలం ఒక్క లక్ష్మణునికి మాత్రమే సంబంధించిన సందేశమని భావించకూడదు. ధర్మమార్గము ననుసరించమని తన కుమారునిద్వారా యావద్విశ్వానికి తన సందేశమునందిస్తున్నది త్యాగమయి సుమిత్ర.

మరొక్క ముఖ్యవిషయం. మాటలయందు నేర్పరియైన సుమిత్రను దోషములు లేనిది **(అనవద్యా)** అన్నాడు వాల్మీకి.

కొందరు మాటలలో నేర్పరితనాన్ని ప్రదర్శించాలని లేనిపోనివి కల్పిస్తూ, అతిశయోక్తి ఉత్ప్రేక్ష్యాది అలంకారాలను బలంగా పోషిస్తూ, అబద్ధాలమేడెక్కి అభినయిస్తుంటారు. సుమిత్ర మాటల్లో అలాంటి దోషాలు లేవంటున్నాడు ఆదికవి. ఆమె నేర్పరితనములో అసత్యమును నేర్పనితనము చోటుచేసుకొని వుంది. ఋజుమార్గములో పలుకుటేగాని అబద్ధాల బూజు అతికించుకోలేదు. అలా ఎందరు మాట్లాడగలరు? అవన్నీ మిత్రవాక్యాలు. సుమిత్ర వాక్యాలు. ఆమెకే అలా భాషించడం సాధ్యం.

సుమిత్ర మాటల నాలకించిన కౌసల్యకు గుండెబరువు తగ్గింది. శోకము ఉపశమించింది. శరత్కాలమేఘాలు జలమును కొద్దిగా కలిగియున్నట్లు కౌసల్య దుఃఖము బాగా క్షీణించింది.

బాధల్లో బోధలు అందించడం, ఇతరుల బరువుల్ని సునాయాసంగా దించడం, తాను కష్టాల్లో కూరుకుపోయినపుడుకూడా అన్యులను బాధావిముక్తుల్ని గావించి సంతోషపరచడం ఎవరికి సాధ్యం? ఎవరికి సాధ్యమైనా, వారుమాత్రం ఈప్రపంచంలో మిత్రబాంధవ్యానికి ప్రతీకలే. అట్టి మైత్రికి ప్రతిరూపమే సుమిత్ర.

రామాయణంలో విశిష్టమైన పాత్రలుగా మనకు తెలిసేవాటిలో సుమిత్ర ఒకటి. స్త్రీ పాత్రలలో ఇంత ఉదాత్తమైన, అమోఘమైనపాత్రను మనం అరుదుగా చూస్తాం.



సుమిత్ర పాత్ర రామాయణంలో రెండుసార్లుమాత్రమే మెరుపుతీగలాగా ప్రకాశిస్తూ భాషిస్తుంది. వనవాసానికి వెళ్ళేముందు లక్ష్మణుడు తనకు నమస్కరించినపుడు ఒకసారి, సీతారామలక్ష్మణులు అరణ్యానికి వెళ్ళినతరువాత దశరథుడు కౌసల్యమందిరములో పరితపించేటప్పుడు మరొకసారి సుమిత్ర అమోఘవచనాలు మనం వినగలుగుతాము.

రాముని వనవాసానికి కారణముంది. కానీ తన కుమారుడైన లక్ష్మణుడు వనవాసానికి వెళ్ళడానికి కారణమేమైనా ఉందా? "నాయనా! ఈ సమస్య నీకు సంబంధించింది కాదు. నా ముద్దులపట్టీ! నీవెందుకు వెళ్ళాలి?" అని సుమిత్ర లక్ష్మణునితో అన్నదా? అదే సుమిత్ర గొప్పతనం. లక్ష్మణుడు నమస్కరించినపుడు దీవించి పంపింది.

తన కుమారుని వెళ్ళవద్దని కౌసల్య బ్రతిమలాడింది. రాజాజ్ఞను ప్రతిఘటించమని చెప్పింది. కానీ సుమిత్ర నోరుతెరచి ఒక్కమాట అనలేదు.

అడవికి వెళ్ళవలసిన తన కుమారుని వెళ్ళవద్దని కౌసల్య అడ్డుపడితే, వెళ్ళనవసరంలేని తన కుమారునికి అడ్డునిలవకుండా పంపింది సుమిత్ర.

అరణ్యానికి వెళ్ళడానికి లక్ష్మణుడు తల్లిదగ్గర అనుమతి తీసుకున్నట్లుగాని, ఆమె అనుమతినిచ్చినట్లుగాని మనకు రామాయణంలో గోచరించడంలేదు. వెళ్తూ వెళ్తూ నమస్కరిస్తాడు తల్లికి లక్ష్మణుడు. అంతే. తాను చరించే ధర్మమార్గానికి తన తల్లి అడ్డురాదని లక్ష్మణుని విశ్వాసం. తన బిడ్డ ధర్మమార్గముననే పయనిస్తాడు అని తల్లికి నమ్మకం. ఆహా(... తల్లి బిడ్డల మధ్య ఎంత చక్కని అవగాహన? వారిరువురిలో మనకు తెలిసేది ధర్మయుతమైన జ్ఞానము కాదు. జ్ఞానయుతమైన ధర్మము.

బిడ్డను వనవాసం పంపడం దుర్భరమైన విషయమే. అయినా నిస్సంకోచంగా, సంతోషంగా పంపింది సుమిత్ర. వ్యక్తిగతసుఖాలకన్నా ఉన్నతాశయాలకే ప్రాధాన్యతనిచ్చే విశిష్టమైన పాత్ర సుమిత్ర.

కౌసల్య పూజామందిరంలో రాముడు తన రాజ్యాభిషేకవార్తను కౌసల్యతో చెప్పినపుడు సీతతోకూడా సుమిత్ర అక్కడే ఉంది. కానీ ఒక్కమాట పలకలేదు. పొంగిపోయి ఏదో ఏదో పలవరించలేదు."లక్ష్మణా! నీకొరకే రాజ్యాన్ని అంగీకరించాను. సర్వసుఖాలు అనుభవించు" అని రాముడు లక్ష్మణునితో చెప్పినపుడుకూడా హర్షాతిశయాన్ని ప్రదర్శించలేదు.

అంతేగాదు. వనవాసవార్త విన్నపుడుకూడా స్థిమితంగా ఉండిందేగాని మతిచెడి రోదించలేదు. సుఖదుఃఖాలలో చలించకుండాఉండే పాత్రలు ఇప్పటికి మనకు రెండు కన్పించాయి. ఒకటి రాముడుకాగా రెండవది సుమిత్ర.

కౌసల్యాదశరథులను ఓదార్చే సందర్భంలో సుమిత్ర మరొక చక్కనివిషయం చెబుతుంది. రాముడు ధర్మాత్ముడుగనుక సూర్యుడు తన తాపంతో రాముని బాధించడని, వాయువు ఆహ్లాదంగా హాయిని చేకూర్చుతుందని చెబుతుంది. **"ధర్మో రక్షతి రక్షితః"** ఎవరు ధర్మమును రక్షిస్తారో, వారిని ధర్మము రక్షిస్తుంది అనే విషయంలో పూర్తివిశ్వాసం గల్గిన పాత్ర సుమిత్ర.

ధర్మ ప్రవర్తనకు, ధర్మజీవనానికి అలవాటుపడిన సుమిత్రను కేవలం ఒకగృహిణిగా, రాణిగా చూడలేము. లక్ష్మణునివంటి త్యాగమయుని ప్రపంచానికి ప్రసాదించిన త్యాగమయి సుమిత్ర. ఆమెది విశ్వవాణి.

కోసలదేశానికి చెందినదికనుక దశరథుని పెద్దభార్య కౌసల్య అయింది. కేకయ దేశానికి చెందినదికనుక మరొక భార్య కైకేయి అయింది. సుమిత్ర నామధేయంలో అలాంటి పరిమిత భావాలు మనకు కనిపించవు. యావద్విశ్వానికి సంబంధించిన పౌరసత్వం ఆమెది. సుమిత్ర లాంటి మహాతల్లినికన్న భరతమాత ధన్యురాలు.

## తమసా తీరమున తారకరాముడు

ప్రేమాతిశయముచే వనవాసము వెళ్తున్న రాముని ప్రజలందరు అనుసరించివెళ్ళారు. ఎంతగా చెప్పినా వారు రాముని అనుసరించడం మానడంలేదు. ప్రజలను కన్నబిడ్డలవలె భావించు రాముడు వెంబడిస్తున్న పౌరులను కళ్ళతో త్రాగుతున్నట్లు ప్రేమగా చూశాడు. వారిని ఉద్దేశించి,

"పౌరులారా! మీకు నాపైవున్న గౌరవప్రేమలు నాకుతెలుసు. వాటిని మీరు భరతునిపై చూపితే నేను చాలాసంతోషిస్తాను.

"భరతుడు శుభప్రదుడు. శుభచరితుడు. మీక్షేమాలను చక్కగా చూడగలవాడు. వయసులో చిన్నవాడైనా జ్ఞానంలో వృద్ధుడు. మృదువైన మధురస్వభావము కలవాడు. పరాక్రమ వంతుడు. సుగుణాలరాశి. మీకు అభయప్రదానం చేయగల అసమానచక్రవర్తి.

"దశరథమహారాజుకు ఏబాధ లేకుండా మీరు చూసుకోవాలి. అదే నాకు సంతోషము;" అని పలికి కన్నీటితో విలపిస్తున్న పౌరులను తన ప్రేమపాశంతో రాముడు బంధించాడు.

వయసుచేత, జ్ఞానముచేత వృద్ధులైన కొందరు బ్రాహ్మణులు వృద్ధాప్యమువలన తలలు వణుకుచుండగా ఇలా పలికారు.

"ఓ అశ్వములారా! ముందుకు వెళ్ళకండి. రథాన్ని లాగకండి. వెనుకకు మరలండి. మన ప్రభువైన రామునికి మేలుచేయండి.

"అన్ని జంతువులకన్నా మీ చెవులకు అధికంగా గ్రహణశక్తి ఉంటుంది. ఓ గుఱ్ఱములారా! అట్టి మీరు మా మనవి నాలకించి వెనుదిరగండి. ధర్మాత్ముడైన మన ప్రభువును నగరంలోకి తీసుకొనిరావాలిగాని నగరమునుండి తీసికొని వెళ్ళకూడదు;" అని పలుకుచున్న వృద్ధులైన బ్రాహ్మణశ్రేష్ఠులను చూచి, రాముడు రథమునుండి దిగాడు. అక్కడనుండి రాముడు నడక ప్రారంభించాడు.

**ద్విజాతీంస్తు పదాతీం స్తాన్ రామశ్చారిత్ర వత్సలః**
**న శశాక ఘృణా చక్షుః పరిమోక్తుం రథేన సః**

"మంచి నడవడికయందు ప్రేమ కలవాడు, కరుణతో కూడిన కన్నులు కలవాడునగు రాముడు వృద్ధులైన బ్రాహ్మణులు నడచివస్తూవుండగా తాను రథముపై వెళ్ళలేక పోయాడు" అంటాడు వాల్మీకిమహర్షి.

పాదచారియై వెళ్తున్న రామునితో ఆ ద్విజశ్రేష్ఠులు ఇలాపలికారు. "రామా! సదా వేద మంత్రాలను అనుసరించే మాబుద్ధి ఈనాడు నిన్ను అనుసరిస్తూ వనవాసాన్ని కోరుతూ వుంది.



"వేదములు మాకు గొప్ప ధనము. అవి ఎక్కడికీ పోవు. మా హృదయములోనే ఉంటాయి. మా భార్యలు పతివ్రతలు. వారు ఇళ్ళల్లోనే ఉంటారు. ఎటొచ్చి మా బాధంతా నీకొరకే. నీవు అయోధ్యకి తిరిగిరావాలి. మేమంతా నిన్ను ప్రార్థిస్తున్నాము.

"రామా! మేమే కాదు. అటుచూడు. చెట్లు ఎలా ఊగిపోతున్నాయో! నిన్ను అనుసరించాలని చెట్లు లేస్తూవుంటే, వాటి వ్రేళ్ళు అడ్డుకోవడంవల్ల అవి నీవెంట రాలేక ఏడుస్తున్నాయి;" అని పలుకుతూ బ్రాహ్మణులు రాముని ముందుకు పోనివ్వకుండా నిరోధిస్తూవుండగా, తానూ వారితో చేరినట్లు తమసానది అడ్డుగావచ్చింది.

సుమంత్రుడు గుఱ్ఱాలను రథమునుండి విప్పి నీరుత్రాగించాడు. రాముడు అందమైన తమసాతీరమునుచేరి సీతాలక్ష్మణులతో ఇలాపలికాడు.

"లక్ష్మణా! మన వనవాసములో ఇది తొలిరేయి. నీవు బెంగపెట్టుకోకు. సద్దుమణిగిన ఈ అరణ్యప్రాంతము నలుదిక్కుల రోదిస్తునట్లు ఉంది.

"అయోధ్యానగరములో ప్రజలుకూడా ఈరోజు దుఃఖిస్తూనే ఉంటారు. ప్రజలందరికీ నాన్నగారిమీద, నీమీద, నామీద, భరతశత్రుఘ్నులమీద విశేషమైన ప్రేమ ఉంది. లక్ష్మణా! నా తల్లిదండ్రులు ఏడ్చి ఏడ్చి గ్రుడ్డివారౌతారేమో అని బాధపడుతున్నాను. ధర్మాత్ముడైన భరతుడు వారిని ఓదార్చగలడనే ధైర్యంఉంది.

"లక్ష్మణా! తల్లిదండ్రులు మనసులో కదలగనే నాకు దుఃఖం పొంగివస్తూవుంది. వెంటనే భరతుడు స్మృతికిరాగానే అది ఉపశమిస్తోంది.

"లక్ష్మణా! నాతోపాటుగా వచ్చి నీవు నాకు ఎంతో మేలుచేశావు. నీవులేకపోతే సీత ఒంటరిగ ఉండవలసివచ్చేది;" అన్నాడు రాముడు.

రాత్రయింది. రామలక్ష్మణులకు, సీతకు చెట్లఆకులతో పడకను ఏర్పాటుచేశాడు సుమంత్రుడు. వారు శయనించారు.

సీతారాములు నిద్రించారు. రాముని సుగుణాలనుగూర్చి లక్ష్మణుడు సుమంత్రునితో చెప్పడం ప్రారంభించాడు. లక్ష్మణుడు చెప్తూనేవున్నాడు. ఈలోగా సూర్యుడు ఉదయించాడు.

రాముడు తెల్లవారకముందే లేచి, నిద్రిస్తున్న ప్రజలనుచూచి, సోదరుడైన లక్ష్మణునితో ఇలాపలికాడు.

"లక్ష్మణా! శుభలక్షణా! నిన్నటిరోజు పాదచారులై మనవెంట రావడంచేత పౌరులు అలసి నిద్రిస్తున్నారు. గృహాసక్తినికూడా త్యజించి వారు మనల్ని వెంబడిస్తున్నారు. ఎలాగైనా మనల్ని నగరానికి తీసికొనివెళ్ళాలని వీరంతా దృఢసంకల్పంతో ఉన్నారు. ఆ ప్రయత్నంలో ప్రాణత్యాగానికికూడా సిద్ధపడేటట్లు తోస్తూవుంది. వీరు నిద్రలేచేలోగా మనం ఈ ప్రదేశాన్ని వదలివెళ్ళడం మంచిది.

"చూడు. వీరంతా ఈరోజు చెట్లమొదళ్ళలో పడుకున్నారు. ప్రజలకు కలిగే దుఃఖాన్ని రాజకుమారులమైన మనం తొలగించాలిగాని మనవల్ల వారికి దుఃఖం కలగకూడదు;" అన్నాడు రాముడు.

"అన్నా! నీవు చెప్పింది నాకూ నచ్చింది. అలాగే చేస్తాం. వెంటనే రథాన్ని అధిరోహించండి" అన్నాడు లక్ష్మణుడు. సుమంత్రుడు తొందరగా రథానికి గుఱ్ఱములను కట్టాడు. సీతారామ లక్ష్మణులు రథము నెక్కారు. తమసానదిని దాటారు.

"సుమంత్రా! రథాన్ని కొంతదూరము ఉత్తరదిక్కుగా పోనిచ్చి, మళ్ళీ దానిని వెనుకకు మరలించు. పౌరులు రథచక్రాల జాడలనుగుర్తించి మనల్ని వెంబడించకుండా ఉండాలి" అన్నాడు రాముడు.

సుమంత్రుడు అలాగే చేశాడు. సీతారామలక్ష్మణులను రథంలో ఎక్కించుకొని తపోవనం వైపు వెళ్ళాడు సుమంత్రుడు.

రథాన్ని మొదట కొంతదూరము ఉత్తరదిక్కుగా పోనిచ్చి, మళ్ళీ వెనుదిరిగి, రథచక్రాల జాడలు ప్రజలకు అర్థంగాకుండా పయనించమని శ్రీరాముడు సుమంత్రుని ఆదేశించడం ఆ ప్రజలను మోసంచేయడంకాదా! అని కొందరి వాదన. రథాన్ని ఆపమని దశరథుడు సుమంత్రునితో చెప్పినపుడు శ్రీరాముడు "వెళ్ళు - వెళ్ళు" అంటూ, ఒకవేళ రాజు అడిగితే వినపడలేదని చెప్పమనిన సందర్భములాంటిదే ఈ సందర్భముకూడా. అక్కడ అర్థం చేసుకున్నట్లే ఇక్కడకూడా జాగ్రత్తగా అర్థంచేసుకోవాలి.

తండ్రి మాటను పాలించి రాముడు వనాలకు వెళ్తున్నాడు. ప్రేమతో ప్రజలంతా వెంట బడ్డారు. వారిలో అతివృద్ధులైన జ్ఞానవంతులుకూడా ఉన్నారు. వారు తనవెంట నడచి రావడము చూసిన రాముడు తానుకూడా రథందిగి నడిచాడు.

రాత్రంతా వారు తమసానదీతీరాన రామునితోపాటు విశ్రమించారు. నిద్రలేచారా! రాముని వెళ్ళనివ్వరు. లేదా మళ్ళీ వెంటపడుతారు. ఇలాచేసి సాధించే దేమైనాఉందా? తన ప్రజలు ఆవిధంగా దుఃఖపడడం రామునికి ఇష్టంలేదు. అందుచేత వారు నిద్రపోతుండగనే సీత, లక్ష్మణ, సుమంత్రులతో బయలుదేరాడు. ఇక్కడ మోసంచేయడానికి ఏముంది? మోసం చేసి రాముడు పట్టుకపోయేదేముంది? దుఃఖమనే పట్టునుండి ప్రజలను విడిపించడం తప్ప.

అయితే, ప్రజలకు రథచక్రాల జాడలు తెలియకుండా చేయుమని సుమంత్రునికి రాముడు ఆదేశాలు ఎందుకిచ్చాడు? జాడలు గుర్తుపడితే ప్రజలు రాముని చేరేందుకు ప్రయత్నిస్తారేగాని అయోధ్యవైపు మరలరు. తనపై ప్రేమతో ప్రజలు అగచాట్లకు గురికావడం ధర్మాత్ముడైన రాముడు సహిస్తాడా? మరి వారి దుఃఖాన్ని, లేదా బాధల్ని ఎంతకాలం చూడాలి? అందుచేతనే రాముడు సుమంత్రునితో అలా పలికాడు.

## నగరవాసుల నైరాశ్యం

తెల్లవారింది. తమసానదీతీరమున నిద్రలేచారు అయోధ్యాపురవాసులు. రాముని జాడ తెలియక తీవ్రంగా దుఃఖించారు. పాలిపోయినముఖాలతో దీనులై ఇలా సంభాషించుకున్నారు.

"ఛీ! నిద్ర ఎంతపనిచేసింది? దరిద్రదేవతయైన ఈ నిద్రయొక్క మైకంలోపడి భద్రమైన రాముని పోగొట్టుకున్నాం. రాముని సేవ దుర్లభమైనది. రాముడు మనల్ని వదలి వెళ్ళిపోయాడు.



"మనమంతా ఇక్కడే మరణిస్తాము. లేదా మరణించువరకు ఉత్తరదిక్కుగా రాముని అన్వేషిస్తూ ప్రయాణం సాగిస్తాము. **"కిమర్థం జీవితం హి నః"** రాముడు లేని ఈ జీవితమెందుకు?

"భక్తజనులైన మనల్ని వదలి రాముడు ఎలా వెళ్ళగలిగాడు? ఇక్కడ ఎండిపోయిన కట్టెలు చాలాఉన్నాయి. వాటిచే అగ్నిని ప్రతిష్ఠించుకొని మనమంతా అగ్నిలో ప్రవేశిస్తాము.

"మనము నగరానికి తిరిగి వెళ్ళగనే "రాముడేడి?" అని అడిగినవారికి మనము ఏమి సమాధానము చెప్పగలము? రాముడు లేని నగరంలో ఎలా జీవించగలము?" అని పలుకుచూ లేగదూడలను పోగొట్టుకున్న ఆవులవలె పౌరులందరూ విలపించారు. ఆ తరువాత రథచక్రాల జాడలను పట్టుకొని కొంతదూరము ప్రయాణముచేసి, జాడలు అగోచరం కాగానే కర్తవ్యం బోధపడక వెనక్కితిరిగారు. దుఃఖిస్తూ పౌరులందరూ అయోధ్యానగరానికి తిరిగివచ్చారు. పెద్దదైన సర్పమును గరుడుడు ఎత్తుకొనిపోగా సరస్సు నిశ్చలంగా గోచరించునట్లు రాముడు లేని అయోధ్య ప్రకాశహీనమై మిగిలింది. చంద్రుడులేని ఆకాశంలాగా, నీరులేని నదిలాగా శోభరహితమైంది. వనమునుండి తిరిగివచ్చిన పౌరులందరు ప్రాణము లేనివారివలె కన్పిస్తున్నారు.

"రాముని వనములో వదలిపెట్టి గృహాలకు మరలివచ్చిన పౌరులను ఇంటిలోని స్త్రీలు దుఃఖిస్తూ ఏనుగులను అంకుశములతో పొడచినట్లు మాట్లాడారు.

"రాముని వదలిపెట్టి వచ్చిన వారికి గృహాలెందుకు? భార్యాపుత్రుల అవసరమేముంది? ఇక్కడ ఏమి చూసుకొని రాముణ్ణి వదలివచ్చారు? రాముడు లేని అయోధ్య మనకు శ్మశానము వంటిది. ఈ అయోధ్యకు రావాలని మీకు ఎందు కనిపించింది? కైకేయి ఏలే రాజ్యంలో జీవించడంకన్నా మరణించడమే నయం.

"రాముని విడచి దశరథుడు జీవించలేడు. అతడు మరణించడముకూడా మీరు చూడదలచుకున్నారా? మీ పుణ్యమంతా నశించింది. మామాటవిని మీరంతా విషం కలుపుకొని చావండి.

"లేదా, అందరము వెళ్ళి రాముని అన్వేషిద్దాం. పదండి. మీరు రాముని సేవించండి. మేము సీతను సేవిస్తాం. మన యోగక్షేమాలన్నీ సీతారాములే చూసుకుంటారు.

"రాముని అరణ్యాలలో వదలివచ్చిన మీకు హృదయముందా? రామునిపై మీకున్నదంతా కపటప్రేమ. కలుషితమైన ప్రేమ. మీప్రేమలో స్వచ్ఛత లేదు. స్పష్టత లేదు.

"రామునికి సేవలు చేయుటకు వెంట నడచివెళ్ళిన లక్ష్మణుడొక్కడే సత్పురుషుడు. రాముడు ఏ ప్రదేశాలలో స్నానంచేస్తాడో ఆనదులే పుణ్యనదులు. అరణ్యాలన్నీ రాముని అతిథి వలె భావించి సేవచేసి తరిస్తాయి. పుణ్యవృక్షాలన్నీ రామునికి ఫలాలను అర్పిస్తాయి. పర్వతాలు నిర్మలజలాలను రామునకు అందించి తృప్తిచెందుతాయి" ఇలా ఇండ్లలోని తల్లులు తల్లడిల్లుచుండగా సూర్యాస్తమయమైంది. యజ్ఞాలు, వంటకాలు, సంధ్యావందనాది కార్యక్రమాలకు దూరమైన అయోధ్యానగరము చీకటిపూసినట్లు గోచరించింది. నక్షత్రాలులేని ఆకాశంవలె కనిపించింది. నీరుతగ్గిన సముద్రమువలె ఉంది.

# పావన గంగా ప్రాభవము

రాముడు ప్రయాణమునుసాగించి "వేదశ్రుతి" యను నదినిదాటి, అగస్త్యాశ్రమం మార్గంలో పయనించాడు. చాలాదూరము ప్రయాణమును సాగించి, సాగరములో ప్రవేశించునది అయిన "గోమతీనది"ని దాటాడు. అక్కడనుండి గోవుల సమూహముతో కూడినది, ఆతరువాత ధ్వనిచేయు నెమళ్ళు, హంసలు కల "స్యందికానది"ని కూడా దాటాడు.

ఇపుడు రాముడు కోసలదేశాన్ని దాటాడు. అయోధ్యవైపుతిరిగి రెండుచేతులు జోడించి నమస్కరించాడు.

"ఓ ఉత్తమమైన అయోధ్యానగరమా! నాకు అనుమతిని ప్రసాదించు. వనవాసమును పూర్తిచేసికొని తిరిగివచ్చి మరల నిన్ను దర్శిస్తాను;" అనిపలికి ప్రయాణం సాగించాడు.

ఆ సమయంలో రాముణ్ణి చూడడానికి చాలామంది గ్రామీణప్రజలు వస్తారు. రామునికి వచ్చిన కష్టాన్నిచూచి వారంతా దుఃఖిస్తారు. వారియొక్క దుఃఖాన్నిచూచి రాముడు వారితో ఇలాచెబుతాడు.

**అనుక్రోశో దయాచైవ యథార్హం మయి వః కృతః**
**చిరం దుఃఖస్య పాపీయో గమ్యతా మర్థ సిద్ధయే ॥**

"మీరు నాపై ఎంతో దయచూపారు. జాలిచూపారు. దుఃఖము ఎక్కువకాలము ఉండుట మంచిదికాదు. కనుక మీరు మీమీ కార్యములను నిర్వహించుటకు వెళ్ళండి" అంటాడు.

"ఈ దుఃఖాన్ని నేను సహించలేను. కనుక నీవు రథాన్ని ఆపకుండా నడుపు. మాతండ్రి అడిగితే వినబడలేదని చెప్పు" అని సుమంత్రునితో చెప్పుటకు, శ్రీరాముడు దుఃఖమును ఎక్కువ కాలము కొనసాగించుట ఇష్టములేకనే అని మనం గ్రహించాము.

**"చిరం దుఃఖస్య పాపిష్ఠం"** దుర్భరమైన దుఃఖము చిరకాలము సహింపరానిది అని అక్కడ రాముడు సుమంత్రునితో అన్నాడు.

**"చిరం దుఃఖస్య పాపీయః"** దుఃఖము చిరకాలము ఉండుట చెడ్డది అని ఇక్కడ గ్రామీణులతో అంటున్నాడు.

ఈ రెండు సందర్భాలలో ఏ దుఃఖము కొనసాగడం తనకు ఇష్టంలేదని చెప్తున్నాడో ఆదుఃఖమును చూడలేకనే తమసాతీరమున శ్రీరాముడు నిద్రపోతున్న ప్రజలను విడిచి వెళ్ళాడు. సున్నితమైన శ్రీరాముని హృదయము పరుల బాధలనుచూచి సహించలేదు. ఈవిధమైన కోమల మనస్తత్త్వమువలన రాముడు ఎన్నో కఠోరమైన బాధలను అనుభవించవలసి వచ్చింది. ధర్మపరాయణులైనవారు బాధలకు భీతిచెందరు.

రాముడు ప్రయాణం సాగించాడు. కొంతదూరము ప్రయాణంచేసిన తరువాత మూడు పాయలుగా ప్రవహించునది, సుందరమైనది, స్వచ్ఛమైనది, పుణ్యప్రదమైనది, ఋషులచే సేవించబడునదియైన గంగానదిని చూశాడు.

పవిత్రగంగాతీరమున అనేక ఋష్యాశ్రమాలున్నాయి. దేవ దానవ గంధర్వాదులందరు గంగను తరచుగా దర్శిస్తూవుంటారు. దీనిని 'దేవనది' అనికూడా అంటారు.



గంగాజలము కొన్నిప్రదేశాలలో నిశ్చలంగా, అగాధంగా తెలుస్తుంది. కొన్నిప్రదేశాలలో తీవ్ర వేగంతో ప్రవహిస్తుంది. కొన్నిచోట్ల గంభీరధ్వనితో పయనిస్తుంది. కొన్నిచోట్ల సుడులతో శోభిస్తుంది.

కొన్నిచోట్ల తీరములపై మొలచిన వృక్షములు మాలలవలె తీరి గంగను అలంకరించి ఉంటాయి. ఈ నది మణివలె ప్రకాశిస్తూ నిర్మలంగా ఉంటుంది.

విష్ణుదేవుని పవిత్ర చరణకమలమునుండి ఆవిర్భవించిన గంగానది దోషరహితమైనది. పాపాలను హరిస్తుంది.

గంగానది పరమ పవిత్రమైనది. గంగానదిలో మునకవేస్తే సమస్తపాపాలు ప్రక్షాళనమవుతాయని హిందువులు భావిస్తారు.

**'స్రోతసామస్మి జాహ్నవి'**

నదులలో తాను గంగానదియని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో తెలిపియున్నాడు.

గంగాజలంలో రోగనిరోధక పదార్థాలున్నట్లు ఇటీవల శాస్త్రజ్ఞులు గుర్తించారు. గంగ కేవలం నది కాదు. అది తీర్థరాజము. కలరాపురుగులు గంగాజలములో జీవించలేక మృతి చెందుతాయని ఫ్రెంచి వైద్యుడు డాక్టర్ డి.హిరిల్లె అభిప్రాయపడ్డారు. గంగాజలములాగా ఏ నదీజలముకూడా ఎక్కువకాలం చెడిపోకుండా నిలువవుండదని బ్రిటీషు వైద్యులు డా॥ సి.ఇ.నెల్సన్ అభిప్రాయపడ్డారు.

**దూరీకృత జన పాపసమూహే**
**పూరిత కచ్ఛప గుచ్ఛగ్రాహే**
**పరమ హంస గురు భణిత చరిత్రే**
**బ్రహ్మ విష్ణు శంకర నుతి పాత్రే**
**తుంగ తరంగే గంగే .... జయ తుంగ తరంగే గంగే ॥**

"మనుజుల పాపములను నివారించునదియు, కూర్మ, మకర, మీనములకు నిలయమైనదియు, మహాత్ములచేత ప్రవచింపబడిన కథలు గలదియు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులచే నుతింపబడినదియు అగు ఉవ్వెత్తునలేచే తరంగములుగల గంగాదేవికి జయము కలుగుగాక" అని సదాశివబ్రహ్మేంద్రులవారు కీర్తించారు.

**తవ జల మమలం యేన నిపీతం**
**పరమ పదం ఖలు తేన గృహీతం**
**మాతర్గంగే త్వయి యో భక్తః**
**కిలతం ద్రష్టుం నయమశ్శక్తః ॥**

"తల్లీ! నిర్మలమైన నీ జలము నెవడు కొద్దిగా పానముచేయునో, వానిని యముడు చూడలేడు. అట్టి భక్తుడు పరమపదమైన మోక్షమును పొందుచున్నాడు" అని ఆది శంకరాచార్యులు గంగాస్తోత్రములో రచించారు.

రాముడు శృంగబేరపురమువద్ద గంగానదిని సమీపించాడు. "సుమంత్రా! ఈరోజు మనోహరమైన ఈ గంగాతీరమున వసిస్తాము" అన్నాడు రాముడు సుమంత్రునితో.

సీతారామలక్ష్మణులు రథమును దిగారు. చెట్టుక్రింద విశ్రమించారు. సుమంత్రుడు రథమునుండి గుఱ్ఱాలనువిప్పి తానుకూడా రామునివద్ద ఆసీనుడయ్యాడు.

## నిషాదరాజు గుహుడు

ఆ ప్రాంతమును గుహుడు అనే నిషాదరాజు పాలిస్తున్నాడు. అతడు రామునికి బాల్య స్నేహితుడు. బోయజాతికి చెందినవాడు. గొప్ప బలవంతుడు.

రాముడువచ్చినట్లు విని గుహుడు మంత్రులతో, పరివారముతోకూడి రాముని దర్శించుటకు వచ్చాడు. గుహుడు వస్తున్నట్లు దూరమునుండియే చూచిన రాముడు ఎదురేగి కలిశాడు.

గుహుడు కన్నీరుకార్చుచు, రాముని కౌగిలించుకొని, "రామా! నీకు అయోధ్య ఎలాగో ఈ రాజ్యముకూడా అలాగే. రామా! నీలాంటి ప్రియమైన అతిథి ఎవరికి లభిస్తాడు? నా భాగ్యమే భాగ్యము. నన్ను ఆజ్ఞాపించు. నీ సేవాభాగ్యమును ప్రసాదించు.

"రామా! స్వాగతం. ఈ రాజ్యము నీది. ఈ భూమంతా నీదే. మేమంతా నీ సేవకులం. నీవు రాజువు. మమ్మల్ని అనుగ్రహించి ఈ రాజ్యమును పాలించు" అని తనవెంట తీసికొని వచ్చిన రుచికరమైన ఆహారాదులను రామునికి సమర్పించాడు.

శ్రీరాముడు ప్రేమతో గుహుని కౌగిలించుకొని, "గుహుడా! బంధుమిత్రాదులతో కూడి నీవు ఆనందముగానుండగా చూడగలుగుట నా భాగ్యము. మీరంతా క్షేమమేగదా! నీప్రేమ నాకెంతో హాయిని గూర్చినది.

**పద్భ్యా మభిగమా చ్చైవ స్నేహ సందర్శనేనచ**

"నీ పవిత్ర స్నేహాన్ని ప్రదర్శిస్తూ నా కొరకు పాదాలతో నడచివచ్చావు. నాకు ప్రియమైన మాటలు పలికావు.

"నీవు సమర్పించినదానిని విధిలేని పరిస్థితులలో నీకే తిరిగి ఇచ్చివేస్తున్నాను. గుహుడా! నేను ప్రస్తుతము ఎవరిచ్చినదికూడా అంగీకరించను.

**కుశ చీరాజిన ధరం ఫలమూలాశినం చ మామ్**
**విద్ధి ప్రణిహితం ధర్మే తాపసం వన గోచరమ్**

"గుహుడా! ప్రస్తుతము నేను నారచీరలు, జింకచర్మము, దర్భాసనములను ధరించి, ఫలమూలములను తింటూ అరణ్యములో నివసించే ధర్మనిరతుడనైన మునిని అని తెలుసుకో.

"నాకు ఇప్పుడు ఏమీ అవసరంలేదు. నాకు కావలసిందల్లా గుఱ్ఱములకు ఆహారము మాత్రమే. ఈ అశ్వములు దశరథమహారాజుకి ప్రియమైనవి. వాటిని తృప్తిపరిస్తే నాకు అదియే అర్చన" అన్నాడు రాముడు.

రామునిమాటలువిన్న గుహుడు అశ్వములకు వెంటనే ఆహారపానీయములను ఇమ్మని ఆజ్ఞాపించాడు. తరువాత రాముడు సాయంకాలసంధ్యను అర్చించి, లక్ష్మణుడు తెచ్చిన పవిత్ర జలమును పానంచేశాడు.



లక్ష్మణుడు గంగోదకముతో రాముని పాదాలు కడిగాడు. రాముడు నేలపై పడుకున్నాడు. సీతమ్మకూడా నేలపై శయనించింది.

లక్ష్మణ సుమంత్రులతోకూడి రాముని సంరక్షిస్తూ గుహుడుకూడా ఆరాత్రి మేల్కొని యుండినాడు.

గుహుడు లక్ష్మణునితో ఇలా పలికాడు. "నాయనా! లక్ష్మణా! నీవుకూడా పడుకొని విశ్రాంతి తీసుకో. మేము శ్రమకు అలవాటు పడ్డవాళ్ళం. నీవు కష్టమెరుగవు. రాముని రక్షణలో రాత్రంతా మేము మేల్కొని ఉంటాము. ఈ లోకంలో నాకు రామునికంటె ఇష్టుడు మరొకడు లేడు. నేను సత్యముపై ప్రతిజ్ఞచేసి చెప్తున్నాను.

"నాకు రాముని అనుగ్రహ మొక్కటి వుంటేచాలు. నేను, నా బంధువులు ధనుర్బాణములు ధరించి సీతారాములను రాత్రంతా సంరక్షిస్తాము. ఈ అడవిలో నాకు తెలియనివిషయము లేదు;" అన్నాడు.

రాముని సేవలో రాత్రంతా మేల్కొనుటకు గుహుడు నిర్ణయించుకున్నాడు. ఈ అవకాశం లభించినందుకు పొంగిపోతున్నాడు.

లోకంలో అందరూ అజ్ఞాననిద్రలో మునిగిపోవువారేగాని భక్తి జాగరణలో, జ్ఞాన జాగరణలో మేల్కొనియుండువారెవరు? దృఢనిశ్చయముగల భక్తులే అలా జీవించగలరు. అట్టి పవిత్రమైన భక్తుడు గుహుడు. కనుక "రాముని సేవలో మేల్కొని ఉంటాను" అంటున్నాడు.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ**

"సర్వభూతములకు ఏది రాత్రియో సంయమయోగికి అది పగలు" అంటాడు భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ.

ఇంద్రియవిషయాలయందు లోకులు మేల్కొనిఉంటారు గనుక వారు భగవంతుని విషయంలో నిద్రిస్తుంటారు. మహాత్ములు సదా భగవంతుని ఎరుకలో ఉంటారు గనుక ప్రాపంచిక విషయాలయందు స్పృహలేకుండా ఉంటారు.

**Error stands in the same relation to Truth as sleeping to waking.**

"అసత్యమునకు సత్యముతోగల సంబంధము నిద్రకు జాగ్రదవస్థతోగల సంబంధం లాంటిది" అంటాడు గోథే.

జ్ఞానజాగరణలో జీవితానికి పూర్ణత్వాన్ని కల్పించుకొనువారే ధన్యజీవులు. అట్టివారి కోవలో నిషాదుడైనా, గుహుడు చేరిపోయాడు. రాముని శయ్యకు పర్ణములు పరచి, భక్తితో కావలాయుండి రామానుగ్రహానికి పాత్రుడై తరించాడు.

రాముడు నీకేముందనిగాని, నీవు ఏమి పెట్టావనిగాని చూడడు. నీ హృదయాన్ని చూస్తాడు. నీ భక్తిని చూస్తాడు. గుహుని భక్తిని త్యాగరాజస్వామికూడా స్మృతిలోఉంచుకొని రాముని కీర్తిస్తాడు.

**ధరాతలమున గుహుని వలె పత్ర**
**తల్ప మొనర్చితినా శ్రీత్యాగరాజుపై**
**పరాకు నీకేలరా రామ** ॥పరాకు॥

పత్రాలతో పడకనమర్చి పరమాత్మ అనుగ్రహానికిపాత్రుడై తరించిన గుహుని పవిత్ర భక్తిని స్మరిస్తూ, కిరణావళి రాగంలో కీర్తిస్తూ, చరాచరాత్ముడైన రాముని చరణములవద్ద సంతసిస్తున్నాడు త్యాగానికి రాజైన త్యాగరాజు.

**నీ దాసుని దాసుడా గుహుడు తావక దాస్య మొసంగినావు**

"దాశరథీ! నీ సేవకుడైన లక్ష్మణునికి సేవకుడై ఒక్కరాత్రి గడిపినందుకు గుహుని ఉద్ధరించినావు" అని భద్రాచలరామదాసు కీర్తించినాడు.

గుహుని మాటలువిన్న లక్ష్మణుడు, "గుహుడా! దోషరహితుడా! నీవు ధర్మాసక్తుడవు. నీ ఆశ్రయంలో మాకు కొరతఉంటుందా?

"గుహా! సీతారాములు ఈవిధంగా నేలపై పడుకొనిఉండగా నాగుండె ముక్కలవుతూ ఉంది. ఇక నాకు నిద్రెలా వస్తుంది? దేవదానవులు కలిసి యుద్ధమున ఎవనిని ఓడించలేరో అట్టి రాముడు ఈనాడు తృణశయనుడై ఉన్నాడు.

"ఈ రాముడు దశరథునికి ప్రియమైన కుమారుడు. పుత్రులలో ముఖ్యుడు. రాముడు కానలకేగిన పిమ్మట రాజు ఎక్కువకాలం జీవించడు. కొద్దిరోజులలో రాజ్యము అనాథ అయిపోతుంది.

"దశరథుడు, రామమాత కౌసల్య, మా తల్లి సుమిత్ర ఈ రాత్రి జీవించిఉంటారని నేను భావించడంలేదు. ఒకవేళ నా తమ్ముడైన శత్రుఘ్నునికొరకు నిరీక్షిస్తూ మా తల్లి జీవించవచ్చునేమో గాని కౌసల్యమాత్రం జీవించదు. నా దుఃఖమంతా వారినిగురించే.

"మేము తిరిగివచ్చువరకు రాజు జీవించిఉంటాడా? మేము మరల ఆయనను దర్శించగలమా?" లక్ష్మణుడు గుహునితో ఇలా పలుకుతూ విలపించుచుండగా తెల్లవారి పోయింది. లక్ష్మణుని మాటలనాలకించిన గుహుడు దుఃఖపీడితుడై జ్వరముతో బాధపడు ఏనుగువలె శోకిస్తూ కన్నీరుకార్చాడు.

సూర్యోదయమైంది. రాముడు లక్ష్మణుని పిలిచాడు. గంగానదిని దాటెదమని చెప్పినాడు. వెంటనే చక్కని నావను తీసికొనిరమ్మని గుహుడు మంత్రులను ఆజ్ఞాపించాడు.

మంత్రులు వెళ్ళి అందమైన నావను తీసికొనివచ్చారు. గుహుడు రాముని సమీపించి, చేతులు జోడించి, "ప్రభూ! నావ వచ్చింది. నేను ఇంకేమిచేయాలో ఆజ్ఞాపించండి" అన్నాడు.

"గుహుడా! చాలా సంతోషము.నేను కోరినట్లు చేశావు. మమ్మల్ని నావ ఎక్కించు;" అన్నాడు రాముడు.

అందరూ గంగాతీరమువైపు నడిచారు. అపుడు సుమంత్రుడు ధర్మాత్ముడైన రాముని సమీపించి, చేతులు జోడించి, "ఇపుడు నేనేమిచేయాలి?" అని అడిగాడు.

రాముడు సుమంత్రుని భుజంతట్టి, "సుమంత్రా! అయోధ్యకు తిరిగివెళ్ళి రాజుగారిని సావధానంతో సేవిస్తూవుండు. ఇంతవరకు చక్కని సేవలందించావు. ఇక్కడనుండి మేము నడచివెళ్తాము. నీవు తిరిగి అయోధ్యకివెళ్ళు;" అన్నాడు.



సుమంత్రునికి రాముని వదలిపెట్టి వెళ్ళాల్సిన సమయం ఆసన్నమైనట్లు తెలిసిపోయింది. "రామా! నీవు సోదరునితో, ధర్మపత్నితో కలిసి సామాన్యునివలె అరణ్యములో సంచరిస్తున్నావు. ఇది మరొకరు ఆచరించలేని కార్యము.

"నీకు ప్రాప్తించిన ఈ కష్టమునుగూర్చి తలచినవారికి మృదుత్వానికి, ఋజుత్వానికి ఫలమే లేదనే భావన కల్గుతుంది. రామా! మాఅంత దురదృష్టవంతులు ప్రపంచంలో మరొకరుండరు;" అని పలుకుతూ బిగ్గరగా ఏడ్చాడు సుమంత్రుడు.

"సుమంత్రా! ఇక్ష్వాకువంశానికి నీకు మించిన హితులెవ్వరూ లేరు. రాజుగారు నన్ను గూర్చి దుఃఖించకుండా చూసుకో. ఆయన వృద్ధుడు. ఆయన ఆజ్ఞలేవీ నిరాకరించకండి.

"నేను రాజుగారికి పదేపదే నమస్కరించానని చెప్పు. అరణ్యములో జీవిస్తున్నందుకు నేనుగాని, లక్ష్మణుడుగాని, సీతగాని ఏమాత్రము దుఃఖించడంలేదని చెప్పు. మా తల్లు లందరికీ మేము ముగ్గురము పాదాభివందనము చేశామని చెప్పు.

"భరతుని శీఘ్రంగా తీసికొనివచ్చి రాజ్యాధికారము అప్పగించండి. భరతుడు రాజైతే ఎవరికి ఏకష్టమూ వుండదు.

"తల్లులందరిని సమానంగా చూసుకోమని నామాటగా భరతునికి చెప్పు" అన్నాడు రాముడు. ఆమాటలు విని సుమంత్రుడు రామునితో ఇలాపలికాడు.

"రామా! నీవు లేకుండా నేను అయోధ్యకు ఎలా తిరిగివెళ్ళేది? ఆనాడు రాముడున్నను రథాన్నిచూచి పౌరులు అంతగా దుఃఖించారు. ఈనాడు నీవు లేకుండా నేను ఈ రథాన్ని తీసికొనిపోతే వారిగుండెలు పగిలిపోవచ్చు.

"కౌసల్యకు నేను ఏమిచెప్పేది? నీ కుమారుని అరణ్యములో విడచివచ్చినాను అనే అప్రియవాక్యాన్ని ఆమెతో చెప్పమంటావా? నీవు అధిరోహించిన రథమునులాగిన ఈ గుఱ్ఱములు నీవులేని రథమును ఎలా తీసికొనివెళ్తాయి?

"రామా! నేను తిరిగి అయోధ్యకు వెళ్ళలేను. నీతోపాటే అరణ్యానికి వచ్చునట్లు ఆజ్ఞ ఇవ్వు. ఇంతగా ప్రాధేయపడుతున్నను నన్ను నీవు ఉపేక్షిస్తే నేను రథముతోకూడా ఇక్కడే అగ్నిప్రవేశం చేస్తాను.

"రామా! ఇంతవరకు నీ రథాన్ని నడపి సుఖించిన నేను ఇకమీదట నీతోపాటు వనవాస సుఖాన్ని కూడా పొందే అవకాశం కల్పించు. "సుమంత్రా! నీవు ఇక్కడే మాతోనే వుండు" అనే ఒక్కమాటను నీనుండి వింటే చాలు. అంతకుమించి ఈ జీవితంలో నేను ఆశించేది మరొకటి వుండదు. నా శిరమువంచి నీకు సేవచేస్తాను. వనవాసము పూర్తిఅయిన పిదప నిన్ను ఈ రథంలోనే అయోధ్యకు తీసికొనివెళ్తాను.

"రామా! ఈ పద్నాలుగు సంవత్సరాలు నీ సన్నిధిలో నాకు క్షణంలాగా దొర్లిపోతాయి. అలాకానిచో నేను అయోధ్యలో క్షణమొక యుగంలా గడపవలసివస్తుంది.

**భక్తం భృత్యం స్థితం స్థిత్యాం త్వం న మాం హాతు మర్హసి**

"నేను నీకు భక్తుణ్ణి. భృత్యుణ్ణి. మర్యాదను రక్షించువాడను. నన్నువిడువకు;" అని రోదిస్తున్న సుమంత్రునితో రాముడు ఇలా పలికాడు.

"సుమంత్రా! నాపై నీకుగల భక్తి నాకు తెలుసు. నేను నిన్ను అయోధ్యానగరానికి ఎందుకు పంపుతున్నానో చెబుతాను. విను.

"సుమంత్రా! నీవు అయోధ్యకు వెళ్ళగానే నిన్నుచూసి నేను వనవాసము చేస్తున్నట్లు గ్రహించి కైకేయి సంతసిస్తుంది. నేను అడవికి చేరినట్లు ఆమెకు నమ్మకం కల్గుతుంది.

"అంతేగాదు. రాజుపై అవిశ్వాసము పోతుంది. నీవు అయోధ్యకు వెళ్ళడంవలన నన్ను, రాజుగారిని సంతోషపెట్టినవాడవు అవుతావు;" అని అనేకవిధముల సుమంత్రుని ఓదార్చి, రాముడు గుహునితో ఇలా పలికాడు.

"గుహుడా! నేను జనులున్న వనములో ఇప్పుడు నివసించకూడదు. నేను ఆశ్రమమునందే జీవించాలి. మునులకు అలంకారమైన జడలనే ధరించాలి. మఱ్ఱిపాలు తీసికొనిరా;" అన్నాడు.

గుహుడు మఱ్ఱిపాలు తీసికొనివచ్చాడు. ఆ క్షీరముతో రామలక్ష్మణులు జడలు ముడుచుకున్నారు. రాముడు జడధారి అయ్యాడు. రామలక్ష్మణులు ఋషులవలె శోభించారు.

సీతారామలక్ష్మణులు నదిఒడ్డున నిలిచియున్న నావ వద్దకు వచ్చారు. రాముడు లక్ష్మణునితో ఇలా పలికాడు. "లక్ష్మణా! నావ నిలిచియుంది. మెల్లగా ఎక్కు. తరువాత సీతను కూడా ఎక్కించు" అన్నాడు.

లక్ష్మణుడు రామునిమాటలు విని ముందు సీతను ఎక్కించి తరువాత తానెక్కాడు. సీతాలక్ష్మణులు ఎక్కిన తరువాత రాముడుకూడా నావ నెక్కాడు. నావ నెక్కునపుడు పఠించే మంత్రాన్ని రాముడు పఠించాడు. సీతారామలక్ష్మణులు నదికి నమస్కరించారు.

ఈ సందర్భమున ఆంధ్రదేశంలో బహుళప్రచారములోయున్న ఒక సన్నివేశానికై మీరు ఎదురు చూస్తున్నారని నాకు తెలుసు. రాముని నావలో ఎక్కించుకొనుటకు నిరాకరించిన పడవవాని ప్రస్తావన రాలేదని మీరు ఆలోచిస్తూవుంటారు. ఇది వాల్మీకి రామాయణంలో లేదు. సంత్ తులసీదాస్ మహాత్ముడు రామచరితమానసంలో రచించాడు. అది కూడా చెప్పుకొని ఆనందిస్తాం.

రామలక్ష్మణులు గంగాతీరానికి వచ్చారు. నావను తెమ్మని నావికునితో చెప్పారు. వాడు నావను తీసుకురాలేదు సరిగదా, రాముని విషయమంతా వాడికి తెలిసిపోయినట్లు, ఆయన పాదధూళి సోకి ఒకబండ స్త్రీగా మారినట్లు, ఆయన పాదంపడితే తన నావ నారిగా మారితే తనబ్రతుకు అన్యాయమగునట్లు పెద్ద ఉపన్యాసంచేశాడు.

నావికుడు రామునితో ఇలాఅంటాడు.

"అయ్యా! నా కుటుంబమును పోషించుకొనుటకు ఈ నావే నాకు ఆధారము. ఈ నావ నారిగా మారితే, ఆవిడని పోషించనూలేను. నాకు నావకూడా లేకుండాపోతుంది. కనుక మీ చరణాలు కడిగే అవకాశాన్ని నాకివ్వండి. మీ పాదాలకున్న ధూళిని కడిగేసి నిర్భయంగా మిమ్మల్ని ఎక్కించుకుంటాను" అంటాడు.



ఎవని నామమును ఉచ్చరించి జనులు సంసారసాగరాన్ని దాటుచున్నారో అట్టి రాముడు గంగానదిని దాటించమని నావికుని అడుగుచున్నాడు.

"నావికా! సరే! అలాగే! గంగను తెచ్చి నాపాదాలు కడుగు" అన్నాడట రాముడు.

ఆమాటలు వినేసరికి గంగకు సందేహం కల్గింది. ఈ రాముడు విష్ణుదేవుడేనా? కాదా? అనే సంశయం గంగాదేవికి కల్గింది. నావికుడు గంగాజలం తీసికొని రాముని సమీపించాడు. పాదాలపై పోసేటపుడు గంగాదేవి రాముని పదనఖములు చూసి సంతోషించింది. "అవును. ఇతడు శ్రీమహావిష్ణువే. ఈ పాదనఖములనుండే నేనుపుట్టాను" అని తృప్తిచెందింది గంగమ్మ.

కొయ్యపళ్ళెంలో రాముని పాదాలుంచాడు నావికుడు. రాముని చరణముల క్రింద చేతులుంచి రాముని పాదాలను పట్టుకొని కడుగుతున్నాడు. నావికుని చేతులపై రాముని పాదాలున్నందున పాదాలను సమంగా నిలబెట్టలేక రాముడు అటూ ఇటూ కదులుతున్నాడట.

"నావికుడా! జాగ్రత్త! ఏమిటి? అలా కడుగుతున్నావు. నేను పడిపోతానేమో!" అన్నాడు రాముడు.

"రామా! ఈ ప్రపంచంలో అవతరించిన నీవు ఎక్కడ పడిపోతానో అని సందేహిస్తుంటే; మాబోటి సామాన్యులు మాయాసంసారంలో పడకుండా నిలువగలరా? అయినా ఫరవాలేదు. మీరేమీ విచారించకండి. దానికి ఉపాయం చెబుతాను. మీరు మీచేతులతో నాతల పట్టుకోండి" అంటాడు.

రాముడు వాడితలపై రెండుచేతులు పెట్టి నిలబడుతాడు. ఏ మహాత్ముని చూపు పడితేనే జన్మరాహిత్యం జరుగుతుందో అట్టి రాముడు ఈ నావికుని మస్తకముపై తన అమృత హస్తములను ఉంచాడు అని పరవశిస్తూ దేవతలు పుష్పవృష్టిని కురిపించారు.

**బరషి సుమన్ సుర్ సకల సిహాహీఁ**
**ఏహి సమ్ పుణ్యపుంజ్ కొఉ నాహీఁ...**

"ఈ నావికునివంటి కృతపుణ్యపుంజులు మరొకరు లేరని దేవతలు సుమవృష్టిని కురిపించారు" అంటాడు తులసీదాస్.

సీతారామలక్ష్మణులు నావనెక్కారు. నావ కదిలింది. గంగాదేవి పులకరించిపోయింది. "ఆహా! ఏమి నేటి వైభవము! నదులు సాగరంవద్దకు వెళ్ళి కలవడం మనం చూస్తున్నాము. ఈనాడు నా భాగ్యము ఏమని చెప్పాలి? సాగరమే నావద్దకు కదిలివచ్చి నన్ను కడతేర్చుచున్నది" అని పరవశించిందంట గంగామాత.

నావ నదిలో పోతూవుంది. ఈలోగా నావికునికి ఒక ఆలోచన కలిగింది. వెంటనే ముందుకుపోతున్న నావను వెనక్కితిప్పి బయలుదేరిన ప్రదేశం వైపు నడుపుతున్నాడట. ఇలా ఉత్తరదక్షిణాలవైపు పడవను త్రిప్పుకుంటూ తిరుగుతున్నాడట. వీడు ఇలా ఎందుకు తిరుగుచున్నాడో రామలక్ష్మణులకు అర్థం కాలేదు. గంగాదేవి మాత్రం సంతోషిస్తూ ఉందట. "మంచిపని చేస్తున్నాడు ఈ నావికుడు. రాముని ఎక్కువసేపు నాలోనే ఉంచుతున్నాడు" అనుకున్నదట గంగమ్మ.

"ఓయీ! ఏమిటీ తిరుగుడు? మమ్మల్ని తీరం చేరుస్తావా? లేదా?" అని అడిగాడట రాముడు. సర్వులను దుఃఖసముద్రమును దాటించి శాంతితీరాలకు చేర్చే రాముడు మమ్మల్ని తీరంచేర్చవా? అని నావికుని అడుగుచున్నాడు.

నావికుడు రామునితో ఇలా పలుకుచున్నాడు. "అయ్యా! కైకేయి మహారాణి మిమ్మల్ని పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసంచేసి రమ్మన్నదిగాని ఎక్కడెక్కడ ఎంతెంతకాలం ఉండాలో చెప్పిందా? మాతో కొంతసేపు నదిలో గడిపితే ఏంపోతుంది?" అంటాడు.

రాముని తీరంలో వదలిపెట్టడం ఇష్టంలేక ఆ నావికుడు అలా తిరుగుతూవున్నాడు. పరమాత్మను సదా ఎవరు విడవకుండా పట్టుకొనిఉంటారో వారే ధన్యజీవులు.

నావికుడు నావను తీరానికి చేర్చాడు. సీతారామలక్ష్మణులు దిగినారు. రాముని మనోభిప్రాయమును గ్రహించిన జానకి రత్నాలుపొదిగిన ఉంగరాన్ని తీసి నావికుడికి ఇవ్వబోయింది. కానీ వాడు గ్రహించలేదు.

"అయ్యా! నేను మీనుండి వేతనమును స్వీకరించను. గంగానదిని దాటించేవాడ్ని నేను. జీవననదిని దాటించేవారు మీరు;" అని రాముని పాదాలను గట్టిగ పట్టుకున్నాడాకైవర్తకుడు.

**నాథ ఆజుమే, కాహ్ న పావా! మిటే దోష్ దుఃఖ్ దారిద్ దావా!**

**బహుత్ కాల్ మై కీన్హి మజూరీ! ఆజు దీన్హి బిధి బని బలిభూరీ ॥**

"ప్రభూ! ఈరోజు నేను పొందని దేమున్నది? నాపాపాలు, దుఃఖాలు, దారిద్ర్యాలు ఈరోజు అదృశ్యమైనాయి. నా జీవితకాలమంతా జీవనానికే సంపాదించుకున్నాను. ఈనాడు నా వేతనాన్ని భగవంతుడు పూర్ణంగా నాకు ముట్టచెప్పాడు;" అని ఆనందాశ్రువులను రాల్చాడు భక్తుడైన నావికుడు.



శ్రీరాముడు భక్తుడైన నావికుని ఆశీర్వదించి, భక్తి వృద్ధి యగునట్లు దీవించాడు. ఇది తులసీదాస్ చెప్పిన భక్తిగాథ.

ఇక వాల్మీకి రామాయణానికి పోదాం.

సీతారామలక్ష్మణులు నావనెక్కేందుకు గంగాతీరంలో సిద్ధంగా ఉన్నారు.

రాముడు గుహుని, సుమంత్రుని వీడ్కొలిపినాడు. నావ కదిలింది. గంగానది మధ్యకు నావ చేరగానే సీతమ్మ చేతులు జోడించి గంగమ్మను ఇలా ప్రార్థించింది.

"అమ్మా! గంగా భవానీ! మేము వన వాసము పూర్తిచేసికొని తిరిగివచ్చునపుడు నిన్ను పూజిస్తాను. అర్హులైనవారికి లక్షలాది గోవులను, వస్త్రములను దానం చేస్తాను;" అని పలికింది.

నావ తీరాన్ని చేరింది. నావదిగి, సీతాలక్ష్మణులతో కూడి రాముడు నడిచి వెళ్ళాడు.



"లక్ష్మణా! జాగ్రత్తగా ఉండు. జనసంచారమున్న ప్రదేశమైనా, నిర్జనప్రదేశమైనా రక్షణ విషయంలో జాగ్రత్తగా ఉండు. జనశూన్యమైన అరణ్యప్రాంతాలలో అజాగ్రత్తతో ఉండకూడదు.

"నీవు ముందు నడుస్తూ వుండు. నీవెనుక సీత నడుస్తుంది. మీ ఇద్దరిని కాపాడుతూ నేను వెనుక వస్తుంటాను. ఇక్కడ మనము ఒకరికి మరొకరు అండగా ఉండాలి.

**న హి తావ దతిక్రాన్తా సుకరా కాచన క్రియా**

"ఏ పని అయినా చేయిదాటిపోయిన తరువాత దానిని మరల సరిచేయడం సాధ్యం కాదు"అన్నాడు రాముడు. అలాగే ముందు లక్ష్మణుడు, వెనుక సీతమ్మ నడవసాగారు.

అవతలి తీరాన నావదిగి నడిచివెళ్తున్న రాముని కనపడువరకు చూచి, కనుమరుగు కాగానే దుఃఖాన్ని ఆపుకోలేక సుమంత్రుడు కన్నీరుకార్చాడు.

రాముడు వత్సదేశములోని అరణ్యంలో ప్రవేశించాడు. సాయంకాల సంధ్యను అర్చించి, లక్ష్మణునితో ఇలా పలికాడు.

"లక్ష్మణా! ఇప్పుడు మనం వేరే దేశంలో ఉన్నాము. సుమంత్రుడుకూడా వెళ్ళిపోయాడు. మనం ఒంటరిగా ఉండవలసిన రాత్రులలో ఇది మొదటిరాత్రి. నీవు భీతిచెందకు.

"లక్ష్మణా! ఈనాటినుండి రాత్రులందు మనమిద్దరము మేల్కొనియుంటాము. సీత యోగక్షేమాలు మనమీదే ఆధారపడి ఉన్నాయి. లక్ష్మణా! ఏవో ఆకులు తెచ్చి, నేలమీద పరచుకొని ఈ రాత్రి ఎలాగో గడుపుతాము" అన్నాడు రాముడు.

## తొలిరేయి

పట్టుపరుపులపై, మెత్తని తలగడాలపై పడుకొనే రామలక్ష్మణులు నేలమీద ఆకులను పరచుకున్నారు. వాటిపై పడుకొని రాముడు లక్ష్మణునితో చెప్తున్నాడు.

"లక్ష్మణా! నాన్నగారు చాలా దుఃఖపడ్తూఉంటారు. తనకోరిక ఫలించినందున కైకేయి చాలా ఆనందంగా ఉంటుంది. రాజ్యకాంక్షతో మత్తెక్కిన మనసుగల ఈ కైకేయి రాజుగారి ప్రాణాలుతీయదు కదా!

"తండ్రి కామంతో కైకేయికి లొంగిపోయాడు. నాకుకూడా దూరమైనాడు. వృద్ధుడైన రాజు ఇప్పుడేమి చేయగలడు? ఇదంతా చూస్తుంటే అర్థధర్మాలకంటె కామమే గొప్పది యేమో! అనికూడా నాకనిపిస్తూవుంది.

"లక్ష్మణా! ఎంత బుద్ధిహీనుడైనా, ఒక స్త్రీ మాటవిని, మనతండ్రి నన్ను విడిచినట్లు, మాటవినే కుమారుని ఎవరైనా విడిచిపెడ్తారా?

**అర్థ ధర్మౌ పరిత్యజ్య యః కామ మనువర్తతే**

**ఏవ మాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా!**

"అర్థధర్మాలను విడిచి కేవలము కామమునే ఆశ్రయించువాడు దశరథునివలె తొందరగా ఆపదలలో చిక్కుకుంటాడు.

"లక్ష్మణా! ఈకైకేయి మూడు కారణాలచే మనఇంటికి చేరిందని నేను భావిస్తున్నాను. 1. దశరథుని మరణము 2. నా వనవాసము 3. భరతుని రాజ్యపాలనము.

"రాజమాత అనే గర్వముతో ఒళ్ళుమరచి నాకారణముగా మనతల్లులైన కౌసల్యా సుమిత్రలను కైకేయి బాధించదుకదా! లక్ష్మణా! అందుచేత నీవు ఉదయాన్నే లేచి అయోధ్యకు వెళ్ళు. అనాథులైన మనతల్లులకు అండగావుండు. సీతతోకలిసి నేను దండకారణ్యం వెళ్తాను.

కైకేయిని న్యూనతపరుస్తూ రాముడు భాషించడం ఈసందర్భంలోనే మనం చూస్తున్నాము. అనేక కోణాల్లో అనుమానించడం, విమర్శించడం కూడా చూస్తున్నాము. ఇది ఎంతవరకు సమంజసము? కైకేయిపాత్ర అలాంటిదేనా?

ఈ విషయంలో సందేహానికి అవకాశంలేదు. కైకేయి కుటిలస్వభావం కలది. అబద్ధాలు చెబుతుంది. ఈర్ష్యకు పుట్టినిల్లు. అసూయకు మారుపేరు.

తనవలె సమాన హక్కు, హోదా గలిగిన దశరథుని రాణులను కైకేయి సమానంగా ఆదరించిందా? లేదు అని సంశయరహితంగా చెప్పవచ్చు.

1. దశరథుడు కైకేయితో ఇలా పలికాడు.

**న మయా సత్కృతా దేవి సత్కారార్హా కృతే తవ**

"సత్కారాలు పొందుటకు అర్హురాలైనను నీవలన నేను కౌసల్యను సత్కరించలేదు;" అని దశరథుడే కైకేయితో చెప్పాడు.

దీనిని బట్టి చూస్తే కైకేయి భర్తను లొంగదీసుకొని, సవతులను ఎలా కష్టపెట్టిందో మనం ఊహించుకోవచ్చు. ఈవిషయాన్ని కైకేయి ప్రియసఖియైన మంథరకూడా ధృవపరచడం మరొక విశేషం.

2. మంథర కైకేయితో ఇలా చెబుతుంది.

**దర్పాన్నిరాకృతా పూర్వం త్వయా సౌభాగ్యవత్తయా**
**రామమాతా సపత్నీ తే కథం వైరం న శాతయేత్**

"నేనే భర్తకు ఇష్టురాలైన భాగ్యవంతురాలను అనే గర్వముతో నీవు కౌసల్యను అనాదరముగా చూసియున్నావు. రాముడు యువరాజైతే నీ సవతియైన కౌసల్య పగతీర్చుకోకుండా ఉంటుందా?" ఇది మంథర చెప్పినమాట.

కైకేయి ఇంతకుపూర్వమే రాజుయొక్క అండచూచుకొని అంతఃపురములో రాణులను ఎంత అనాదరంగా చూసిందో అర్థమవుతుంది.

వీరి, వారి అభిప్రాయాలు అలాఉంచి, కైకేయి పెట్టిన బాధలకు గురియైన కౌసల్య నోటినుండి కూడా కైకేయి కుటిలస్వభావం వ్యక్తమవుతుంది.

3. తన వనవాసవార్తను రాముడు కౌసల్యతో చెప్పగనే కౌసల్య రామునితో ఇలా చెబుతుంది. ఎంత దురదృష్టకరమైన విషయమో ఆలోచించండి.

**న దృష్టపూర్వం కల్యాణం సుఖం వా పతిపౌరుషే**
**అపి పుత్రేఽపి పశ్యేయ మితి రామాస్థితం మయా ॥**



"భర్త అధికారంలో ఉన్నపుడు నేను ఏసుఖానికి, శుభానికి నోచుకోలేదు. పుత్రుడు రాజయిన తరువాత సుఖించగలను అని భావించాను.

**త్వయి సన్నిహితేఽప్యేవ మహమానం నిరాకృతా**
**కిం పునః ప్రోషితే తాత ధ్రువం మరణ మేవ మే ॥**

"నాయనా! నీవు దగ్గరఉండగనే నన్నిట్లు బాధిస్తున్నారు. నీవు వనవాసము వెళ్ళిన తరువాత ఇకచెప్పాలా? నాకు మరణమే ఖాయము."

రాజు నీడచూసుకొని కైకేయి కౌసల్యను ఎంత ఆవేదనకు గురిచేసిందో పైరెండు శ్లోకాలనుబట్టి మనం గ్రహించవచ్చు. అధర్మమార్గాల్లో ఆధిపత్యాన్ని సాధించి, అక్రమ ప్రయోజనాలకు వినియోగించడంలో కైకేయి అందెవేసిన చేయి. తన వరాల కారణంగా భర్త మరణిస్తాడని అర్థమౌతున్నా తన దుష్టసంకల్పాన్ని విడిచిపెట్టలేదంటే ఆవిడ ఎంత కఠినాత్మురాలో ప్రత్యేకించి చెప్పనవసరంలేదు.

కౌసల్య మరొకమాటకూడా రామునితో చెబుతుంది.

**నిత్య క్రోధతయా తస్యాః కథం ను ఖరవాది తత్**
**కైకేయ్యా వదనం ద్రష్టుం పుత్ర శక్ష్యామి దుర్గతా ॥**

"రామా! కైకేయి సదా కోపముతో ఊగిపోతూ వుంటుంది. పరుషవాక్కులనే మాట్లాడుతూ ఉంటుంది. శోకమునునుభవించు నేను ఆమె ముఖాన్ని ఎలా చూడగలను?" అంటుంది కౌసల్య.

ఇంతవరకు కఠినాత్మురాలిగా, స్వార్థపూరితురాలుగా మనకు కైకేయి తెలిసింది. అంతే గాదు. అయోధ్య అంతఃపురములో అబద్ధాలకు అలవాటుపడిందికూడా కైకేయి ఒక్కతే.

1. పట్టాభిషేకం జరుగవలసినరోజు సుమంత్రుడు దశరథుని మందిరానికివెళ్ళి చింతాక్రాంతుడైయున్న రాజును చూచినపుడు సుమంత్రుని ఆలోచనలను నిరోధిస్తూ కైకేయి ఇలా చెబుతుంది.

**సుమంత్ర రాజా రజనీం రామహర్ష సముత్సుకః**
**ప్రజాగర పరిశ్రాన్తో నిద్రావశ ముపేయివాన్**

"సుమంత్రా! రామునికి యౌవరాజ్యాభిషేకము జరుగుచున్నది అనే ఆనందములో రాజుగారు రాత్రంతా నిద్రలేక అలసిపోయినారు. ఇప్పుడు నిద్రిస్తున్నారు;" అన్నది కైకేయి.

రాజుగారికి నిద్రలేని విషయం అవివాదం. కానీ ఎందుకు లేదు? అనేచోటే వివాదమంతా. తన కఠోరవచనాలతో రాజు గుండెల్లో శూలాలుగ్రుచ్చి, కన్నీటిలో దశరథుని స్నానం చేయించిన కైకేయి మనసును మోసంచేసుకుంటూ, మాటను మార్చుతూ ఆనందావేశముతో రాజు నిద్రించలేదని చెప్పడం ఎంతనిజం? పైగా రాజు ఒకవైపు దుఃఖిస్తూఉండడాన్ని సుమంత్రుడు సాక్షిగా వీక్షిస్తున్న సమయంలోనే రాజుగారు నిద్రిస్తున్నారని పలికిందంటే కైకేయి ఎలాంటి వ్యక్తో, ఎంతకు తెగిస్తుందో మీరే ఊహించుకోవచ్చు.

సుమంత్రుడు సునిశిత ప్రజ్ఞాశాలి. దశరథుని ఆవేదనకు కారణాన్ని ఊహించేరీతిలో ఆలోచనలు సాగించగనే, అతని ముఖంలో మనసును చూస్తూ, సుమంత్రుని ఆలోచనలను శాశ్వతంగా నిరోధిస్తూ **"నాత్ర కార్యా విచారణా"** ఈవిషయంలో ఆలోచింప పనిలేదు అని సమయస్ఫూర్తితో మాట్లాడింది.

2. రాముడు సుమంత్రునితోగూడి దశరథునివద్దకు వచ్చినపుడు కైకేయి ఎన్ని అబద్ధాలు చెప్పించో చూడండి.

"అమ్మా! మాతండ్రిగారు ఎందుకలా దుఃఖిస్తున్నారు? నీవేమి అనలేదు కదా?" అని రాముడు కైకేయిని అడిగినపుడు ఎంత చక్కగా అబద్ధంచెప్పి తప్పుకున్నదో చూడండి.

**న రాజా కుపితో రామ వ్యసనం నాస్య కించన**
**కించి న్మనోగతం త్వస్య త్వద్భయా న్నాభిభాషతే ॥**

"రామా! రాజుగారికి కోపంరాలేదు. కష్టము కొద్దిగాకూడాలేదు. తన మనసులో ఉన్న విషయాన్ని నీకు చెప్పడానికి భయపడుతున్నాడు" అని పలికింది.

రాజుకు కోపంరాలేదట. కష్టము కొద్దిగాకూడా లేదట. ఇంతవరకు దశరథుడు అనుభవించింది కైకేయి దృష్టిలో కష్టముగా కనిపించలేదు. ఇక ఆవిడ సమ్మతించే కష్టం ఎలా ఉంటుందో, దానిని అనుభవించడం జీవించియున్నవారికి సాధ్యమో కాదో మీరే ఆలోచించాలి.

రాజుగారికి క్రోధశోకాలు లేనేలేవని అబద్ధంచెప్పి, ఆయన మనసులోని విషయాన్ని చెప్పడానికి భయపడుతున్నాడు అనిచెప్పడం ఎంత దారుణం?

వాస్తవానికి దశరథుని మనసులో ఏవిషయముంది చెప్పడానికి? దుర్భరమైన దుఃఖం తప్ప.

తన మనసులోఉండే విషయాన్ని రాజుగారి మనసులోఉండే విషయంగా చిత్రీకరించడం కైకేయికే సాధ్యం.

"నీకొరకు ఏదైనా చేయడానికి సిద్ధం" అని దశరథుడు చెప్పిన తరువాత తన రెండు వరాలను ప్రస్తావించింది కైకేయి.

అలాగే ఇప్పుడుకూడా ముందు రామునివద్దనుండి శపథాన్ని విన్నతరువాతే వరాల విషయం చెప్పింది. కార్యసాధకురాలైన కైకేయిలో ఎంత కుటిలత్వముందో, ఎన్ని అబద్ధాలు నిండిఉన్నాయో మనం గ్రహించవచ్చు.

"రామా! నీవు తొందరగా అడవికి పోవాలి. నీవు పోనంతవరకు మానాన్న స్నానముగాని, భోజనంగాని చేయరు" అంటూ తన స్వార్థపూరిత ఆలోచనల్లో పరాకాష్ఠకు చేరింది. పైగా ఈ మాటను దశరథుని ఎదుటే బహిరంగంగా చెప్పగలిగిన సాహసవంతురాలు.

"నీవు వెళ్ళనంతవరకు రాజుగారికి భోజనముండదు" అనకుండా"భోజనం చేయరు" అని జాగ్రత్తగా పలికింది.

సరే బావుంది. అలాంటి స్త్రీయొక్క మాటల్ని దశరథుడు ఎందుకు విశ్వసించాలి? రాముడు ఎందుకు పాటించాలి? ఇది అందమైన ప్రశ్న. ఆలోచించదగిన ప్రశ్న.

**1. దశరథుడు :-** దశరథుడు ఎటువంటి పరిస్థితిలో అలా చేయవలసివచ్చిందో మీకు ఇంతకుముందే విపులంగా వివరించాను.

ఇక్కడ ఒక్కవిషయాన్ని అర్థంచేసుకుంటే చాలు. దశరథుడు కామలోలుడై, కైకేయికి వశమై ఇలాప్రవర్తించాడుఅనేది అపవాదు. ఇది సరైందికాదు.

దశరథుడు వృద్ధుడు. కైకేయికూడా వయసుమళ్ళిందే. ఈ దశలో దశరథుని ఆకోణంలో అంతగా ఊహించుకోవలసిన పనిలేదు.



పైగా అవి దశరథుడు ఈనాడిచ్చిన వరాలు కావు. ఈనాడు కాదంటే ఆవిడ చేసేదేమీ ఉండదు. ఆవిడ క్రూరాత్మురాలు అని తెలిసిపోగానే వరాలు నిరాకరించవచ్చు. అలా దశరథుడు చేయలేక పోవడానికి కామవశుడు కావడం కారణంకాదు. ధర్మవశుడు కావడమే. ఆయన బాధంతా కైకేయికి దూరముకావలసివస్తుందని కాదు. సత్యానికి దూరంకావలసివస్తుందని.

ఇక్ష్వాకు వంశానికి అపకీర్తిని ఆపాదించలేకనే దశరథుడు ధర్మపాశబద్ధుడయ్యాడు. కామ పాశబద్ధుడై మాత్రముకాదు. కానీ లోకులు అలాగే అనుకుంటారని, నిజంచెప్పినా తనను నమ్మరని దశరథుడే వాపోయాడు.

**యది సత్యం బ్రవీమ్యే తత్తదసత్యం భవిష్యతి**

"నేను సత్యము చెప్పినా దానిని అసత్యంగా జనులు భావిస్తారు" అంటాడు దశరథుడు.

మనమూ అదేకదా చేస్తున్నాము. మనలో చాలామంది దశరథుని బలహీనునిగానే భావిస్తున్నారు. పైగా భార్యచెప్పేమాటలు విని అక్రమమూర్గాన చరించే వారిని "దశరథా!" అని వేళాకోళంగా పిలవడం కూడా జరుగుతూవుంది! ఏం చేస్తాం? కర్మఫలాలు అనూహ్యమైనవి.

ప్రపంచం తనను విశ్వసించకపోవడమే గాక, తనను దూషిస్తుందనికూడా దశరథుడు ఊహించాడు.

**తం తు మాం జీవలోకోఽయం నూనమాక్రోష్టు మర్హతి**

"ఈ ప్రపంచమంతా నన్ను తప్పక దూషిస్తుంది. అలా దూషించినా తప్పులేదు" అని చెప్పుకొనిన ధర్మాత్ముడు దశరథుడు.

**2. రాముడు :-** తండ్రి ఇచ్చిన మాటను నిలబెట్టాలి అనేదొక్కటే రాముని సంకల్పం. పుత్రవాత్సల్యంతో తండ్రి ధర్మపథమును వీడి కీర్తిని, గతిని పోగొట్టుకోవడం రాముడు ఇష్టపడడు.

కైకేయి ఆడిన కుటిలనాటకంలో సత్యవ్రతుడైన తండ్రి, ధర్మబద్ధుడైన కుమారుడు సంఘర్షణకు గురిఅయ్యారు. అసత్యం పంచన నిలవడం ఇష్టంలేక ఒకరు అసువులర్పిస్తే, అధర్మ నీడలో చరించడం ఇష్టంలేక మరొకరు అరణ్యాలపాలయ్యారు. ఇంతటి మారణహోమాన్ని సృష్టించిన కైకేయివంటి పట్టమహిషి మహిలో ఉంటుందా?

వైరశుద్ధికి, వైమనస్యానికి ప్రతిరూపమైన కైకేయిపాత్ర విశ్లేషణమును ఆపేముందు మీలో కదులుతున్న ఒక సందేహాన్ని నివారించడం నాధర్మం.

"కైకేయిపాత్రను ఇంత కఠినంగా, క్రూరంగా చిత్రించారు. మరి రామునిపై అంతవరకు ఆమె ప్రదర్శించిన ప్రేమ బూటకమా? అసలు కైకేయికి రాముడిమీద ప్రేమ ఉందా? లేదా? ఉండి ప్రవర్తించిందా? లేకనే నటించిందా?"

ఇదేమంత గడ్డుప్రశ్నకాదు గాని అర్థంచేసుకోవడములో అడ్డంకులు ఎదురవుతుంటాయి. అడ్డులేకుండా, జిడ్డు అంటకుండా, ఈ గడ్డుప్రశ్నను అర్థంచేసుకొని ఒడ్డుకు చేరుతాము.

ఇంతకీ కైకేయి రాముని ప్రేమించిందా? లేక రాముని ప్రేమకు ఆకర్షించబడిందా? కైకేయిని ఏంచూసి ప్రేమించాలి? ఆమెలోఆకర్షించే గుణాలేమున్నాయి?

సుగుణాలరాశియైన రాముని ఎవరైనా ప్రేమించకుండా ఎలా ఉండగలరు? రాముని మూర్తిమత్వము యెదుట శత్రువులే ఎలా కరిగిపోతారో మున్ముందు మనం చూడబోతాము.

యౌవరాజ్య పట్టాభిషేకానికి ముందు కైకేయి రాముని అమితంగా ప్రేమించింది అనేది ఒకటే ఆమెకు కితాబు. ఎందుకు ప్రేమించింది? అనే ప్రశ్న తలెత్తినపుడు, దానిని లోతుగా విశ్లేషించినపుడు ఆ కితాబుకూడా మతాబులాగా క్షణంలో ఆరిపోతుంది.

“భరతునికంటె రాముడే నాకు ఎక్కువగా సేవచేశాడు” అని తానే మంథరతో చెప్పుకున్నది. అలాంటి రాముని ప్రేమించకుండా ఎవరుంటారు?

ఇంతకీ చెప్పొచ్చిందేమిటంటే కైకేయి స్వభావత: కుటిలస్వభావురాలు. ఈర్ష్యాసూయలు కలది. తెలివిగలది. కాని ఆతెలివంతా వ్యక్తిగతదర్పాన్ని ప్రదర్శించుకోవడానికి, స్వార్థానికి ఉపయోగించుకుంది.

అయోధ్యలో ధర్మాత్ముడైన దశరథమహారాజువద్ద అన్నీ సానుకూలంగానే జరిగిపోతున్నందున ఆమె కుటిలత్వము మరీ బహిరంగం కాకుండా మరుగునపడి ఉండింది. ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యసంధుడు అయిన శ్రీరాముని ప్రేమముందు, గరుడునిముందు సర్పమువలె అడుగునపడి ఉండింది.

నాగస్వరం ఊదగానే పుట్టలోని సర్పము బయటికివచ్చినట్లు, మంథరయొక్క దుర్వచనములనెడి నాగస్వరానికి కైకేయి కుటిలత్వమనే సర్పము, వరాలనే రెండు కోరలను ముందుకుచాచి బయటపడింది.

అడుగునవున్న వస్తువులు ఎప్పుడైనా ఆలస్యంగానే బహిర్గతమవుతాయి. బస్సులో ముందెక్కినవాడు వెనుక దిగుతాడు. వెనుక ఎక్కి చోటులేక కండక్టర్ ప్రక్కన కూర్చున్నవాడు ముందు దిగుతాడు.

ప్రయాణమై వెళ్ళునపుడు పెట్టెలో ముందుగా సర్దిన వస్తువులు క్రిందిభాగంలో ఉంటాయి. చివరగా సర్దే వస్తువులు పైనే ఉంటాయి.పెట్టె తెరచి వస్తువులు వెలికి తీసేటప్పుడు చివర పెట్టిన వస్తువులు ముందు వస్తాయి. ముందు ఉంచిన వస్తువులు చివర వస్తాయి. సంస్కారాలుకూడా అంతే.

కుటిలత్వము కైకేయి హృదయాన్ని ముందే ఆవరించిఉంది. ప్రేమ, ధర్మము అనేవి అయోధ్యలో తరువాత సంక్రమించాయి.

తరువాత సంక్రమించిన ప్రేమాదులు కథారంభంలో ముందుగా అభివ్యక్త మయ్యాయి. నిగూఢంగా ఆంతర్యములో నిలిచియున్న కుటిలత్వాలు నిదానంగా ఇప్పుడు బయట పడుతున్నాయి.

ఇక్కడ సంస్కారాలు, స్వభావాలు అని మనం చెప్పుకొనేవన్నీ మనోధర్మాలే. మనోధర్మాలు మారిపోతూఉంటాయి. మనసే మారేస్వభావంగలది కనుక మనోజనిత సంస్కారాలను, స్వభావాలను ప్రయత్నంతో మనిషి మార్చుకోవచ్చు. ఇదంతా సంగత్యంమీద ఆధారపడిఉంది. సత్సంగము లభిస్తే దుష్టసంస్కారాలు నశిస్తాయి. దుస్సంగము ప్రాప్తిస్తే దుష్టసంస్కారాలు బ్రతుకునే గట్టిపడతాయి. కైకేయికి దుస్సంగము ప్రాప్తించింది. మంథర సహవాసంతో బ్రతుకునే మరణసదృశంగా మార్చుకున్నది కైకేయి. మంథరలాంటి సహవాసాలు సమీపించకుండా మనంకూడా జాగ్రత్తపడాలి.



దేహంలో ఒక్కచోట లేచిన పుట్టకురుపు దేహాన్నంతా పాడుచేయునట్లు, ఒక్క కైకేయిలో జనించిన స్వార్థము అయోధ్యనంతా ఆవేదనతో కుదిపేసింది.

కైకేయి కుటిలత్వం ముంజేతికంకణంలాగ కనిపిస్తున్నందున రాముడు లక్ష్మణుని అయోధ్యకు వెళ్ళమని చెబుతున్నాడు. వినండి.

“లక్ష్మణా! నీచకార్యాలకు అలవాటుపడిన కైకేయి నా తల్లి విషయంలో న్యాయ విరుద్ధంగా ప్రవర్తించవచ్చు. కనుక మా తల్లిని ధర్మమూర్తియైన భరతునికి అప్పగించు.

“నన్ను ఎంతోకాలముపెంచి, పోషించిన నా తల్లి నావల్ల సుఖపడేకాలము సమీపించగనే నాకు దూరమైంది. నాజన్మ ఎంత వ్యర్థమైనది? లక్ష్మణా! నావల్ల మా అమ్మకు దుర్భరమైన దుఃఖము కలిగింది. నావంటి బిడ్డను ఏ స్త్రీకూడా ప్రసవించకుండుగాక!

“తమ్ముడూ! నా వనవాసము మాట వినగానే గోరువంకపక్షి “ఓ చిలుకా! ఆ కైకేయి పాదాన్నికొరుకు. ఆవిడ మన శత్రువు;” అని పలికింది. ఆ గోరువంకకు కౌసల్యపై నాకంటె ప్రేమ ఎక్కువని భావించాను.

“ఏకైక పుత్రునికి తల్లియైన మా అమ్మ అలా రోదిస్తుండగా ఆమె శోకాన్ని పోగొట్ట లేకపోయిన నేనూ ఒక బిడ్డనేనా? లక్ష్మణా! కోపించడమే జరిగితే నేనొక్కడినే ధనుస్సును ఎక్కుపెట్టి అయోధ్యనే కాదు, ఈ భూమినంతాకూడా స్వాధీనపరచుకోగలను. ఇది శౌర్యాన్ని ప్రదర్శించే సమయం కాదుగదా! ధర్మాన్ని ఆచరించాల్సిన సమయం;” అని రాముడు పలుకుచూ నేత్రములనుండి కన్నీరువొలకగా మాట్లాడలేక ఊరకున్నాడు.

ఈసందర్భమున రాముడు తన అమోఘమైన శక్తినిగూర్చి ప్రథమంగా మాట్లాడుతున్నాడు. తానొక్కడే ధనుర్బాణములను ధరించి ప్రపంచము నంతటిని జయించగల సామర్థ్యమున్నట్లు పలుకుతున్నాడు.

తాను అభిలషిస్తే క్షణంలో రాజ్యాన్ని హస్తగతం చేసుకోగలడు. ఆవిషయం తనకీ తెలుసు. కానీ తనలోని వాంఛల్ని నిరోధించే శక్తి రామునికుంది. తన పరాక్రమము ఒకవైపు ఆంతర్యంలో రెచ్చగొడుతూ ఉండినా, దానిని నిగ్రహించి ధర్మంకొరకు అరణ్యానికి వచ్చాడు రాముడు. అదే రామునిలోని ప్రత్యేకత.

మనిషి మనసులో స్వార్థం అంకురించినపుడు సంకుచితమైన సంకల్పాలతో దిగజారి, చేయకూడని పనులు చేస్తూవుండడం మనం చూస్తూవుంటాము. అదేవ్యక్తి బుద్ధిలో త్యాగం, ఔదార్యం పొడసూపినపుడు ఉదాత్తమైనభావములతో అనూహ్యమైన పవిత్రకార్యాలు చేపట్టడం కూడా మనం వీక్షిస్తూనేవున్నాం.

మనోస్థాయిలో రాముడు ఎప్పుడూ ఉదాత్తంగానే ఉంటాడు. కానీ అప్పుడప్పుడు మనలాగా ఆవేశాలకు, ఉద్రేకాలకు లోనవుతూఉంటాడు. అయితే ఈ ఆవేశాలు, ఉద్రేకాలు మనోస్థాయిలోనే ఆగిపోతాయి. కర్మలలో తొంగిచూడలేవు. అదే రాముని జీవనవైభవం.

రాముడికి పట్టాభిషేకం చేయాలని సంకల్పించి దశరథుడు సుమంత్రుని రాముని వద్దకు పంపుతాడు. కైకేయీదశరథులు పిలుస్తున్నారని రామునితో చెబుతాడు. ఆ

సమయంలో రాముడు సీతతో మాట్లాడిన మాటలు మనం విన్నాం. తన రాజ్యాభిషేక విషయమే వారు మాట్లాడుతూ ఉంటారని, కైకేయికి తానంటే ఎంతో ప్రేమని రాముడు సీతతో చెబుతాడు. ఇక్కడ రామునిలోని కుతూహలం సుస్పష్టంగా తెలుస్తూవుంది.

కానీ కైకేయిమందిరములో అంతా తారుమారైంది. ఊహాసౌధాలు పేకమేడలై కూలిపోయాయి. రాముడు చలించలేదు. రాముని స్థితిలో మరెవరన్నా ఉండుంటే ఎంత ఆవేదన ననుభవించేవారో?

పిలిచినపుడు మనలాగే రాముడుకూడా పొంగిపోయాడు. వనాలకు పొమ్మని చెప్పగనే మనలాగా కాకుండా ప్రశాంతంగా అంగీకరించాడు. అదే రాముని వ్యక్తిత్వం. ఈ వ్యక్తిత్వమే సర్వులనూ ఆకర్షిస్తుంది.

జ్వాలలేని అగ్నిలాగా, కెరటములులేని కడలిలాగా ప్రశాంతంగాఉన్న రామునితో లక్ష్మణుడు ఇలా పలికాడు.

"జ్యేష్ఠభ్రాతా! నీకు దూరమైన అయోధ్య ఇపుడు చంద్రుడులేని రాత్రివలె కాంతిహీనమై ఉంటుంది. అన్నా! నీవిలా శోకించుట సముచితంకాదు. అలా చేయుటవలన నాకు, సీతమ్మకు కూడా దుఃఖం కల్గుతుంది.



"నీకు దూరమై మేమిద్దరము క్షణకాలంకూడా జీవించలేము. నీటికి దూరమైన చేపలవలె బ్రతకలేము. సోదరా! నీకు దూరమై, తండ్రినిగాని, తల్లియైన సుమిత్రను గాని, సోదరుడైన శత్రుఘ్నునిగాని, చివరికి స్వర్గమునుగాని చేరాలని నేను భావించను;" అన్నాడు లక్ష్మణుడు. లక్ష్మణుని ఉదార వచనాలను ఆలకించిన రాముడు తృప్తిచెందాడు.

పర్వతాలపై చరించు రెండు సింహాలలాగా రామలక్ష్మణులు నిర్భయులై ఆరాత్రి అరణ్యములో జీవించారు.

## భరద్వాజాశ్రమము

సూర్యోదయం కాగానే సీతా రామలక్ష్మణులు మళ్ళీ ప్రయాణం సాగించారు. అందమైన వనప్రదేశాలను చూస్తూ, యమున గంగలో ప్రవేశించు దివ్యమైన ప్రదేశమునకు సమీపంగా వచ్చారు. గంగా యమునల సంగమస్థానమునకు దగ్గరగావున్న భరద్వాజముని ఆశ్రమానికి చేరారు. శిష్యసమేతుడైయున్న భరద్వాజమహర్షిని చూశారు. సీతారామలక్ష్మణులు భరద్వాజ మహర్షికి నమస్కరించారు.



రాముడు భరద్వాజాశ్రమాన్ని వెతుక్కుంటూ వచ్చాడు. భరద్వాజముని ఆహ్వానం లేకనే రాముడు తనంతటతాను స్వయంగా నడచివచ్చాడు.

భగవంతుని నీ ఇంటికి రప్పించగలిగేదే నిజమైన భక్తి. భరద్వాజునివలె ఎవరు సాధన చేస్తారో అట్టివారిని రాముడు వెతుక్కుంటూ వస్తాడు.

"మహర్షీ! మేము దశరథుని పుత్రులము. రామలక్ష్మణులము. ఈ కళ్యాణి నా ధర్మపత్ని. జనకుని కుమార్తెయైన సీత. దోషరహితయైన ఈమె నన్ను అనుసరించి వనవాసమునకు వచ్చుచున్నది.

"ఇతడే లక్ష్మణుడు. దృఢ నిశ్చయుడు. నా తమ్ముడు. నాకు చాలా ప్రియమైన వాడు. తండ్రి ఆజ్ఞచే నేను అరణ్యానికి వస్తూవుంటే నన్ను అనుసరించి వచ్చాడు.

"పూజ్యుడా! మేము తండ్రి ఆజ్ఞమేరకు ధర్మాన్ని ఆశ్రయించి వనములో జీవిస్తాము. ఫలమూలాదులు, కాయలు తిని జీవిస్తాము;" అన్నాడు రాముడు.

భరద్వాజమహర్షి రాముని మాటలు విని సంతోషించాడు. అడవిలో లభించు దివ్యమైన ఆహారమును, రసములను వారికిచ్చి మహర్షి సత్కరించాడు. ఆసీనులైన సీతారామ లక్ష్మణులతో భరద్వాజ మహర్షి ఇలా పలికాడు.



"రామా! నిన్నుచూసి చాలా సంతృప్తి చెందుతున్నాను. నిన్ను అకారణంగా తండ్రి అరణ్యానికి పంపినాడనికూడా వినియున్నాను. గంగా యమునల సంగమస్థానమైన ఈ ప్రదేశము జనసంసర్గము లేకుండా ప్రశాంతముగా ఉంటుంది. పుణ్యప్రదమైన ఈ సుందర ప్రదేశము వాసయోగ్యమైనది. నీవు ఇక్కడ సుఖంగా వసించవచ్చు;" అన్నాడు మహర్షి.

"మహామునీ! ఈ ప్రాంతమునకు దగ్గరలో పురములున్నట్లు తెలుస్తూవుంది. మేము ఈ ప్రాంతమున ఉన్నట్లు తెలిస్తే నన్ను, సీతను చూచుటకు పౌరులు వస్తారని నేను భావిస్తున్నాను. అందుచేత ఇక్కడఉండడం నాకిష్టంలేదు. ఇంతవరకు ఏకష్టములు అనుభవించని సీత ఎక్కడ సుఖంగా ఉండగలదో, జనసంచారము లేని ఆ ప్రదేశమును సూచించండి " అని రాముడు పలకగనే అట్టి ప్రదేశమును తెలుపుచూ భరద్వాజ మహర్షి రామునితో ఇలా పలికాడు.

"నాయనా! రామా! ఇక్కడికి పదిక్రోశుల దూరమున గంధమాదన పర్వతముతో సమానమైన చిత్రకూటమనే పర్వతముంది. ఆ ప్రదేశమున ఎందరో మహర్షులు వసిస్తున్నారు. పవిత్రమైన ఆప్రదేశము చాలాఅందంగా ఉంటుంది. అచ్చట ఎక్కువగా కోతులు, కొండ ముచ్చులు, ఎలుగుబంటులు మాత్రమే ఉంటాయి. క్రూరమృగాలుండవు. మీరు వసించుటకు

అది అనువైనప్రదేశము. లేదా నీవు ఇక్కడే మాతోపాటు ఉండి వనవాసమును పూర్తిచేసు కోవచ్చు" అన్నాడు భరద్వాజమహర్షి.

రాముడు భరద్వాజమహామునితో చాలాసేపు సంభాషించి, మనోహరమైన ఆ ఆశ్రమములో సీతారామలక్ష్మణులు మలిరేయి సుఖంగా నిద్రించారు.

తాము నివసించుటకు అనువైనప్రదేశమును చూపమని రాముడు భరద్వాజుని అడుగు చున్నాడు. రాముడు లేనిదెక్కడ? మహర్షులను ఆశ్రయించి, అర్థించి, ప్రార్థించి మార్గమును తెలుసుకోమని మనకు ఆదర్శమును చూపడమే రాముడు భరద్వాజుని అడుగుటలోని అంత ర్భావము. అంతేగాని దారి రామునకు తెలియకకాదు. అలాకానిచో భరద్వాజాశ్రమానికిమాత్రం రామునికి ఎవరు దారిచూపించారు?

**మునిమన్ బిహసి రామ్ సన్ కహహీ**
**సుగమ్ సకల్ మగ్ తుమ్హ కహుఁ అహహీఁ.**

దారి తెలుపమని రాముడు భరద్వాజుని అడిగినపుడు మహర్షి మనసులో నవ్వుకొని "రామా! అన్ని మార్గాలు నీకు సుగమమే" అని పలికినట్లు సంత్ తులసీదాస్ రామచరిత మానసంలో తెలుపుతారు.

తెల్లవారింది. రాముడు భరద్వాజుని సమీపించి ఇలా పలికాడు. " మహర్షిదేవా! మీ ఆశ్రమంలో రాత్రి సుఖంగా గడిపాము. మా నివాసానికి వెళ్ళుటకు ఆజ్ఞ ఇమ్ము" అని పలికాడు.

"రామా! చిత్రకూటపర్వతముపై తేనె, దుంపలు, ఫలాలు అధికంగా లభిస్తాయి. అక్కడికి వెళ్ళు" అన్నాడు.

సీతారామలక్ష్మణులు భరద్వాజమహర్షికి నమస్కరించి బయలుదేరారు. వారిని సాగనంప డానికి కొంతదూరమువచ్చి భరద్వాజుడు వీడ్కోలుఇచ్చి, "రామా! చిత్రకూట పర్వతముపైనుండి చూస్తే అరణ్యమధ్యమున ఏనుగులు, లేళ్ళు గుంపులుగుంపులుగా తిరుగుతూ వుంటాయి. నదులు, సెలయేళ్ళు, గుహలు, కొండచరియలు చూడముచ్చటగా ఉంటాయి.

"రామా! అదియే గంగా యమునా సంగమస్థానము. అక్కడనుండి పడమటివైపు ప్రవహిస్తున్న సూర్యుని కుమార్తెయగు పవిత్ర యమునానదిని అనుసరించి వెళ్ళండి.

"నేను అనేకసార్లు ఆ మార్గమున ప్రయాణము చేశాను. అది చాలా రమ్యమైన ప్రదేశము;" అనిపలికి భరద్వాజుడు తిరిగివెళ్ళిపోయాడు.

"లక్ష్మణా! భరద్వాజమహర్షి మనపై దయచూపాడు. మనము అదృష్టవంతులము" అన్నాడు రాముడు. సీతారామలక్ష్మణులు బయలుదేరి యమునానదిని సమీపించారు.

భరద్వాజమహర్షి లాంటివారే సాధకులకు దారిచూపించగలరు. భరద్వాజుడు గంగా యమునల సంగమస్థానమువద్ద వసిస్తున్నాడు. ఎవరిలో శాస్త్ర విషయము అనెడి గంగ, అనుభవ విషయమనెడి యమున కలిసియుండునో అట్టివారే గురువులై సాధకులకు మార్గాములు కాగలరు.

పైగా తాను ఆమార్గంలో అనేకసార్లు ప్రయాణంచేసినట్లు భరద్వాజుడు సీతారామ లక్ష్మణులకు చెబుతున్నాడు. సాధనలో ఎవరైతే ముందునడచి జ్ఞానమును పొందియున్నారో అట్టివారే సాధకులను నడిపింప గల్గుతారు.



అలాంటి గురువులు లభించడం శిష్యుని భాగ్యము. కనుకనే "లక్ష్మణా! భరద్వాజుని అనుగ్రహానికి పాత్రులమైన మనము అదృష్టవంతులము" అన్నాడు రాముడు.

భరద్వాజుడు రామలక్ష్మణులతో కలసి కొంతదూరం ప్రయాణంచేసి, ఆ తరువాత వారిని వెళ్ళమని గుర్తులు చెప్పి వెనుకకు మరలాడు.

సనాతన ధర్మపథంలో ఇదియే శిష్టాచార సంప్రదాయము. గురువు శిష్యులకు ముందుగా గుర్తు తెలుపుతాడు. తరువాత శిష్యులతో కలసి కొంతదూరం నడుస్తాడు. ఆ తరువాత స్వయంగా నడిచి ముందుకు ధైర్యంగా వెళ్ళమని చెప్పి తాను ఆగిపోతాడు. గురువుపై విశ్వాసమునుంచి ధీరోదాత్తులై ముందుకు నడిచివెళ్ళి శిష్యులు తరిస్తారు.

ఆదర్శాన్ని నిలిపేందుకు రాముడు భరద్వాజుని మార్గముచూపమని అడిగాడు. రాముని మనసునుగ్రహించిన భరద్వాజుడు రామునికి దారి చూపాడు.

రాముడు ఎవరో భరద్వాజునికి తెలుసు. కనుక "రామా! నన్ను మార్గము చూపమని నీవు అడుగుచున్నావు. మార్గము, గమ్యము నీవేనని నాకు తెలుసు. నాప్రయాణానికి నీవే గమ్యము. నీతోనే నేను నడుస్తున్నాను" అని చెప్పకనే చెబుతూ రామునితో కలసి నడిచాడు భరద్వాజుడు.

## చిత్ర కూటం

వేగంగా ప్రవహిస్తున్న యమునను దాటేందుకు ఉపాయం ఆలోచించారు. అక్కడ ఎండిపోయిన మాకులు పడివున్నాయి. కొన్ని కట్టెలను తెచ్చి, దగ్గర దగ్గరగా నారతో బిగించి కట్టి, దానిపై గడ్డి పరచారు. లక్ష్మణుడు వెళ్ళి ప్రబ్బకొమ్మలు, నేరేడుకొమ్మలు కొట్టి తెచ్చి సీతమ్మకు మెత్తని సుఖాసనాన్ని తయారుచేశాడు.

కాస్త సిగ్గుపడుతూ నిలబడియున్న సీతమ్మను రాముడు తెప్పపైకి ఎక్కించాడు. సీతమ్మ వస్త్రములు, ఆభరణములు, చిన్న గునపము, తోలు పుటిక, ఆయుధములు సీతమ్మ ప్రక్కన తెప్పపై ఉంచాడు రాముడు.



ముందుగా తెప్పను గట్టిగా పట్టి ఉంచి, తెప్పపై సీతమ్మను ఎక్కించిన తరువాత తామెక్కి తెప్పను నడుపుతూ యమునలో పయనిస్తున్నారు. సీతారాములను మాత్రమే తెప్పపై ఎక్కించి, తాను యమునలో తెప్పను నెట్టుతూ లక్ష్మణుడు ఈదినట్లు కంబరు తమిళ రామాయణంలో రచించాడు.

నదిమధ్యకు చేరగనే సీతమ్మ చేతులు జోడించి యమునాదేవికి

నమస్కరిస్తూ ఆశీర్వదించమని ప్రార్థించింది. సీతారామలక్ష్మణులు యమునను దాటి దక్షిణతీరం చేరారు. నదీతీరమున వున్న వనంలో పయనించసాగారు.

సీతారాములు నడుస్తూవుంటే ప్రచండభానుడు చల్లబడ్డాడు. ఎండినమాకులు చిగురించాయి. స్వాగతంచెప్తున్న నర్తకీమణులవలె మయూరాలు పురివిప్పి నాట్యం చేయసాగాయి. ఋతుధర్మాన్ని అతిక్రమించి చెట్లు పుష్పించాయి.

ఈలోగా భరద్వాజమహర్షి చెప్పిన క్యోలనీడేర్చే వటవృక్షమును సమీపించారు. సీతమ్మ ఆ వటవృక్షమును సమీపించి, "వటవృక్షమా! నీకు నమస్కారము. నా భర్త వ్రతము నిర్విఘ్నముగా సాగునట్లు ఆశీర్వదించు. నేను అయోధ్యలో కౌసల్యాసుమిత్రలను దర్శింతును గాక!" అని ప్రార్థించింది. రాజుయొక్క ప్రస్తావన వటవృక్షముదగ్గర సీతమ్మ తీసుకురాలేదు. రాబోయే సన్నివేశాల ఛాయలు ముందేగోచరిస్తాయి అంటారు. అది ఇదేనేమో!

సీతారామలక్ష్మణులు వనంలో ప్రవేశించారు. "లక్ష్మణా! సీతను తీసికొని నీవు ముందు నడుస్తూవుండు. వెనుక ఆయుధమునుధరించి నేను వస్తూఉంటాను. సీత ఏయే ఫలాలను, పుష్పాలను కోరుతుందో అవి తెచ్చిఇస్తూవుండు" అన్నాడు రాముడు.

సీతమ్మ నడుస్తూ, "అదేం చెట్టు? ఆ పూలుచూడు ఎంతబావున్నాయో! ఇదేం చెట్టు! ఈ తీగలు చూశారా! ఎంత అందంగా అల్లుకున్నాయో! గుబురుగా ఉన్న ఆ చెట్లపొద సింహము తలలాలేదూ?" అని అడుగుతూ నడుస్తూవుంది సీతమ్మ.

రాముడు సీతమ్మతో "సీతా! ఆ కొండచూడు. దానిశిఖరం శివుని జటాజూటంలా లేదూ! దానినుండి జారే జలపాతాలు విరజిమ్మే జలతుంపరులు గంగాదేవి భువికిదిగుతున్నట్లు అనిపిస్తోందికదూ!

"సీతా! ఈ గిరిశిఖరం చూడు. అలసిన శశాంకుడు విశ్రమించడానికి నిర్మించిన విడిది గృహంలా ఎంతచక్కగా శోభిస్తూ వుందో!" అంటూ సీతకు మార్గాయాసం ఉపశమించేటట్లు శ్రీరాముడు ఆ పరిసర సౌందర్య సౌభాగ్యాన్ని వర్ణించిచెప్తూ నడుస్తున్నాడు.

ఆకలి వేస్తూ ఉందేమో! ఆ వనంలో సంచరించే మృగాలను చంపి భక్షించారు. ఎందుకు అలా ఆలోచిస్తున్నారు? రాముడు మాంసభక్షణం చేశాడనా? ఏమి? ఎందుకు చేయకూడదు? రాముడు క్షత్రియుడు. మాంసం తింటాడుకదా! ఇందులో కలతచెందాల్సిన విషయమేముంది? నీ కలత ఏమిటో చెప్పనా? రాముడు దేవుడని భావించి రామాయణాన్ని చదవడమే! నీ ఊహలకు అనుగుణంగా పాత్రలు నడవవు. పాత్రల్ని అర్థంచేసుకుంటూ నీ ఊహలు ఊరేగాలి.

మృగమాంసాన్ని కమ్మగా భుజించి మళ్ళీ నడక ప్రారంభించారు. అవీ ఇవీ సీతమ్మకు చూపుతూ ఒక చందనవనంలో ప్రవేశించారు. సూర్యుడు అస్తమించాడు. కొద్దిసేపు ఆగారు.

చంద్రోదయం అయింది. అది వసంతకాలం. ఆకాశంలో చంద్రుడు కదుల్తున్నాడు. చందనవృక్ష కొమ్మలగుండా చంద్రుడు తప్పించుకొనిపోతుంటే, ఆ చెట్లకొమ్మలు, ఆకులు చంద్రుని మచ్చను తుడిచివేస్తున్నట్లు గోచరిస్తున్నాయి. ప్రకృతిమాత రమణీయ శోభతో పిండారబోసినట్లున్న వెన్నెలలో రాణిస్తుంటే, ఎత్తైన ఒక సమతలప్రదేశంలో ఆసీనులై, కరువుదీరా కళ్ళకు విందుచేస్తూ ఆదమరచి నిద్రించారు సీతారామలక్ష్మణులు.



తెల్లవారింది. ముందుగా నిద్రలేచిన రాముడు లక్ష్మణుని నిద్రలేపాడు. మంగళప్రదమైన యమునాజలంలో స్నానంచేసి భరద్వాజుడుచెప్పిన దారినిపట్టుకొని చిత్రకూటానికి పయనమయ్యారు.

ముగ్గురూ నడుస్తున్నారు. రాముడు తన మృదుమధురవచనములు అనే శకటాలపై సీతను, లక్ష్మణుని సునాయాసంగా తీసికొనిపోతున్నాడు.

"సీతా! ఎఱ్ఱనిపూలతో నిండిన ఈ కింశుకవృక్షాలు అగ్నివలె మండుతున్నట్లున్నాయి కదూ! వలయాకారంగావున్న వాటిపుష్పాలతోనే ఆ చెట్లు పుష్పహారములను ధరించినట్లు గోచరిస్తూ, ఆశ్చర్యమును కల్గిస్తున్నాయి.

"ఈ జీడిమామిడిచెట్లు ఫలపుష్పాలతో వంగివున్నాయి. వీటిని అనుభవించుటకు ఇక్కడ జనులెవ్వరూ లేరు. ఇక్కడ మనం హాయిగా జీవించవచ్చు.

"లక్ష్మణా! చూశావా! ప్రతిచెట్టుమీద తేనెటీగలుపెట్టిన తేనెపట్టులు పెద్దతొట్టెలవలె వ్రేలాడుతున్నాయిగదూ! ఈ చిత్రకూటపర్వతముపై ఏనుగులగుంపులు చూడముచ్చటగా తిరుగుతున్నాయి. నాయనా! సుందరమైన వృక్షములతో, మనోహరమైన లతలతో, తియ్యని నీటితో, వివిధములైన మధుర ఫలవృక్షాలతో నిండిన ఈ చిత్రకూటపర్వతము మీద మనము హాయిగా జీవించవచ్చు అని నాకు అనిపిస్తూవుంది. పైగా ఇక్కడ చాలా మున్యాశ్రమాలున్నాయి" అని చెబుతూ వాల్మీకి ఆశ్రమానికి చేరారు. ముగ్గురూ వాల్మీకికి నమస్కరించారు.

రాముడు వాల్మీకితో సంభాషించి, "లక్ష్మణా! చేవగలవి, శ్రేష్ఠమైనవి అయిన కఱ్ఱలను తీసికొని వచ్చి గృహాన్ని నిర్మించు. మనకొక నివాసస్థలమంటూ ఉంటే మంచిది" అన్నాడు రాముడు.

లక్ష్మణుడు సంతోషంతో వెళ్ళి మంచిగుంజలను సేకరించి చక్కని ఎత్తైన సమతల ప్రదేశంలో నాటాడు. వాటిపై అడ్డంగా వెదురుగడలు పేర్చాడు. నిట్రాళ్ళు, వాసాలు, పెండెలు అమర్చాడు. దానిపై ఆకుపరచి, బోదగడ్డితో కప్పాడు. ప్రక్కన తడికగోడ నిర్మించాడు. ఎఱ్ఱని పుట్టమట్టి తెచ్చి వేలను అలికాడు. లోపలివైపు తడికగోడకు మెత్తని ఏటిమట్టిని తెచ్చి పూసి, దానిపై అందమైన రంగురంగుల చిన్నరాళ్ళను పొదివినాడు. ఇలా చక్కగా, అందంగా పర్ణశాలను నిర్మించాడు లక్ష్మణుడు.

దూరంగా చెట్టుక్రింద ఆసీనులైఉన్న సీతారాములను సమీపించి, యాచిస్తున్నట్లు రెండు హస్తములు ముందుకుచాచి, "అన్నా! పర్ణశాల సిద్ధమైంది. ఇక మీరు ప్రవేశించవచ్చు" అన్నాడు లక్ష్మణుడు.

చాచిన లక్ష్మణుని రెండుహస్తములను చూచాడు రాముడు. లక్ష్మణుని అరచేతులు కందిపోయి వున్నాయి. నేలమీద పడిన వడగండ్లువలె చేతులు బొబ్బలతో పొంగివున్నాయి. ఏ కష్టము తెలియకుండా అంతఃపురములో సుకుమారంగా పెరిగిన తమ్ముడు ఈనాడు పడిన బాధకు రాముడు కలతచెంది ద్రవించిపోయాడు.

"నాయనా! ఈ గృహనిర్మాణకార్యము ఎక్కడ నేర్చావయ్యా! తండ్రిఆజ్ఞను పాలించి రాజ్యాన్ని భరతునికిచ్చిన ధర్మాత్ముడనని అందరూ నన్ను పొగుడుతున్నారు. వత్సా!

చెమటోడ్చి, ఇలా కష్టిస్తున్న నిన్ను ఎవరు శ్లాఘిస్తున్నారు? లక్ష్మణా! ఈ అన్నను పొందిన నీకు బాధలు ఇప్పుడల్లా తప్పవేమో! తండ్రీ!నీ చేతులు చూస్తుంటే నాగుండె నీరైపోతూ వుంది" అని దుఃఖాన్ని ఆపుకోలేక కన్నీరుకారుస్తూ తమ్ముని ఆలింగనంచేసుకున్నాడు రాముడు.

లక్ష్మణుడు తీవ్రంగా వ్యథచెందుతూ, "అన్నా! నీవలా మాట్లాడడం న్యాయమా! మీసేవకే గదా నాజీవితం! ఈ భాగ్యం ఎవరికి కల్గుతుంది?" అంటూ మాట్లాడలేక రాముని కౌగిలిలో తల్లియెదపై బిడ్డ ఒదిగిపోయినట్లు సౌమిత్రి ఒదిగిపోయాడు. రాముడు లక్ష్మణుని ఓదార్చాడు. సోదరప్రేమను ప్రత్యక్షంగా తిలకించిన సీతమ్మ నేత్రమేఘాలు కుండపోతగా వర్షించాయి.

రాముడు మాల్యవతీనదిలో స్నానంచేసి, వాస్తుపూజచేసి, పర్ణశాలలో ప్రవేశించాడు. సీతమ్మ గంగమ్మకు పూజచేసి, అగ్నిదేవుని అర్చించింది. లక్ష్మణుడు తెచ్చిన ఫలాదులు, రసాదులు సేవించి ముగ్గురు విశ్రమించారు. వారివిశ్రాంతికి భంగం కల్గించకుండా మనం అటు అయోధ్యకు వెళ్ళివస్తాం. పదండి.

ఈ 'చిత్రకూటం' అనే శీర్షిక్రింద నేనువ్రాసిన విషయాలలో వాల్మీకితోపాటు తమిళకవి కంబరునుకూడా అనుసరించాను.

## అయోధ్యలో సుమంత్రుడు

నిషాదరాజు గుహుడు సీతారాములను సాగనంపి సుమంత్రుని చూశాడు. దుఃఖముతో కుమిలిపోతున్న సుమంత్రునిచూచి గుహుడు తీవ్రంగా వ్యథచెందాడు.

సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమము చేరడము, అక్కడనుండి బయలుదేరి చిత్రకూటము చేరడము మొదలైన వివరములతోడి విషయమును గూఢచారులువచ్చి గుహునికి తెలిపారు.

గుహునివద్ద సెలవుతీసికొని సుమంత్రుడు రథాన్ని సమీపించాడు. గుర్రములను రథానికి పూన్చేందుకు వెళ్ళగా, ఆ గుర్రాలు రాముడువెళ్ళినదిశకు చూస్తూ, సకిలిస్తూ విలపించాయి.

**న హి తృను చరహిఀ న పిఆహిఀ జలుమోచహిఀ లోచన్ బరి**
**వ్యాకుల్ భయే నిషాద్ సబ్ రఘువర్ బాజి నిహారి ॥**

" గుఱ్ఱములు గడ్డితినడం మానేశాయి. నీళ్ళుత్రాగడం విరమించుకున్నాయి. కళ్ళనుండి నీళ్ళుకార్చడమే పనిగా పెట్టుకున్నాయి. గుఱ్ఱముల దీనావస్థనుచూచి నిషాదులందరూ కలత చెందారు" అంటాడు సంత్ తులసీదాస్.

శోకసంతప్తుడైన సుమంత్రుడు గుఱ్ఱములను రథానికిపూన్చి బయలుదేరాడు. అరణ్యములు, నదులు, నగరములు, గ్రామములు, సరస్సులు దాటుకుంటూ అయోధ్య చేరాడు. సుఖశూన్యమైన ఆ నగరాన్నిచూచి భీతిచెంది కలవరపడ్డాడు.

సుమంత్రుడురావడం చూచిన జనులు పరుగెత్తుతూవచ్చి, "మా రాముడేడి? మా రాము డెక్కడ?" అని అడిగారు.





"ధర్మాత్ముడైన రాముని గంగాతీరమున విడిచి పెట్టి, రామాజ్ఞచేత తిరిగివచ్చాను" అన్నాడు దుఃఖిస్తూ సుమంత్రుడు. ఆ మాట వినగానే "హా! రామా!" అంటూ కొందరు మూర్ఛిల్లారు.

సుమంత్రుడు రాజగృహంలోకి ప్రవేశించాడు. దీనుడై, పుత్రశోకంతో ప్రకాశహీనుడై విలపిస్తున్న దశరథుని చూశాడు. నమస్కరించాడు. రాముని సందేశాన్ని వినిపించాడు.

అది వినగానే భరించలేని దుఃఖముతో దశరథుడు మూర్ఛిల్లాడు. స్పృహతప్పి నేలపై పడిన దశరథుని అంతఃపురములోనివారు చూచి విలపించారు.

కౌసల్య దశరథుని సమీపించి ఇలా పలికింది. " మహారాజా! సుమంత్రుడు రాముని వద్దనుండి వచ్చాడు. అతనితో మాట్లాడవెందుకని? చేయకూడని పని ఎలాగూ చేశావు. ఇప్పుడు సిగ్గెందుకు? లే .... మాట నిలబెట్టుకొనిన పుణ్యాన్ని సంపాదించుకున్నావు కదూ!

"ఎవరి భయంతో నీవు సుమంత్రునితో భాషించుటకు సందేహిస్తున్నావో ఆ కైకేయి ఇక్కడలేదు. నీవు నిర్భయంగా మాట్లాడవచ్చు" అని దుఃఖమును భరించలేక నేలపైబడింది కౌసల్య.

కౌసల్యాదశరథుల దీనావస్థనుచూచి అంతఃపురవాసులంతా విలపించారు. ఆ రోదనమువిని పట్టణమంతా మళ్ళీ బిగ్గరగా ఏడ్వడం జరిగింది.

దుఃఖసంతప్త హృదయుడైన దశరథమహారాజు సుమంత్రుని వైపు చూచి, "సుమంత్రా! ధర్మాత్ముడైన నా రాముడు ఏ చెట్లక్రింద జీవిస్తున్నాడు? ఎన్నో సుఖాలను అనుభవించిన నాబిడ్డ ఏమితిని బ్రతుకుతున్నాడు? సుమంత్రా! ఇంతవరకు ఏ కష్టాలకు అలవాటుపడని నా రాముడు నేలపై ఎలాపడుకుంటున్నాడు? నిర్జనప్రదేశంలో ఎలా ఒంటరిగా వున్నాడో? సుమంత్రా! వనాలలోకి పాదచారియై నా రాముడు ఎలావెళ్ళాడు? సీతతో, లక్ష్మణునితోకూడి నా రాముడు వనాలలో ప్రవేశిస్తుంటే చూచిన నీవు ఎంత భాగ్యశాలివి? సుమంత్రా! అరణ్యములో రాముడేమన్నాడు? లక్ష్మణుడేమి పలికాడు? సీత ఏమి చెప్పింది? చెప్పు .... చెప్పు సుమంత్రా! నా రాముడు ఎలా కూర్చున్నాడో, ఎలా భుజించాడో, ఎలా పడుకున్నాడో అన్నీ చెప్పు .... నాకన్నీ చెప్పు. అవి నాకు కర్ణపేయంగా ఉంటాయి. చెప్పు" అని కన్నీరు కార్చాడు దశరథుడు.

సుమంత్రుడు శోకసంవిగ్నుడై, డగ్గుత్తికతో, తడబడుచున్నమాటలతో చెప్పడం ప్రారంభించాడు.

" మహారాజా! రాముడు మీకు శిరమువంచి నమస్కరించాడు.

"తాను తండ్రికి శిరమోడ్చి నమస్కరించినట్లు చెప్పమన్నాడు. అంతఃపురములోని వారి నందరిని అడిగినట్లు చెప్పమన్నాడు. ఇంకా ఇలా చెప్పాడు.

" సుమంత్రా! నా తల్లి కౌసల్యకు నా అభివాదనము తెలుపు. జాగ్రత్తగా ఉండమని చెప్పు. తల్లీ! ధర్మమును వీడకు. రాజును సేవించడం మానకు. తల్లులందరి యెడల ఈర్ష్యాసూయలు లేకుండా వుండు. రాజుకు ఇష్టమైన కైకేయితో అనుకూలంగా వుండు.

"అమ్మా! భరతుడు రాజని గుర్తుంచుకో. అతడు నీ కుమారుడే అయినా అతని పట్ల రాజుతో వ్యవహరించినట్లు మసలుకో. ఇది రాజధర్మం.

" సుమంత్రా! భరతునికి నా ఆశీస్సులు చెప్పు. తల్లులందరిని సమంగా చూసుకోమని చెప్పు. భరతా! నీవు యువరాజువి. మహారాజుని క్రమంతప్పకుండా అనుసరించు. రాజుగారు వృద్ధులైనారు. ఆయన అభీష్టం భగ్నంకాకుండా చూసుకో.

"భరతా! బిడ్డపై అధికప్రేమగల నా తల్లిని నీ తల్లివలె చూసుకో" అని పలికి అధికంగా రాముడు కన్నీళ్ళుకార్చాడు" అని సుమంత్రుడు దశరథునితో చెప్పాడు.

"రాజా! లక్ష్మణుడు మాత్రం చాలాకోపంతో పలికాడు" అని లక్ష్మణుని మాటలను వినిపించాడు సుమంత్రుడు.

"రాజకుమారుడైన రాముడు ఏమి అపరాధం చేశాడు? ఆయనను పట్టణంనుండి ఎందుకు వెళ్ళగొట్టాలి? కైకేయి తుచ్ఛమైన కోరికను తీర్చడానికి మమ్మల్నందరినీ కష్టపెట్టాడు ఆ దశరథమహారాజు.

"కారణమేదైనా చేసినపని మాత్రం చాలాచెడ్డది. తాను రాజని స్వేచ్ఛగా ఇలా ప్రవర్తించాడు. ఇది తెలివిమాలినకార్యము. దశరథుని తండ్రిగా నేను అంగీకరించను. నాకు తండ్రయినా, సోదరుడైనా, బంధువయినా, ప్రభువైనా అన్నీ రాముడే.

"రామునివిషయంలో ఇంతకఠినంగా ప్రవర్తించిన ఆరాజుపై ఎవరికి విశ్వాసముంటుంది? "రామునివిషయంలో ఇంతకఠినంగా ప్రవర్తించిన ఆరాజుపై ఎవరికి విశ్వాసముంటుంది?

రాముని అరణ్యాలకు పంపి, ప్రజలదుఃఖానికి కారకుడైనవాడు రాజుగా ఎలా కొనసాగు తాడు?" అని లక్ష్మణుడు పలికాడని దశరథునితో చెప్పాడు సుమంత్రుడు.

"రాజా! జానకి మాత్రము ఏమీ మాట్లాడలేదు. దుఃఖిస్తూ నిలబడింది;" అన్నాడు సుమంత్రుడు. సుమంత్రుని మాటలనువిని దశరథుడు దీనుడై ఇలాపలికాడు.

"సుమంత్రా! కైకేయి ప్రేరణకు బలైపోయానేగాని పెద్దలను సంప్రదిస్తామనే ఆలోచనే కలగలేదు. స్నేహితులు, అమాత్యులు, పౌరులు మరెందరో హితులున్నారు. వారెవ్వరితోను కలిసి ఆలోచించకుండా ఈ తొందరపాటుపనికి పూనుకున్నాను.

"సుమంత్రా! ఇంతకీ ఇలా దుర్గతి ప్రాప్తించాలనివుంది. అందుకే నాబుద్ధి అలా పాడైంది.

"సుమంత్రా! నేనెప్పుడైనా నీకు మేలుచేసుంటే, ప్రతిఫలంగా ఈనాడు నాకు ఒక్క ఉపకారంచెయ్యి. నన్ను నా రామునివద్దకుతీసికొనిపో. నా ప్రాణాలు పారిపోయేలా ఉన్నాయి.

"ఒకవేళ ఈ రాజ్యంపై నాకు ఇంకా అధికారముంటే, వెళ్ళి రాముని వెంటబెట్టుకొనిరా!



**న శక్ష్యామి వినా రామం ముహూర్త మపి జీవితుమ్**

" సుమంత్రా! రాముడులేకుండా నేను క్షణంకూడా జీవించలేను.

"ఒకవేళ రాముడు దూరంగా వెళ్ళివుంటే నన్నే రథములో రామునివద్దకు తీసికొనిపో. సుమంత్రా! నామాట నమ్ము. నా ప్రాణాలు అల్లాడుతున్నాయి.

**రామం యది న పశ్యేయం గమిష్యామి యమక్షయమ్**

"రాముని చూడకపోతే నేను యమసదనానికి వెళ్ళినట్లే.

"అయ్యో! రామా! అయ్యో! లక్ష్మణా! అయ్యో! సీతా! దిక్కులేనివానివలె నేను మరణిస్తున్నానని మీకు తెలియుటలేదుకదూ!" అని రోదిస్తూ పడకపై పడిపోయాడు.

దశరథుని మనసు దుర్బలమైపోయింది. శరీరం బాగా క్షీణించింది. పుత్రశోకంతో తల్లడిల్లిపోతున్న కౌసల్య భర్తయొక్క పరిస్థితిని గమనించలేకపోయింది.

కౌసల్య దుఃఖిస్తూ సుమంత్రునితో ఇలా పల్కింది.

"సుమంత్రా! సీతారామలక్ష్మణులు ఎక్కడున్నారో నన్నుకూడా అక్కడికి తీసికొని వెళ్ళు. వారికి దూరమై నేను క్షణకాలం జీవించలేను. వాళ్ళను వదలి ఇక్కడ ఉండలేను.

"రథాన్ని సిద్ధం చెయ్యి. నన్ను కూడా అరణ్యానికి తీసికొనిపో. నేను రాముడి దగ్గరికన్నా వెళ్ళాలి, లేదా యముని దగ్గరికన్నా వెళ్ళాలి. అంతే " అన్నది ఏడుస్తూ కౌసల్య.

సుమంత్రుడు కౌసల్యకు నమస్కరిస్తూ ఆమెను ఓదార్చాడు.

"అమ్మా! దుఃఖాన్ని మ్రింగి ప్రశాంతంగా ఉండు. తొందరపడకు. కలతచెందకు. రాముడు అరణ్యంలో హాయిగా ఉన్నాడు. ధర్మాత్ముడైన లక్ష్మణుడు రామునికి సేవచేస్తూ పుణ్యాన్ని మూటగట్టుకొంటున్నాడు.

"సీత ఇంటివద్ద ఉన్నట్లే ఆనందంగా, నిర్భయంగా చరిస్తూవుంది. ఆమెలో భయమే కనిపించడం లేదు. వనవాసము అలవాటున్నట్లు కనిపిస్తూవుంది. పూర్వము అయోధ్య ఉద్యాన వనాల్లో ఎలా విహరించేదో అలాగే అరణ్యంలో విహరిస్తూవుంది. చిన్నబాలికవలె గంతు లేస్తోంది.

"ఆమె ప్రాణములన్నీ రామునిపై పెట్టుకొని జీవిస్తోంది. వనాల్లో శోభించే నదీప్రవాహాలను, వృక్షాలను, ఫలపుష్పాలను రాముని, లక్ష్మణుని మరీమరీ అడిగి తెలుసుకుంటోంది.

"అమ్మా! ఆమెలో శోభ తగ్గలేదు. శరీరకాంతి వాడిపోలేదు. ఆమె ముఖం తామర పువ్వులా, చంద్రబింబంలా పసివాడక ప్రకాశిస్తోంది. పాదాలకు పారాణి పూసుకోకపోయినా, ఆమె పాదాలు పారాణిపూసినట్లు తామర మొగ్గల్లాగా ప్రకాశిస్తున్నాయి. అందెలను ధరించిన సీత అందంగా ఆడుకుంటున్నట్లు విలాసంగా చరిస్తోంది.

"అంతేకాదు. అక్కడ చరించే పులులనుచూచి, సింహాలనుచూచి, ఏనుగులనుచూచి సీత భీతిచెందడం లేదు. వారు ధర్మపథంలో జీవిస్తున్నారు. వారి కీర్తి లోకంలో స్థిరంగా నిలిచిపోతుంది.

"సీతారామలక్ష్మణులు శోకరహితులై, సుఖయుతులై, మహర్షులమార్గంలో చరిస్తూ ఫలాహారమును భుజిస్తూ ఆనందయాత్ర గడుపుచున్నారు. కనుక వారికొరకు మీరు దుఃఖింప పనిలేదు" అన్నాడు సుమంత్రుడు.సుమంత్రుడు ఇలా పలుకుతూ ఓదార్చినంతవరకు కౌసల్య

ప్రశాంతంగానే విన్నది. సుమంత్రుడు ఆపగానే మళ్ళీ రోదించడం ప్రారంభించింది. "అయ్యో! నాయనా! రామా!" అంటూ ఏడ్వసాగింది. క్రిందపడి పొర్లింది. కౌసల్య దుఃఖం దుర్భరంగా పరిణమించింది. ఈ విషాదపరిస్థితికి దశరథుడే మూలకారణమని నిందిస్తూ, భర్తను కఠినంగా మాట్లాడింది.

"రాజా! 'దశరథుడు దయామయుడు. ఉదారుడు. ప్రియవాది' అని ముల్లోకములందును నీకు గొప్ప కీర్తిఉంది. ఇప్పుడు నా బిడ్డల్ని వనాలకు పంపడమువల్ల నీ కీర్తి ఇంకా ఇనుమడిస్తుంది.

"సీత సుకుమారి. సుఖాలకు అలవాటుపడింది. ఆమె అరణ్యంలో ఎండకు, వానకు, తట్టుకోగలదా? మెత్తని తలగడాలపై ఇక్కడ శయనించిన రాముడు తనచెయ్యినే తలగడాగా పెట్టుకొని నిద్రించగలడా?

"అయ్యో! నా రాముని నేను ఎప్పుడు చూడగలను? రాముడు కనిపించకపోయినా నా గుండె బ్రద్దలుకావడంలేదు.అది వజ్రముతో చేయబడిఉంటుంది. ఆ విషయంలో సందేహము లేదు.

"నిర్దయుడవైన నీ మూలంగా నా బిడ్డలు అడవుల పాలయ్యారు. ఇంతకంటే నువ్వేమి చేయగలవు? రాముడు వనాలనుండి తిరిగివచ్చిన తరువాతకూడా రాజ్యమును స్వీకరించడు. తప్పక విడిచిపెడ్తాడు.

"కనిష్ఠుడు అనుభవించిన రాజ్యాన్ని రాముడు ముట్టడు. ఈ అవమానమును రాముడు సహింపడు. హవిస్సు, ఘృతము, పురోడాశములు ఒక పర్యాయము యజ్ఞములో ఉపయోగిస్తే మళ్ళీ వాటిని ఉపయోగించరు. అలాగే ఇతరులు అనుభవించిన రాజ్యాన్ని జ్యేష్ఠుడైన రాముడు అంగీకరించడు.

**న పరేణాశితం భక్ష్యం వ్యాఘ్రః ఖాదితు మిచ్ఛతి**

"ఒక జంతువు ముట్టిన ఆహారాన్ని పులి తినదు. అలాగే ఇతరులు అనుభవించిన రాజ్యాన్ని రాముడు అనుభవించడు.

"మహారాజా! రాముడు ఆత్మాభిమానం కలవాడు. ధర్మాత్ముడు. అవమానాల్ని సహించడు. రాముని బాధించడమంటే పులిని తోక త్రొక్కినట్లే.

"రాముడు తలిస్తే సముద్రాల్ని శోషింప చేయగలడు. పర్వతాల్ని బ్రద్దలు చేయగలడు. అట్టి రాముని నీవు పుణ్యంకట్టుకొని అడవులపాల్జేశావు. ఇదేనా సనాతనధర్మము? చేప తన బిడ్డల్ని పొట్టనపెట్టుకున్నట్లు నీవు నా రాముని నాశనంచేశావు.

**గతి రేకా పతిర్నార్యా ద్వితీయా గతిరాత్మజః**
**తృతీయా జ్ఞాతయో రాజం శ్చతుర్థీ నేహ విద్యతే**

"స్త్రీకి భర్త మొదటిగతి. పుత్రుడు రెండవగతి. బంధువులు మూడవగతి. నాల్గవగతి అనేది లేనేలేదు.

"ఏ విధంగా చూచినా నేను గతిలేని దాననయ్యాను. నీవు వుండినా కైకేయికి భర్తగా ఉన్నావే గాని మాకు కాదు. రెండవ ఆధారమైన పుత్రుడు అడవుల పాలయ్యాడు. ఆ ఆధారం



కూడా పోయింది. భర్తను, పుత్రుని పెట్టుకొని మూడవ ఆధారమైన బంధువుల్ని ఎలా ఆశ్రయించేది? ఇంతకీ నేను దిక్కులేనిదానను. దుర్గతిపాలయ్యాను.

"ఇంకేం కావాలి? నీ వనుకున్నదంతా జరిగిపోయింది. రాజ్యాన్ని పాడుచేశావు. మంత్రులను నాశనంచేశావు. నిన్ను నాశనంచేసుకున్నావు. నన్ను దిక్కులేనిదానివి చేశావు. పౌరులను దుర్భరదుఃఖానికి గురిచేశావు. ఇంకేముంది? నీ భార్య కైకేయి, నీ కుమారుడు భరతుడు సుఖంగా ఉన్నారు. చాలుకదూ! నీకు కావలసింది అదేకదూ!" అంటూ పుండుమీద కారంచల్లినట్లు తన కఠోరవాక్కులతో దశరథుని బాధిస్తూఉంది కౌసల్య.

పుత్రశోకంతో క్రుంగియున్న కౌసల్య పలికిన కర్కశవాక్కుల వెనుక ఏ వాస్తవమూ లేదు. దశరథుని విషయంలోగాని, రాముని విషయంలోగాని కౌసల్యచేసిన విర్ణయాలు నిరాధారాలు. సత్యదూరాలు. మనసు ఆవేశానికి లోనైనపుడు నోటినుండి అనర్థాలే దొర్లుతాయి.

కౌసల్య మాటలనువిని రాజు భరించలేని దుఃఖముతో మూర్ఛిల్లాడు. స్పృహ వచ్చిన తరువాత చింతాక్రాంతుడై కౌసల్యను చూశాడు. ఈలోగా తన స్మృతిపుటలు తెరువబడ్డాయి. చిన్నతనాన జరిగిన సంఘటన ఏదో గుర్తుకువస్తూవుంది. ప్రక్కనే ఉన్న కౌసల్యనుచూచి, నమస్కరిస్తూ, బ్రతిమాలుతూ ఇలాపలికాడు.

"కౌసల్యా! నన్ను కనికరించు. ఈ బాధను నేను భరించలేకపోతున్నాను. మంచివాడైనా, చెడ్డవాడైనా పతియే ప్రత్యక్షదైవమనికదా ధర్మశాస్త్రము.

"నీవు ధర్మాసక్తి కలదానివి. మంచిచెడులు తెలిసినదానివి. అందరివిషయంలోను ఉదారంగా ప్రవర్తించేదానివి. నీవు ఎంత దుఃఖములోవున్నా, శోకగ్రస్తుడైన నన్ను ఇలా నిందించడం న్యాయమా!" అని దీనుడై పలికాడు దశరథుడు. ఆ మాటలువిన్న కౌసల్య నీటిగొట్టము వాననీటిని కార్చినట్లు కన్నీటినికార్చింది. ప్రాధేయపడుతున్న రాజుగారి దోసిలిని పద్మమువలె తనతలపై పెట్టుకొని, భయంతో, ఆందోళనతో ఇలాపలికింది.

"మహారాజా! నన్ను క్షమించు. నీకు శిరమువంచి నమస్కరిస్తున్నాను. మీరు నన్ను ప్రార్థించుట అనేది నాకు మరణసదృశమే. నేను గొప్ప అపరాధంచేశాను. నేను క్షమార్హురాలిని కాను. భర్తను బాధపెట్టిన స్త్రీకి ఇహపరాలుండవు.

"రాజా! నాకు ధర్మం తెలుసు. నీవు ఏ దోషమూ ఎరుగవని తెలుసు. సత్యసంధుడవని తెలుసు. కానీ నామనసు నాఅధీనంలోలేదు. నేను ఏంమాట్లాడుతున్నానో నాకే బోధపడడంలేదు. పుత్రశోకం నాచేత అలా మాట్లాడిస్తూవుంది. మిమ్మల్ని అనరానిమాటలు అన్నాను.

**శోకో నాశయతే ధైర్యం శోకో నాశయతే శ్రుతమ్**
**శోకో నాశయతే సర్వం నాస్తి శోకసమో రిపుః**

"రాజా! దుఃఖమనేది ధైర్యాన్ని పోగొడుతుంది. జ్ఞానాన్ని నశింపచేస్తుంది. శోకము సమస్తమును హరిస్తుంది. శోకమువంటి శత్రువు మరొకరులేరు.

"శత్రువు కొట్టిన దెబ్బను భరించవచ్చునేమోగాని హఠాత్తుగా వచ్చిన శోకము చిన్నదైనా దానిని భరించడం కష్టము. రాజా! శోకమువచ్చినపుడు ధర్మజ్ఞులు, శాస్త్రజ్ఞులు కూడా వ్యథచెందుతూ వుంటారు.

"రాముడు అరణ్యానికివెళ్ళి నేటికి ఐదురోజులు అయింది. శోకభారముచే కృంగిన నాకు అయిదు సంవత్సరాలైనట్లుంది. రాజా! నదీజలాలు ప్రవేశించుకొలదీ సముద్రము పొంగునట్లు, రాముని తలచుకొనేకొలదీ నా దుఃఖము పొంగుతూఉంది" అని కౌసల్య పశ్చాత్తాపంతో పలికింది. ఈలోగా సూర్యాస్తమయం అయింది. మళ్ళీ రేపు ఉదయం సూర్యుడు తప్పక ఉదయిస్తాడు. కానీ అది చూడలేనివారు, ఈరాత్రితోనే తమజీవితాన్ని ముగించుకొనేవారు కూడా ప్రపంచంలో ఎందరో ఉంటారు. క్షణభంగురమైన జీవితంలో మనది ఏక్షణమో, మనది కానిది ఏక్షణమో ఎవరికితెలుసు?

## మరణశయ్యపై మహారాజు

కౌసల్య పశ్చాత్తాపవాక్కులు దశరథునికి ఊరటను కల్పించాయి. చింతాక్రాంతుడైన దశరథుడు నిద్రపోయాడు.

దుఃఖము చాలా చెడ్డది. అది మనిషిని ప్రశాంతంగా నిద్రపోనివ్వదు. మళ్ళీ కొంతసేపటికే దశరథుడు నిద్రలేచాడు. దుఃఖపూరితమైన మనసుతో ఆలోచించసాగాడు. రామలక్ష్మణుల వనవాసము కారణంగా మహారాజు రాహువు పట్టిన సూర్యునిలా తయారయ్యాడు.

సీతారాములు అరణ్యానికి వెళ్ళిన తరువాత ఇది ఆరవనాటి రాత్రి. దశరథుడు ఆలోచిస్తున్నాడు. రాముడు తన ఆజ్ఞను పాటించకుండా తిరస్కరించి వుంటే తనకు ఈ దుఃఖం కలిగుండేది కాదు. రాముడు ధర్మదీక్షతో కానల కేగి తనను కష్టాలకడలిలో తోశాడు అని దశరథుడు దుఃఖిస్తూవున్నాడు. ఇష్టుడైన బిడ్డకు దూరమై జీవించడంకన్నా మరణమే మేలు అని భావించాడు.

ఆ ఆలోచనరాగానే దశరథుడు అవధానచిత్తుడయ్యాడు. ఇంతకుముందు నిద్రపోయే సమయంలో అస్పష్టంగా మనసులో కదలిన చిన్ననాటి స్మృతులు ఇపుడు సుస్పష్టమయ్యాయి. పూర్వము తాను చేసిన పాపం జ్ఞాపకమొచ్చింది. పుత్రశోకమునకుగల కారణం తెలిసివచ్చింది. వెంటనే కౌసల్యకు చెప్పదలచాడు అర్ధరాత్రిసమయాన దశరథుడు.

"కౌసల్యా! ఈ బాధల వెనుకుండే గాథ ఇప్పుడు నాకు తెలుస్తూవుంది. చెబుతున్నా. విను.

"కర్మఫలాలు అశాశ్వతాలు. కానీ అనివార్యాలు. మానవుడు తాను ఆచరించిన కర్మల యొక్క ఫలితాలనుండి పారిపోలేడు.

**తదేవ లభతే భద్రే కర్తా కర్మజ మాత్మనః**

"పుణ్యమైనా, పాపమైనా మానవుడు ఏకర్మచేస్తాడో దాని ఫలితాన్ని పొందుతాడు.

"ఒక పని చేయునపుడు అది మంచిదా, లేదా చెడ్డదా? దానివలన ఏవిధమైన ఫలం రాబోతుంది? అని గ్రహించక కర్మలాచరించేవాడు బాలునివలె మూర్ఖుడు.

"కౌసల్యా! మోదుగుచెట్టు యొక్క పూలనుచూచి, పండ్లు ఎంతో శ్రేష్ఠంగాఉంటాయని భ్రమించి, మామిడిచెట్టును కొట్టేసి మోదుగుచెట్టును పెంచువాడు ఆ ఫలాలు అందినపుడు హతాశుడై దుఃఖిస్తాడు.



"తానుచేయు కర్మయొక్క ఫలమును తెలిసికొనక కర్మను ఆచరించువాడు కింశుక వృక్షానికి నీళ్ళుపోసి పెంచినవానివలె శోకిస్తాడు.

"నేనూ అదే చేశాను. మామిడివృక్షాన్ని నరికి మోదుగుచెట్లకు నీళ్ళుపోసి పెంచాను. ఇపుడు ఫలాలను చూచి దుఃఖిస్తున్నాను. చేసినపనులు రుచుల్ని చూపకపోతాయా?" అంటూ తనజీవితంలో ఏనాడో జరిగిన సంఘటనయొక్క వాస్తవచిత్రాన్ని దశరథుడు వీక్షిస్తున్నాడు.

విత్తనము చెట్టునిచ్చునట్లు కర్మలు కర్మఫలాల నందిస్తాయి. ఫలితాలు అందినపుడు పొంగిపోవడం, క్రుంగిపోవడము మాత్రమే మనకు తెలుసు. అవి కదిలిందెక్కడో మన ఊహకు అందదు.

సుఖాలు వచ్చినపుడు మనిషి పొంగకుండా ఉండగలడేమోగాని దుఃఖఫలాలు అందినపుడు క్రుంగకుండా ఉండలేడు. కష్టాలొచ్చాయని కలతచెందడంకన్నా, ఈ కష్టాల యొక్క, కన్నీళ్ళ యొక్క ఆరంభమెక్కడో దర్శించగలిగితే కన్నీళ్ళు ఇంకిపోయే అవకాశము ఉండవచ్చు. కష్టాలు కరిగిపోయే పరిస్థితీ ఏర్పడవచ్చు.

కష్టాలు ఏవైపునుండి కదలినా అనుభవించాల్సింది ఆంతర్యంలోనేగాని బాహ్యంలో కాదు. ఇదితెలిసి ఆంతర్యపు లోతులను పరిశీలించేవానికి కష్టాలు కనుమరుగవుతాయి.

**I can give you no other advice than this, retire into yourself and probe the depths from which your life springs up.**

"నేను ఇంతకంటే వేరుగా మరొక సలహానివ్వలేను. నీవు నీలోకి ప్రవేశించి, నీ జీవితం ఎక్కడనుండి వచ్చిందో ఆ లోతులకువెళ్ళి అన్వేషించు" అంటాడు రిల్కే.

దశరథుడుకూడా ఆంతర్యపు లోతులను దర్శించాడు. స్మృతిపుటలలో ప్రవేశించాడు. ఈనాటి దుఃఖానికి కారణాన్ని కనుగొన్నాడు. మనసువిప్పి కౌసల్యముందు సత్యాన్ని పెడుతున్నాడు.

"కౌసల్యా! అది నా యౌవనదశ. శబ్దవేధి విద్యను నేను అభ్యసించాను. శబ్దమునుబట్టి బాణప్రయోగం చేయడంలో నిపుణుడుగా పేరుతెచ్చుకున్నాను.

"ఆ శబ్దవేధి వల్లనే నేను ఘోరపాపం తెలియక చేశాను. పిల్లవాడు తెలియక విషపానం చేసి దుఃఖించునట్లు, నేనుకూడా తెలియకచేసిన నేరానికి ఈదుఃఖాన్ని అనుభవిస్తున్నాను. పలాశవృక్షాన్నిచూచి మోసపోయిన బాటసారిలాగా శబ్దమునువిని మోసపోయిన నేను ఈ దుర్భరస్థితిని కొనితెచ్చుకున్నాను.

"రాణీ! అప్పటికి నీతో నాకు వివాహం కాలేదు. నేను యువరాజుగా ఉన్న రోజులవి. సంతోషదాయకమైన వర్షాకాలమున ఒకనాడు వేటాడుటకు నేను సరయూ నదీతీరమునైపు వెళ్ళాను.

"అది రాత్రివేళ. నీరుత్రాగుటకు నదివద్దకువచ్చు ఏదైనా మృగాన్ని శబ్దము ననుసరించి చంపాలని భావించి, ఒక రహస్య ప్రదేశమున నేను దాగాను.

"ఇంతలో ఆ చీకటి సమయాన ఒక శబ్దము వినిపించింది. ఆ శబ్దమును గుర్తించి ఒక వన్యమృగాన్ని వధించాను. మరికొంతసేపటికి ఒక క్రూరమృగాన్నికూడా శబ్దవేధి వల్లనే చంపాను.

“మరికొంతసేపటికి నీటిలో కుండముంచిన శబ్దం వినిపించింది. అదివిని ఏనుగు తొండముతో నీళ్ళు త్రాగుతూవుందని భావించాను. ఎలాగైనా ఆ ఏనుగును కొట్టాలని అభిలాష పడ్డాను.

“సర్పమువంటి వాడియైన బాణాన్ని అవధానంతో ప్రయోగించాను. ఏనుగును వధిస్తున్నా నన్న సంతోషంతో శబ్దము వచ్చిన దిక్కునకు బాణాన్ని విడిచాను.

“అంతే. “అయ్యో! అయ్యో!” అనే హాహాకారాలు విన్పించాయి. అది మానవుని మాట. నాకు భూమ్యాకాశాలు ఒక్కటైనట్లు అనిపించింది. ఈలోగా పెద్దపెద్ద కేకలు వినిపించాయి.

“తాపసినైన నాపై ఈ శరప్రయోగం చేసిందెవరు? నీటిని తీసుకొనిపోవుటకు రాత్రివేళ నేను నిర్జనమైన ఈ నదివద్దకు వచ్చాను. నన్ను బాణంతో ఇంత భయంకరంగా కొట్టిందెవరు? నేను ఎవరికి ఏమి అపకారం చేశాను? అహింసావ్రతమును పాటిస్తూ తపస్సు చేసుకుంటూ, వనాలలో లభించే ఆహారంతో జీవించే నన్ను ఇంత క్రూరంగా వధించుటకు ఏమి కారణము? మునులను చంపాలనే కోరిక ఎవరికి కల్గింది? నేను వారికి చేసిన చెడు ఏమి? ఈపనిచేసిన వాడు ఎవడైనా, ఫలితాన్ని అనుభవించకపోడు. అతణ్ణి ఎవరూ హర్షించరు. గురుతల్పగమనం చేసినవానిలా చూసి ద్వేషిస్తారు. నేను నా మరణాన్నిగూర్చి విచారించడంలేదు. నా తల్లిదండ్రులనుగూర్చే ఆలోచిస్తున్నాను. వృద్ధులైన నా తల్లిదండ్రులను ఇంతకాలము నేనే పోషిస్తున్నాను. నేను మరణిస్తే వారిని పోషించేవారెవరు? వారికి సేవలు చేసేవారెవరు? ఈబాణము తగిలింది నాకేఅయినా, ఇది మాముగ్గురి మరణానికి కారణమైంది. ఇంతటి ఘోరకర్మకు పాల్పడిన ఆ మూర్ఖుడెవడు?”

“ఈ విధంగా దుఃఖిస్తున్న ముని వచనాలు నా చెవినిపడ్డాయి. నా అంతర్యం ముక్కలైంది. నా చేతులనుండి ధనుర్బాణాలు జారి క్రిందపడ్డాయి. నామనసంతా వికలమై పోయింది.

“నేను ఆ ప్రదేశానికి వెళ్ళాను. బాణము గ్రుచ్చుకొని నేలపైపడియున్న మునిబాలుని చూశాను. అతడు రక్తపుమడుగులో పడియున్నాడు. నన్నుచూచి అతడు మండిపడ్డాడు.

“రాజా! నా తల్లిదండ్రులకు నీరు తీసికొనిపోవుటకు వచ్చిన నిరపరాధినైన నన్ను ఇలా హింసించావే ! నేను నీకు ఏమి అపకారంచేశాను?

“నా తల్లిదండ్రులు వృద్ధులు. దుర్బలులు. పైగా గ్రుడ్డివారు. నేను నీరు తెస్తానసే ఆశతో దప్పికను ఆపుకుంటూ నాకొరకు నిరీక్షిస్తూవుంటారు. నేను ఇలా నేలపై పడియున్నట్లు, మృత్యుముఖంలో ప్రవేశిస్తున్నట్లు వారికి తెలియదు. ఎంత చదివి ఏమి ప్రయోజనం? ఎంత తపస్సు చేసినా ఏమిలాభం?

“ఒకవేళ ఈవిషయం తెలిసినా దుర్బలుడైన నాతండ్రి ఏంచేయగలడు? ఈ ప్రపంచంలో ఎవరిని ఎవరు ఆదుకోగలరు? ఒకరిని రక్షించే శక్తి ఎవరికుంది?

**ఛిద్యమాన మివాశక్త స్త్రాతు మన్యో నగో నగమ్**

చేయగలదు?

“ఒక వృక్షమును ఖండిస్తూవుంటే ప్రక్కనున్న చెట్టు ఏమి చేయగలదు?



“రాజా! అగ్ని వనమును దహించునట్లు, నాతండ్రియొక్క కోపాగ్ని నిన్ను దహించి వేస్తుంది. అలా కాకూడదని నీవు భావించేటట్లయితే, నీవు వెంటనేవెళ్ళి జరిగినవిషయాన్ని నాతండ్రికిచెప్పు.

“అదిగో. ఆ కాలిబాటలో వెళ్తే నాతండ్రి ఆశ్రమం వస్తుంది. వెళ్ళు. అతణ్ణి ప్రాధేయపడి ప్రార్థించు. లేనిచో నీవు శాపాన్ని తప్పించుకోలేవు.

“రాజా! నేను ఈ బాధను భరించలేకున్నాను. ఈ బాణశల్యాన్ని తీసివెయ్యి;” అన్నాడు మునిబాలుడు.

“కౌసల్యా! ఏంచేయాలో నాకు అవగతం కాలేదు. బాణాన్ని ఊడబెరకకపోతే ఆ మునిబాలుడు మరణించడు. బాధపడుతూనే ఉంటాడు. బాణాన్ని పెరికివేస్తే అతడు మరణిస్తాడు. ఏంచేయాలో నాకు బోధపడలేదు.

“ఈలోగా ఆ మునిబాలుడు సంశయగ్రస్తమైన నా మనస్సును గ్రహించాడు. అతడు బాధతో కృంగిపోతున్నాడు. అవయవాలు చుట్టుకపోతున్నాయి. నేలపై అటూ ఇటూ పొరలుతున్నాడు. తీవ్రంగా దుఃఖిస్తూ నాతో ఇలా పలికాడు.

“రాజా! బ్రహ్మహత్యాపాతకము సంభవిస్తుందని భయపడకు. నా శరీరమునుండి బాణమును తీసేసి, నా బాధను నివారించు” అన్నాడు.

“అంతే. దుఃఖము పొరలివచ్చుచుండగా, ఎలాగో ఓలాగు అతని దేహమునుండి బాణ శల్యమును తీసేశాను. ఆ తపోధనుడు కళ్ళెత్తి నన్ను చూచి ప్రాణాలువిడిచాడు. నేను ఈ సంఘటనకు మరీమరీ దుఃఖించాను;” అని ఆ మునికుమారుని తలచుకొని ఏడుస్తూ చెప్తున్నాడు దశరథమహారాజు.

తెలిసిచేసినా, తెలియకచేసినా కర్మలు ఆయాఫలాలను ప్రసాదించకపోవు. కనుక ప్రతి కర్మను ఆలోచించి చేసేందుకు అలవాటుపడాలి. చేతులుకాలిన తరువాత ఆకులు పట్టుకొని ఏమి సాధిస్తాం?

పాపం చేసేటప్పుడు మనకు ఎందరో సహకరించవచ్చు. పాపఫలితాన్ని మాత్రం మనం ఒంటరిగనే అనుభవించాల్సిఉంటుంది.

**ఏకస్య చిన్తయం బుద్ధ్యా కథం ను సుకృతం భవేత్**

“కౌసల్యా! అక్కడ ఏకాకిగా మిగిలియున్న నేను ఈ పాపంనుండి బయటపడేది ఎలా? అని ఆలోచించాను.

“ఆ మునిబాలునికి దగ్గరగా పడియున్న కుండలో నీరునింపుకొని, అతడు చెప్పిన మార్గాన్నే అనుసరిస్తూ ఆశ్రమం చేరాను. అక్కడ వృద్ధులైన దంపతుల్ని చూశాను. వారే ముని కుమారుని తల్లిదండ్రులని గ్రహించాను.

“అంధులైన వారిని నడిపించేవారు అక్కడ ఎవ్వరూ లేనందున వారు రెక్కలుతెగిన పక్షులవలె నాకు గోచరించారు. వారు పుత్రునిగూర్చి మాట్లాడుకొనుచున్నదంతా విన్నాను.

"ఏ ఆశాలేని ఆ వృద్ధదంపతులకు పుత్రుడే ఆశాదీపం. ఆ దీపాన్నికూడా నేను ఆర్పేశాను. నాలో భయం తీవ్రతరమైంది. నా అడుగుల సవ్వడిని విని వారి పుత్రుడే వచ్చినట్లు భావించి మాట్లాడారు ఆ మునిదంపతులు.

"నాయనా! ఏమి? ఎందుకింత ఆలస్యంచేశావు? పిపాస ఎక్కువగా పీడిస్తోంది. ఏదీ! నీళ్ళివ్వు. కుమారా! నీవు ఇంకా రాలేదని మీ అమ్మ చాలా దిగులుపడింది. తొందరగా రా! నాయనా! రా! మా దగ్గరికి రావు ఎందుకని? మాతో మాట్లాడ వెందుకని? నాయనా! మీ అమ్మగాని, నేనుగాని ఏదైనా అపరాధము చేసుంటే మనసులో పెట్టుకోకు. నీ మాట మా చెవిని పడకుంటే మేము ప్రాణాల్తో జీవించలేము.

**త్వం గతి స్త్వగతీనాం చ త్వం హి చక్షు రచక్షుషామ్**
**సమాసక్త స్త్వయి ప్రాణాః కిం త్వం నో నాభిభాషసే !**

"మేము గతిలేనివారము. మాకు నీవే గతివి. నేత్రములులేని మాకు నీవే నేత్రములై ఉన్నావు. మా ప్రాణాలు నీమీదనే ఆధారపడిఉన్నాయి.నీవు మాతోఎందుకు మాట్లాడవు?"

"కౌసల్యా! నేను భయంతో వణకిపోయాను. తడబడుతున్న మాటలతో జరిగిన విషయాన్ని ఆ మునీశ్వరునికి తెలిపాను. అజ్ఞానముచే నేను చేసిన ఈ కార్యానికి నేను ఏమి చేయాలో తెలుపమని అతనిని ప్రార్థించాను.

"మునిబాలుని తల్లిదండ్రులు తీవ్రంగా దుఃఖించారు. నావిషయంలో క్రుద్ధులయ్యారు. ఆ మునీశ్వరుడు నాతో ఇలాపలికాడు.

" రాజా! నీవాచరించిన ఈ అశుభకార్యాన్ని గూర్చి నీవే స్వయంగా వచ్చి నాకు చెప్పడమువలన బ్రతికిపోయావు. అలాకానిచో నీ శిరస్సు లక్షముక్కలై ఉండేది.

"రాజా! ఈ కార్యమును తెలియక చేశావు. పైగా పశ్చాత్తాపముతో మాట్లాడుతున్నావు. అందుచేత బ్రతికిపోయావు. లేనిచో నీ ఇక్ష్వాకువంశమే నశించిఉండేది.

"రాజా! మమ్మల్ని ఇద్దరిని మా బిడ్డవద్దకు తీసికొనిపో. మా ప్రియపుత్రుని చివరగా చూడాలనిపిస్తూవుంది" అన్నాడు ఆ మునీశ్వరుడు.

"కౌసల్యా! నేను వారిద్దరిని సరయూ నదీతీరానికి తీసికొనివెళ్ళి, వారు తమపుత్రుని స్పృశించునట్లు చేశాను. వారిరువురు ఆ మునిబాలునిపైబడి రోదించారు. వారు అక్కడ చచ్చి పడియున్న బాలునితో ఇలామాట్లాడారు.

"కుమారా! మేము నాయనా! నీ తల్లిదండ్రులము. అదేమిటి నాయనా! మాకు నమస్కారము చేయడం లేదేమిటి? మాతో మాట్లాడవెందుకని? నేలపై పడుకొనియున్నావా? నాపై కోపమువచ్చిందా? కుమారా! ధర్మాత్ముడా! నాతో మాట్లాడవా?" ఈ మాటలు మునీశ్వరుడు చెప్పినా, దశరథుడు రాముని మనసులో నిలుపుకొని మాట్లాడుతున్నాడు. భావాన్ని పరిశీలించండి.

"కుమారా! చక్కగా వేదపఠనము చేయు కంఠము ఇక మాకు వినిపించదా? కందమూలాలుతెచ్చి రేపు మాకు ప్రేమతో పెట్టేవారెవరు? నాయనా! మీ తల్లి ఎలా దుఃఖిస్తూ వుందో చూడు. ఆమెను నేను ఓదార్చగలనా?



"పుత్రా! ఆగు ... ఆగు ... వెళ్ళకు .... వెళ్ళకు. నీతో మేమూ వస్తాము. నీ వెక్కడ వుంటే మేమూ అక్కడే ఉంటాము.

"నాయనా! నీవు ఏ పాపము తెలియనివాడవు. ఈ పాపాత్ముడు నిష్కారణంగా నిన్ను వధించాడు. కుమారా! నీకు సద్గతి ప్రాప్తించుగాక!

**న హి త్వస్మిన్ కులే జాతో గచ్ఛత్య కుశలాం గతిమ్**
**స తు యాస్యతి యేన త్వం నిహతో మమ బాన్ధవః**

"నాయనా! మన ఋషికులములో పుట్టినవానికి దుర్గతి ఎన్నటికీరాదు. నా కుమారుడవైన నిన్ను వధించినవానికే దుర్గతి కల్గుతుంది."

"కౌసల్యా! ఆ మునిదంపతులు ఈవిధంగా అక్కడ చాలాసేపు రోదించారు. తరువాత కుమారునికి ఉదకక్రియలుచేశారు. ఆ మునికుమారుడు పుణ్యకర్మఫలవిశేషంతో స్వర్గధామమును అలంకరించాడు. ఇంద్రునితోపాటు విమానంలో కూర్చుని తల్లిదండ్రులతో ఆమునిబాలుడు భాషించాడు.

"జననీజనకులారా! మీకు సేవచేయుట వలన నాకు ఉత్తమగతి ప్రాప్తించింది. మీరు కూడా తొందరగా నన్ను చేరుతారు" అని పలికి ఆ మునిబాలుడు స్వర్గధామం చేరాడు.

"మునీశ్వరుడు భార్యతోకూడి జలతర్పణాలు ముగించుకున్నాడు.నాతో ఇలా పలికాడు.

"రాజా! నిరపరాధి, పాపరహితుడు అయిన నా ఏకైక పుత్రుని చంపి నాకు పుత్రశోకాన్ని కల్గించావు. ఇంకా చూస్తూ నిలుచున్నావేమి? నన్నుకూడా వధించు. నాకు మరణభయము లేదు.

"నీవు నా కుమారుని తెలియక చంపివుండవచ్చు. అయినా నా శాపాన్ని అనుభవించక తప్పదు.

**ఏవం త్వం పుత్రశోకేన రాజన్ కాలం కరిష్యసి**

"నేను ఇపుడు పుత్రశోకాన్ని ఎలా అనుభవిస్తున్నానో నీవుకూడా అలాగే పుత్రశోకాన్ని అనుభవిస్తూ మరణిస్తావు. నీవు మునిబాలుని తెలియక చంపావు గనుక బ్రహ్మహత్యా దోషము అంటదు."

"కౌసల్యా! ఆ మునిదంపతులు నన్ను ఈవిధంగా శాపగ్రస్తునిచేసి, వారి దేహములను చితిపై పెట్టుకొని, ప్రాణత్యాగంచేసి, తమ కుమారుడున్న స్వర్గధామం చేరారు.

"రాణీ! ఆ ముగ్గురు నా కళ్ళముందు కనిపిస్తున్నారు. ఆరోజు తెలియక నేనుచేసిన పాపము ఈనాడు ఇంత ఘోరంగా నన్ను బాధిస్తూఉంది.

**అపథ్యైః సహ సంభుక్తే వ్యాధి రన్నరసే యథా !**

"కౌసల్యా! అపథ్యభోజనానికి వ్యాధి ఫలమైనట్లు, నేను అప్పుడు చేసిన కర్మకు కాలాంతరమున నేడు ఫలం ప్రాప్తిస్తోంది.

"కౌసల్యా! నేను పుత్రశోకముతో మరణించునట్లు ఆ మునీశ్వరుడు శాపంపెట్టాడు. ఆసమయం నాకు సమీపించింది.

"కౌసల్యా! కౌసల్యా! నాకేమీ కనిపించడంలేదు. ఏదీ! నీచెయ్యి నామీద వెయ్యి. నాకు నీవు కనిపించడంలేదు.

"కౌసల్యా! కన్నకొడుకును వనాలకు నిర్దాక్షిణ్యంగా పంపడం పాపినైన నాకే చెల్లింది. నా మాటను మన్నించి సర్వమునూ త్యజించి అడవులకు వెళ్ళడం ధర్మాత్ముడైన రామునికే చెల్లింది.

"కౌసల్యా! బిడ్డ ఎంత తప్పుచేసినా తెలివిగల తండ్రి ఎవడైనా ఈలోకంలో బిడ్డను వదులుకుంటాడా? అలాగే, ఏ బిడ్డడైనా వనాలకు వెళ్ళమనిన తండ్రిపై కోపించకుండా ఉంటాడా?"

"కౌసల్యా! నేనెలాగూ బ్రతకను. నేను కన్నుమూసేలోగా రాముడు నా దగ్గరకువస్తే ఎంత బావుంటుంది? నన్ను తాకితే ఎంత బావుంటుంది? చనిపోయిన తరువాత ఎవరు ఎవరిని చూస్తారు?

**యమక్షయ మనుప్రాప్తా ద్రక్ష్యన్తి న హి మానవాః**

"గతించిన తరువాత మానవులు తమ బంధువర్గాన్ని చూడరుకదా!

"కౌసల్యా! నీవు ప్రక్కనే ఉన్నావా! నాకు నీవు కనిపించడంలేదు. నా జ్ఞాపకశక్తి తగ్గిపోతూ వుంది. యమదూతలు నన్ను తొందరచేస్తున్నారు.

"కౌసల్యా! మరణసమయాన నా రాముడు నావద్దలేడు. వనవాసాన్ని పూర్తిచేసుకొని అరుదెంచు నారాముని ఎవరుచూస్తారో వారు మానవులుకాదు. దేవతలే. ధన్యాత్ములే రాముని చూడగలరు. నా నాథుడైన రాముని సుఖవంతులే చూడగలరు.

"కౌసల్యా! విషయాలు దగ్గరకువచ్చినా వాటిని ఇంద్రియాలద్వారా నేను తెలుసుకోలేక పోతున్నాను. తైలము క్షీణించుటచే దీపకిరణములు నశించునట్లు, నా మనస్సు నశించుట చేత ఇంద్రియములు క్షీణించిపోయాయి.

"దేవీ! నదీప్రవాహము తీరమును పడదోయునట్లు, ఈ పుత్రశోకము నన్ను నశింపచేస్తున్నది.

"రామా! అయ్యో! రామా! అయ్యో! మహాబాహో! అయ్యో! మదీయ శోకనాశకా! అయ్యో! పితృప్రియా! అయ్యో! రక్షకా! అయ్యో! కుమారా! ఎక్కడికెళ్ళావు నాయనా!

"అయ్యో! కౌసల్యా! దీనురాలైన సుమిత్రా! కులనాశినియైన కైకేయీ! నేను మరణిస్తున్నాను" అని విలపిస్తూ దశరథుడు కౌసల్యాసుమిత్రల దగ్గరగావాలి మరణించాడు. అర్థరాత్రి సమయాన ప్రాణాలువిడిచాడు.

**జీవన మరన ఫలు దసరథ పావా! అండ అనేక అమల జసు ఛావా**
**జీవత్ రామ బిధు బదన నిహారా! రామ్ విరహ కరి మరను సంవారా!**

"ఈ విధంగా దశరథమహారాజు జీవితకాలమునందు, మరణానంతరముకూడా పొందదగిన ఫలితాన్ని పొందాడు. నిష్కల్మషమైన ఆయన కీర్తి బ్రహ్మాండమంతా వ్యాపించింది. జీవించియుండగా రాముని ముఖారవిందమును దర్శిస్తూ బ్రతికాడు. మరణకాలమున రాముని



స్మరిస్తూ ప్రాణాలువిడిచాడు" అని రామచరితమానసంలో తులసీదాస్ దశరథుని స్మరించాడు.

**రామ రామ కహి రామ కహి రామ రామ కహి రామ**
**తను పరిహరి రఘువర విరహ రాట గయే ఉ సురధామ**

'రామ-రామ' అనిపలికి, మరల "రామ" అనిపలికి, ఆతరువాత 'రామ-రామ' అని ఉచ్చరించి, చివరగ "రామ" అనిపలికి దశరథమహారాజు వియోగదుఃఖముచే ప్రాణములను త్యజించి సురలోకానికి వెళ్ళాడు" అని రచించాడు తులసీదాసు.

అంత్యదశలో అయోధ్యాధిపతి ఆరుసార్లు రామనామమును ఉచ్చరించునట్లు తులసీదాస్ మహనీయుడు రామచరితమానసంలో రచించాడు. దశరథుడు ఆవిధంగా ఆరు పర్యాయములు 'రామ' నామమును పలుకుటకుగల కారణమును మహాత్ములు అనేకవిధాల దర్శించారు.

1. రాముడు వనవాసానికి వెళ్ళి నేటికి ఆరు రోజులైనది. అందుచేత దశరథుడు ఆరుసార్లు 'రామ' నామము పలికినాడు.

2. 'రామ' నామము షడ్దర్శనముల సమగ్రస్వరూపము అని తెలుపుటకు ఆరుసార్లు పలికాడు.

3. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లనెడి అరిషడ్వర్గములను జయించుట చాలా కష్టము. వీటన్నిటిని ఒక్క రామనామముతోనే జయించవచ్చు అని తెలుపుటకే 'రామ' నామమును ఆరుసార్లు ఉచ్చరించినాడు.

4. దశరథుని అవసానదశ సమయాన, కౌసల్య, సుమిత్ర, సుమంత్రుడు ముగ్గురే ఉన్నారట. ఆ ముగ్గురికి వీడ్కోలిస్తూ 'రామ్-రామ్' చెప్పాడట. ఇలా ముగ్గురికి 'రాం-రాం' చెప్పినపుడు రామనామము ఆరుసార్లు ఉచ్చరించినట్లు అయింది.

5. రామాయణంలోని ఆరుకాండలూ కేవలం రామస్వరూపమేనని తెలుపుటకు 'రామ' నామమును ఆరుసార్లు ఉచ్చరించినాడు.

6. రాముడు షడ్గుణైశ్వర్య సంపన్నుడైన విష్ణుమూర్తి అని తెలుపుటకు 'రామ' నామమును దశరథుడు ఆరుసార్లు ఉచ్చరించాడు.

తులసీరామాయణంలో దశరథుడు ఆరుసార్లు రామనామమును పలికి కన్నుమూశాడు. వాల్మీకిరామయణంలో కూడా ఆరుసార్లు ఉచ్చరించినట్లే ఉంది. రాముని ఆరుసార్లు' పిలిచినట్లుంది.

**హా రాఘవ మహాబాహో హా మమాయాస నాశన**
**హా పితృప్రియ మే నాథ హాద్య క్వాసి గతః సుత ॥**

1.అయ్యో! రాఘవా! 2. అయ్యో! మహాబాహో! 3. అయ్యో! మదీయ శోకనాశకా ! 4.అయ్యో! పితృప్రియా! 5.అయ్యో! నాథా! 6.అయ్యో! నా కుమారా! ఎక్కడికి వెళ్ళావు?

ఈవిధంగా దశరథుడు వాల్మీకంలోకూడా అవసానదశలో ఆరుసార్లు రాముని పిలిచాడు.

ఎన్నిసార్లు పిలిచినా, వాటి వ్యాఖ్య లెలావున్నా, ప్రాణప్రయాణ సమయంలో 'రామ' నామమును పలుకుతూ, రాముని హృదయంలో దర్శిస్తూ మరణించడం ఎవరికి సాధ్యం? మహాభక్తులకే అది సాధ్యం.

నారాయణుడు నామవశుడు. కనుక నామముద్వారానే భగవంతుడు భక్తులకు వశుడవుతాడు. ఏ వస్తువును మనము పొందాలనుకున్నా ముందుగా దాని నామాన్ని మనసులో ధరించడం జరుగుతుంది. అలాగే భగవంతుని పొందుటకు ముందుగా భగవన్నామాన్ని అనుస్మరించాలి.

భగవన్నామము సమస్త పాపాల్ని హరిస్తుంది. భగవన్నామముద్వారా పోగొట్టుకోలేనంత పాపాన్ని మానవుడు చేయగలడా?

**నామ్నోఽస్తి యావతీ శక్తిః పాప నిర్హరణే హరేః**
**తావత్కర్తుం న శక్నోతి పాతకం పాతకీ జనః**

"పాపమును హరించుటలో భగవన్నామానికి ఎంత శక్తివుందో అంతటి పాపాన్ని మానవుడు ఆచరించలేడు" అని గరుడపురాణము పేర్కొంది. రామనామ మహిమ అద్భుతమైనది. అప్రమేయమైనది.

**రమంతే యోగినోఽనంతే - నిత్యానందే చిదాత్మని**
**ఇతి రామ పదే నాసౌ - పరం బ్రహ్మాభిధీయతే**

"అనంతమైన ఏ నిత్యానంద చిదాత్మ పరమాత్మయందు యోగులు రమింతురో అతడే 'రామ' అనే పదముద్వారా పిలువబడినాడు" అని రామపూర్వతాపిన్యుపనిషత్ ప్రవచించింది.

అట్టి కళ్యాణరాముని రూపమును హృదయమునందు ఉంచుకొని, రామనామమును నాలుకపై నిలుపుకొని కన్నుమూసిన దశరథుడు ధన్యాత్ముడు.

## దివంగతుడైన దశరథుడు

దశరథుడు రాత్రే మరణించాడని కౌసల్యాసుమిత్రలకు కూడా తెలియదు. వందిమాగధులూ, గాయకులు వచ్చి సుప్రభాతం పలికిన తరువాతే రాజు మరణించినట్లు తెలిసింది.

మునిశాపాన్ని వివరించిన తరువాత మధ్యమధ్యన రాజు మూర్ఛిల్లుతూ, లేచి మూలుగుతూ ఉండటం జరిగింది. ఒక దశలో దశరథుడు మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయాడు. రాజు నిద్రించిఉంటాడని కౌసల్యాసుమిత్రలు భావించిఉంటారు. వారిరువురు కూడా శోకభారంతో ఉన్నందున నిద్రించిఉంటారు. ఈవిధంగా దశరథమహారాజు రాత్రే మరణించినా, సూర్యోదయ సమయానికిగాని వెల్లడికాలేదు.

మరణించియున్న దశరథుని చూచి కౌసల్యాసుమిత్రలు "హా నాథా!" అని అరచి నేల మీద పడిపోయారు. కౌసల్య నేలపై దొర్లుతూ, ఆకాశంనుండి జారి దుమ్ములోపడ్డ నక్షత్రం లాగా కాంతిహీనమై గోచరించింది.



రాణులందరూ బిగ్గరగా రోదించారు. వారి ఏడుపులతో రాజభవనమంతా ప్రతిధ్వనించింది. రాజప్రాసాదాలన్నీ దైన్యంతో, విషాదంతో నిండిపోయాయి. రాణులందరు దశరథుని చుట్టూచేరి ఒకరిచేతులు మరొకరు పట్టుకొని బిగ్గరగా విలపించారు.

కౌసల్య దశరథుని శిరస్సును ఒడిలోనుంచుకొని దుఃఖిస్తూ కూర్చున్నది. శాంతించిన అగ్నిలాగా, నీరులేని సముద్రంలాగా, కాంతి పోయిన సూర్యుడులాగా గోచరిస్తున్న దశరథుని చూస్తూ, కన్నీళ్ళుకార్చుతూ కౌసల్య కైకేయితో ఇలాపలికింది.

"క్రూరాత్మురాలా! దుష్టచారిణీ! నీ కోర్కెలు తీరాయా? ఇక రాజుకూడా లేడు. నీ ఇష్టమొచ్చినట్లు, అడ్డంకులులేని రాజ్యాన్ని అనుభవించు.

"రాముడు నన్ను విడచి అడవులకు వెళ్ళాడు. నన్ను వదలి భర్త పరలోకం చేరాడు. ఏకాకిగా నేను మిగిలిపోయాను. నాకు బ్రతకాలనే ఆశలేదు.

"నాలాగే వృద్ధుడు, పుత్రహీనుడు అయిన జనకుడుకూడా జీవించలేడు. నేను భర్తను పోగొట్టుకొనిన అనాథ నయ్యానని నా తండ్రి రామునికి తెలియదు."

"భర్తను విడచి నేను జీవించలేను. నా భర్త శరీరమును పట్టుకొని నేను ఇప్పుడే అగ్నిలో ప్రవేశిస్తాను;" అని విలపిస్తూఉంది మహారాణి కౌసల్య.

మంత్రులు, కుమారులు ఎవ్వరూ లేని సమయాన దశరథుని కళేబరానికి దహన సంస్కారము చేయలేక, వసిష్ఠుని ఆజ్ఞప్రకారము రాజుగారి శరీరాన్ని తైలద్రోణిలో చెడకుండా ఉంచారు.

దశరథుడులేని అయోధ్య చంద్రుడులేని రాత్రిలాగా, భర్తలేని భార్యలాగా కాంతిహీనమైంది. ప్రజలంతా కన్నీళ్ళతో వ్యాకులంగా కన్పిస్తున్నారు. నగరమంతా శోభారహితమైంది.

మార్గములలోను, చతుష్పథముల యందును జనులు గుమిగూడి రోదించసాగారు. స్త్రీ పురుషులందరూ ముక్తకంఠంతో కైకేయిని నిందిస్తున్నారు. పట్టణమంతా నక్షత్రములు లేని రాత్రిలాగా, సూర్యుడులేని ఆకాశంలాగా ప్రకాశహీనమైంది.

ఆ రాత్రంతా అయోధ్యాపట్టణము అరపులతో, శోకాలతో, హాహాకారాలతో నిండి పోయింది. తెల్లవారింది. పెద్దలు, బ్రాహ్మణులు, సచివులు అందరూ వచ్చారు.

మార్కండేయుడు, మౌద్గల్యుడు, కాశ్యపుడు, వామదేవుడు, గౌతముడు, కాత్యాయనుడు, ఇతర మంత్రులు, రాజపురోహితుడైన వసిష్ఠునితో విడివిడిగా తమ అభిప్రాయాలను తెలిపారు.

"మహర్షీ! రాజులేని రాత్రి మనకు నూరు సంవత్సరాలలాగా అతికష్టంగా గడిచింది. మహారాజు మరణించాడు. రాముడు వనాలకు వెళ్ళాడు. లక్ష్మణుడుకూడా రామునివద్దే ఉన్నాడు. భరతశత్రుఘ్నులు కేకయదేశంలో ఉన్నారు.

"ఇక్ష్వాకువంశానికి చెందిన ఎవరినో ఒకరిని రాజుగా చేయాలి. రాజు లేకుంటే రాజ్యమే నశించిపోతుంది. రాజులేని రాజ్యములో అన్నీ దుర్భిక్షాలే.

“రాజులేని రాజ్యంలో వర్షాలు కురియవు. పంటలు పండవు. భర్తమాట భార్య వినదు. తండ్రిని పుత్రుడు గౌరవించడు. ఆనందంగా సభలు జరుగవు. దేవాలయాలు శోభించవు. యజ్ఞాలుండవు. దానాలుండవు. కళలు వృద్ధిచెందవు. అభివృద్ధికార్యక్రమాలు విరోధింపబడుతాయి. న్యాయం దెబ్బతింటుంది. చట్టం విలువను కోల్పోతుంది. స్త్రీలకు రక్షణ ఉండదు. చోరభయం కల్గుతుంది. కృషి, గోరక్ష, వాణిజ్యాలు దెబ్బతింటాయి. వీరులు అదృశ్యమవుతారు. ప్రయాణాలలో బాధలు ఎదురౌతాయి. మునులు గోచరించరు. యోగక్షేమాలుండవు. సేన బలహీనమై శత్రువులను ఎదిరించలేని స్థితిలో ఉంటుంది. భయం స్వైరవిహారం చేస్తుంది. శాస్త్రచర్చలు సన్నగిల్లుతాయి. పూజలు సడలిపోతాయి.

“ఒక్కమాటలో చెప్పాలంటే, రాజులేని రాజ్యము నీరులేని నది వంటిది. గడ్డిలేని వనము వంటిది. గోపాలురులేని గోవులవంటిది. మనుషులు చేపల్లాగా ఒకరినొకరు పీక్కుతింటారు.

“ప్రజలకు రాజే తండ్రి. రాజే తల్లి. రాజే సర్వము. మహర్షీ! వసిష్ఠా! రాజుగారు జీవించి యున్నప్పుడుకూడా మేము నీమాటను ఎన్నడూ దాటి ఎరుగము. నీమాటే మాకు వేదము.

“నీవు చెప్పినది ఏదైనను మాకు ఆమోదమే. రాజులేని రాజ్యము అరణ్యముగా మారుతుందని మీకు తెలుసు. కనుక తక్షణమే ఉత్తముడైన ఇక్ష్వాకువంశీయుని రాజుగా అభిషిక్తుని గావించు” అని వసిష్ఠునితో పలికారు.

## భరతునికి సందేశము

ద్విజులు, సచివులు పలికిన విషయాలను ఆలకించిన రాజపురోహితుడైన వసిష్ఠుడు వారితో ఇలాచెప్పాడు.

“దశరథమహారాజే భరతునికి రాజ్యాన్ని ఇచ్చినపుడు మనము మరొకవిధంగా ఆలోచించవలసిన పనిలేదు. దూతలచే భరతునికి వర్తమానం పంపడమే మన తక్షణ కర్తవ్యం” అనిపలికి దూతలను పిలిపించాడు. వారికి సూచనలిచ్చాడు.

“సిద్ధార్థా! జయంతా! విజయా! అశోకా! నందనా! రండి. నే చెప్పేది శ్రద్ధగా వినండి.

“సిద్ధార్థా! ... ” మీరు వెంటనే మంచి అశ్వములను అధిరోహించి కేకయరాజ్యములోని రాజగృహపురానికి ప్రయాణంకండి.

“మీ మాటల్లోగాని, ముఖంలోగాని ఏవిధమైన విషాదము కనిపించకూడదు. పురోహితుడు, మంత్రులు కుశలమడిగారని భరతునికి చెప్పండి. అవసరమైన కార్యముంది. వెంటనే బయలుదేరమన్నామని చెప్పండి.

“వినండి. రాముడు అరణ్యాలకు వెళ్ళినట్లుగాని, దశరథమహారాజు మరణించినట్లు గాని, అయోధ్యకు ఆపదలు సంభవించినట్లుగాని భరతునితో చెప్పకూడదు.

“వారికి సందేహంరాకుండా, అశుభాన్ని వారు ఊహించకుండా కేకయరాజుకూ, భరతునికీ పట్టువస్త్రాలు, విలువైన అలంకారాలు తీసికొనివెళ్ళండి;” అని వసిష్ఠుడు పలికాడు.

వసిష్ఠుడు పిలిచిన దూతల పేర్లను పరిశీలిస్తే దూత అనేవాడు ఎలావుండాలో తెలుస్తుంది.



దూత సిద్ధార్థుడై వుండాలి. కార్యసిద్ధిని లక్ష్యంగాపెట్టుకొని వర్తించేవాడై ఉండాలి. దానిని ప్రధానధ్యేయంగా కలిగి చరించేవాడై ఉండాలి.

సిద్ధార్థుడైన దూత జయంతుడై వుండాలి. జయంతుడు ఇంద్రుని కుమారుడు. ఇంద్రుడు ఇంద్రియములకు రాజు. కనుక దూత జితేంద్రియుడై ఉండాలి. ఆకలి దప్పుల్ని, శీతోష్ణాల్ని జయించినపుడే ప్రతికూల వాతావరణంలోకూడా దూత జయమును సాధిస్తాడు.

సిద్ధార్థుడు, జయంతుడు అయిన దూత విజయుడై ఉండాలి. లక్ష్యమును దృష్టిలో ఉంచుకొని, ఇంద్రియాలను నియమించి దూతగా తన విధిని నిర్వహించుటేగాక కార్యమును సాధించేవాడై ఉండాలి. విజయమును హస్తగతం చేసుకొనేవాడై ఉండాలి.

విజయాన్ని సాధించేముందు అనేక బాధలు ఎదురుకావచ్చు. కష్టాలు ఏర్పడవచ్చు. వాటిని సంతోషంతో భరించేవాడై ఉండాలి.అంతేగాని దుఃఖించే స్వభావముకలవాడై ఉండకూడదు. కార్యము విఫలమైనా అధైర్యముతో దుఃఖించేవాడై ఉండకూడదు. కనుక దూత అశోకుడు. అనగా శోకం లేనివాడు.

చివరగా దూతను నందనుడుగా మనకు వసిష్ఠుడు పరిచయంచేశాడు. నందనుడు అంటే సంతోషపరచువాడు అని అర్థము. దూత తన కార్యముద్వారా ప్రభువును సంతోష పరచేవాడై ఉండాలి. ఇవి దూతకు ఉండవలసిన లక్షణాలు. నేటికాలంలో రాయబారులకు ఈ లక్షణాలుండాలి.

దూతలు అవసరమైన వస్తువులను, బహుమానాలను తీసికొని అశ్వములపై బయలుదేరి వెళ్ళారు. అడవులు, సరస్సులు, కొండలు, నదులు దాటుతూ కేకయదేశం చేరారు. రాత్రి అగుసరికి భరతుడున్న రాజగృహపురం చేరారు. ఉదయాన్నే భరతుని చూచుటకు అమమతి తీసుకున్నారు.

ఆ రాత్రే భరతుడు ఒక భయంకరమైన కలగన్నాడు. తెల్లవారుజామున వచ్చిన స్వప్నమైనందున భరతుడు చాలా పరితపించిపోయాడు. భరతుని సంతోషపెట్టాలని భరతుని మిత్రులు ఎంతగానో ప్రయత్నించారు.

కొందరు కథలు చెప్పారు. కొందరు పాటలు పాడారు. మరికొందరు హాస్యపాత్రల నభినయించారు. ఇంకకొందరు ధ్వన్యనుకరణం చేశారు. హారెంత ప్రయత్నించినా భరతుని మనస్సు స్థిమితపడలేదు. ఈ విషాదానికి కారణమేమిటని ఒక మిత్రుడు భరతుని ప్రశ్నించాడు. వారికి భరతుడు ఇలా సమాధానంచెప్పాడు.

“ఈనాడు నాకొక చెడ్డ కలవచ్చింది. మా తండ్రి ఆకాశంనుండి గోమయంతో నిండిన గోతిలో పడుతున్నట్లు, తైలము త్రాగుచూ, తైలములో మునిగియున్నట్లు కల వచ్చింది. కారణం సుస్పష్టంగా తెలియకపోయినా నా హృదయం భయకంపితంగాఉంది” అన్నాడు భరతుడు.

అదేసమయానికి అయోధ్యనుండి వచ్చిన దూతలు రాజసౌధంలో ప్రవేశించారు. కేకయరాజు, యుధాజిత్తును కలిసి, రాజుకు నమస్కరించి భరతునితో ఇలాపలికారు;

“పురోహితుడైన వసిష్ఠుడు, మంత్రులందరు మిమ్మల్ని కుశలమడిగారు. మీతో చాలా పనిఉన్నదట. వెంటనే మిమ్మల్ని బయలుదేరి అయోధ్యకురమ్మని చెప్పారు.

" ఈ వస్త్రములను, కానుకలను మీ మేనమామగారి కివ్వండి. ఇవి మీ తాతగారికి ఇవ్వండి;" అన్నారు. భరతుడు వాటిని గ్రహించి తాతగారికి, మేనమామకు ఇచ్చాడు.

భరతుడు దూతలను ప్రశ్నించాడు. "దూతల్లారా! మా తండ్రి దశరథమహారాజు క్షేమంగా యున్నాడా? మా అన్న రాముడు కుశలమా! లక్ష్మణుడు సౌఖ్యమా? సీత, కౌసల్య, సుమిత్ర, కైకేయి క్షేమంగాఉన్నారా?" అని పేరుపేరున అడిగాడు భరతుడు.

"అందరూ క్షేమంగానే యున్నారు. అందరూ మీ శుభాన్ని కాంక్షించారు. వెంటనే మిమ్మల్ని బయలుదేరి రమ్మన్నారు" అనిపలికారు దూతలు.

భరతుడు తాతగారినుండి, మేనమామ యుధాజిత్తునుండి అనుజ్ఞనుపొంది, శత్రుఘ్నునితో కూడి, వందలకొలది భృత్యులు, హితులు రథములలో అనుసరించగా ప్రయాణమును సాగించాడు.

## భరతుని ఆగమనం

భరతుడు తనను అనుసరించు పరివారముతోకూడి వేగంగా ప్రయాణం సాగించాడు. అక్కడక్కడ విశ్రాంతి తీసుకుంటూ, గుర్రాలను కడుగుతూ, భోజనాలు ఆరగిస్తూ ఏడు రోజులు అతివేగంగా ప్రయాణంచేసి ఎనిమిదవరోజు ఉదయం అయోధ్యానగరంలో ప్రవేశించారు. నగరాన్ని దూరమునుండిచూచి భరతుడు భీతిచెందాడు. సారథిని ప్రశ్నించాడు.

"సారథీ! చక్కని ఉద్యానవనములతో రమణీయంగా శోభించే అయోధ్యానగరమును పూర్వము ఎందరో రాజర్షులు పాలించారు. వేదజ్ఞులైన బ్రాహ్మణులు ఇక్కడ ఎందరో వున్నారు.

"పూర్వము ఈప్రాంతానికి వచ్చేసరికి అయోధ్యానగరంనుండి ఎంతో కలకలం వినిపించేది. ఈనాడు ఏసవ్వడీ లేదు. జనసంచారము, వాహనసంచారము ఏదీ కనిపించడం లేదు. నగరంలోకి ప్రవేశ నిర్గమములు గోచరించడంలేదు.

"మృగపక్ష్యాదుల శబ్దములు వినిపించడంలేదు. భేరీ మృదంగ వీణాదుల మధుర నాదములు వినిపించడంలేదు. పైగా, దుశ్శకునములు కన్పిస్తున్నాయి. నా మనస్సు కుదుట పడడంలేదు. సారథీ! దుఃఖకారణము ఏమీ తెలియకున్నా, నా మనసు తీవ్రంగా వ్యథ చెందుతూఉంది;" అని పలుకుతూ భరతుడు నగరంలోకి భయపడుతూ ప్రవేశించాడు.

"సారథీ! నా మనసు కృంగిపోతూవుంది. పూర్వము రాజులు మరణించినపుడు నగరాలు ఎలా ఉండేవో అలా గోచరిస్తూ వుంది అయోధ్య. పట్టణమంతా కాంతిహీనంగా ఉంది. ముంగిళ్ళు తుడిచినట్లులేధు. వాకిళ్ళు అలికినట్లులేదు. ఆలయాలు పూజాహీనంగా కన్పిస్తున్నాయి. యజ్ఞాలు నిర్వహించడం లేదు. పూలమాలలు విక్రయించే అంగళ్ళు లేనేలేవు. పక్షులు హాయిగా విహరించడం లేదు. ఎవరినిచూసినా దుఃఖంతో, కన్నీళ్ళతో కనిపిస్తున్నారు;" అని సారథితో పలికి భరతుడు రాజభవనంలో ప్రవేశించాడు.

తండ్రి సౌధానికి వెళ్ళాడు భరతుడు. అక్కడ తండ్రి కనిపించలేదు. వెంటనే తల్లిని చూచేందుకు అంతఃపురానికి వెళ్ళాడు.



కైకేయి భరతుని చూచింది. ఆనందంతో పొంగిపోయింది. బంగారు ఆసనముపైనుండి చివాలున సంతోషంతో లేచింది. భరతుడు తల్లిపాదాలను స్పృశించి నమస్కరించాడు.

కైకేయి భరతుని కౌగిలించుకుంది. తలను ప్రేమతో మూర్కొనింది. ఒడిలో కూర్చోబెట్టుకున్నది.

"నాయనా! ప్రయాణం బాగా జరిగిందా? నీవు తాతగారి ఇంటినుండి బయలు దేరిందెప్పుడు? ప్రయాణబడలిక కలుగలేదుకదా? కుమారా! తాతగారు,మీ మామ యుధాజిత్తు క్షేమంగా ఉన్నారా?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించింది కైకేయి.

భరతుడు ఆమె ప్రశ్నలన్నిటికీ సమాధానంచెప్పాడు. "తల్లీ! నేను తాతగారి ఇంటినుండి బయలుదేరి ఏడురోజులైంది. మా తాతగారు, మేనమామ యుధాజిత్తు క్షేమంగాఉన్నారు. తాతగారు నాకు అనేక కానుకలిచ్చారు. అవన్నీ వెనుక వస్తున్నాయి. నన్ను ఎందుకో అవసరమైన పనిఉందని తొందరగారమ్మని కబురంపారు. అందుచేత పరివారాన్ని వెంట రమ్మనిచెప్పి నేను తొందరగా, ముందుగా వచ్చాను.

"అమ్మా! నేను మా నాన్నగారిని దర్శించడానికి వారిమందిరానికి వెళ్ళాను. రాజుగారు అక్కడ కనిపించలేదు. ఆయన ఎక్కువగా నీ గృహంలో ఉంటారుకదా! అని ఇక్కడికొచ్చాను. ఇక్కడా కనిపించడంలేదు.

"ఆయన ఎక్కడున్నారో చెప్పు.తండ్రికి పాదాభివందనం చేయాలని నా మనసు ఆతురత చెందుతూవుంది. అమ్మా!రాజుగారు మా పెద్దతల్లి కౌసల్య మందిరములో ఉన్నారా?"అని ప్రశ్నించాడు భరతుడు.

అతిభయంకరమైన వార్తను ఉన్నదున్నట్లు చెప్పింది కైకేయి. ఆవార్త భరతునికి ప్రియంగా ఉంటుందని భావించింది. భరతుడు అదివిని ఎంతగానో సంతోషపడతాడని అభిప్రాయపడింది.

"కుమారా! మహారాజు, మహాత్ముడు, తేజశ్శాలి, యజ్ఞమయుడు, సర్వాశ్రయుడు అయిన నీతండ్రి సకలప్రాణులకు చివర ఏమవుతుందో అదే అయినాడు" అంది కైకేయి.

ఆ మాట వినగానే పవిత్రుడైన భరతుడు పితృశోకమును భరించలేక, మొదలు నరికిన చెట్టులాగా ఏడుస్తూ నేలపైపడ్డాడు. **'హతోస్మి'** అని పలుకుతూ దీనుడై దుఃఖించాడు. పితృశోకము భరతునికి దుర్భర దుఃఖంగా పరిణమించింది.

తండ్రి పడుకొనే శయ్యనుచూచి, "పూర్వము నాతండ్రి ఈ శయ్యపై పవ్వళించి వుంటే ఆకాశం చంద్రునివలన ప్రకాశించినట్లు శోభిస్తూవుండేది. ఈనాడు చంద్రుడులేని ఆకాశంలా కాంతిహీనంగాఉంది" అని పలుకుతూ, ముఖాన్ని వస్త్రముతో కప్పుకొని అతి దీనంగా దుఃఖించాడు భరతుడు.

సూర్యచంద్రులతో సమానుడైన భరతుడు అలా నేలపైపడి దుఃఖించడం చూచి కైకేయి భరతుని సమీపించింది. నేలపైనుండి లేవదీసి కూర్చోబెట్టింది. భరతునితో ఇలాపలికింది.

"రాజకుమారా! లే ... లే .... ఏమిటి నీ ప్రవర్తన? సభలలో సన్మానాలుపొందే అర్హతగల నీలాంటి వీరులు అలా నేలపైబడి దుఃఖిస్తారా?

"భరతా! నీవు బుద్ధిమంతుడవు. శీలవంతుడవు. యజ్ఞయాగాదులను నిర్వహించే అధికారమును కలిగియున్నావు. నీ మేధస్సు సూర్యుని ప్రకాశం వంటిది. రాజులు ఇలా విలపించకూడదు. లే. ధీరుడవై నిలబడు" అన్నది కైకేయి.

"అమ్మా! అవసరమైన కార్యముంది. వెంటనే రమ్మని గురువులు కబురంపితే రాజుగారు రామునికి రాజ్యాభిషేకముచేయ సంకల్పించి ఉంటారని భావించాను. కన్నుల పండుగగ రాముని యౌవరాజ్యాభిషేకమును చూడవచ్చని పొంగిపోయాను.

"లేదా తండ్రిగారు యజ్ఞము ఏదైనా నిర్వహించాలని సంకల్పించారేమోనని భావించాను. నా ఊహలన్నీ తారుమారయ్యాయి. నా ఆశాసౌధాలు పేకమేడలై కూలిపోయాయి. నా బ్రతుకంతా చీకటైపోయింది.

"ఎప్పుడూ నా మంచినికోరే తండ్రిని చూడలేకపోయినందుకు నా హృదయం బ్రద్దలవుతూవుంది. అమ్మా! తండ్రి ఎందుకు చనిపోయారు? ఏ వ్యాధి ఆ మహాత్ముని కబళించింది?

"నా తండ్రికి ప్రేతసంస్కారములు చేసిన రాముడు ధన్యుడయ్యాడు. నా శరీరంపై దుమ్ము కనబడితే నా తండ్రి దగ్గరగా పిలిచి ప్రేమతో తుడిచేవాడు. ఆయన హస్తస్పర్శ నాకెంతో హాయిని, సుఖాన్ని ప్రసాదించేది.

"అమ్మా! నేను వచ్చినట్లు నాఅన్న రామునకు తెలియజేయండి. రాముడు నాకు సోదరుడే కాదు. తండ్రి. బంధువు. ప్రభువు. నేను ఆయన సేవకుణ్ణి. నాకిక ఆయనే తండ్రి. ఆయనే దిక్కు. ఆయన పాదాల్ని గట్టిగ పట్టుకుంటాను.

"తల్లీ! నా తండ్రి ధర్మాత్ముడు. సత్యవ్రతుడు. పూజ్యుడు. సత్యవిక్రముడు. నా తండ్రి నాకు ఇచ్చిన చివరి సందేశమును ఉన్నదున్నట్లు వినాలని కోరికగాఉంది. చెప్పు. నా తండ్రి నాకు ఏమి చెప్పివెళ్ళాడో యథాతథంగా చెప్పు" అన్నాడు భరతుడు.

"భరతా! మృత్యుపాశబద్ధుడైన మీ తండ్రి "హా రామా! హా లక్ష్మణా! హా సీతా!" అని పలుకుతూ ప్రాణాలు విడిచాడు.

"సీతాసమేతుడై తిరిగివచ్చిన రాముని, లక్ష్మణుని చూడగలవారు ధన్యాత్ములు అని మీ నాన్నగారు చివరిమాటలు పలికారు" అన్నది కైకేయి.

ఆ మాటలు వినగానే, "అయ్యో! చివరిక్షణాన నా తండ్రి ప్రక్కన రామలక్ష్మణులు కూడా లేరా? అమ్మా! వారెక్కడికి వెళ్ళారు?" అని ప్రశ్నించాడు భరతుడు.

భరతుని మాటల నాలకించిన కైకేయి తాను చెప్పబోయే విషయములు భరతునికి ప్రియమైన వాక్యములని భ్రమించి ఉన్నదున్నట్లు చెప్పింది.

"కుమారా! ప్రియభరతా! శ్రీరాముడు నారచీరలు ధరించి, సీతాలక్ష్మణులతో కలిసి దండకారణ్యానికి వెళ్ళాడు" అన్నది కైకేయి.

భరతుడు నిర్ఘాంతపోయాడు. తన వంశప్రతిష్ఠ దెబ్బతిన్నదేమో అని శంకించి భయపడ్డాడు. వనవాసానికి పంపబడ్డాడంటే రాముడు ధర్మంతప్పి ప్రవర్తించాడేమోనని భీతిచెందాడు. ఆదర్శవంతుడుగా మహోన్నతస్థాయిలో నిలిచిన రాముని అపకీర్తిని



ఊహించలేకపోయాడు. వంశప్రతిష్ఠను, రాముని ఆదర్శచరిత్రను దృష్టిలో ఉంచుకొని కలత చెందాడు. మహావ్యక్తిగా, యుగపురుషుడుగా ఏ రాముని ఊహించుకున్నాడో అట్టి రాముడు చరిత్రహీనుడుగా మారాడనే విషయాన్ని ఎలా భరించగలడు? రాముని అపరాధ మేమిటో తెలుపమని తల్లిని ప్రశ్నించాడు.

"అమ్మా! రాముడు వివేకవంతుల ధనాన్నేమైనా అపహరించాడా? నిరపరాధుల్ని శిక్షించాడా? లేక పరుల భార్యలను వాంఛించాడా? లేకపోతే గర్భస్థశిశువును చంపినవానివి పంపినట్లు రాముని అరణ్యాలకు ఎందుకు పంపవలసి వచ్చింది?" అని ఆనాటి నేరాలను, శిక్షలను దృష్టిలో ఉంచుకొని భరతుడు ప్రశ్నించాడు.

కైకేయి తన సహజధోరణిలో భరతుని సంతోష పెడుతున్నట్లు భావించుకుంటూ ఇలా పల్కింది. "రాముడు ఎవరి ధనాన్ని అపహరించలేదు. ఎవరిని హింసించలేదు. పరుల భార్యలను రాముడు కన్నెత్తి చూడడు."

"పుత్రా! భరతా! రామునికి రాజ్యాభిషేకం చేయాలని మీ నాన్న నిర్ణయించారు. నేను ఆలోచించాను. పూర్వము మీ తండ్రి నాకు వాగ్దానం చేసియున్న రెండు వరాల విషయం ప్రస్తావించి, నీకు రాజ్యాభిషేకం చేయమని, రాముని వనాలకు పంపమని కోరాను.

"నీ తండ్రి సత్యానికి, నియమానికి తలవంచక తప్పలేదు. రాముని అరణ్యానికి పంపాడు. రామునితో సీతాలక్ష్మణులు కూడా వనాలకు వెళ్ళారు. తన ప్రియపుత్రుడైన రాముడు దూరమయ్యాడనే బాధతో దిగులుచెంది పుత్రశోకముతో మహారాజు మరణించారు. ఇపుడు రాజ్యలక్ష్మి నీకొరకు ఎదురుచూస్తూ వుంది.

**త్వత్కృతే హి మయా సర్వమిద మేవం విధం కృతమ్**

"నాయనా! ఇదంతా నేను నీకోసమే చేశాను.

"కుమారా! శోకాన్ని మరచిపో. సంతాపాన్ని విడచిపెట్టు. ధైర్యాన్ని కూడగట్టుకో. ఈ నగరము, ఈ రాజ్యము నీ హస్తగతమైంది. నాయనా! వసిష్ఠాదుల సహాయంతో మీ తండ్రి గారికి చరమసంస్కారము చెయ్యి. దైన్యమును వీడి, ధైర్యోత్సాహములతో రాజ్యాభిషిక్తుడివికా!" అని ఏదో కష్టపడి అత్యుత్తమ ఫలితాన్ని సాధించినట్లు, భరతుని జీవితమును ఉద్ధరించినట్లు, ఇంతవరకు కష్టించి మోసిన బరువును తలమీదనుండి దించుకున్నట్లు మాట్లాడింది కైకేయి.

## భవ్యమైన భరతుడు

ధర్మాత్ముడైన రామునికి లక్ష్మణుడు రెండవ ప్రాణం. భరతుడు రెండవ హృదయం. అంతే.

ప్రాణంలాంటి లక్ష్మణుడు రాముని నీడలా వెంబడించి ఉంటాడు. రాముడికి ఎదురయ్యే బాధల్ని ముందుగా తాను ఎదుర్కొనేందుకు సాహసిస్తాడు. రాముడి ఆనందాన్నే తన ఆనందంగా భావిస్తాడు. ప్రాణరక్షణ కొరకు మానవులు దేనినైనా త్యాగం చేయునట్లు, తన ప్రాణమైన రామునికోసం ఏదైనా చేసేందుకు లక్ష్మణుడు ఎప్పుడైనా సిద్ధమే.

ఈ కారణంగానే లక్ష్మణస్వామి ప్రేమమూర్తిగా తెలుస్తాడు. మన అందరి ప్రేమల్ని చూరగొంటాడు. లక్ష్మణుని రామునినుండి విడదీయలేము. జంటకవులలాగా రామలక్ష్మణులు అంటుంటాము.

రావణుడు సీతను రామునికి దూరం చేయగలిగాడు. కానీ లక్ష్మణుని రామునికి దూరం చేయడం ఒక్క యమునికే సాధ్యపడింది. కనుక లక్ష్మణుడు రామునియొక్క బహిఃప్రాణం. రాముడు చెప్పింది చేయడమేగాని తనకంటూ ప్రత్యేక ధర్మనిర్వచనం లేదు. అది కేవలం ప్రేమ. రామునిపై లక్ష్మణునికున్న ప్రేమ మాటల్లో చెప్పలేనిది. భ్రాతృప్రేమలో భార్య ఉన్నదనే విషయాన్ని కూడా స్మృతికి తెచ్చుకోని ప్రేమమయుడు లక్ష్మణుడు.

భరతుని పాత్ర భవ్యమైంది. దివ్యమైనది. హృదయ సంబంధమైనది. ధర్మనిర్వహణలో పరీక్షకు నిలబడిన పాత్ర. రామాయణంలో రెండు పాత్రలు ధర్మపరీక్షకు నిలబడుతాయి. ఒకటి రాముడుకాగా, రెండవది భరతుడు. అందుచేత రాముని తరువాత విశిష్టమైన ధర్మమూర్తిగా భరతుడు కన్పిస్తాడు.

తనకు హక్కుగా ప్రాప్తించే రాజ్యాన్ని ధర్మంకోసం తమ్మునికి విడచిపెట్టి రాముడు అరణ్యవాసం వెళ్ళాడు. తన మాటను ధిక్కరించి రాముడు రాజ్యాధికారం చేపడితే మంచిదని రాజైన దశరథుడుకూడా భావించాడు. కానీ రాముడు అంగీకరించలేదు. అధర్మమార్గాన కిరీటం ధరించి శోభించడంకన్నా, ధర్మమార్గాన జడలు ధరించి వనవాసం వెళ్ళడమే శ్రేయమని భావించిన ధర్మాత్ముడు రాముడు. ధర్మపరీక్షలో ఉత్తీర్ణుడై రాముడు ధర్మమూర్తిగా కీర్తించబడ్డాడు. ఇపుడు అదే ధర్మసంఘర్షణ భరతునికి సంభవించింది. ధర్మదేవత భరతుని పరీక్షించేందుకు ముందుకువచ్చింది. భరతుడు ఎలాస్పందిస్తాడో చూద్దాం. ధర్మపరీక్షలో భరతుడు ఎలా నెగ్గుతాడో వీక్షిద్దాం.

కర్ణకఠోరమైన కైకేయి మాటలు విన్న భరతుడు తీవ్రంగా కలత చెందాడు. అతని గుండె కన్నీటి కడలిగా మారిపోయింది. ప్రళయాగ్నివలె క్రుద్ధుడయ్యాడు. కైకేయిని కర్కశవాక్కులతో నిందించాడు.

“పాపదర్శినీ! నీవేం చేశావో నీకు తెలుసా! నా తండ్రిని చంపావు. నా అన్నను అరణ్యాలకు పంపావు. దీనికంతటికి నేను కారణము అనే కళంకాన్ని నాకు మిగిల్చావు. ఇక ఏ ముఖం పెట్టుకొని నేను రాజ్యాన్ని పాలించాలి?

“కులనాశినీ! ఇక్ష్వాకువంశాన్ని నాశనం చేసేందుకు నీవు కాళరాత్రివలె దాపురించావు. నా తండ్రిని వధించావు. నీవు అగ్నివని తెలియక మా తండ్రి నిన్ను ఆలింగనం చేసుకున్నాడు. మా వంశంలో సుఖం లేకుండా చేశావు.

“దుష్టురాలా! చెప్పు. మా తండ్రిని ఎందుకు చంపావు? మా అన్నను ఎందుకు అరణ్యానికి పంపించావు? నీవల్ల నా తల్లులైన కౌసల్యాసుమిత్రలు పుత్రశోకంతో కుమిలిపోయేలా చేశావు. వారిక జీవించలేరు.

“రాముడు నిన్ను కన్నతల్లికంటె ఎక్కువగా ప్రేమించాడు. సేవించాడు. అట్టి ధర్మాత్ముడైన రాముని అరణ్యాలకు పంపమని అడిగేందుకు నీకు నోరెలావచ్చింది?



“మా పెద్దతల్లి కౌసల్య నిన్ను సోదరిలా చూసిందేగాని సవతిలా చూడలేదు. పాపాత్మురాలా! అట్టి మహాతల్లి పుత్రునికి నారచీరలు కట్టించి వనాలకు పంపుతావా! ఈ నికృష్టపు కార్యాన్ని చేసినందుకు నీకు బాధకూడా కలగడంలేదా!

“రాముడు పుణ్యదర్శనుడు. శూరుడు. నిగ్రహవంతుడు. యశశ్శాలి. అట్టి రామునిలో నీకు ఏ దోషం కన్పించింది? రాముని ఎందుకు వనవాసము పంపావు? అని ప్రశ్నిస్తే ఏం సమాధానం చెబుతావు?

“లుబ్ధురాలా! రాముడంటే నాకెంత భక్తో నీకు తెలియదు. అందుచేత నాకొరకు నీవు ఈ పాపకార్యం చేశావు. నీ అభిలాష తీరదు. నీ వాంఛ ఫలించదు.

“నీవు దూరమైంది రామునికి కాదు, భరతునికి. నిన్ను చూడడానికి కూడా నా మనసు అంగీకరించడం లేదు.

**న మే వికాంక్షా జాయేత త్యక్తుం త్వాం పాప నిశ్చయామ్**
**యది రామస్య నావేక్షా త్వయి స్యాన్మాతృవత్సదా !**

“రాముడు ఎల్లప్పుడు నిన్ను తన తల్లిలాగే చూసుకొనేవాడు. అందుచేతనే సంశయిస్తున్నాను. అలాకానిచో నిన్ను తప్పక త్యజించి ఉండేవాణ్ణి.

“పాపదర్శినీ! వంశాచారమున లేని ఈబుద్ధి నీకెలా కల్గింది? జ్యేష్ఠుడు రాజ్యాభిషిక్తుడు కాగా సోదరులు సేవలో చరించుట ఈ వంశంలో ఆచారమని నీకు తెలియదా? మా పూర్వీకుల వంశగౌరవాన్నంతా ఈనాడు నీవు మంటగలిపావు.

“ఇక్ష్వాకువంశ ప్రతిష్ఠను దిగజార్చడమేగాక నీ పుట్టింటివారికి కూడా అపవాదు తెచ్చిపెట్టావు. కేకయవంశమున పుట్టిన స్త్రీ భర్తను చంపిందని రేపు అందరూ చెప్పుకుంటారు.

“అందరూ నిందించే ఈ దుష్కార్యాన్ని ఎందుకు చేశావు? ఏది ఏమైనా నీకోరిక నెరవేరదు. నాకు ప్రాణహానిని తలపెట్టావు. నీవు సుఖించడానికి వీల్లేదు.

“నీసుఖానికి విరుద్ధమైనపని చేయాలని నేను నిశ్చయించుకున్నాను. రాముని వనాలకు పంపి, నాకు రాజ్యాభిషేకంచేసి, నీవు రాజమాతవై ఊరేగుతూ, నా తల్లులైన కౌసల్యా సుమిత్రలపై ఆధిపత్యం చెలాయించాలని ఊహించావు.

“ఇపుడు దానికి భిన్నంగా జరుగుతుంది. నేను అరణ్యానికి వెళ్ళి రాముని తీసికొని వస్తాను. రాముడు రాజ్యాభిషిక్తు డవుతాడు. కౌసల్య రాజమాత అవుతుంది. అప్పుడు వారిని చూస్తూ కన్నీళ్ళుత్రాగి జీవిద్దువుగానీ! నేను రాముడికి సేవకుణ్ణై హాయిగా జీవిస్తాను.”

ఇలా భరతుడు తల్లిని నిందిస్తూవుండగా అతని కోపం తీవ్రస్థాయికి చేరింది. నిగ్రహాన్ని కోల్పోయాడు. మనసు పట్టుతప్పింది.

ఇక్కడ మనం కాస్త జాగ్రత్తగా భరతుని అర్థంచేసుకోవాలి. రాముడు వనవాసం వెళ్ళాడని మొదట కైకేయి చెప్పినపుడు రాముని చరిత్ర కలుషితమైనదా? అనే ఆలోచనతో భరతుడు క్రుంగిపోయాడు.

తీరా విన్నాక, తనచరిత్రే కలుషితమైందని, తానే చరిత్రహీను డయ్యాడని భరతుడు వ్యథ చెందుతున్నాడు. ధర్మాత్ముడైన రాముని చరిత్ర పవిత్రంగానే ఉంది. తానే లోకనిందకు గురైనట్లు తలుస్తున్నాడు.

ఇంతవరకు ఇక్ష్వాకువంశంలో సింహాసనంకోసం కలహం ఎప్పుడూ రాలేదు. ఈనాడు తనవల్లే ఇది వచ్చిందని భరతుడు కలతచెందుతున్నాడు. ఇలాంటి స్త్రీ తల్లిగాదు అనుకుంటు న్నాడు. తల్లీకొడుకుల బంధాన్ని మనసునుండి తొలగించుకొనే ప్రయత్నంలో ఉన్నాడు భరతుడు.

కోపం తీవ్రమైంది. మాటలు పట్టుతప్పుతున్నాయి.

**శోకాతు రశ్చాపి ననాద భూయః సింహో యథా పర్వత గహ్వరస్థః**

"దుఃఖంతో కుమిలిపోతూకూడా పర్వతగుహలోని సింహములాగా భరతుడు గర్జిం చాడు" అంటున్నాడు వాల్మీకిమహర్షి.

"కఠినాత్మురాలా! నేనిక బ్రతకలేను. చచ్చిన నన్నుచూస్తూ ఏడుస్తూ పడివుండు. రాజ్యము నీకు దక్కడం కల్ల. భర్తను యమపురికి పంపావు. రాముణ్ణి అడవికి పంపావు. ఇక నీముఖం చూడడానికి ఎవరు సాహసిస్తారు?

"కులాన్ని కళంకంచేశావు. భ్రూణహత్యాపాపము నిన్నావరించి వుంది. నీకు నరకమే గమ్యము. మా తండ్రిగారివలె నీకు ఉత్తమలోకాలు లభించవు. పాపివి అయిన నిన్ను చూడడానికి నాకే భయమేస్తోంది.

"దుష్టచారిణీ! నా జీవితానికి మాయని మచ్చ తెచ్చావు. భర్తను వధించిన నీతో మాట్లాడడం కూడా పాపమే. నీవు నాకు తల్లివికావు. నేను నీకు బిడ్డనుకాను.

**మాతృ రూపే మమా మిత్రే నృశంసే రాజ్య కాముకే**

"నీవు తల్లివికావు. తల్లిరూపంలో వున్న శత్రువువి. క్రూరాత్మురాలివి. రాజ్యకాంక్ష గలదానివి.

"నీచురాలా! బిడ్డడైన రాముని అరణ్యానికి పంపి కౌసల్య గుండెను నిర్దాక్షిణ్యంగా పిండావు. సుమిత్రకు దుర్భరమైన దుఃఖం కల్పించావు. అందరిని బాధించి ఏమి సాధించావే రాక్షసీ!

"నీ కడుపున పుట్టిన నేరానికి నీవు చేసిన పాపం నన్ను పట్టి పీడిస్తూవుంది. తండ్రికి, సోదరులకు, తల్లులకు, చివరికి లోకానికి కూడా నేను అప్రియుణ్ణయ్యాను.

"పాపాత్మురాలా! కౌసల్యకు నీవుచేసిన కీడు ఏపాటిదో నీవు గుర్తించలేకపోతున్నావు. ఏకైకపుత్రుడైన రాముణ్ణి అడవులకు అప్పగించి ఆ తల్లి ఎలా కుమిలిపోతూవుందో పాపిష్టిదానివి, నీకేమర్థమవుతుంది?

"కుమారుని ఆమెకు దూరంచేసి ఆమె దుఃఖిస్తూవుంటే, నీ కుమారుని రాజునిచేసి కులుకుదా మనుకున్నావా? దుష్టురాలా! నీవు దుఃఖంతో కుమిలిపోతావు. చచ్చిన తరువాత కూడా నీ పాపము నిన్ను వెంబడించి నీకు సుఖంలేకుండా చేస్తుంది.



"ఈ విషయంలో నేను చేయవలసిం దంతా చేస్తాను. నీకు ప్రాయశ్చిత్తం చేయకపోను. అలాచేసి నీవల్ల దాపురించిన చెడ్డపేరును పోగొట్టుకుంటాను.

"రాముని అయోధ్యకు రప్పిస్తాను. నేను వనాలకు వెళ్తాను. అప్పుడు ఈనాడు నీవు సంతోషిస్తున్నట్లు కౌసల్య తృప్తి చెందుతుంది. కౌసల్య ఈనాడు దుఃఖిస్తున్నట్లు నీవు కుమిలి పోతావు.

"అయ్యో! దుష్టురాలా! నీవు నా భుజానికి ఎత్తిన పాపాన్ని మోయలేకపోతున్నాను. ఛీ! నీ ముఖం చూడను. నీవు అగ్నిలోనైనా దూకు. వనాలకన్నా వెళ్ళు. లేదా ఉరిపోసుకొని చచ్చిపో!' అని బిగ్గరగా ఏడుస్తూ నేలపై పడ్డాడు ధర్మాత్ముడైన భరతుడు.

భరతుడు తల్లిని ఇలా మాట్లాడవచ్చా? తల్లిని తూలనాడటాన్ని ఏ ధర్మశాస్త్రం సమర్థిస్తుంది? కైకేయి ఇదంతా ఎవరికొరకు చేసింది? భర్త మరణించినా ఎవరిని చూసుకొని సంతోషంగాఉంది? అట్టి తల్లిని నిరాదరంగా, కఠినంగా, నిష్ఠూరాలతో దూషించడం సబబేనా?

ఈవిధమైన ప్రశ్నలు ఈసందర్భమున మొలకెత్తకపోవు. ప్రశ్నలైతే అందరి మనోక్షేత్రా ల్లోనూ అంకురిస్తాయి. కానీ అందరూ ఒకే విధమైన సమాధానాలతో తృప్తి చెందరనేది మాత్రం నిజం. చరిత్రలో తొంగిచూసిన నగ్నసత్యం. ఏది ఏమైనా, ఈ ధర్మసంకటంలో తలదూర్చక తప్పదు. విశ్లేషిద్దాం కానివ్వండి.

భరతుడు అనేక అశుభదృశ్యాలను, అప్రియమైన విషయాలను చూస్తూ వచ్చి నగరిలో ప్రవేశించాడు. తండ్రి మందిరానికి వెళ్ళాడు. అక్కడ తండ్రి కనిపించకపోయే సరికి తల్లి యొక్క అంతఃపురానికి వచ్చాడు. భరతుడు మాతృదేవి మందిరంలో ప్రవేశించు సమయాన వాల్మీకి రచించిన శ్లోకాన్ని చూడండి.

**స ప్రవిశ్యైవ ధర్మాత్మా స్వగృహం శ్రీ వివర్జితమ్**
**భరతః ప్రతిజగ్రాహ జనన్యా శ్చరణౌ శుభౌ ॥**

ధర్మాత్మా=ధర్మాత్ముడైన, **సః భరతః=ఆ భరతుడు, శ్రీవివర్జితమ్=కళావిహీనమైన,** స్వగృహమ్=తన గృహమును, ప్రవిశ్యైవ=ప్రవేశించగనే, **జనన్యాః=తల్లియొక్క, శుభౌ=** పవిత్రములైన, **చరణౌ=చరణములను, ప్రతిజగ్రాహ=స్పృశించెను.**

ధర్మాత్ముడైన భరతుడు కళావిహీనమైఉన్న తనగృహంలో ప్రవేశించగనే తల్లియొక్క పవిత్ర చరణములకు నమస్కరించాడు. ఇదీ శ్లోకభావం.

తల్లిగృహంలోకి అడుగుపెట్టే సమయంలోనే భరతుని ధర్మాత్మునిగా మనకు పరిచయం చేస్తున్నాడు వాల్మీకి.

వెళ్ళగానే తల్లిపాదాలకు భరతుడు నమస్కరించాడు. భరతునికి తల్లియందు భక్తి ఉన్నదీ లేనిది ఈ సంఘటనే ఋజువుచేస్తూవుంది.

మరి ధర్మాత్ముడు, మాతృభక్తి కల్గినవాడు అయిన భరతుడు, "మాతృదేవోభవ" అని స్తుతించే ఆర్షసంస్కృతీవృక్షంలో విరబూసిన జ్ఞానసుమమనే భరతుడు మాతృభక్తి అనే పరిమళాన్ని వెదజల్లలేక పోవడమేమిటి? పైగా మాతృనింద అనే కార్యానికి పూనుకోవడ మేమిటి? ఈ పరిస్థితికి దారితీసిన సూక్ష్మ విషయాల్ని మీ ముందుంచుతాను. న్యాయనిర్ణయం మీకే వదుల్తాను.

భరతుడు అయోధ్యలో ప్రవేశించేనాటికి దశరథునికి అంతిమసంస్కారం జరగలేదు. కళేబరము తైలద్రోణిలోనే ఉంది. ఈ బీభత్సమును తట్టుకోలేక అయోధ్య సద్దుమణిగి ఉంది. ఇదంతా బాధాతప్త హృదయంతో భరతుడు వీక్షిస్తూనే వచ్చాడు.

ధర్మాత్ముడైన భరతుడు తల్లిగృహంలో ప్రవేశించుసరికి ఆ గృహము కళావిహీనంగా **(శ్రీ వివర్జితమ్)** ఉన్నట్లు వాల్మీకియే శ్లోకంలో రచించియున్నాడు.

కానీ భరతుడు ప్రవేశించు వేళకు కైకేయి హాయిగా బంగారు ఆసనంమీద కూర్చుని ఉంది. అంతేగాదు. భరతుని చూడగానే సంతోషాన్ని వ్యక్తంచేస్తూ **(హృష్టా)** ఆసనమునుండి ఎగిరిలేచింది **(ఉత్పపాత)**.

హాయిగా, బంగారు ఆసనముపై కూర్చునియున్న తల్లిని చూచినపుడు రాజభవనంలో అంతా క్షేమంగానే ఉంది అని భరతుడు భావించే అవకాశముందికదూ! (తన హృదయంలో సంశయాలుండినా)

అంతేకాదు. సంతోషంతో కైకేయి ఎదురొచ్చింది. ఎగిరిలేచింది లేడిలాగా. భరతుడు తల్లిపాదాలకు నమస్కరించాడు.

భర్త మరణించియుండగా, మృతకళేబరము తైలద్రోణిలో ఉండగా ఏ స్త్రీ అయినా అలా ప్రవర్తించగలదా? తండ్రి మరణవార్తను, రాముని వనవాసాన్ని కైకేయి భరతునికి వివరించినపుడు, బాధాతప్త హృదయుడైన భరతుడు ప్రవేశసమయాన తాను చూచిన స్వర్ణాసనమును, మందహాసమును, కైకేయి ఎగిరి గంతెయ్యడాన్ని ఎలాభావించాలి? ఈ జ్ఞాపకాలతో మనిషైనవానికి ఏవిధమైన భావావేశము కల్గుతుంది? ఆలోచించండి. ఇప్పుడు ఆమెను ఎలా అర్థంచేసుకోవాలి? ఏమో! నేను అల్పజ్ఞుణ్ణి. నావల్లకాదు. మహాత్ములు ఎలా అర్థం చేసుకున్నారో చెప్తాను. వినండి.

**కైకేయీ హర్‌షిత్ ఏహి భాంతీ । మనహుఀ ముదిత దవ లాయీ కిరాతీ !**

**సుతహి ససోచ దేఖి మను మారేఀ । పూంఛతి నైహర్ కుసల్ హమారేఀ !**

"అడవికి నలువైపుల నిప్పు అంటించి సంతోషించు కిరాతస్త్రీలాగా కైకేయి సంతోషిస్తూ వుండింది. బిడ్డయొక్క ముఖంలో విషాదాన్నిచూసి "తాతగారింట్లో అందరూ కుశలమా?" అని అడిగింది;" అని రామచరితమానసంలో సంత్ తులసీదాస్ మహాత్ముడు వివరిస్తాడు.

రాజభవనంలో అందరూ దుఃఖసాగరంలో మునిగివుండగా, దుఃఖాన్ని సృష్టించిన కైకేయి హాయిగా ఉందంటే ఆమెను కిరాతస్త్రీగా తులసీదాసు వర్ణించడం సముచితమేకదూ!

ఇకపోతే, తండ్రికి పాదాభివందనం చేయాలని తొందరపడుతూ తండ్రి ఎక్కడున్నాడో చెప్పుమని భరతుడు అడిగినపుడు కైకేయి ఏమిచెప్పిందో జ్ఞాపకం చేసుకుందాం.

**యా గతిః సర్వ భూతానాం తా గతిం తే పితా గతః**

సర్వభూతానాం = సర్వప్రాణులకు, యా=ఏది, గతిః=గమ్యమో, తా గతిం=ఆ గమ్యమును, తే పితా=నీ తండ్రి, గతః=పొందినాడు.



"సర్వప్రాణులకు చివర ఏమవుతుందో మీ నాన్న అదే అయినాడు" అని చాలా ఇష్టమైన విషయాన్ని చెప్పినట్లు చెప్పింది.

భర్త మరణాన్ని ఇంత తేలిగ్గాచెప్పిన స్త్రీ మనకు చరిత్రలో మరొకరున్నారా? భరతుడు బాధపడతాడని అలా చెప్పిందా? లేక అంతగా బాధపడాల్సిన విషయం కాదని అభిప్రాయ పడిందా?

ఆమె ముఖంలో ఏమాత్రం విషాదం గోచరించకపోగా, సంతోషంతో భాషించడం భరతునిమాటల్లో చెబితే, పుండుపై కారంచల్లడమే.

తండ్రి మరణవార్తను వినగానే భరతుడు "హతోస్మి" - "చచ్చాను" అన్నాడు. ఏడుస్తూ క్రిందపడ్డాడు. "చచ్చాను" అని భరతుడు ఎందుకు అనివుంటాడు?

దశరథుడు మరణించినందుకా? లేక ఈమె ఇలా ప్రవర్తిస్తున్నందుకా? ఈ మిశ్రమ భావ సంఘర్షణ బుర్రకెక్కనందుకా? - ఏదైతేఏమి? హతోస్మి.

దుఃఖార్తుడై నేలమీద పడియున్న భరతుని లేవదీసి కైకేయి ఏమిచెప్పిందో చూడండి.

**ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే రాజపుత్ర మహా యశః**

**త్వద్విధా న హి శోచన్తి సన్తః సదసి సంమతాః**

మహాయశః=గొప్ప వైభవముగల, రాజపుత్ర!=రాజపుత్రా!, ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ=లెమ్ము. లెమ్ము. కిం శేషే=ఎందుకు పడుకొని ఉన్నావు?, సదసి=సభలో, సంమతాః=సన్మానించబడిన, త్వద్విధాః సన్తః=నీ వంటి సత్పురుషులు, న శోచన్తి హి=దుఃఖించరుకదా?

"మహా యశశ్శాలిఅగు రాజకుమారా! లెమ్ము. లెమ్ము. పడుకున్నా వెందులకు? సభలలో గౌరవాలను పొందుటకు అర్హతగల నీవంటి సత్పురుషులు ఈవిధంగా దుఃఖిస్తారా?" ఇది ఆ మహాతల్లి భరతుని సముదాయించిన విధానము.

"రాజకుమారా!" అని కైకేయి సంబోధించడం భరతునికి ములుకులవలె గ్రుచ్చుకున్నాయి. ఇక్ష్వాకువంశంలో జ్యేష్ఠుడు రాజుకావాలి. జ్యేష్ఠుడు ఉండగనే కనిష్ఠుని "రాజకుమారా!" అని సంబోధించడం భరతునికి తీవ్రసంతాపాన్ని కల్గించింది.

ఒకవైపు తండ్రి మరణించాడనే వార్తను విని భరతుడు నేలమీదపడి దొర్లుతూ దుఃఖిస్తుంటే, "లే... లే ... ఎందుకు పడుకొనియున్నావు? **(కిం శేషే)** అంటుందా? భరతుడు ఎందుకు నేలపై దొర్లుతున్నట్లు? తినింది జీర్ణంకాలేదనా? నిద్రరాలేదనా?

దశరథుని మరణము ఆమె మనసుపై ఎలాంటి ప్రభావమును కలిగియుందో ఆలోచించండి. భర్తకు అంతిమసంస్కారం కూడా జరగకముందే ఇలా మాట్లాడే భార్యలుంటారా?

పైగా, "సభల్లో సన్మానాలుపొందే అర్హతగల నీవంటి సత్పురుషులు ఇలా దుఃఖిస్తారా?" అని ఎంత దారుణంగా పల్కింది?

సత్పురుషులు తండ్రి చనిపోతే దుఃఖించరా? లేక దుఃఖించకూడదా? అంటే, ఆమె దృష్టిలో తండ్రి మరణిస్తే దుఃఖించని వారంతా సత్పురుషులేమో!

ఒకవైపు భర్త మృతదేహం శ్మశానానికి తరలించబడేందుకు సిద్ధంగా ఉన్న సమయంలో ఆమె మనోగగనంలో వల్లకాటికి బదులుగా సన్మాన సభావేదికలు గోచరిస్తున్నాయి. "పితృ దేవోభవ" అని భావించే భరతుని హృదయంమీద ఈ మాటల వేటు ఎలా పడుంటుందో మీరే ఊహించుకోండి.

చివరగా అతి ప్రధానమైన విషయాన్ని ప్రస్తావిస్తాను. ఆలోచించండి. ఈ విషయం ఆమె వ్యక్తిత్వానికి అద్దంపడుతుంది.

తాను కోరిన రెండు వరాలలో ఒకదాని ఫలితంగా రాముడు వనాలకేగాడని భరతునితో చెబుతుంది కైకేయి. రాముని చూడనిదే జీవించలేని దశరథమహారాజు మరణించాడు అనికూడా చెబుతుంది. అలాచెప్పి, "నాయనా! ఇదంతా నీకోసమే చేశాను.నీవు రాజ్యాభిషిక్తుడివికా!" అనిపలికి చివరగా భరతునితో ఇలా పలికింది.

**తత్పుత్ర శీఘ్రం విధినా విధిజ్ఞై**
**ర్వసిష్ఠ ముఖ్యైః సహితో ద్విజేన్ద్రైః**
**సంకాల్య రాజాన మదీన సత్త్వ**
**మాత్మాన ముర్వ్యా మభిషేచయస్వ**

"పుత్రా! అందుచేత, శాస్త్రవిధానము తెలిసిన వసిష్ఠుడు మొదలైన ద్విజోత్తములతో కలిసి, తొందరగా రాజుగారికి యథావిధిగా అంతిమసంస్కారము గావించి, మనసులోని దీనత్వమును తొలగించుకొని, రాజ్యాభిషిక్తుడవు కా!" అన్నది కఠినాత్మురాలు కైకేయి.

ఆమె హృదయాకాశంలో వైభవాల తోరణాలు వ్రేలాడుతున్నాయేగాని, ప్రాప్తించనున్న వైధవ్య తిమిరాలు తెలియడంలేదు. తొందరగా భర్త శవానికి అంత్యక్రియలుచేసి, "రాజ్యాభిషిక్తుడవు కా" అని భరతునికి చెబుతుందా?

తండ్రికి చరమసంస్కారం చేయాల్సిన పుత్రుడు ఒకవైపు విలపిస్తుంటే దైన్యాన్ని విడిచిపెట్టమని చచ్చిన రాజుగారి బ్రతికున్న భార్య బోధిస్తుందా? పుత్రుని రాజ్యాభిషేకాన్ని చూడటానికి కుతూహలపడుతుందా?

రాజ్యాభిషేకము నేడు కాకపోతే మరొకనాడు జరుగుతుంది. శవానికి అంతిమసంస్కారం మరొకరోజు జరుపుకొనే అవకాశం ఉందా? జీవితమంతా ఎవరి నీడలో గడిపిందో అట్టి భర్తయొక్క దేహము అంత్యక్రియల తరువాత మళ్ళీ కనిపిస్తుందా?

తండ్రి మరణానికి దుఃఖింప నవసరంలేదు. అన్నగారి వనవాసానికి విచారించాల్సిన పనిలేదు. రాజ్యాభిషేకమే ప్రధానం. ఈ వాలకం తల్లి దగ్గర ప్రత్యక్షంగా చూసినపుడు భరతుని హృదయం ఎలా మండిపోయి వుంటుందో ఆలోచించండి.

తండ్రిని పొట్టనపెట్టుకొని, అన్నను గుట్టలెక్కించి, అసందర్భపు ప్రలాపాలు పలికే వ్యక్తి తల్లి అయినంతమాత్రాన భావసంక్షోభం కలగకుండా ఉంటుందా? భావసంక్షోభంలో భావోద్రేకం ఉత్పన్నం కాదా? తినడం తప్పులేదు గాని, త్రేపితే తప్పొచ్చిందా? అందుకే భరతుడు కైకేయిపై మండిపడ్డాడు. ఏపాపం తెలియని తనను లోకనిందకు గురిచేసిందెవరు?



జన్మనిచ్చిన తండ్రిని దూరంచేసిందెవరు? తండ్రిలాంటి అన్నను అడవులకు పంపిందెవరు? ఇదంతా ఆలోచించిన భరతుడు మెల్లగా ఎలా ఉండగలడు?

తులసీదాస్ భరతుడు ఏమంటాడో వినండి.

**జౌ పై కురుచి రహీ అతి తోహీ ! జనమత కాహే న మారే మోహీ**
**పేడు కాటితై పాలఉ సీంచా ! మీన జీఅన నితి బారి ఉలీచా ॥**

"దుష్టురాలా! ఈ పాపపు బుద్ధి నీ మనసులో ఇంతకుపూర్వమే ఉండిఉండాలి. అలాంటప్పుడు నేను పుట్టినపుడే నీవు నన్నెందుకు చంపలేదు?

"చెట్టును నరికి కొమ్మలకు నీళ్ళు పోస్తావా? చేపల్ని బ్రతికించాలని సరస్సులో నీళ్ళు తోడేస్తావా?" అని భావగర్భితంగా మాట్లాడుతాడు భరతుడు తులసీరామాయణంలో.

తాను పుట్టడంవల్లనే తన తల్లికి ఈ దుర్బుద్ధి కలిగిందని భరతుడు బాధపడ్డాడు. అదంతా తన దురదృష్టంగా తలపోసుకుంటాడు.

తల్లిని భరతుడు అగౌరవంగా మాట్లాడవచ్చా? పెద్దలను గౌరవించడం సంస్కృతి నేర్పదా? - ఇలాంటి కుటిలప్రశ్నలు వేసే వారంతా కల్పితభావాలను ప్రక్కకునెట్టి ఒక్కక్షణం ఆలోచించండి. నిజానిజాలు కళ్ళముందు నాట్యంచేస్తాయి.

పెద్దలను గౌరవించని కుటిలాత్ములు ఎవరు? కైకేయినా? భరతుడా? ఆలోచించండి.

తల్లిమందిరంలో ప్రవేశించగనే తల్లికి పాదాభివందనం చేసిన భరతుడా పెద్దలను గౌరవించనివాడు? తండ్రికి పాదాభివందనం చేయడం ఆలస్యమైందని తల్లడిల్లిపోయిన తనయుడా తల్లిదండ్రులపై భక్తిలేనివాడు?

రాజ్యలక్ష్మి ఒకవైపు నిరీక్షిస్తున్నా వద్దని నిరాకరించి, అడవుల కేగిన అన్నకొరకు పసిబిడ్డలా రోదించే భరతుడా సంస్కృతి వంటబట్టనివాడు?

పెద్దవాడైన రాజును పాడెపై సంతోషంగా పండబెట్టిన కైకేయికా ఇప్పుడు పెద్దతనం దక్కాల్సింది?

భరతుడు ఆశల అంబారీలో ఊరేగలేదు. ఆశయాల పల్లకీని మోశాడు.

"నేను రాజును కాలేను...... సేవకుడై పడి ఉంటాను" ఎవరంటారు ఈ ముత్యాలమాటలు? ఎవరు పలకగలరు ఈ రత్నాలపలుకులు?

ఇక్కడ భరతుని వ్యక్తిగా చూడలేము. ఇది ఆ ధర్మాత్ముని వ్యక్తిగతసమస్యే కాదు. ఇందులో కుటుంబప్రతిష్ఠ ఇమిడిఉంది. వంశగౌరవం చేరివుంది. రాజ్యక్షేమం తలదాచుకొని వుంది. న్యాయనిర్ణయంలో తన,మన తేడాలులేవు. న్యాయస్థానంలో న్యాయాధిపతిగా ఆసీనుడైనపుడు తీర్పు పాక్షికంగా ఉండేందుకు వీలులేదు. తనవారైనా దోషులు శిక్షార్హులే. సాక్ష్యాలు, వాదాలు వేయి ఉండవచ్చు. న్యాయాధిపతియే అదృశ్య సాక్షియైనపుడు తీర్పు ఎలా ఉంటుంది? భరతుని న్యాయాధిపతిగా నేను కూర్చోబెట్టడంలేదు. ఆ కోణంలో ఆలోచిస్తే సత్యం ఎరుకపడుతుంది అంటాను. అంతేగాని చేయని నేరానికి, తెలియని పాపానికి

అందరిచేత భరతుని 'ఛీ' కొట్టించి లోకం ఎదుట దోషిగా నిలబెట్టిన కైకేయి మహాతల్లి ముందు భరతుని న్యాయాధిపతిగా నేనెలా కూర్చోబెట్టగలను?

భరతుని ఒక ఉదాత్తమైన వ్యక్తిగా భావించిన రైట్ ఆనరబుల్ వి.ఎస్. శ్రీనివాస శాస్త్రిగారు కూడా భరతుడు తల్లిని నిందించడాన్ని హర్షించలేదు. విధేయతగల పుత్రునిలో ఉండవలసిన లక్షణములు భరతునిలో ఆ సందర్భమున గోచరించలేదని నిర్ద్వంద్వంగా ఖండించారు. **Bharata lacked the quality which we associate with a dutiful son.** తమకు జరిగిన చెడువలన ఉత్పన్నమయ్యే ద్వేషము కొందరిలో వారి వ్యక్తిత్వాన్నే కుదిపేస్తుందని భావించారు.

శాస్త్రిగారు మరొక విషయాన్నికూడా ప్రస్తావిస్తారు. భరతునికి వసిష్ఠుని సందేశాన్ని అందించుటకు అయోధ్యనుండి దూతలు కేకయరాజ్యానికి వెళ్ళినపుడు భరతుడు అందరి క్షేమాలను అడుగుతాడు. తల్లుల్నిగూర్చి ఇలా ప్రస్తావిస్తాడు.

“పూజ్యురాలు, ధర్మనిరతురాలు, ధర్మజ్ఞురాలు, ధర్మదర్శిని అయిన మా రాముని తల్లి కౌసల్య క్షేమమేనా?

“ధర్మజ్ఞురాలు, లక్ష్మణునకు, వీరుడైన శత్రుఘ్నునకు తల్లియైన మా పిన్నమ్మ సుమిత్ర ఆరోగ్యంగా వుందా?

“స్వార్థపరురాలు, అతిగా ప్రవర్తించేది, కోపస్వభావముకలది, తెలివిగలదానను అనే గర్వముకలది అయిన నా తల్లి కైకేయి ఆరోగ్యంగా వున్నదా?” అని భరతుడు దూతల్ని ప్రశ్నించాడు.

భరతుడు ఇలా మాట్లాడి వుండవలసింది కాదు అంటారు శాస్త్రిగారు.

**However wicked the mother may be, that is not the spirit in which a son should behave to her. I do not ask him to go and praise her unnecessarily and in a false spirit. He need not do so. If other people abuse her, let him be quiet, not say a word. But for him to launch out a crusade is scandalous.**

“తల్లి ఎంత చెడ్డదైనా, కుమారుడు ప్రవర్తించవలసిన తీరు అదికాదు. అనర్థావేశంతో, అనవసరంగా తల్లివద్దకు వెళ్ళి ఆమెను స్తుతించమని నేను చెప్పడంలేదు. అతడు అలా చేయనవసరం లేదు. ఇతరులు ఆమెను దూషిస్తే మారు మాట్లాడకుండా అతణ్ణి మౌనంగా ఉండమనండి. కానీ తానే సాహసించి విజృంభించడ మనేది అవమానకరమైనది” అని భావిస్తూ, భరతుడు అసందర్భంగా దూతలతో పలికినవి పోకిరి మాటలుగా అభివర్ణించారు.

ఇక్కడ మనమొక ముఖ్యవిషయాన్ని గుర్తించి, తరువాత చర్చలో ప్రవేశించాలి. భరతుడు తల్లిని అలామాట్లాడవచ్చా? అనే విషయంలో మీమాంసలున్నాయేమోగాని, భరతుడు కైకేయి విషయంలో పలికిన మాటలు అసత్యాలని మాత్రం నిరూపించలేము.

ఇకపోతే, భరతుడు అనవసరంగా దూతలవద్ద ఈ విషయాన్ని ప్రస్తావించి, తల్లిని దూషించాడనేది శాస్త్రిగారి అభియోగం. మేనమామ యుధాజిత్తు ఇంటిలో ఎక్కువకాలం ఉండడంవల్ల కూడా, ఎలా మెలగాలో తెలియని యువకుడుగా కన్పిస్తాడని కూడా అంటారు **(Untamed youth).**



భరతుని పాత్రను చక్కగా పరిశీలించినపుడు అర్థరహితంగా, అసందర్భముగా అతడు పలికినట్లు ఎక్కడా వినిపించదు. పైపెచ్చు, లక్ష్మణునివలె కాకుండా ధర్మవిషయంలో రామునితో ఎదురుగా నిలబడి మాట్లాడే ధీశక్తి, అవసరమైతే విభేదిస్తూ మాట్లాడే నేర్పుగలవాడుగా భరతుని శాస్త్రిగారే వర్ణిస్తారు. అలాంటప్పుడు ఈ సన్నివేశంలో భరతుడు అలా ఎందుకు మాట్లాడవలసి వచ్చింది? అనేది మనం అర్థంచేసుకోవాలి.

వేకువజామున చెడ్డకల రావడము, తండ్రి ఆపదలో ఉన్నట్లు స్వప్నాన్ని దర్శించడము, మిత్రులు ఉత్సాహపరుస్తున్నా, స్పందనలేకుండా భరతుడు ఆవేదనా మనస్కుడై ఉండడాన్ని మనం చూసివున్నాము. తన మానసిక ఆందోళననుగూర్చి మిత్రులతోచెప్పడం వినికూడా ఉన్నాము.

ఈబాధకు తోడుగా దూతలు అదేసమయానికి రావడము భరతుని మరీ కలతపరచింది. తన హృదయపులోతులలో రేగియున్న సంక్షోభాన్ని మనస్తత్త్వశాస్త్రరీత్యా మనము నిరాకరించలేము.

ఏదో జరిగిఉంటుందని భరతుని మనసు ఊహిస్తూఉంది. ఏది జరిగినా స్వార్థము, అతిప్రవర్తన, క్రోధము, గర్వముగల కైకేయివలన జరుగవలసిందేగాని అయోధ్యలో మరొకరి వలన జరుగదు. ఈ విషయము మనకే తెలిసినపుడు భరతునికి తెలియకపోతుందా?

కైకేయి తన తల్లి కనుక దూతలు భయపడి చెప్పకుండా దాచే అవకాశముంది. తానే వారి ముందు ఆమె స్వభావాన్ని ఉన్నదున్నట్లు దూషిస్తే, దానివలన నిర్భయులై దూతలు చెప్పే అవకాశముందని భరతుడు అస్పష్టంగా ఆలోచించి వుంటాడు.

భరతుని ఆలోచనలను ఆరోపితాలుగా, అసంబద్ధమైనవిగా కొట్టిపారేయగలమా? పవిత్రాత్మునికి వచ్చిన స్వప్నము కల్పించిన ఆందోళనను నిర్హేతుకమని నిరాకరించగలమా? మరి భరతుడు అయోధ్యలో చూసింది తన స్వప్నంలో ముందుగా గాంచిన విషయాలేకదూ?

కనుక జరుగకూడనివి జీవితంలో జరిగినపుడు వాటివలన పుట్టే ద్వేషం వ్యక్తిత్వాన్ని కుదిపేస్తుందని భావించడం కొందరి విషయంలో సత్యం కావచ్చు. అందరివిషయంలో, ముఖ్యంగా భరతునివంటి ధర్మాత్ముని విషయంలో అవి సత్యం కాకపోవచ్చు.

ధర్మాత్ముడైన మహితాత్ముడు అసందర్భంగా మాట్లాడాడని తోచినపుడు అట్టి ప్రవర్తనకు కారణమైన అసాధారణ పరిస్థితులు ఏమిటా అనే కోణంలోకూడా ఆలోచిస్తే మంచిదని నా మనసు చెప్పినమాట. ఈ మాటతోనే నేను తృప్తి చెందుతున్నా. దోషరహితుడైన భరతుని ప్రవర్తనలో తప్పిదాన్ని చూడలేని వానిగా ప్రక్కకు తప్పుకుంటున్నా.

ఈ సందర్భములో భరతుని సమర్థించిన ఆధునిక వ్యాఖ్యాతలలో శాస్త్రిగారివంటి మేధావి రాజాజీని ప్రవేశపెడుతున్నాను. రాజాజీ భరతుని ఎలా చక్కగా సమర్థిస్తాడో చూడండి.

**To understand Bharata's feelings, we should keep in mind his innate noble nature, his love for Rama, his grief for his father and the sense of guilt and shame that for his sake his mother has done this grievous wrong. We should not weigh his words in dry air and a chemical balance. In such contexts, poetry flashes fire. One sees it both in Valmeeki and Kamban.**

"భరతుని భావాల్ని గ్రహించాలని ప్రయత్నించినపుడు భరతుని ఉదాత్తమైన ఆంతరంగిక స్వభావాన్ని, రామునియందు అతనికున్న ప్రేమను, తండ్రి మరణంవలన అతనికి ప్రాప్తించిన దుఃఖాన్ని, తనకారకే తన తల్లి ఈదుర్భరమైన తప్పిదాన్ని చేసిందని భావించడం వలన ఎదురయ్యే అపనిందను, దోషాన్ని మనం దృష్టిలో ఉంచుకొని ఆలోచించాలి. భరతుని మాటల్ని సున్నితపు త్రాసులో ఉంచి వాగాడంబరముతో తూచకూడదు. ఇలాంటి సందర్భాలలోనే కవితావైభవం జాజ్వల్యమానంగా ప్రకాశిస్తుంది. దీనిని వాల్మీకిలోను, కంబరులోకూడా మనం స్పష్టంగా చూడవచ్చు" అంటారు రాజాజీ.

చివరగా ఒక్కమాట. భవ్యుడైన భరతుని విశ్లేషణమును విరమించేముందు దివ్యమైన రామాయణ వ్యాఖ్యాతలలో ఒకరైన శ్రీనివాస శాస్త్రిగారితో ఈవిషయంలో నేను విభేదించడాన్ని మీరు అన్యంగా భావించరని ఆశిస్తాను. ఏ ఋజుత్వముతో మాననీయులైన శాస్త్రిగారు భరతునితో విభేదించారో అదే ఋజుత్వముతో నేను శాస్త్రిగారితో ఈవిషయంలో ఏకీభవించలేక పోతున్నానని సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

## భరతుని హృదయం

భరతుని ఆగమనవార్త అంతఃపురమంతా వ్యాపించింది. దుర్భర దుఃఖంతో కుమిలిపోతున్న కౌసల్యకు కూడా తెలిసింది. కౌసల్య సుమిత్రను సమీపించి, "చెల్లీ! క్రూరాత్మురాలైన కైకేయియొక్క పుత్రుడు భరతుడు వచ్చాడు. అతడు దూరచూపుగలవాడు. అతణ్ణి చూడాలి అనిపిస్తూ వుంది" అని పలికి బయలుదేరబోతూవుంది. ఈలోగా భరతుడు శత్రుఘ్నునితో కలిసి కౌసల్య మందిరానికి వచ్చాడు.

భరతుని చూడగానే కౌసల్య స్పృహతప్పి నేలపైబడింది. ఉత్తమురాలైన కౌసల్య దీనావస్థను చూచి కలతచెందిన భరతశత్రుఘ్నులు చలనంలేని వృక్షాలవలె నిలబడిపోయారు. కదలలేని కాళ్ళను మెల్లగా కదిలించి, కౌసల్యను సమీపించి, బిగ్గరగా రోదిస్తూ ఆమెను కౌగలించుకున్నారు. తీవ్రంగా వ్యథచెందుతున్న కౌసల్య భరతునితో ఇలా పలికింది.

**ఇదంతే రాజ్య కామస్య రాజ్యం ప్రాప్త మకణ్టకమ్**
**సంప్రాప్తం బత కైకేయ్యాః శీఘ్రం క్రూరేణ కర్మణా ॥**

"నాయనా! రాజ్యాభిలాషుడవైన నీకు అడ్డంకులులేని రాజ్యం లభించింది. క్రూరమైన కర్మచేసి నీతల్లి తొందరగా నీకు రాజ్యాన్ని సంపాదించింది.

"దుర్బుద్ధియైన కైకేయి నాకుమారుని నారచీరలు కట్టించి వనాలకు వెళ్ళగొట్టింది. ఏమిసాధించాలని ఇలాచేసింది? నాబంగారుకొండ, నారాము డెక్కడున్నాడో అక్కడికి నన్ను పంపించండి. లేదా, అగ్నిహోత్రమును తీసుకొని సుమిత్రతోకలిసి నేనే వెళ్తాను.

"లేదా, నారాముడు ఎక్కడ తపస్సు చేయుచున్నాడో అక్కడికి నీవన్నా నన్ను తీసికొనివెళ్ళి దిగబెట్టు. నీతల్లి నీకు సాధించిపెట్టిన ఈరాజ్యం సామాన్యమైనది కాదు. ధనం విశేషంగా ఉంది. ధాన్యం సమృద్ధిగా ఉంది. ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు అసంఖ్యాకంగా



ఉన్నాయి. ఇది చాలా విశాలమైన రాజ్యము. నీవు హాయిగా అనుభవించు" అని తీవ్రమైన మాటలతో పుండును సూదితో గ్రుచ్చినట్లు మాట్లాడింది కౌసల్య.

ఆమాటలు వినగానే ఏపాపము తెలియని భరతునికి తల తిరిగిపోయింది. గోలపెడ్తూ దుఃఖించాడు. ఆమె పాదాలపైబడి మూర్ఛిల్లాడు. కొంతసేపటికి తేరుకొని కౌసల్యకు నమస్కరిస్తూ ఇలా పలికాడు.

"అమ్మా! ఏదోషము తెలియని నన్ను ఎందుకిలా దూషిస్తున్నావు? ఏపాపము ఎరుగని నన్ను ఎందుకిలా నిందిస్తూ బాధిస్తున్నావు? నాకు రాముడంటే ఎంతప్రేమో నీకు తెలియదా?

"రాజ్యము కావాలని నేనెన్నడూ కోరలేదు. నాతల్లి వరాలు కోరినట్లుగాని, రాజుగారు నాకు రాజ్యము నిచ్చినట్లుగాని నాకు తెలియదు. నేను, శత్రుఘ్నుడు దూరప్రాంతంలో ఉన్నాముకదా?

"మహాత్ముడైన రాముడు సీతాలక్ష్మణులతో కలిసి వనాలకు వెళ్ళినట్లు నాకు తెలియనే తెలియదు. అమ్మా! నేను అన్నకు తెలిసి అన్యాయం చేస్తానా? చేయనిస్తానా?

"అమ్మా! సత్యసంధుడు, శ్రేష్ఠుడు అయిన అన్నగారు అరణ్యానికి వెళ్ళుటలో నాప్రమేయం ఉన్నట్లయితే నాబుద్ధి పాడైపోతుంది. నాకు వినాశము ప్రాప్తిస్తుంది.

"తల్లీ! అన్నగారు వనాలకు వెళ్ళాలని నేను సంకల్పించి ఉన్నచో నామనసు ధర్మమునందు రమించకుండుగాక! నా బ్రతుకు అధర్మములో కూరుకపోవుగాక! దారిద్ర్యముతో కుమిలిపోవుగాక! రోగాలతో నలిగిపోవుగాక! సదా దుఃఖాగ్నిలో మాడిపోవుగాక!

**కపాలపాణిః పృథివీ మటతాం చీరసంవృతః**
**భిక్షమాణో యథోన్మత్తో యస్యార్యోఽ సుమతే గతః**

"అన్నగారు వనాలకు వెళ్ళాలని కోరిననాడు కపాలము చేతపట్టుకొని, చినిగిన వస్త్రాలను కట్టుకొని, బిచ్చమెత్తుకుంటూ పిచ్చివానిలాగా ప్రపంచంలో చరింతునుగాక!" అని పలుకుతూ, రాముని వనవాసం విషయం ముందుగా తనకు తెలిసి ఉన్నట్లయితే లోకములోని పాపాలన్నీ తనను ఆశ్రయించునట్లు శపథంచేశాడు ధర్మాత్ముడైన భరతుడు.

ఏపాపము ఎరుగని ధర్మాత్ముడు తాను నిర్దోషినని నిరూపించుకోడానికి అన్ని శపథాలు భయంకరంగా చేయవలసి వచ్చింది.

దశరథుని నిర్ణయం మేరకు భరతునికే రాజ్యాభిషేకం చేయాలని వసిష్ఠుడు నిర్ణయించి, దూతలను కేకయరాజ్యానికి పంపి భరతుని పిలిపించడం జరిగింది. రాజ్యాభిలాషతో భరతుడు తొందరగా వచ్చాడని భావించింది కౌసల్య.

భరతుని వెంటబెట్టుకొని శీఘ్రంగా రమ్మని వసిష్ఠుడు దూతలతో చెప్పాడు. దూతలు అలా చెప్పడంచేత, దానికితోడు తనుగాంచిన స్వప్నముయొక్క చెడుఫలితాలను ఊహించుకొని భీతిచెంది ఉండటంవల్ల, భరతుడు హుటాహుటిన బయలుదేరి వచ్చాడు. మధ్యలో పరివారాన్ని మెల్లగా వెంటరమ్మని చెప్పి, సారథితోకలిసి తానొక్కడే శీఘ్రంగా అయోధ్య చేరాడు.

దూరప్రాంతమైన కేకయదేశమునుండి అంత త్వరగా భరతుడు రావడం రాజ్యాభిలాషతోనే అని కౌసల్య అభిప్రాయపడింది. పైగా, మొదట కైకేయిని దర్శించి, తరువాత తనదగ్గరికి రావడంవల్ల భరతుడు కైకేయి ఆలోచనలకన్నా వేరుగాలేడనే భావం కౌసల్యకు కలిగి వుంటుంది.

అయోధ్యలో జరిగిన విషయాలు భరతునకు చెప్పవద్దని వసిష్ఠుడు ఆదేశించిన విషయం కౌసల్యకు తెలియదు. భరతుడు కైకేయిని నిందించి, రాజ్యాభిషేకాన్ని తిరస్కరించాడని కూడా తెలియదు. ఏమీ తెలియకనే,

"రాజ్యకాంక్షగల నీకు అడ్డులేని రాజ్యాన్ని మీ అమ్మ తేలికగా సంపాదించింది" అని అనేసింది. ఎంతఘోరమైన మాట! ఎంత అపచారం? ఎంత పొరపాటు!

ఈమాటవల్ల భరతుని హృదయానికి అయిన గాయం సామాన్యమైందికాదు. దారుణమైన ఈమాటలు భరతుని కత్తిపోట్లకన్నా ఎక్కువగా బాధించాయి. ఈబాధ రాజ్యత్యాగంకన్నా తీవ్రమైంది. వనవాసంకన్నా భయంకరమైంది.

రామునికి అన్యాయం జరిగినా అది సహింపగలిగే విధంగా ఉండింది. రాముడు విధికి తలవంచి ప్రశాంతంగా అడవికి వెళ్ళాడు. కానీ భరతునికి జరిగిన అన్యాయం దుర్భరమైంది. అందుకే తాను నేలపై పొర్లుతూ, దొర్లుతూ దుఃఖిస్తున్నాడు. భయంకరమైన శపథాలు చేశాడు.

కౌసల్య అంతటితో ఆగలేదు. సుమిత్రతో కూడా తనను తీసికెళ్ళి అరణ్యంలో రాముని వద్ద దిగబెట్టమని భరతుని కోరింది. "నీతల్లి నాబిడ్డను ఎలాగూ వనాలకు పంపింది. నీవు తల్లినైన నన్ను అరణ్యాలలో నా బిడ్డదగ్గర దిగబెట్టు.

"నీ తల్లిని తృప్తిపరచిన ఆనందం నీకు లభిస్తుంది. నా బిడ్డను చూశాననే తృప్తి నాకు మిగుల్తుంది. అమ్మాకొడుకులైన మీరిద్దరు తల్లీబిడ్డలైన మా ఇద్దరిని అడవులకు పంపిన ఘనతను సాధించిన వారవుతారు. ఫలితంగా మేము అక్కడ సుఖంగా ఉంటాము. మీరు ఇక్కడ హాయిగా జీవించండి" అనే భావాలతో కౌసల్య మాట్లాడిందనే ధ్వని అస్పష్టమేమీ కాదు.

భరతుని మనసు ఎలా క్షోభించివుంటుందో?

"ఒకవేళ నీవు విడచిపెట్టకపోతే, అగ్నిహోత్రాన్ని పట్టుకొని నేను, సుమిత్ర వనానికి వెళ్తాము" అనికూడా అంది కౌసల్య.

దశరథుని అంతిమసంస్కారంలో పాల్గొనే అవకాశం భరతునికి లేదని చెప్తూవుంది. అగ్నిహోత్రం తీసికెళ్ళి చరమసంస్కారాలన్నీ అరణ్యంలోనే నిర్వహించుకుంటాము అంటున్నది కౌసల్య. ఈమాటతో భరతుని గుండె బ్రద్దలైంది.

కౌసల్య ఇపుడు ప్రస్తావించిన విషయాన్ని దుఃఖితుడైన దశరథుడు కూడా ప్రస్తావించాడు. భరతుడు రాజ్యాన్ని అంగీకరిస్తే, తన అంత్యక్రియలలో పాల్గొనే అర్హతను కోల్పోతాడు అన్నాడు దశరథుడు. కానీ భరతుడు రాజ్యాధికారాన్ని అంగీకరించినట్లే భ్రమించి, భరతుడు అర్హతను కోల్పోయాడు కనుక అగ్నిహోత్రాన్ని తీసికొని అరణ్యాలకు వెళ్తాను అంటుంది అమాయకంగా కౌసల్యాదేవి.



ఈమాటల నాలకించిన భరతుని దుఃఖానికి అంతమంటూ లేకుండా పోయింది. భరతుడు కన్నీటి కడలిలా మారిపోయాడు. భయంకరమైన శపథాలు చేసి దుఃఖించాడు.

కౌసల్య తన తప్పిదమును గుర్తించింది. తన పొరపాటును గ్రహించింది. మాయా మర్మం తెలియని భరతుని హృదయాన్నిచూచి ద్రవించిపోయింది. పశ్చాత్తాపంతో కదలిపోయింది.

**Late repentance is seldom true, but repentance is never too late.**

"పశ్చాత్తాపానికి ఆలస్యం తెలియదు. ఆలస్యంగా జరిగే పశ్చాత్తాపం నిజమైంది కాదు."

కౌసల్య భరతునిలో రాజ్యకాంక్ష ఉన్నదేమోనని సందేహించింది. నిర్మలమైన నదిలాంటి భరతుని పవిత్రహృదయాన్ని చూడగానే తనతప్పును గ్రహించింది. వెంటనే పశ్చాత్తాపంతో స్పందించింది. కౌసల్య నిష్కపటి. సరళస్వభావురాలు. భరతుని దుఃఖాన్నిచూచి భరించలేక పోయింది.

భరతుని దగ్గరగా తీసికొని కౌగలించుకుంది. తనఒడిలో భరతుని కూర్చోబెట్టుకుంది. ప్రేమతో కన్నీటిని తుడిచింది. పసిబిడ్డను లాలించినట్లు సముదాయిస్తూ,

"నాయనా! భరతా! నీశపథాలు నాప్రాణాల్ని తోడేస్తున్నాయి. నీ అమాయక హృదయంలో ఉప్పొంగే దుఃఖాన్నిచూసి నేను జీవించేలా లేను.

"కుమారా! మన పుణ్యం ఇంకా క్షీణించలేదు. నీవు లక్ష్మణునిలాగా, ధర్మాన్ని విడిచి పెట్టకుండా ఉన్నావు. తండ్రీ! నీకు సర్వసుఖాలు ప్రాప్తించుగాక!" అని దీవించి ఊరటచెందింది రామమాత.

భరతుడు రాత్రంతా నేలపైబడి దుఃఖిస్తూనే ఉన్నాడు. కౌసల్య భరతుని ఓదార్చుతూ "నాయనా! అమ్మ నీచంగా దూషించిందని బాధపడుతున్నావా! నాతండ్రీ! కోమలమైన నీమనసును ఎంత కష్టానికి గురిచేశానో?" అని కౌసల్య విలపించగనే భరతుడు తీవ్రంగా రోదిస్తూ తల్లిపాదాలపై పడ్డాడు. ఆమె పాదాలను హృదయానికి హత్తుకొని పసిబిడ్డలా విలపించాడు.

కౌసల్య భరతుని లేవదీసి, శిరస్సును మూర్కొని, గాఢంగా కౌగిలించుకుంది. ఒక పుత్రుడు వనాలకు వెళ్ళినా మరొకబిడ్డ దగ్గరే ఉన్నాడని భావించింది. ఆప్రేమ పరిష్వంగంలో కౌసల్య స్తనాలు పాలను స్రవించాయని కంబరు తమిళరామాయణంలో వ్రాశాడు.

భరతుని నిష్కాపట్యాన్ని, నిర్మల హృదయాన్ని దర్శించిన కౌసల్య ప్రసన్న ప్రభావాలతో మృదుమధురంగా రామచరితమానసంలో మాట్లాడుతుంది.

**సరల సభాయ మాయ హియ లాయే! అతి హిత మనహు రామ ఫిరి ఆయే!**

సరళ స్వభావురాలు, కరుణామయి అయిన కౌసల్య భరతుని ప్రేమతో ఆలింగనం చేసికొని రాముడే వచ్చినట్లు తృప్తిచెందింది.

ధర్మాత్మురాలైన రామమాత ఇలా అంటుంది.

**రామ్ ప్రాన్ హు తేఁప్రాన్ తుమ్హారే! తుమ్హ రఘుపతి హి ప్రానుహుతేప్యారే**
**బిధు బిష చవ ఇ స్రవ ఇ హిము ఆగీ! హో ఇ బారిచర బారి బిరాగీ**
**భయేఁ జ్ఞాను బరు మిట ఇ నమోహుఁ! తుమ్హ్ రామహి ప్రతికూలన హో హూ!**
**మత తుమ్హార యేహు జోజగ కహహీఁ! సో సపనేహుఁ సుఖ్ సుగతిన లహహీఁ....**

"నాయనా! భరతా! రాముడు నీకు ప్రాణంకన్నా ప్రియమైనవాడు. అలాగే అతని ప్రాణములకంటే రామునికి నీవు ప్రియుడవు.

"వత్సా! చంద్రుడు విషాన్ని వర్షించవచ్చు. మంచు అగ్నిని పుట్టించవచ్చు. జలచరములు నీటిని వదలి జీవించవచ్చు.

"జ్ఞానికి మోహము జనించవచ్చు. కానీ నీవు మాత్రము రామునితో విభేదించవు. రాముడు వనాలకు వెళ్ళుటలో నీ ప్రమేయ ముందని ఎవడైనా భావించినట్లయితే అట్టివానికి సుఖము, శాంతి స్వప్నంలోకూడా లభించవు;" అని పలికి కౌసల్యామాత భరతుని ఆలింగనం చేసుకోగానే ఆమె స్తనములకు పాలు చేపువచ్చింది. నేత్రాలు జలమయ మయ్యాయి" అని తులసీదాస్ రచించాడు.



"తనను సహోదరికంటె మిన్నగా చూసుచున్న కౌసల్యాతనయుని నిర్దాక్షిణ్యంగా అరణ్యాలకు పంపింది నాతల్లి కైకేయి. తన కుమారుని నిర్హేతుకంగా వనాలకు పంపిన కైకేయి కుమారుడనగు నాపై అనురాగ జల్లులు కురిపిస్తూఉంది కౌసల్యామాత. నన్నుగన్న తల్లికి, రామునిగన్న తల్లికి ఎంత తేడా ఉంది" అని భావించాడు భరతుడు.

వర్షజలంగా, నదీజలంగా పిలువబడే నీరే సముద్రాన్ని చేరినపుడు సాగరజలమని పిలవబడుతోంది. సంకుచితమైన గట్లు తెగిపోతే తీరము తెలియని విధంగా ప్రేమ విశాలమవుతుంది. యావత్ప్రపంచాన్ని తన కుక్షిలో నింపుకుంటుంది.

## అయోధ్యాధిపతికి అగ్నిసంస్కారము

ధర్మాత్ముడైన భరతుడు రాత్రంతా ఏడుస్తూనే గడిపాడు. కౌసల్య ఎంతగా ఓదార్చినా అతని నేత్రమేఘాలు వర్షించడం ఆపలేదు. మధ్యమధ్యన సొమ్మసిల్లి పడిపోయేవాడు. మళ్ళీ రోదించడం ప్రారంభించేవాడు. రాత్రంతా ఇలాగే గడచిపోయింది.



తెల్లవారింది. శ్రేష్ఠుడైన వసిష్ఠుడు వచ్చాడు. దుఃఖిస్తున్న భరతుని ఓదార్చాడు. దేహముయొక్క అనిత్యత్వాన్ని వివరించాడు. అనివార్యమైన మరణానికి దుఃఖించి ప్రయోజనం లేదని బోధించాడు.

**చలపత్రాంత లగ్నాంబు బిందువత్ క్షణభంగురమ్**
**ఆయు స్త్యజ త్యవేళాయాం క స్తత్ర ప్రత్యయస్తవ**

"చలించే ఆకుయొక్క చివరనున్న జలబిందువులాగా జీవితము క్షణభంగురము. ప్రాణము శరీరాన్ని వదలిపోవుటకు కాలనియమములేదు. అట్టి అశాశ్వత దేహాదులపై మోహము ఎందుకు?" అని వసిష్ఠుడు అధ్యాత్మరామాయణంలో భరతునికి బోధిస్తాడు.

"నాయనా! భరతా! శోకించకు. రాజుగారికి చరమ సంస్కారములు చేయాలి. ధైర్యం వహించు. కార్యాన్ని నిర్వహించు" అన్నాడు వసిష్ఠుడు. భరతుడు వసిష్ఠుని అనుసరించాడు.

దశరథుని కళేబరాన్ని తైలద్రోణినుండి వెలికితీసి నేలపై ఉంచారు. వేదోక్త విధానము ననుసరించి స్నానం చేయించారు. తైలద్రోణికలో ఉంచడంచేత దశరథుని ఎఱ్ఱని దేహము పచ్చగా మారింది. చక్కని శయ్యపై పడుకోబెట్టారు.

తండ్రిదేహాన్ని చూచిన భరతుడు కన్నీటి వాగయ్యాడు.

"మహారాజా! శోకార్తుడనైన నన్ను విడచి ఎక్కడికెళ్ళావు? నీప్రేమకు దూరమై జీవించమని నన్ను శపించి వెళ్ళావు ఎందుకని? నేను ఏనేరం చేశాను? ఎందుకు నాకీశిక్ష?

"తండ్రీ! నీవు స్వర్గధామం అలంకరించావు. రాముడు వనాల్లో వసిస్తున్నాడు. ఏపాపం చేశానని నన్ను ఈనరకంలో పడదోశారు?

"రాజా! చూడు! నిన్ను పోగొట్టుకున్న అయోధ్య ఎంత కళావిహీనంగా వుందో? చంద్రుడులేని రాత్రిలాగా ఎలా వికృతంగా ఉందో? ఇక ఈ అయోధ్య యోగక్షేమాలు చూచేవారెవరు?

"మహాత్మా! నేను రాకముందే ధర్మాత్ముడైన రాముని, వీరుడైన లక్ష్మణుని అడవుల కెందుకు పంపించావు? ఎవరికీ సుఖంగాని ఆ కఠోరనిర్ణయాన్ని ఎందుకు తీసుకున్నావు తండ్రీ!" అంటూ విలపిస్తున్న భరతుని ఓదార్చి, ప్రేతకార్యములు చేయించాడు వసిష్ఠుడు.

రాజును పల్లకీపై ఎక్కించారు. మోసుకొని పోతున్నారు. అరవైవేల సంవత్సరాలు అనేక సంపదలతో శోభించిన దేహము క్షణక్షణానికి శ్మశానానికి చేరువవుతూ ఉంది. అయోధ్యకు దూరమవుతూ ఉంది. ఎన్నో భోగా లనుభవించిన దేహము బూడిదగా మారేందుకు ఎంతో సమయంలేదు.

పల్లకీ దించారు. ఋత్విక్కులు, రాణులు రాజుచుట్టూ అప్రదక్షిణంగా తిరిగారు. సామవేదులు సామగానం చేశారు. దశరథునికి దహనసంస్కారం జరిగింది. అక్కడ గుమిగూడిన వేలకొలది స్త్రీలు చేసిన రోదనలు క్రౌంచపక్షుల ధ్వనుల్లా వినిపించాయి.

దశరథుని దేహం చూస్తుండగనే భస్మమైపోయింది.

అందరూ విలపిస్తూ సరయూనదిని సమీపించారు. జలతర్పణా లిచ్చారు. జీవితంలో ఎంత తేలిగ్గా ఎగిరినా, ఎంత తెలివిగా ఊరేగినా ఒకనాడు బ్రతుకు భారమయ్యేదే

నను కుంటూ, కదలలేని కాళ్ళను మెల్లగా ఈడ్చుకుంటూ నగరాన్ని చేరారు. పదిరోజులు దుఃఖిస్తూనే గడిపారు.

పదమూడో దినం భరతునిచేత తండ్రికి అస్థిసంచయనం చేయించారు. దుఃఖిస్తున్న భరతశత్రుఘ్నులను వసిష్ఠసుమంత్రులు ఓదార్చారు.

**త్రీణి ద్వన్ద్వాని భూతేషు ప్రవృత్తా న్యవిశేషతః**

"ఆకలిదప్పులు, సుఖదుఃఖాలు, జననమరణాలు అను ఈమూడు జంటలు ప్రాణులందరికీ సమానమే" నని వసిష్ఠుడు భరతుని సముదాయించాడు.

ఈ ద్వంద్వత్రయమునుండి విడిపడినవాడే నిత్యానందమును అనుభవిస్తాడు. అహంకారం నుండి విడిపడితే ఈమూడు జంటలనుండి ముచ్చటగా విడిపడి సుఖించవచ్చు.

అహం చస్తే దేహం లేదు. దేహం లేనివానికి ఆకలిదప్పులెలా ఉంటాయి? సుఖదుఃఖాలు ఎలాకల్గుతాయి? దేహం లేనివానికి జన్మ ఎక్కడ? జన్మలేనివానికి మరణ మేమిటి?

దేహాభిమానం నశిస్తే దేహమున్నా లేనట్లే. అట్టి వ్యక్తిద్వారా ఆచరింపబడే కర్మలు బంధహేతువులు కావు. సదా విముక్తములే. విశిష్టములే. ఇట్టి విశిష్టజీవనము అందించే విమలానందము నిత్యమైనది. సత్యమైనది. నిరంజనమైనది.

వార్ధక్యము తెలియనిది. మరణ భయములేనిది. ఇదే సర్వులకూ వాంఛనీయమైనది. సర్వులూ పొందదగినది.

**"Teach me your mood, O patient stars;**
**Who climb each night the ancient sky,**
**Leaving no space, no shade, no scars**
**No trace of age, no fear to die."**

"జాడలు మిగల్చక, నీడలు పరచక, మచ్చలు చూపక, ముసలితనపు ముడత లెరుగక, మరణ భీతితో కృంగక, అనుదినము అవినాశియగు అంబరమునెక్కి విహరించే తారలారా! మీతత్త్వాన్ని మాకు తెలుపరా!" అని నక్షత్రాల్ని అడుగుతాడు ఎమర్సన్.

## మంథర బ్రతికిపోయింది

ఉత్తరక్రియలన్నీ పూర్తయ్యాయి. రాముని వద్దకు వెళ్ళాలని భరతుడు ఆలోచిస్తున్నాడు. ఈలోగా శత్రుఘ్నుడు వచ్చి శోకసంతప్తుడైన భరతుని చూచి ఇలా పలికాడు.

"రాముడు వీర్యవంతుడు. మనకు రక్షకుడు. సర్వప్రాణుల దుఃఖాన్ని పోగొట్టగల రాముని ఒక స్త్రీ అడవులకు తరిమేసింది.

"బలవంతుడు, పరాక్రమశాలి అయిన మాసోదరుడు లక్ష్మణుడు ఉండికూడా ప్రయోజనం లేకుండాపోయింది. లక్ష్మణుడు తండ్రిని అడ్డుకొని రాముని ఎందుకు విడిపించలేకపోయాడో అర్థం కావడంలేదు.



"మంచిచెడులను ఆలోచించి ఆడదాని చేతిలో కీలుబొమ్మై అడ్డమార్గాలలో చరించే రాజును ఆదిలోనే అడ్డుకోనుంటే ఎంతో బాగుండేది;" అని శత్రుఘ్నుడు భరతునితో చెప్తూవుండగా మంథర అంతఃపురములో ప్రవేశించింది.

మంథర చక్కగా ముస్తాబై వచ్చింది. విలువైన రాజవస్త్రాలను ధరించింది. గుబాళించు చందనమును రాసుకొని, దివ్యమైన ఆభరణములను ధరించింది. వడుముకు అందమైన వడ్డాణమును, అనేకములైన అలంకారములను ధరించి త్రాళ్ళతో కట్టిన ఆడకోతివలె కన్పించింది అన్నాడు వాల్మీకి **(రజ్జు బద్ధేన వానరీ).**

రాజభవనంలో జరుగుతున్న దుఃఖమయ సన్నివేశాలను వీక్షించి కలతచెందియున్న ఒక ద్వారపాలకుడు మంథరను చూశాడు. జాలిలేనిది, పాపాత్మురాలు అయిన మంథరను పట్టుకొని శత్రుఘ్నుని దగ్గరకు తీసికొని వచ్చాడు ద్వారపాలకుడు.

"ఇదిగో! మీతండ్రి మరణించడానికి, మీఅన్న వనవాసము చేయడానికి కారణమైన నీచురాలు, పాపిష్ఠిది ఇదే. ఇదిగో. దీన్ని ఏం చేస్తావో చెయ్యి!" అని శత్రుఘ్నునితో పలికాడు ద్వారపాలకుడు.

శత్రుఘ్నుడు తీవ్రంగా క్రుద్ధుడై మంథర వంకచూసి, "మా కుటుంబములో చిచ్చు పెట్టిన ఈ క్రూరాత్మురాలు ఫలితాన్ని అనుభవించబోతూవుంది;" అని పలికి మంథరను బలవంతంగా పట్టుకున్నాడు.

అక్కడ కూడియున్న చెలికత్తెలను చూచి మంథర బిగ్గరగా రోదించింది. భయంతో ఆమె చేసిన రోదనకు భవనము ప్రతిధ్వనించింది. ఆ భయంకర దృశ్యాన్ని చూచి చెలికత్తె లందరూ పారిపోయారు. కైకేయి సఖురాండ్రయిన తమ ప్రాణానికి కూడా ముప్పు వస్తుందేమో నని పరస్పరం మాట్లాడుకున్నారు.

శతృసంహారకుడైన శత్రుఘ్నుని నేత్రాలు రోషంతో ఎరుపెక్కాయి. ఎటుపోవాలో తెలియక రోదిస్తున్న మంథరను నేలతోసి, దాని జుట్టుపట్టుకొని ఈడ్చాడు. అలా ఈడ్చుకుపోవడంలో దాని శరీరంపై ఉన్న నగలు రాలి చెల్లాచెదరయ్యాయి. అపుడు నక్షత్రములతో కూడా ఆకాశము ఒకముక్క విరిగి ఆభవనంలో పడ్డట్లు, చెల్లాచెదరై పడివున్న ఆభరణాలతో ఆ భవనం శోభించింది అంటాడు వాల్మీకి. ఇక ఆవిడ ఎన్ని ఆభరణాలు ధరించిందో, పాపానికి ఏస్థాయిలో బహుమానాలు ముట్టాయో మనం ఊహించుకోవచ్చు.

శత్రుఘ్నుడు మంథరను హింసిస్తున్నాడని తెలియగనే కైకేయి భయపడి పరుగెత్తుకుంటూ వచ్చింది. కైకేయిని చూడగానే భరతునికి ఒళ్ళు మండిపోయింది. కైకేయిని కఠినవాక్కులతో భయపెట్టాడు. మంథరను వధించుటకు ఉద్యుక్తుడయ్యాడు శత్రుఘ్నుడు.

భరతుడు శత్రుఘ్నుని నివారిస్తూ ఇలా పలికాడు. "తమ్ముడూ! తొందరపడకు. ఇది నీవు చేయదగిన పనికాదు. చేయకూడని పనిని చేయడం సముచితంకాదు.

**అవధ్యాః సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతా మితి**

"స్త్రీని చంపకూడదు. ఆమెను క్షమించి విడిచిపెట్టు.

"నాయనా! ధర్మవిరుద్ధమైన కార్యాన్ని అన్న ఆమోదించడు. మాతృహత్య చేసినందుకు అన్న నన్ను తిరస్కరిస్తాడని భయపడి వూరుకున్నాను. లేకపోతే, పాపిష్ఠిమైన కైకేయిని వధించి వుండేవాణ్ణి.

"శత్రుఘ్నా! ఈ గూనిదానిని మనం చంపినట్లు రామునికి తెలిస్తే మనిద్దరితో రాముడు మాట్లాడడు" అని భరతుడు పలికాడు.

ఆమాటలు వినగానే రామునియందు ఉత్తమమైన భక్తిగల శత్రుఘ్నుడు మంథరను వదలిపెట్టాడు. మంథర ఏడుస్తూ కైకేయి పాదాలపై పడింది. కైకేయి మంథరను ఓదార్చింది.

## పాలకులు - పాలితులు

మరునాడు అమాత్యులు భరతుని సమీపించారు.రాజ్యాభిషేక విషయాన్ని ప్రస్తావించారు.

"రాజకుమారా! పూజ్యుడైన దశరథమహారాజు రామలక్ష్మణులను వనవాసానికి పంపి తాను దివంగతుడయ్యాడు. ఆనాటినుండి అయోధ్య రాజులేని రాజ్యంగా మిగిలివుంది. దైవకృప చేత రాజ్యంలో ఏ కల్లోలమూ ఏర్పడలేదు. ఇంకా ఆలస్యంచేస్తే ఉపద్రవాలు సంభవించవచ్చు. నీవు రాజువై మమ్మల్నందరినీ పరిపాలించు. అయోధ్య అనాథ కాదని నిరూపించు.

"అభిషేక సంభారాలన్నీ సిద్ధంగా ఉన్నాయి. అందరూ నీకోసం నిరీక్షిస్తున్నారు. పితృపితామహంగా సంక్రమిస్తున్న రాజ్యాన్ని గ్రహించి పరిపాలించు;" అని పలికారు.

భరతుడు అభిషేక సంభారాలను, అచ్చట సిద్ధం చేయబడియున్న వస్తుసముదాయాన్ని చూశాడు. వాటికి ప్రదక్షిణ నమస్కారములుచేసి అమాత్యులతో ఇలాచెప్పాడు.

"జ్యేష్ఠపుత్రుడు రాజుకావడం మా వంశాచారము. ఈవిషయం మీకంతా తెలుసు. అన్నీ తెలిసి నాకు రాజ్యాభిషేకం చేయాలని భావించడం ధర్మంకాదు.

"మా అందరిలో రాముడు జ్యేష్ఠుడు. ఆయన రాజ్యాన్ని పాలిస్తాడు. వనవాసం కూడా ఆయన కార్యమే. అయితే, ఆయన సేవకుడుగా ఆపనిని నేను నిర్వహిస్తాను.

"రాముని వెంటనే అరణ్యంనుండి తీసికొనిరావాలి. ఇది మన తక్షణ కర్తవ్యం. చతురంగ బలాన్ని సిద్ధం చేయండి. ఈ అభిషేక సంభారాలన్నీ వెంటతీసికొని వనానికి వెళ్తాను. అక్కడే రామునికి రాజ్యాభిషేకంచేసి యజ్ఞశాలనుండి పవిత్రాగ్నిని తీసికొని వచ్చునట్లు రాముని ముందుపెట్టుకొని నేను తిరిగివస్తాను.

"నాతల్లి కోర్కె నెరవేరడం నాకిష్టంలేదు. రాముడు రాజవుతాడు. నేను అరణ్యంలో ఉంటాను. మార్గమును శుద్ధిచేయమని శిల్పులకు ఆజ్ఞలివ్వండి. ప్రవేశించుటకు వీలుకాని ప్రదేశాలలో మనకు తోడుగా మార్గగాములను, రక్షకులను సమాయత్తం చేయండి" అన్నాడు భరతుడు.

భరతుని మాటలు విన్న వారందరూ భరతుని మనసులలో శ్లాఘించారు. శుభం కలగాలని దీవించారు. భరతుని ధర్మవచనాలచే పులకాంకితులైన జనులు హర్షధ్వానాలు చేస్తూ అశ్రువులను రాల్చారు. అమాత్యులు భరతుని ఆజ్ఞను అమలుచేయుటకు వెళ్ళారు.



భరతుని సంభాషణా చాతుర్యమును, రాజనీతిని ఇక్కడ మనం గ్రహించవచ్చు.

పితృపితామహంగా సంక్రమిస్తున్న రాజ్యాన్ని గ్రహించమని అమాత్యులు పలికారు. ఇది వంశాచారం. వంశాచారాన్ని అనుసరించమని అమాత్యులు భరతునితో పరోక్షంగా విన్నవించారు.

వంశాచారాన్ని ముందుంచుకొని మాట్లాడే అమాత్యుల మాటలను తిరస్కరించడానికి భరతుడు వంశాచారాన్నే ప్రధానంగా తీసుకున్నాడు. జ్యేష్ఠుడు రాజుకావడం వంశాచారమైనపుడు పితృపైతామహంగా సంక్రమించే రాజ్యాన్ని కనిష్ఠుడు చేపడితే అది వంశప్రతిష్ఠను దెబ్బతీయదా? అని పలికి అమాత్యులు అవాక్కయ్యేలా చేశాడు.

దశరథుని మానసిక సంక్షోభాన్ని కూడా ఈ దృక్కోణం నుండే నేను మీకు వివరించాను. కైకేయికి ఇచ్చిన వరాల ప్రకారం భరతుని రాజుచేయాలి. భరతుడు రాజైతే, జ్యేష్ఠుని విస్మరించిన కారణంగా వంశప్రతిష్ఠ దెబ్బతిన్నట్లు అవుతుందికదా! అని దశరథుడాలోచించాడు. భరతుడు దానినే సహేతుకంగా వివరిస్తున్నాడు.

అమాత్యులు తిరిగివచ్చి, "ధర్మాత్మా! నీ ఆజ్ఞమేరకు ఉత్తరువులను జారీచేశాం. కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి" అన్నారు.

మార్గాలు తెలిసినవారు, నేలత్రవ్వి చదునుచేసేవారు, అడ్డున్న చెట్లను నరికేసేవాళ్ళు, బాటలు వేసేవారు, యంత్రముల వినియోగము తెలిసినవారు, వడ్రంగులూ, తాత్కాలిక శిబిరములు నిర్మించువారు- ఇలా ఆయాకార్యాలలో నైపుణ్యము గలవారంతా గుంపులు గుంపులుగా ఉత్సాహంతో బయలుదేరారు.

కొందరు లోతైన ప్రదేశాలను మట్టితో నింపారు. కొందరు మార్గాలు ఏర్పరచారు. తీగలు, పొదలు, కంటకాలు తొలగించే కార్యాన్ని కొందరు చేపట్టారు. మిట్టపల్లాలుగా వున్న ప్రదేశాలను కొందరు చదును చేశారు. నీరు లభించని ప్రదేశాలలో చలివేంద్రలవలె నీటి సదుపాయాలు చేశారు. దారిలో అందముగ ధ్వజములను అలంకరించారు. శ్రేష్ఠులైన శిల్పులతో, ఉత్సాహవంతులైన పనివాండ్రతో నిర్మించబడిన ఆ రాజమార్గము రాత్రిపూట తారాచంద్రులతో శోభించే ఆకాశంలాగా తయారైంది అంటాడు వాల్మీకి.

ఇంతటి మహత్తరకార్యం అంత త్వరితంగా ఎలా సాధ్యమైంది? అనే ప్రశ్న ఎవరికో కాదు, నాకుకూడా ఈ సందర్భంలో వ్రాస్తూవుంటే స్ఫురిస్తూ వుంది. నిజమేకదూ!

సంవత్సరాలు తరబడి రోడ్లు వేస్తున్నా, తొలకరి జల్లుకే అదృశ్యమయ్యే రహదారుల్ని ఈనాడు ప్రత్యక్షంగాచూసే మనకు సంశయం కల్గకుండా ఎలా ఉంటుంది?

ఆ కార్యమంతా ఎవరో భుజానపెడితే మూలుగుతూ మోసిందికాదు. అది స్వచ్ఛందసేవ. స్వచ్ఛమైన సేవ. రాజుపై భక్తిప్రేమలుగల ప్రజలు సాగరరూపంలో కదలివచ్చి నిర్వహించిన సేవాకార్యము.

ప్రజలకు ఆనాడు కర్తవ్యదీక్ష ఎక్కువ. రాజభక్తి మెండుగా ఉండేది. ప్రజలందరిది ఒకే ఆలోచనగా ఉండేది. హక్కులు గాకుండా బాధ్యతలను జీర్ణించుకున్న సమాజం అది.

సమాజంపట్ల కర్తవ్యస్పృహ ప్రజలలో ఉన్నందున అలాంటి కార్యాలు అమోఘంగా జరిగేవి. రాముడు రాజైతే నేమి? భరతుడు రాజైతే నేమి? అని ప్రజలు తటస్థంగా ఉండలేరు. ప్రభువుతో ప్రజలకు ప్రేమమయ సంబంధం ఉంది.

రాజుగారి కార్యంపట్ల ప్రజలలో ఈఅంకితభావం, కర్తవ్యనిష్ఠ కలగడానికి కారణమేమిటి? ఏమీలేదు. రాజు ధర్మబద్ధుడై, స్వార్థచింతన లేకుండా ప్రజల్ని కన్నబిడ్డలలాగా పరిపాలించడమే.

ప్రభువు, ప్రజలు ఇరువురూ ధర్మంపట్ల ఆకర్షితులై ఉండేవారు. ప్రజలు కర్తవ్యాన్ని గూర్చి ఆలోచించేవారు. సర్వకార్యాలు యజ్ఞభావంతో సాగేవి. ధర్మజీవనంలో ప్రజలు, ప్రభువులు త్యాగమయులుగా ఉండేవారు.

రాముడు రాజుకావాలని అయోధ్యా నగరవాసులంతా కాంక్షించారు. రాముని కొరకు ఏ త్యాగం చేయడానికైనా సిద్ధపడ్డారు. రాముడు తాను రాజుకావాలని అభిలషించి వుంటే అడ్డెవ్వరూ లేరు. దశరథుడు కూడా అలా జరిగితేనే బాగుంటుందని భావించాడు. కానీ వెళ్ళవద్దని మహాప్రవాహంలా ఎదురు నిలిచిన జనసమూహాన్ని ఛేదించుకొని రాముడు ధర్మంకోసం, ధర్మపరిరక్షణకోసం అరణ్యాలకు వెళ్ళాడు.

అట్టి త్యాగధనుడు, ధర్మాత్ముడైన ప్రభువుకోసం పరితపించే జనం స్వచ్ఛందంగా ముందుకు తరలివచ్చి మార్గాలు నిర్మించారు. కన్నుమూసి తెరిచేలోగా కళ్ళతో చూసినా నమ్మలేని కార్యాన్ని దిగ్విజయంగా ఆచరించి చూపారు.

తన ప్రయత్నం లేకుండా భరతునికి రాజ్యం లభించింది. అనుభవించా లనుకుంటే అవరోధ మేమీలేదు. ధర్మాన్ని వరించి, రాజ్యాన్ని వర్జించి, అభ్యుదయ నిశ్శ్రేయసలను సముపార్జించేందుకు అరణ్యాలకు ప్రయాణమయ్యాడు భరతుడు. అట్టివాని ప్రయాణానికి ప్రజలు ప్రేమతో రహదారుల్ని నిర్మించారు. శ్రమను ఆహారంగా, పరిశ్రమను పానీయంగా గ్రహించారు.

సత్యధర్మాలు ప్రేమతో ఆచరింపబడే సమాజంలో దేవతలు వసిస్తారు. ఇలాంటి సమాజవ్యవస్థకు ప్రభువు అంకురార్పణ చేయాలి. ప్రభువే ఆదర్శం కావాలి.

**"యథారాజ తథాప్రజ"** రాజెలావుంటే ప్రజలు అలావుంటారు. ఆనాటికి ఈనాటికి ప్రజల్లో ఎంత మార్పుఉంది? ఒక్క రామునికోసం, ఒక్క భరతునికోసం ఆనాడు అందరు ప్రజలు శ్రమను అనుభవించారు. ఈనాటి పౌరుడు తన ఒక్కడికోసం ఎందరినైనా ఆహుతి చేసుకుంటాడు. తాను సుఖపడాలి. ఎవరు ఏమైనా ఫరవాలేదు. ఎందరు బాధపడ్డా తనకు చింతలేదు.

రైలు వేగాన్ని పుంజుకొని నడుస్తూ వుంటుంది. రైలుఆగని కుగ్రామంలో తాను దిగవలసి వస్తే గొలుసులాగి మరీ దిగిపోతాడు. అదొక సాహసకృత్యంగా పరిగణిస్తాడు. ఈపని చేసేవారిలో చదువురానివారు చాలా తక్కువని నేను చెప్ప నవసరంలేదు.

పండుతిని తొక్కను ప్రధాన రహదారిలో విసిరివేయడమే గాని, దాని పర్యవసాన మేమిటి? అని ఆలోచనలేదు. పర్యవసానము ఏదైతేనేమి? అది నాకు సంబంధించి ఉండదు అనేదే అవగాహన.

నీళ్ళుత్రాగి కుళాయి కట్టేయకుండా తమదారిన తాము పోయేవారు, ఫాన్లు కట్టేయకుండా, లైట్లు ఆర్పకుండా బండి దిగిపోయేవారు, బస్సులు తగలబెట్టేవాళ్ళు, వీధి దీపాల్ని రాళ్ళతో పలకరించేవాళ్ళు - వీరంతా ఎవరో కాదు. పాలించేవారి దౌష్ట్యంవల్ల సమాజానికి ప్రాప్తించిన జాడ్యాలు.



వ్యసనపరులు, లంచగొండులు, అశ్లీలవంతులు, అధర్మపరులు ప్రభువులుగా చలామణి అయ్యే సమాజంలో అంతకుమించి ప్రగతిని ఊహించడం సాధ్యంకాదు. అభ్యుదయాన్ని ఆశించి లాభంలేదు.

ధర్మప్రభువుల ధర్మయుత పరిపాలనలో ప్రజలు ధార్మికు లవుతారు. వారు నివసించే సమాజం నైతిక విలువలతో జీవించే ధార్మిక సమాజంగా శోభిల్లుతుంది. అదే ఆనాటి రామరాజ్యం.

పాలకులు ధర్మానికి చెల్లుచీటి వ్రాయడంవల్ల ఈనాడు రాక్షసరాజ్యం గోచరిస్తోంది.

## రాజ్యంవద్దు - రాముడే కావాలి

ప్రభాతవేళ వందిమాగధులు హర్షాతిరేకముతో భరతుని స్తుతించడం ప్రారంభించారు. మంగళవాద్యఘోష రాజభవనమంతా ప్రతిధ్వనించింది. అదివిని భరతుడు తీవ్రంగా దుఃఖపడ్డాడు.

"ఆపండి. ఈ ఘోషలు నేను వినలేను. నేను రాజునుకాను;" అని పలికి శత్రుఘ్నునితో ఇలాచెప్పాడు.

"శత్రుఘ్నా! చూశావా! కైకేయి లోకానికి ఎంత అపకారం చేసిందో? ఆయన దుఃఖాన్నంతా నాకిచ్చేసి దశరథమహారాజు వెళ్ళిపోయాడు" అన్నాడు భరతుడు.

దశరథుడుకూడా వందిమాగధులను ఇలాగే ఆపమన్నాడు. ఆ ఘోషలవల్ల తన దుఃఖం అతిశయిస్తోంది అన్నాడు. భరతుడుకూడా అదే అంటున్నాడు.

"శత్రుఘ్నా! ధర్మాత్ముడైన దశరథమహారాజు రాజ్యం ఇపుడు చుక్కానిలేని పడవలాగా నడుస్తోంది. అధర్మపరురాలైన నాతల్లి ధర్మాత్ముడైన రాముని అడవికి పంపింది;" అని ఏడుస్తూ క్రిందపడిన భరతుని చూచి అంతఃపుర స్త్రీలందరూ పెద్దగా విలపించారు.

ఇదిలావుండగా రాజ్యాభిషేకానికి అన్నీ సిద్ధంచేసి, సభాభవనానికి రమ్మని దూతల ద్వారా వసిష్ఠుడు భరతునికి కబురంపాడు. సుమంత్రునితోకలిసి భరత శత్రుఘ్నులను వెంటబెట్టుకొని దూతలు సభాభవనంలో ప్రవేశించారు.

అమాత్యులు, ద్విజశ్రేష్ఠులు, ధర్మవేత్తలు, పండితులతో నిండిన ఆ సభ శరదృతువునందు పూర్ణచంద్రునితోకూడిన రాత్రివలె ప్రకాశించింది.

మహాత్ముడైన వసిష్ఠుడు సభలో నోరువిప్పాడు.

"నాయనా! భరతా! ధర్మాత్ముడైన దశరథమహారాజు ఈరాజ్యాన్ని ధర్మబద్ధంగా పాలించాడు. పుష్కలంగా ధనధాన్యాలుగల ఈ విశాలరాజ్యాన్ని నీకు అందించి, ఆయన దివి కేగాడు.

"సత్యసంధుడైన రాముడు సత్పురుషుల మార్గంలో చరిస్తూ, చంద్రుడు వెన్నెలను వీడనట్లు తండ్రిమాటను విడువకుండా జీవించాడు. నీతండ్రి, నీసోదరుడు నీకు ఏ ఆటంకము లేకుండా అనుగ్రహించిన ఈరాజ్యాన్ని స్వీకరించు. రాజ్యాభిషిక్తుడవై, మంత్రిమండలితో కలిసి ప్రజలను చక్కగా పరిపాలించు.

"ఈ అభిషేక సమయాన నీకు సమర్పించుటకు అనేక దేశములనుండి కోట్లకొలది ధనమును తీసికొని రాజులు విచ్చేసియున్నారు" అన్నాడు వసిష్ఠమహర్షి.

వసిష్ఠుని వచనములు విన్న భరతుడు చింతాక్రాంతు డయ్యాడు. ధర్మావలంబనకు ధైర్యము నిమ్మని రాముని ప్రార్థించాడు.

**జగామ మనసా రామం ధర్మజ్ఞో ధర్మకాంక్షయా**

"ధర్మము నాచరించాలనే అభిలాషతో ధర్మజ్ఞుడైన భరతుడు రాముని ప్రార్థించాడు".

నిత్యజీవితంలో అనేక ఆకర్షణలు మనిషిని ప్రలోభపెడుతుంటాయి. వంచించడానికి ప్రయత్నిస్తుంటాయి. అలాంటి ఆకర్షణలు ఎదురైనపుడల్లా వాటిని జయించేశక్తిని ప్రసాదించమని భగవంతుని భరతునిలాగా ప్రార్థించడం అలవరచుకోవాలి. ఆరాధనకు అలవాటుపడిన చిత్తము ఆవేదనకు దూరమవుతుంది. ఆవేదనను కల్పించే పరిస్థితులు ఆసన్నమైనపుడు ఎవరు శాంతిని కోల్పోకుండా ఉంటారో వారే ధైర్యవంతులు. ధర్మాచరణమే ధైర్యాన్ని ప్రసాదిస్తుంది.

**వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః**

"వికార హేతువులు ఒకవైపు గోచరిస్తున్నను ఎవరి మనసు వికారమునొందదో వారే ధీరులు" అని కాళిదాసమహాకవి కుమారసంభవంలో వ్రాశాడు.

వసిష్ఠుని మాటలు విన్న భరతుడు ధర్మాచరణకు ధీరుడై నిలిచాడు.

**చరిత బ్రహ్మచర్యస్య విద్యాస్నాతస్య ధీమతః**
**ధర్మే ప్రయత మానస్య కో రాజ్యం మద్విధో హరేత్**

"మహాత్మా! బ్రహ్మచర్య వ్రతదీక్షాపరుడై, సర్వశాస్త్ర పారంగతుడై, ధర్మమార్గానువర్తియైన రాముని రాజ్యమును ఎవడైనా అపహరిస్తాడా?" అని భరతుడు వసిష్ఠునిపై మొదటి బాణాన్ని సంధించాడు.

రామునికి సర్వశాస్త్రములు తెలుసు. శాస్త్రజ్ఞానమేకాక అనుభవజ్ఞానముకూడా కలిగినవాడు. ధర్మమార్గమునందే చరించువాడు. అట్టివానికి నేను తమ్ముడను. ధర్మాన్ని ప్రక్కకునెట్టి అధర్మంగా రాజ్యాన్ని అపహరించడం న్యాయమా! అని భరతుడు వసిష్ఠుని ప్రశ్నిస్తున్నాడు.

ఇక్ష్వాకు వంశాచారమును అనుసరించి జ్యేష్ఠపుత్రుడు రాజుకావాలి. అది ధర్మం. ధర్మాత్ముడైన రామునికి చెందవలసిన రాజ్యమును కనిష్ఠుడు పాలించడం ధర్మంపట్ల అన్యాయం చేయడంకాదా! అంటున్నాడు భరతుడు. ఒకరికి సంబంధించిన రాజ్యాన్ని మరొకరు అపహరించి అనుభవించడం దొంగతనమే అవుతుందని భరతుని అభిప్రాయము.

అలా ఎందుకు అనుకోవాలి? రాజ్యము దశరథునిది. తన తరువాత రాజ్యము భరతునిది అని దశరథుడు నిర్ణయించి పరమపదించాడు. అలాంటప్పుడు అట్టి రాజ్యాన్ని స్వీకరించడానికి భరతునికి అభ్యంతరమేమిటి? అది దొంగతనం ఎలాఅవుతుంది? దీనికి కూడా భరతుడు సమాధానం చెప్తున్నాడు.



**కథం దశరథా జ్జాతో భవే ద్రాజ్యాపహారకః**
**రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తు మిహార్హసి ॥**

"దశరథునికి పుట్టినవాడు రాజ్యాన్ని హరించగలడా? ఈరాజ్యం రామునిది. నేను కూడా రామునికి చెందినవాడను. ఈవిషయంలో ధర్మమేదో మీరేచెప్పండి" అని వసిష్ఠుని ప్రశ్నించాడు భరతుడు.

దశరథుడు ధర్మాత్ముడు. ధర్మబద్ధంగా రాజ్యం రామునికి చెందాలనే భావించాడు దశరథుడు. అలాకానిచో, రామునకు యౌవరాజ్యాభిషేకము చేయడానికి ఎందుకు నిర్ణయిస్తాడు? రాజ్యము రామునికి చెందాలి అనే అభిప్రాయమే దశరథునిలో ఉండింది. కానీ కైకేయి ఆడిన చదరంగంలో తాను బలైపోయాడు. నోరుమెదపలేక పోయాడు. అంతేకానీ భరతుడు రాజ్యాన్ని పాలించాలని దశరథుని హృదయంలో లేశమంత భావంకూడా లేదు.

భరతునికి రాజ్యకాంక్ష ఉండి అతడు తల్లికి అనుకూలుడైతే తనకు అంతిమ సంస్కారము చేయుటకు అనర్హుడవుతాడు అని దశరథుడు చెప్పియున్నాడు కూడా. అలాంటి దశరథుని కుమారుడు తండ్రి అభిలాషకు భిన్నంగా, విరుద్ధంగా రాజ్యాన్ని అపహరించడం పరలోకంలోకూడా తండ్రికి శాంతిలేకుండా చేయడమే అవుతుంది అని భరతుని భావము.

కనుక దశరథునికి పుట్టినవాడు చేయవలసింది రాజ్యమును అపహరించుటకాదు అని ఖచ్చితంగా చెప్తున్నాడు భరతుడు. మరి చేయవలసింది ఏమిటి? అదికూడా తనలోతాను ఊహించుకున్నాడు.

రాజ్యాభిషేకము ఆగి, రాముడు అరణ్యాలకు వెళ్ళగనే దశరథుడు జీవించలేక ప్రాణాల్ని వదిలాడు. దశరథుని కుమారుడుగా ఈవార్త తెలియగానే తానుకూడా మరణించి వుండవలసింది. కాని అలా జరగలేదు. తాను కఠినాత్ముడ నైనందువల్లనే అలా జరుగలేదేమో! అని భావిస్తున్నాడు భరతుడు. కఠినాత్ముడని వీరికికూడా తెలిసిపోయిందేమో! అందుచేతనే రాజ్యాన్ని చేపట్టమని తనను కోరుతున్నారు అనికూడా ధర్మాత్ముడైన భరతుడు ఆంతర్యంలో భావిస్తున్నాడు.

ఈ రాజ్యము రామునిది. అంతేకాదు. నేను కూడా రామునికి చెందిన వాడనే అంటున్నాడు భరతుడు.

రాజ్యము రామునిదికనుక రాముని రాజ్యాన్ని పాలించమని చెప్పడానికి దశరథునికి కూడా హక్కులేదు అని దశరథుని అధికారాన్నికూడా ప్రశ్నిస్తున్నాడు భరతుడు. అధికారము లేనివాడు ఇచ్చే రాజ్యాన్ని ఎవరు పుచ్చుకుంటారు? అనికూడా ధ్వనిస్తూవుంది.

పితృపితామహంగా సంక్రమిస్తున్న రాజ్యం జ్యేష్ఠుడికే చెందాలి. అలాగే దశరథుడు తనతండ్రినుండి, ఆయన ఆయన తండ్రినుండి గ్రహించడం జరిగింది. ఈవంశాచారము ప్రకారము దశరథుని తరువాత జ్యేష్ఠుడైన రామునికి చెందాలి. పైగా రాముడు శ్రేష్ఠుడుకూడా. కనుక దశరథుని తరువాత రాజయ్యే హక్కు రామునికే ఉంది. రాజ్యము రామునిదే.

రామునికి సంబంధించిన రాజ్యాన్ని మరొకరికి దానం చేయడానికి దశరథునికి హక్కేముంది? తనది కానిదానిని ఇచ్చుట అన్యాయమైతే, దానిని గ్రహించుటకూడా అన్యాయమేకదా!

అన్యాయంగా ఆశపడి ఆర్జించడానికి శత్రువొక్కడే సిద్ధపడతాడు. అలా చూపినా తనకు రామునితో ఉండే సంబంధం అలాంటిది కాదని భరతుడు అభిప్రాయపడుతున్నాడు. రాజ్యము ఎలా రామునిదో తాను కూడా రామునికి చెందినవాడనే అంటున్నాడు భరతుడు.

రాముడు స్వామి. తాను దాసుడు. దాసుడైనవాడు ప్రభువు ఆస్తిని అపహరించడాన్ని ఏధర్మశాస్త్రము సమర్థిస్తుంది? మీరే చెప్పండి ఏది ధర్మమో? అని వసిష్ఠుని నిండుసభలో నిలదీశాడు భరతుడు.

**అనార్యజుష్ట మస్వర్గ్యం కుర్యాం పాప మహం యది**
**ఇక్ష్వాకూణా మహం లోకే భవేయం కుల పాంసనః**

"ఆర్యులు చేయరానిది, స్వర్గానికి ప్రతిబంధకమైనది అయిన ఈపాపకార్యాన్ని నేను చేసినట్లయితే ఇక్ష్వాకువంశానికి నేను కళంకము తెచ్చినవాణ్ణి అవుతాను" అన్నాడు భరతుడు.

భరతుడు ధర్మాత్ముడు. కనుక అధర్మమును అనార్యులవలె ఆచరించడు. ఆర్య సంస్కృతి ధర్మచ్యుతిని అంగీకరించదు. భరతుడు పుణ్యాత్ముడు. కనుక నరకహేతువు అయిన కర్మను ఆచరించుటకు భీతిచెందుతున్నాడు. పాపాన్నిచూసి భీతిచెందువాడే సత్పురుషుడు.

తనలోని లోపాన్ని లోపంగా చూసి సరిచేసుకొనువాడు పావనాత్ముడు. తన లోపాన్ని గొప్పగాను, తప్పును ఒప్పుగాను దర్శించి విర్రవీగేవాడు పాపి. పాపికి పాపం ఆహ్లాదంగా ఉంటుంది. పుణ్యచరితుడు పాపాన్ని చూసి భీతి చెందుతాడు.

**There are only two sorts of men: the one the just, who believe themselves sinners; the other sinners, who believe themselves just.**

"మనుషులు రెండు తెగలుగా తెలుస్తుంటారు. తమను పాపాత్ములుగా భావించుకొనే ధర్మాత్ములు ఒక కోవవారుకాగా, తమను ధర్మాత్ములుగా చిత్రించుకొనే పాపాత్ములు రెండవకోవకు చెందుతారు" అంటాడు పాస్కల్.

చేతికి అందిన సుఖాలను పరిత్యజించిన ధీశాలి భరతుడు. పరమాత్మ పొందును వాంఛించి ప్రాపంచిక విషయ సుఖాలను విడనాడిన పుణ్యచరితుడు.

ధర్మాన్ని సూక్ష్మంగా అర్థం చేసుకోవాలి. కోరకుండా లభించిన రాజ్యాన్ని అనుభవించడము ఆర్యులకు తగనిది, స్వర్గానికి ప్రతిబంధకమైనది, కళంకమును అందించి కీర్తిని పోగొట్టునదిగా భరతుడు చెప్తున్నాడు.

ఒక్కసారి మనం అటు భారతంవైపు తిరిగితే ఈధర్మమే మరోవిధంగా గోచరిస్తుంది. ఇక్కడ రాజ్యాన్ని అనుభవించడం తప్పయితే, అక్కడ యుద్ధంచేసైనా రాజ్యాన్ని ఆక్రమించకపోతే తప్పుగా గోచరిస్తుంది.

యుద్ధంద్వారా లభించే ఈరాజ్యసుఖం తనకు అవసరంలేదంటూ, తాను వనాలకు వెళ్ళి తపస్సు చేసుకోవడానికి కూడా సిద్ధపడిన అర్జునుని శ్రీకృష్ణుడు వారించాడు. రాజ్యం చేపట్టడం తప్పంటూ ఇక్కడ భరతుడు ఏమాటలు పలికాడో వాటినే శ్రీకృష్ణుడుకూడా పలికాడు చూడండి.



**కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్**
**అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున !**

"అర్జునా! ఆర్యులకు తగనిది, స్వర్గానికి అనర్హమైనది, అపకీర్తిని తెచ్చిపెట్టునది అయిన అజ్ఞానము ఈవిషమ పరిస్థితులలో నీకు ఎక్కడనుండి ప్రాప్తించినది?" అని శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నించాడు.

భారతంలో చట్టబద్ధంగా పాండవులకు రాజ్యము సంక్రమించవలసి వుంది. పైగా దానిని అనుభవించేవాడు దురాత్ముడు అయిన దుర్యోధనుడు.

రామాయణంలో ధర్మబద్ధంగా రామునకు రాజ్యము సంక్రమించాలి. రాజ్యాన్ని అనుభవించవలసిన రాముడు ధర్మాత్ముడు. అట్టి రాముడు రాజ్యాన్ని త్యాగంచేసి వనాలకు వెళ్ళాడు.

తనది కాని రాజ్యాన్ని అన్యాయంగా మహాభారతంలో దుర్యోధనుడు అనుభవిస్తూ వుంటే, ఆశించకుండా తనకు లభించిన రాజ్యాన్ని విషతుల్యంగా శ్రీమద్రామాయణంలో భరతుడు భావిస్తున్నాడు.

రెండుచోట్లకూడా రాజ్యార్హులు ధర్మాత్ములే. పాండవులు, శ్రీరాముడు ఇరువురూ ధర్మముయొక్క నీడలోనే జీవిస్తున్నారు. కానీ మహాభారతంలో దుర్యోధనుడు దుర్మార్గుడు కనుక ఎవరు ఇవ్వకపోయినా పాండవుల రాజ్యాన్ని కబళించాడు. రామాయణంలో భరతుడు ధర్మాత్ముడు గనుక ఇచ్చినా వద్దని పరిత్యజిస్తున్నాడు.

పెద్దలను ధిక్కరించైనా దుర్యోధనుని నుండి రాజ్యమును గ్రహించడం భారతంలో ధర్మం. అది ఆర్యజీవనం. స్వర్గార్హం. కీర్తికరం.

పెద్దలను తిరస్కరించి అయినా రామునికి రాజ్యాన్ని సమర్పించడం రామాయణంలో ధర్మం. ఇక్కడ ఇది ఆర్యజీవనం. స్వర్గార్హం. కీర్తికరం.

భారతంలో సంగ్రహించకపోయినా, రామాయణంలో సమర్పించకపోయినా అట్టికార్యము ఆర్యులకు తగనిది అవుతుంది. స్వర్గానికి ప్రతిబంధక మవుతుంది. అకీర్తికర మవుతుంది.

కనుకనే కాలం మారినా, పరిస్థితులు భిన్నమైనా భరతుడు, కృష్ణుడు ఇద్దరూ **"అనార్య జుష్ట మస్వర్గ్యం"** అంటూ శ్రుతిలయలు తప్పకుండా ఒకే పాటపాడారు. ఇది ఆర్షసంస్కృతిలో ధర్మావగాహన.

ధర్మావగాహనతో ధర్మమేమిటో చెప్పమని గురువైన వసిష్ఠునే నిండుసభలో ప్రశ్నించిన ధర్మాత్ముడైన భరతుడు ఇంకా చెప్తూవున్నాడు.

**యద్దిమాత్రా కృతం పాపం నా హం తదపి రోచయే**
**ఇహస్థో వనదుర్గస్థం నమస్యామి కృతాంజలిః**

"నాతల్లి చేసిన పాపాన్ని నేను అంగీకరించను. గమించను శక్యముగాని మాఅన్నగారైన రామునికి ఇక్కడనుండియే నేను నమస్కరిస్తున్నాను" అన్నాడు భరతుడు.

ఇది అందమైన శ్లోకం. అద్భుతమైన శ్లోకం. తండ్రి ఆజ్ఞను పాలించమని వసిష్ఠుడు చెప్పాడు. నిజమే. తల్లిదండ్రుల ఆజ్ఞను పాలించడం తనయుల ధర్మం. అయితే ధర్మానికి

బద్ధుడై మౌనం వహించినా, రాజ్యము రామునికే చెందాలని మూగబాధ ననుభవించి మరణించిన తండ్రిగారి మనసును అనుసరించాలా? లేక అధర్మము పంచన నిలబడి అన్యాయంగా, అక్రమంగా రాజ్యాన్ని అపహరించిన తల్లియొక్క కల్లబొల్లి మాటలను అనుసరించాలా?

భరతునికి వసిష్ఠుని వచనానుసారం ఈనాడు అందుతున్న రాజ్యము తండ్రి ప్రీతితో ఇచ్చిందికాదు. పసిబిడ్డ తినబోయే వస్తువును కాకి హరించినట్లు కైకేయి అపహరించింది. కనుక ఈరాజ్యము పాపార్జితము అని భరతుని అభిప్రాయము.

పాపకార్యముద్వారా తనకొరకు తల్లి కైకేయి సంపాదించిన రాజ్యము పాపాలమూట. ఈ పాపసంచయానికి తాను భాగస్వామి కాదలచుకోలేదు భరతుడు. "నాతల్లి చేసిన పాపకార్యాన్ని నేను అంగీకరించను" అంటున్నాడు పవిత్రాత్ముడైన భరతుడు.

ఈసందర్భమున తులసీరామాయణంలో భరతుడు పలికిన మాటలు సదా సంస్మరణీయములు.

"నే నేపాపము చేయలేదు. కైకేయి గర్భమున పుట్టుటయే నేను చేసిన భయంకరమైన పాపము. అదియే నాకు వచ్చిన మచ్చ. ఇది బ్రహ్మదేవుడు నాముఖాన లిఖించాడు. దాని విషయంలో నేను చేయగలిగిందిలేదు కనుక నేను దానికి బాధపడడంలేదు. కానీ మీరెందుకు ఈ విధివంచితుణ్ణి బాధిస్తున్నారు?

**మోరి బాత్ సబ్ విధిహిం బనాయీ! ప్రజా పాంచ్ కత కరహు సహాయీ!**

"విధాత నా లలాటమున అలా లిఖించాడు. మీరు పంచాయితీ చేసి నా విధివ్రాతకు ఎందుకు సహకరిస్తున్నారు?

"నాబ్రతుకుకు తగినంతగా బ్రహ్మదేవుడు నాముఖాన వ్రాయవలసినదంతా వ్రాశాడు. నేను విధివక్రించిన దురదృష్టవంతుడను. అట్టినేను దశరథుని కుమారునిగా, రాముని తమ్మునిగా గొప్పలు చెప్పుకొనుటకు తగుదునా?

"శరీరమున రోగమున్నవాడు భోగాల ననుభవించుటకు అనర్హుడు. విధివంచితుడనైన నేను రాజుగా అర్హుణ్ణికాను. వస్త్రములు ధరించక, ఆభరణాలు ధరించినవాడు ఎలా ఉంటాడో, అదృష్టహీనుణ్ణయిన నేను రాజ్యభారం వహించడం అలా ఉంటుంది.

"ఎవరి పేరు వినిపించగనే అయోధ్యలో భయంకరమైన పరిణామాలు తలెత్తాయో, ఎవనికి రాజ్యాభిషేకం చేయాలని నిర్ణయించగానే ముగ్గురు తల్లుల మాంగల్యములు అపహరించబడ్డాయో అట్టి అధముణ్ణి, నీచుణ్ణి అయిన నన్ను రాజుగా పొంది మీరేం సుఖిస్తారు?

"ఏరాజ్యము కారణంగా నారాముడు సీతాలక్ష్మణసమేతుడై అరణ్యానికి వెళ్ళాడో, ఆరాజ్యాన్ని పాలించమని నాకుచెప్పడానికి మీకు నోరెలా వచ్చింది?

"వసిష్ఠమహర్షీ! దురాత్మురాలైన నాతల్లి ఏపాపాన్ని నాతలకు చుట్టబెట్టాలని చూసిందో మీరూ అదే చేస్తారా? నామీద ఎవరికీ కనికరము కలగడంలేదు. గతంలో నేను చేసిన పాపాలు నామీద పర్వతాల రూపంలో వచ్చిపడుతున్నట్లున్నాయి.



**గురు వివేక సాగర జను జానా! జిన్హహి విశ్వ కర్ బదర్ సమానా**
**యోకహ తిలక్ సాజ్ సజ్ సోఊ! భయేం విధి విముఖ్ సబ్ కోఊ ॥**

"నాగురువు వసిష్ఠుడు జ్ఞానసాగరము. త్రికాలజ్ఞాన సంపన్నుడు. ప్రపంచమంతా వారికి కరతలామలకము. అట్టి మహాత్ముడుకూడా నాకు రాజ్యతిలకం పెట్టాలని ప్రయత్నిస్తున్నాడు. విధియే విరుద్ధంగా ఉన్నపుడు అందరూ ప్రతికూలంగానే ఉంటారు.

**పరిహరి రాము సీయ జగ్ మాహీ! కోఉ న కహిహి మోర్ మత్ నాహీం**
**సోమై సునబ్ సహబ్ సుఖ్ మానీ! అంతహు కీంచ తహాం జహాం పానీ!**

"సీతారాముల్ని విడచిపెడితే, ఈ పాపకార్యములో నాపాత్ర లేదని ఎవ్వరైనా అంగీకరిస్తారా? ఈ అపవాదులన్నిటిని నేను ఆనందంగా భరించాలి. సహించాలి. నీరున్నచోట బురదలేకుండా ఉంటుందా?

"నన్ను లోకం దూషిస్తుందని నేను బాధపడడంలేదు. పరలోకములో నాస్థితి ఎలా ఉంటుందో అనే ఆలోచన అసలేలేదు. ఒకేఒక విషయంలో నాహృదయం భగ్గున మండుతూ వుంది. నానిమిత్తమేకదా సీతారాములు అడవులపాలై అష్టకష్టా లనుభవిస్తున్నారు? నాబాధంతా అదే.

"నేను పుట్టగానే మరణించివుంటే రాముడికి ఈబాధ కలిగేదేనా? నేను జీవించినందుకు సీతారాములకు కష్టాలు ప్రాప్తించాయి. కానీ మహాత్ముడైన లక్ష్మణుడు జీవించినందుకు సీతారాములకు సేవచేసే భాగ్యం లభించింది. ఆయన పుణ్యం అలావుంది. నాపాపం ఇలా ఉంది" అంటూ రోదించాడు భరతుడు.

ఇక తులసీదాస్‌నుండి సెలవుతీసుకొని వాల్మీకి పాదాలచెంతకు నడుస్తాం.

"నాతల్లి చేసిన పాపాన్ని నేను అంగీకరించను. అరణ్యములోఉన్న మాఅన్న రామునికి అంజలి ఘటించి ఇక్కడనుండే నమస్కరిస్తాను" అన్న భావంగల అందమైన శ్లోకంలో మొదటివాక్యాన్ని అర్థంచేసుకున్నాము. అరణ్యంలో చరించే రామునికి ఇక్కడనుండే నమస్కరిస్తానని భరతుడు పలికిన వాక్యంలోని అంతర్భావాన్ని గ్రహించాలి.

రాముడు అక్కడున్నాడు. భరతుడు ఇక్కడున్నాడు. అది అరణ్యం. ఇది అయోధ్య.

అయోధ్యలో రాజు భరతుడే అని అందరూ భావిస్తున్నారు. ఎక్కడ తనను రాజుగా భావిస్తున్నారో అక్కడనుండే భరతుడు రామునికి నమస్కరిస్తున్నాడు.

నమస్కరించేవాడు రాజెలా అవుతాడు? రాజు వందనాలు అందుకుంటాడు. కనుక రాజు రాముడే. అరణ్యంలో వున్నా రాజ్యాధిపతి రాముడే. ఇక్కడ అయోధ్యలో తనను రాజుగా అందరూ భావిస్తున్నా తాను రాజుకాడు, సేవకుడే అని గుర్తుచేస్తూ భరతుడు నమస్కరిస్తున్నాడు.

**'నమస్యామి'** నమస్కరించుచున్నాను అన్నాడు భరతుడు. **"నమ ఇతి ద్వే అక్షరే"** 'నమ' అనునవి రెండు అక్షరములు అన్నది శాస్త్రము. కనుక 'నమ' అనేదానిని ఒకపదముగా కాకుండా రెండు అక్షరములుగా అర్థం చేసుకోవాలి.

"మః"=నాకొరకు, "నః"=కాదు అని అర్థము. నమః అనగా నాకొరకు కాదు అని భావము. అంటే నీకొరకే నని నిగూఢార్థము. ఈరాజ్యము తనకొరకని, తనదని ఈఅయోధ్యలో అందరూ భావిస్తున్నారు. కానీ వాస్తవానికి తనకొరకు కాదు, తనది కాదు అని తెలుపుతూ భరతుడు రామునికి నమస్కరిస్తున్నాడు.

ఇక్కడ భరతుడు వందన భక్తుడయ్యాడు. నవవిధ భక్తులలో వందన మొకటి. వందన సంస్కారము లేనివానిని నందనందనుడు అనుగ్రహించడు.

**వరద పద్మనాభ హరికృష్ణ గోవింద**
**దాన దుఃఖనాశ వాసుదేవ**
**యవ్యయా ప్రమేయ యనిశంబు గావింతు**
**మిందిరేశ నీకు వందనములు**

అని పోతనామాత్యుని భాగవతము.

అడవిలో రాముడున్నాడు. అయోధ్యలో భరతుడున్నాడు. వందన మాచరించి తన హృదయాన్ని సమర్పిస్తున్నాడు.

అన్నంపెట్టాలంటే తినేవాడు దగ్గరుండాలి. నమస్కారం ఎంతదూరం నుంచైనా పెట్టవచ్చు. **"తద్దూరే తద్వంతికే"** దూరసమీపాలు తెలియనివాడే దయామయుడైన భగవంతుడు. నీవు వందనం అనగానే ఆయన అందింది అంటాడు.

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు**

"అర్జునా! నీమనస్సును నాయందు ఉంచు. నాకు భక్తుడివికా. నన్నే అర్చించు. లేదా నాకు నమస్కరించు" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ గీతలో.

ఏదీ చేయలేని స్థితిలో నమస్కారంతో భగవంతుని సమీపించవచ్చు. భరతుడు అదే చేశాడు. పరిస్థితులన్నీ తారుమారయ్యాయి. రామునికి విన్నవించుకొని నమస్కరించుటకన్నా వేరేమార్గము భరతునికి గోచరించలేదు.

"తండ్రీ! రామా! యావద్విశ్వము ఏవగించుకున్నా నీవు అంగీకరిస్తే చాలు" అని శరణాగతుడై వందనభక్తుడుగా మారాడు వందనీయుడైన భరతుడు.

భరతుడు వసిష్ఠునితో చెప్తున్నాడు.

"నామనసు రామునియందే ఉంది. నేను రామునే అనుసరించి వెళ్తున్నాను. రాముడే రాజు. మరొకరు కాలేరు. నేను వనములకు వెళ్ళి అన్నను వెంటబెట్టుకొని వస్తాను. లేదా లక్ష్మణునివలె నేనూ అరణ్యములోనే ఉండిపోతాను.

**సర్వోపాయంతు వర్తిష్యే వినివర్తయితుం బలాత్**
**సమక్ష మార్య మిశ్రాణాం సాధూనాం గుణవర్తినామ్**

"సుగుణశీలురు, సాధువులు, పూజ్యులైన మీ అందరిముందు బలవంతముగా రాముని అయోధ్యకు తీసికొనివచ్చుటకు అన్నివిధాలైన ఉపాయాలను ప్రయోగిస్తాను.

"మార్గమును సుగమం చేయువారంతా ముందే వెళ్ళియున్నారు. ఇపుడు నేనుకూడా బయలుదేరుతున్నాను.



"సుమంత్రా! సర్వమును సిద్ధపరచు. సైన్యాన్నికూడా సిద్ధంచెయ్యి" అన్నాడు భరతుడు.

ధర్మబద్ధమైన భరతుని మాటలను విని సభలో జనులందరూ పులకరించి ఆనందబాష్పాలు విడిచారు. సుమంత్రుడు భరతుని ఆజ్ఞను పాలించుటకు సంతోషంతో పరుగెత్తాడు. సైన్యాధ్యక్షులందరూ సంతసించారు.

అయోధ్యలో ప్రతి ఇంటిలోను భార్యలందరు భర్తలను ప్రయాణం కమ్మని తొందర పెట్టారు. "ఆరోజు రామునితోపాటువెళ్ళి రాముని అడవిలో విడచివచ్చారుగా! పొండి. ఈరోజు పుణ్యాత్ముడైన భరతునితోకూడా వెళ్ళి రాముని వెంటబెట్టుకొని రండి" అని మహిళామతల్లులు ప్రతి ఇంటిలోను సందడిచేశారు.

## భరతుని వనగమనం

రామునికొరకు భరతుడు అరణ్యానికి వెళ్తున్నాడనే వార్త పట్టణమంతా ప్రాకింది. ఊరంతా కోలాహలంగా ఆనందంతో ఊగిపోయింది. ఇంకేముంది? రాముడు తిరిగి అయోధ్యకు వచ్చేసినట్లే అని అందరూ మాట్లాడుకుంటున్నారు.

భరతుడు ఉషఃకాలమునందే లేచి, అరణ్యానికి పయనించుటకు ఉత్తమమైన రథాన్ని అధిరోహించాడు. మంత్రులు, పురోహితులు వేరువేరు రథాల నెక్కారు.

భరతునివెంట తొమ్మిదివేల ఏనుగులు, అరవైవేల రథాలు, లక్ష అశ్వాలు, వివిధములైన ఆయుధములను ధరించిన సైనికులు, దశరథుని రాణులు ముగ్గురు, గుంపులు గుంపులుగా జనులు రాముని కళ్యాణగుణాలను వర్ణించుకుంటూ వెళ్ళారు. వేలమంది బ్రాహ్మణులు ఎడ్లబండ్లలో అనుసరించారు. వీరంతా గుహుడు పరిపాలిస్తున్న శృంగబేరపురము వద్ద గంగానదిని సమీపించారు. ఆరాత్రికి అక్కడ విడిదిచేసి మరునాడు ఉదయాన్నే గంగానదిని దాటునట్లు నిర్ణయించి సేనాధిపతులకు ఆజ్ఞలిచ్చాడు భరతుడు. అందరూ విశ్రాంతి తీసుకొనుటకు సముచిత స్థానములను నిర్ణయించుకున్నారు. రాముని అయోధ్యకు ఎలా మెప్పించి తీసుకొనిరావాలో ఆలోచించసాగాడు భరతుడు.

గంగానది పొడవునా నిలిచి సముద్రంలా నిలబడియున్న సైన్యాన్ని గుహుడు చూశాడు. వెంటనే తన బంధువులను పిలిచి ఇలాపలికాడు.

"అదిగో గంగకు ఆవలితీరాన అపారమైన సైన్యం నిలబడి వుంది. అక్కడ రథముపై ఉన్న ధ్వజముమీద కోవిదార వృక్షము కన్పిస్తూ వుంది. కనుక అది భరతుని సేనయేనని ధృవపడింది.

"కైకేయి కుమారుడైన భరతుడు ఇంతసైన్యముతో రావడానికి కారణమేమిటి? ఇక్కడున్న మనల్నందరినీ బంధించడానికి వచ్చాడా? లేదా చంపాలని భావించాడా? ఒకవేళ భవిష్యత్తులో రాముడు అడ్డువస్తాడేమోనని భీతిచెంది రాముని వధించడానికి వచ్చాడా?

"రాముడు నాకు ప్రభువేకాదు. మిత్రుడుకూడా. ఆ మహాత్ముని రక్షించే ప్రయత్నంలో మీరంతా సంసిద్ధులై ఉండండి. ఒకొక్క నావలో వందమంది యువకులు ఎక్కండి. అలాంటి నావలు ఐదువందలు సిద్ధంచేయండి. అందరూ ఖడ్గకవచాదులు ధరించండి.

"నేను ముందుగా వెళ్ళి భరతునితో సంభాషిస్తాను. రాముని విషయంలో మనసేమిటో తెలుసుకుంటాను. మనకు అంగీకార మైతేనే వారు గంగను దాటుతారు;" అని పలికి కందమూలాలు, తేనె, మాంసాదులు తీసుకొని గుహుడు భరతుని చూచేందుకు బయలుదేరాడు.

గుహుడు ఆలోచిస్తూ నడుస్తున్నాడు. రాముని అయోధ్యకు తీసుకొనిపోవాలని బహుశ భరతుడు వచ్చాడేమో! అదే వాస్తవమైతే ఏ పదో, పాతికో జనాన్ని వెంటపెట్టుకొని ఉండవచ్చుగదా! ఇంత అపారసైన్యాన్ని, చతురంగబలాన్ని వెంటబెట్టుకొని వచ్చి అవసరమేముంది? ఏమో! నమ్మడానికి లేదు. ఇతడు కైకేయి కుమారుడు. చెట్టు చేదుగా వున్నపుడు పండు తియ్యగా ఎలా ఉంటుంది? గుహుడు గంగాతీరమున భరతుడున్న ప్రదేశానికి వచ్చాడు.

సుమంత్రుడు భరతుని సమీపించి వెయ్యిమంది బంధువులతో అరుదెంచిన గుహుని గూర్చి చెప్పాడు. నిషాదరాజైన గుహుడు దండకారణ్యమంతా తెలిసినవాడని, పైగా రామునికి మిత్రుడని చెప్పాడు. రామలక్ష్మణుల జాడ గుహునికి తెలిసివుంటుందని కూడా చెప్పాడు. భరతుడు గుహుని వెంటనే ప్రవేశపెట్టమని చెప్పాడు.

గుహుడు భరతుని సమీపించి ఇలా పలికాడు.

"ఈప్రదేశమంతా మీకు విహారస్థలము వంటిది. మేమంతా నీ సేవకులము. ఇది నీ దాసుని గృహము. మీరు స్వేచ్ఛగా విహరించవచ్చు. ఇవిగో కందమూలాలు. ఫలములు. ఇది పచ్చిమాంసము. ఇది ఎండుమాంసము. మీ పరివారమంతా భుజించి విశ్రమించవచ్చు" అన్నాడు గుహుడు.

నిషాదరాజైన గుహుడు నిష్కపటి. అపారసైన్యాన్ని చూచి రామునిపై ఉండే భక్తితో భరతుని సందేహించాడు. తీరా భరతుని చూచిన తరువాత అతనిలోని సంశయాలు అదృశ్యమయ్యాయి. ప్రేమతో గౌరవంగా భాషించి ఆతిథ్యం స్వీకరించమని అర్థిస్తున్నాడు.

గుహుని ఉదారవచనములు విని భరతుడు ఇలా అన్నాడు: "గుహుడా! నీవు మా అన్నగారి మిత్రుడవని విన్నాను. మాసేన కంతటికి నీవు ఒక్కడివే ఆతిథ్య మివ్వాలని కోరుతున్నావు. నీదెంత గొప్ప మనస్సు!

"గుహుడా! ఈ గంగానది దాటుటకు దుస్సాధ్యంగా కన్పిస్తూ వుంది. మేము భరద్వాజాశ్రమం చేరాలి. మాకు మార్గాన్ని సూచించు" అన్నాడు భరతుడు.

"రాజకుమారా! మా పల్లెజనమంతా ధనుర్బాణములు ధరించి నిన్ను అనుసరిస్తారు. నేనుకూడా వస్తాను.

"అది సరేగానీ, నీవు రామునికి అపకారం చేయాలని వెళ్ళడంలేదు కదా? నీ అపారమైన సైన్యాన్ని చూస్తే నాకు సందేహం కల్గుతూవుంది;" అని అనేశాడు గుహుడు.

గుహుడు భరతునివద్దకు సందేహంతోనే వచ్చాడు. భరతుని చూడగానే ప్రసన్నుడై సందేహాన్ని మరచిపోయాడు. భరతుడు రాముని విషయాన్ని ప్రస్తావించకుండా భరద్వాజాశ్రమం చేరాలి అని చెప్పడంతో మళ్ళీ సంశయం తిరగబడింది.



గుహుడు ఎంత నిష్కళంకుడో అతడు అడిగిన పద్ధతినిబట్టే తెలిసిపోతుంది. భరతుని ప్రయాణ కారణాన్ని పరోక్షంగా ప్రశ్నించి తెలుసుకొని ఉండొచ్చు. అలాగాకుండా సూటిగా అడిగేశాడు.

రామునికి అపకారం చేయడానికి వెళ్ళడంలేదు కదా? అని అడిగాడు. అంతటితో ఆగక, అపార సైన్యంతో రావడము తనకు సందేహాన్ని కల్గిస్తూ వుందని తన మనోభావాన్ని కూడా స్పష్టంగా బహిర్గతం చేశాడు.

పల్లెజనాన్ని పాలిస్తూ, వనాలలో చరించే గుహుని పసిహృదయానికి మాయలు, మర్మాలు తెలియవని అతడు ప్రశ్నించిన ధోరణిని చూస్తే ఎవరికైనా ఇట్టే తెలిసిపోతుంది.

గుహుడు తనను సందేహించినందుకు భరతుడు కోపాన్ని పొందలేదు. ఆ మాటలు గుహుడు పలికినపుడు భరతుడు ఆకాశంలాగా నిర్మలంగా ఉన్నాడని అంటాడు వాల్మీకి **(ఆకాశ ఇవ నిర్మలః).**

ఆకాశానికి ఏదీ అంటదు. అలాగే ఎందరు అనుమానించినా భరతుని హృదయం నిష్కళంకమే. నిరంజనమే.

సాధారణంగా అనవసరంగా ఒకరు మనల్ని అనుమానిస్తే కోపం రాకుండా ఉండదు. అందులోను గుహుడు అంత ప్రత్యక్షంగా తన అనుమానాన్ని వ్యక్తంచేసి, భరతుని శీలాన్ని పరీక్షిస్తూ శంకించినపుడు నిజానికి భరతునికి కోపం వచ్చివుండాలి. కానీ రాలేదు. గుహుని ప్రశ్నకు భరతుడు మృదువుగా సమాధాన మిచ్చాడు అంటాడు వాల్మీకి.

తనలో దోషం వుందా లేదా అనేది వేరేవిషయం. తనను అందరూ అనుమానించే సమయం వచ్చింది. అనుమానానికి అవకాశాలుకూడా ఉండడంవల్లనే అనుమానాలు, అపవాదులు ఎదురౌతున్నాయి. విధి నడిపే ఈవింతనాటకాన్ని వీక్షించాలేగాని ఆగ్రహించేందుకు ఇది అనువైన సమయం కాదనుకుంటాడు భరతుడు.

"గుహుడా! రామునికి అపకారము చేయు సంకల్పము ఎవరికీ కలుగకుండుగాక! రాముడు నాకు తండ్రి. అడవిలో వసించే రాముని అయోధ్యకు తీసుకరావాలని వెళ్తున్నాను. రామునియందు భక్తిశ్రద్ధలు కల్గిన నా పరివారమంతా రామదర్శనానికి నా ప్రమేయం లేకుండా వారంతట వారే బయలుదేరి వచ్చారు.

"గుహుడా! మరోవిధంగా భావించకు. నేను సత్యమే చెప్తున్నాను. రాముని స్నేహితుడవైన నీవు నాకు రామునితో సమానము" అని పలికాడు భరతుడు.

భరతుని మాటలను ఆలకించి గుహుడు సంతోషపడ్డాడు.

"రాజకుమారా! నీతో సమానులు ఈప్రపంచంలో లేరు. కష్టాలలో వున్న రామచంద్రుని తీసుకొని రావాలని వెళ్తున్నావు. ఈ ప్రయత్నం నీకు అసమాన కీర్తిని తెచ్చిపెడుతుంది.

**ధన్యస్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీ తలే**
**అయత్నా దాగతం రాజ్యం యస్త్వం త్యక్తు మిహేచ్ఛసి.**

"ప్రయత్నం లేకుండా ప్రాప్తించిన రాజ్యాన్ని త్యజించాలని సంకల్పించావు. నీలాంటి వ్యక్తి నాకీలోకంలో మరొకడు కనిపించడం లేదు" అన్నాడు గుహుడు.

సూర్యుడు అస్తమించాడు. భరతుడు, శత్రుఘ్నుడు విశ్రమించారు. భరతుని హృదయము తీవ్రంగా పరితపించింది. సూర్యుని కిరణములచే వేడెక్కిన మంచుకొండ నుండి మంచు కారునట్లు, దుఃఖాగ్నిచే కుమిలిపోయిన భరతుని హృదయము కన్నీటిని వర్షింపచేసింది.

భరతునికి మనశ్శాంతి లోపించింది. గుహుని సమీపించి దుఃఖించాడు. గుహుడు భరతుని ఓదార్చాడు. లక్ష్మణుని భ్రాతృభక్తిని గూర్చి భరతునికి వివరించాడు గుహుడు.

**ఆచచక్షే ఽథ సద్భావం లక్ష్మణస్య మహాత్మనః**

**భరతా యాప్రమేయాయ గుహో గహన గోచరః**

అథ=అనంతరము,గహనగోచరః=వనవాసియైన, గుహః=గుహుడు, అప్రమేయాయ= అప్రమేయుడగు, భరతాయ=భరతునకు, మహాత్మనః=మహాత్ముడైన, లక్ష్మణస్య= లక్ష్మణునియొక్క, సద్భావం=సద్భావమును, ఆచచక్షే=చెప్పెను.

"ఆ తరువాత, అరణ్యంలో వసించే గుహుడు అప్రమేయుడగు భరతునకు మహాత్ముడైన లక్ష్మణుని సద్భావమునుగూర్చి చెప్పాడు," అన్నాడు వాల్మీకిమహర్షి.

ఈ శ్లోకాన్ని గుహ్యమైన ఆధ్యాత్మిక సందేశముతో నింపి మనకు అందించాడు వాల్మీకి మహర్షి. ఈశ్లోకంలో ఆదికవి వాడిన పదాలను మనం జాగ్రత్తగా పరిశీలించి, విశ్లేషించి అర్థం చేసుకోవాలి.

లక్ష్మణుని సద్గుణాలను గూర్చి గుహుడు భరతునికి బోధిస్తున్నాడు. ఈ సందర్భమున నిషాదపతియైన గుహుని గహనగోచరుడు అని సంబోధించాడు వాల్మీకి. గహనగోచరుడు అంటే అరణ్యములో వసించేవాడు అని భావము.

గుహుడు లక్ష్మణుని గూర్చి ఎవరికైతే చెప్తున్నాడో అట్టి భరతుని అప్రమేయుడుగా వర్ణించాడు. అప్రమేయుడంటే ఊహింప శక్యముగాని గుణసంపన్నుడని భావము.

భరతునికి ఎవరినిగూర్చి గుహుడు బోధిస్తున్నాడో అట్టి లక్ష్మణుని మహాత్ముడని కీర్తించాడు వాల్మీకి. గొప్ప వైభవము గలవానిని మహాత్మ డంటాము.

ఇప్పుడు ఆలోచించండి.

1. అరణ్యంలో సంచరించేవాడు వక్త 2. అప్రమేయుడు శ్రోత 3. విషయమేమో మహాత్ముని గుణానుకీర్తనము.

ఎంత విచిత్రం ఈ సత్సంగము? అవును.సత్సంగ వైభవము ఇలా ఉండాలని మనకు తెలియచేసేందుకే వాల్మీకి ఈ శ్లోకాన్ని రమణీయంగా రచించారు.

రామాయణంలో ఇక్కడనుండి మనం అరణ్యంలో ఎందరో మహాత్ములను దర్శిస్తాం. వారితో సత్సంగమును సాగిస్తాం. ఆ సత్సంగ మహాసౌధంలో ప్రవేశించి, వైభవోపేతమైన దివ్యానుభవాలను దర్శించబోయే ముందు అర్హతను సంపాదించి, ప్రవేశమును సుగమం చేసుకోవడమే ఈ శ్లోకంలోని భావార్థము.

గుహుడు లక్ష్మణుని గూర్చి భరతునికి చెప్పడం విడ్డూరమే. విచిత్రమే. గుహునికి లక్ష్మణునితో పరిచయము కొన్ని గంటలే. భరతుడు చిన్నతనము నుండి లక్ష్మణునితో కలిసి జీవించినవాడు.



గుహుడు గహనగోచరుడు అంటున్నాడు వాల్మీకి. అంటే అరణ్యములో సంచరించే వాడని అర్థము. అలాంటి గుహునికి జంతు స్వభావము తెలియడం తేలికే. పల్లెప్రజల మనోభావాలను గుర్తించడం సులభమే. కానీ లక్ష్మణుడులాంటి వ్యక్తిని అర్థం చేసుకోవడము సాధారణమైన విషయం కాదు.

సరే. పాత్రకొద్దీ నీరన్నట్లు తనకు తోచినట్లుగా అర్థం చేసుకున్నాడనే భావిస్తాం. తనకు తెలిసిన విషయాన్ని తనకన్నా తక్కువవారికి చెప్పాలి. లక్ష్మణునితో ఆమాత్రం పరిచయం కూడా లేనివారికి చెప్పాలి. అంతేకాని అప్రమేయుడైన భరతునికి కాదు. మరి గుహుడు ఎందుకు చెప్పాడు?

అదే విచిత్రం. చెప్పకుండా ఉండలేడు. తృప్తిగా మృష్టాన్నములను భోంచేసినవాడు త్రేపకుండా ఉండగలడా! ఇదీ అంతే. భగవంతునియొక్క, భక్తులయొక్క దివ్య వైభవములను గ్రహించినవాడు ఇతరులకు చెప్పకుండా ఉండలేడు.

చెప్పేవ్యక్తి తాను అల్పజ్ఞుడనని భావించడు. తాను చిన్నవాడైనా తాను చెప్పే విషయం గొప్పది అని భావిస్తాడు. విషయం విశిష్టమైనది అయినపుడు ఉత్సాహంతో, ప్రియంగా బోధించే అనురక్తి వక్త కుండాలి. గుహుని విషయంలో మనం ఇక్కడ అదే చూస్తున్నాము.

భగవంతుని వైభవమును, మహాత్ముల వైభవమును కీర్తించుట ద్వారా ప్రతివ్యక్తి తన జన్మను చరితార్థం చేసుకోవాలి. ఎన్నో అసత్యాలను, అసభ్యాలను పలికి పాడైపోయి వున్న నాలుకను గుణానుకీర్తనము ద్వారా పవిత్రం చేసుకోవాలి.

**నగుబాట్లబడే - ని జిహ్వ**

**పగటున నిదివో - పావనమాయె ॥నగు॥**

**ఇలనందర నుతి యించి పెంచువలె**

**నలినలియైనది నా జిహ్వ**

**నలినోదరు శ్రీ నామము దలచిన**

**ఫలమున కిదివో పావనమాయె ॥నగు॥**

"నా నాలుక నగుబాట్లకు గురైంది. నవ్వులపాలైన నా నాలుక ఈనాడు సంకీర్తనవల్ల పావనమైంది.

ప్రపంచంలో ఎవరెవరినో పొగిడి పొగిడి నా నాలుక పాడైపోయింది. పద్మనాభుని పవిత్రనామమును స్మరించి నా నాలుక పవిత్రమైంది" అంటారు అన్నమాచార్యులు.

ఇక శ్రోతవిషయం. శ్రోత సర్వశాస్త్ర పారంగతుడైన భరతుడు. శ్రోత ఎలా ఉండాలి? అనేది ఈ సందర్భమున భరతుని పాత్ర ద్వారా మనకు అవగత మవుతూవుంది.

చెప్పే గుహుడు తనతో పోల్చుకుంటే జ్ఞానంలో అల్పమైనవాడు. విషయప్రధానంగా చూసినా తనకున్న అనుభవం లేనివాడు. అలాంటివాడు చెప్పేది తాను వినడమేమిటి? అనే భావం భరతునికి కలగలేదు. ఎంతో ఆసక్తితో విన్నాడు.

భగవంతుని విషయము నందు, మహాత్ముల విషయము నందు శ్రద్ధాభక్తులు కలవాడు ఎవరు చెప్పినా శ్రద్ధతో వింటాడు. అంతేగాని అతనెవరు? అతనికేమి తెలుసు? అతను ఎలాంటివాడు? అని ఆలోచించుకొని తనను తాను సంకుచితం చేసుకోలేదు.

ఆకలి ఉండాలేగాని ఎవరు పెట్టినా తింటారు. ఆకలితో ప్రాణం పోయేవాడికి ఆహారం అవసరమేగాని ఈ ఆహారాన్ని ఎవరు పెట్టారు? ఆహారం విలువైనదా? కాదా! అనే యోచనే ఉండదు. తినడమే ముఖ్యంగా భావిస్తాడు.

భగవ ద్గుణానుకీర్తనము నందు, సంత్ మహాత్ముల వైభవమునందు పూర్ణవిశ్వాసము కలిగిన శ్రోత ఇలా ఉండాలి అనే ఆదర్శాన్ని అందించింది భరతుని పాత్ర.

గుహుడు లక్ష్మణుని గూర్చి భరతునితో చెప్తున్నాడు.

"సీతారాముల సేవలో లక్ష్మణుడు రాత్రంతా మేలుకొనే ఉండినాడు. "లక్ష్మణా! నీవు విశ్రాంతి తీసుకో. రాముని రక్షించుటకు మేమంతా మేల్కొని ఉంటాము. మాకు రామునికంటె ప్రియమైనవాడు లేడు," అని మేము ఎంత చెప్పినా లక్ష్మణుడు వినలేదు సరిగదా, మాతో ఇలా పలికాడు.

"గుహుడా! సీతారాములు నేలపై పడుకొని ఉన్నారు. నేనెలా నిద్రపోగలను? గుహుడా! రాముడు మా తండ్రిగారికి ప్రాణతుల్యుడు. రాముడు వనాలకు వెళ్ళిన తరువాత దశరథుడు పుత్రశోకముతో జీవించలేడు. అయోధ్య అనాథ అవుతుంది.

"రాజుతోపాటు కౌసల్య, సుమిత్రలు కూడా జీవించరని నా అభిప్రాయము. శత్రుఘ్నుని చూసుకొని మా తల్లి సుమిత్ర బ్రతకగలదేమో కానీ కౌసల్య మాత్రం బ్రతకదు. మా తండ్రిగారికి అంతిమ సంస్కారాలు చేసే భరతశత్రుఘ్నులు ధన్యులు.

"గుహుడా! ఈ పద్నాలుగు సంవత్సరాలు మేము సుఖంగా వనవాసమును పూర్తిచేసుకొని అయోధ్యకు చేరగలమంటావా?" ఈవిధంగా లక్ష్మణుడు రాత్రంతా బాధపడుతూనే ఉండినాడు.

"మరునాడు ఉదయం వారిద్దరు మఱ్ఱిపాలతో జడలు కట్టించుకున్నారు. నేను వారిని సుఖంగా నది దాటించాను. సీతాసమేతంగా రామలక్ష్మణులు అరణ్యములో ప్రవేశించి వెళ్ళిపోయారు" అన్నాడు గుహుడు.

గుహుని మాటలు విన్న భరతుడు స్పృహతప్పి పడిపోయాడు. ఆవిధంగా నేలపైబడిన భరతుని లేవదీసి, కౌగిలించుకొని పసిబిడ్డలా దుఃఖించాడు శత్రుఘ్నుడు.

ఈ ఆర్తనాదాలు ఆలకించి రాణులు పరుగెత్తుకుంటూ భయపడుతూ వచ్చారు. వారుకూడా విలపిస్తూ నేలపై బడ్డారు. కౌసల్య దుఃఖిస్తూ భరతుని ఆలింగనం చేసుకుంది. ఏడుస్తూ కౌసల్య ఇలా పలికింది.

"నాయనా! భరతా! నీ ఆరోగ్యంలో మార్పులేదుగదా! కుమారా! మన రాజవంశము యొక్క బ్రతుకంతా నీ మీదనే ఆధారపడి ఉంది. రాజును పోగొట్టుకొని రామునికి దూరమైన మేము నిన్ను చూసుకొనే బ్రతుకుతున్నాము.

"పుత్రా! నీ దుఃఖానికి ప్రత్యేకమైన కారణ మేదైనా ఉందా? లక్ష్మణుని గూర్చిగాని, సీతారాముల్ని గూర్చిగాని అప్రియమైన వార్తను నీవు వినలేదు కదా!" అని కౌసల్య దుఃఖించింది. భరతుడు కాదని తలఊపి, తల్లిని ఓదార్చి, అక్కడేవున్న గుహునితో ఇలా పలికాడు.



"గుహుడా! ఆ రాత్రి మా అన్న రాముడు ఎక్కడ నివసించాడు? సీత ఎక్కడ నివసించింది? లక్ష్మణుడు ఎక్కడ వసించాడు? వారు ఏమి ఆరగించారు? ఏ పడకపై పవ్వళించారు? నాకు అంతా చెప్పు" అని ఆత్రుతగా అడిగాడు భరతుడు.

గుహుడు భరతునితో "రాజకుమారా! నేను వివిధములైన భోజనములను, ఫలములను రాముని కొరకు తీసుకొని వచ్చాను. రాముడు వాటిని స్వీకరించలేదు. లక్ష్మణుడు తీసికొనివచ్చిన పవిత్రజలాన్ని పానంచేసి ఆరోజు ఉపవసించారు. సీతారాములు పానంచేయగా మిగిలిన పవిత్రోదకాన్ని లక్ష్మణుడు పానంచేశాడు.

"లక్ష్మణుడు వారికి శయనాన్ని ఏర్పాటుచేసి, వారి పాదములు కడిగి దూరంగా వెళ్ళి నిలబడ్డాడు.

"ఇదిగో....ఈ వృక్షము క్రిందే సీతారాములు శయనించారు. ఇదే ఆ తృణశయనము. లక్ష్మణుడు రాత్రంతా ధనుర్బాణములు ధరించి వారిని రక్షించాడు;" అన్నాడు భరతుడు.

గుహుని మాటలను ఆలకించిన భరతుడు రాముడు శయనించిన ప్రదేశమును చేరాడు. చెట్టుకు ప్రదక్షిణము చేసి నమస్కరించాడు. భరతుడు దుఃఖిస్తూ తల్లులతో ఇలా పలికాడు.

"అమ్మా! ఇదిగో. రాముడు శయనించింది ఇక్కడే. ఆహా! దశరథపుత్రుడైన రాముడు నేలపై పండుకొనుటయా! ఈ నేలపై సుకుమారుడైన రాముడు ఎలా నిద్రించాడో? రామునికి ఈ పరిస్థితి ప్రాప్తించింది అంటే నమ్మశక్యంగాలేదు. ఇదంతా కలలాగా అనిపిస్తోంది.

**న నూనం దైవతం కించిత్ కాలేన బలవత్తరమ్**

"కాలము దైవముకంటే బలమైనదిగా తెలుస్తూవుంది.

"జనకుని పుత్రిక సీతమ్మ నేలపై శయనించుటయా? ఈ శయనము నందు దర్భలకు పట్టుదారాలు తగుల్కొని ఉన్నాయి. సీతమ్మ కొంగు బహుశ వీటికి తగుల్కొని ఉండాలి. భర్త సన్నిధిలో బాధలన్నీ ఆమెకు సుఖాలుగానే మారిపోయాయి.

"రామునికెంత కష్టము వచ్చింది? ఇదంతా నా మూలంగానే జరిగింది. నా కారణంగా రాముడు అనాథు డయ్యాడు. నేలపై పడుకొని బ్రతుకుతున్నాడు. రాముని అనుసరిస్తూ, రామసేవలో తృప్తి చెందుతున్న లక్ష్మణుడు ఎంత భాగ్యవంతుడు? సీత ఎంత కృతార్థురాలు?

"నేటినుండి నేనుకూడా జడలు ధరించి, కందమూలాలు, ఫలాలు భక్షించి జీవిస్తాను. రామునికి బదులుగా నేను అరణ్యంలో జీవిస్తాను. శత్రుఘ్నుడు నాకు తోడుగా ఉంటాడు. రాముడు లక్ష్మణుని సేవలను అందుకుంటూ అయోధ్యను పరిపాలిస్తాడు;" ఇలా బాధపడిన భరతుడు ఆరాత్రి గంగాతీరమునందే వసించాడు.

భరతుడు ఉషఃకాలమున నిద్రలేచి, "శత్రుఘ్నా! ఇంకా నిద్రిస్తున్నావేమి? మనం గంగానదిని దాటాలి. నిషాదరాజైన గుహుని తీసికొనిరా!" అన్నాడు.

"అన్నా! నేను నిద్రించడం లేదు. పూజ్యుడైన మన అన్నగారు రాముని ధ్యానిస్తున్నాను;" అని పలికాడు శత్రుఘ్నుడు. భరతశత్రుఘ్నులు ఇలా ముచ్చటించుకొను చుండగా గుహుడు ప్రవేశించాడు. భరతశత్రుఘ్నులకు నమస్కరించాడు. కుశల మడిగాడు.

తొందరగా నదిని దాటించే ఏర్పాట్లు చూడమని భరతుడు గుహునికి చెప్పాడు. గుహుడు పల్లెజనమును పిలిపించాడు. ఐదువందల నౌకలను సిద్దపరచాడు. తెల్లని తెరచాప కలిగిన స్వస్తికము అనే నావను భరతుని కొరకు గుహుడు తీసుకొని వచ్చాడు.

భరతుడు, శత్రుఘ్నుడు, వసిష్ఠుడు, పూజ్యులైన ద్విజులు, కౌసల్య, సుమిత్ర, కైకేయి, కొందరు అంతఃపుర స్త్రీలుకూడా స్వస్తికమును ఎక్కారు. మిగిలిన నావలలో పరివారమంతా ఎక్కారు.

కొన్ని నావలలో స్త్రీలు ఎక్కారు. కొన్ని నావలపై రథములను ఎక్కించారు. కొన్నిటిపై గుఱ్ఱాలను ఎక్కించారు. నావలు నడుస్తూవుంటే పల్లెవారు నావలు నడుపుతూ కొన్ని ప్రత్యేక విన్యాసాలు కూడా చేశారు. నావ లెక్కే సమయంలో గంగాతీరాన వినిపించిన కోలాహలాన్ని వాల్మీకి వర్ణించిన తీరును పరిశీలిస్తే ఈరోజులలో నదీపుష్కరాల సమయంలో జరిగే కోలాహలం స్మృతికి వస్తుంది.

నావలు తీరము చేరాయి. అక్కడనుండి భరతాదులు భరద్వాజాశ్రమానికి ప్రయాణ మయ్యారు.

## భరద్వాజాశ్రమంలో భరతుడు

భరద్వాజాశ్రమము కోసు దూరంలో ఉందనగా ధర్మజ్ఞుడైన భరతుడు తన పరివారాన్నంతా అక్కడే నిలిపి, ఆయుధాలను విసర్జించి, పట్టుబట్టలు ధరించి, వసిష్ఠుని ముందుంచుకొని ఆశ్రమానికి నడచివెళ్ళాడు.

ఆశ్రమమును సమీపించగనే మంత్రులను కూడా దూరంగా ఉంచి, వసిష్ఠుని వెనుక తానొక్కడే నడిచి వెళ్ళాడు. వసిష్ఠుని చూడగనే భరద్వాజుడు ఆసనమునుండి లేచి అర్ఘ్యము సమర్పించాడు.

భరతుడు భరద్వాజునికి నమస్కరించాడు. అతడు దశరథమహారాజు కుమారుడు భరతుడని భరద్వాజుడు గ్రహించాడు. అయోధ్యలో సైన్యము, ప్రజలు, మిత్రులు అందరిని కుశల మడిగాడు భరద్వాజుడు. దశరథుని మరణవార్త ముందే తెలిసినట్లున్నది. అందువల్ల దశరథుని కుశల మడగలేదు. భరతుని భరద్వాజుడు ఇలా ప్రశ్నించాడు.

"భరతా! రాజ్యమును పాలిస్తున్న నీవు ఇలా ఎందుకు వచ్చావు? నాకు పూర్తిగాచెప్పు. నా మనసు ఎందుకో శంకిస్తున్నది. నీ తండ్రి ఆజ్ఞచే రాముడు వనవాసం చేస్తున్నాడు. ఆటంకాలు, అడ్డంకులు లేని రాజ్యాన్ని అనుభవించాలనే అభిలాషతో నీవు రామునికి కీడుచేయాలని తలపెట్టడం లేదుకదా?" అన్నాడు.

"మహాత్మా! పూజ్యులైన మీరుకూడా అలా మాట్లాడుతున్నారా? ఇక నేను మరణించడము ఒక్కటే మార్గము. నాకు ఏ పాపము తెలియదు. నాలో ఏ దోషములేదు. దయచేసి మీరలా అనకండి.

"నేను లేనపుడు నా తల్లి ఇదంతాచేసింది. ఆమె చేసిందానిని నేను సమ్మతించడం లేదు. రాముని చరణకమలములను పట్టుకొని తిరిగి రాముని అయోధ్యకు తీసికొనివెళ్ళి రాజ్యాన్ని అప్పగించాలని నేను వచ్చాను.



"మహాత్మా! నా మనసును చూసి నన్ను అనుగ్రహించి ఆశీర్వదించండి. రాజైన రాముడు ఇపుడెక్క డున్నాడో దయచేసి చెప్పండి," అని కన్నీరు కార్చాడు భరతుడు.

భరద్వాజుడు భరతునితో ఇలా పలికాడు. "నాయనా! గురుభక్తి ఇంద్రియనిగ్రహము, మహాత్ములను అనుసరించి జీవించుట అనునవి రఘుకులానికి అలంకారాలు. నీవు వాటితోనే శోభిస్తున్నావు. చాలా సంతోషము.

"భరతా! నీ మనసు నాకు తెలుసు. అయినా దానిని ధృవపరచుకొనుటకు అడిగాను. నీ వైభవాన్ని ఇనుమడింప చేయాలని అడిగాను. రాముడు ప్రస్తుతం చిత్రకూటపర్వతము నందు వసిస్తున్నాడు. భరతా! నీవు అక్కడికి రేపు వెళ్ళవచ్చు. ఈరోజు మా ఆశ్రమంలోనే ఉండు. నా కోర్కెను తీర్చు" అన్నాడు భరద్వాజుడు. భరతుడు సమ్మతించాడు.

అయోధ్యను వదలి కానలకు కదలివచ్చినా భరతునికి కష్టాలు తప్పడంలేదు. కన్నీళ్ళు ఆగడంలేదు. చేయని దోషానికి అందరూ అనుమానిస్తున్నారు. గుహుడు కన్పించగానే ప్రత్యక్షంగా తన అనుమానాన్ని భరతునికి తెలిపాడు.

గుహుడు ఎలా సందేహించాడో భరద్వాజుడు కూడా అలాగే సందేహించాడు. అందరికీ తనమీద సందేహమే. పండితపామరులనే భేదం లేకుండా అందరూ తనను అనుమానిస్తూనే ఉన్నారు.

గుహుడు అనుమానించినపుడు భరతుడు దుఃఖపడలేదు. ఆకాశంలాగా నిర్మలంగా ఉండినాడు. కానీ భరద్వాజుడు ప్రశ్నించగనే దుఃఖాన్ని ఆపుకోలేక విలపించాడు భరతుడు. పల్లెరాజు గుహుడు అడగడం వేరు. ప్రజ్ఞానిధి అయిన భరద్వాజుడు ప్రశ్నించడం వేరు.

దీనినిబట్టి మనమొక విషయం అర్థం చేసుకోవచ్చు. భరతుని అందరూ ఎందుకు అనుమానిస్తున్నా రంటే అందరికీ రాముడు కావాలి. రాముడికి ఏ చిన్న కష్టమొచ్చినా జనులు భరించేలాలేరు. జీవించేలాలేరు. అందుచేత భరతునికి అపవాదులు తప్పడంలేదు.

"భరతా! నీ సైన్యాన్నంతా దూరంగా ఉంచి వచ్చావేమి? వారిని కూడా రప్పించు. అందరికీ విందు నివ్వాలని నేను సంకల్పించాను" అన్నాడు భరద్వాజుడు.

భరతుడు చేతులు జోడించి నమస్కరిస్తూ ఇలా పలికాడు.

"మహాత్మా! మీకు భయపడి అలా దూరంగా ఉంచి వచ్చాను. మహాత్ములను దర్శించడానికి వెళ్ళునపుడు నియమాలను, సమయాలను పాటించాలిగదా!

రాజ్ఞా చ భగవన్నిత్యం రాజపుత్రేణ వా సదా
యత్నతః పరిహర్తవ్యా విషయేషు తపస్వినః

"తమదేశంలో వుండే మహర్షుల దగ్గరకు వెళ్ళేటప్పుడు రాజుగాని, రాజకుమారులు గాని సైన్యంతో వెళ్ళకూడదని నియమం కదా!" అన్నాడు భరతుడు.

పూర్వము మహర్షుల విషయంలో చక్రవర్తులు కూడా అలా ప్రవర్తించేవారు. భరతుడు ధనుర్బాణాలను కూడా విసర్జించి భరద్వాజుని వద్దకు వచ్చాడు. దశరథమహారాజు కుమారుడు మహాత్ముల విషయంలో అలా ప్రవర్తించాడు.

ఈనాడు అంతా తారుమారే కదూ? ఆశ్రమాలంటే గౌరవం లేదు. మహాత్ములంటే భక్తి లేదు. ఆనాటి చక్రవర్తుల సౌజన్యానికి ఈనాటి వక్రవర్తుల దౌర్జన్యానికి పొంతన ఎక్కడ చింతనకు అందడంలేదు.

సైన్యాన్ని, పరివారాన్ని రప్పించమని భరద్వాజుడు భరతునికి చెప్పాడు. భరతుడు అందరినీ ఆశ్రమానికి పిలిపించాడు.

భరద్వాజుడు ముందుగా అగ్నిశాలలో ప్రవేశించి, ఆచమనంచేసి, విశ్వకర్మను, ఇంద్రుని, యముని, వరుణుని, కుబేరాదులను ఆహ్వానించాడు. భరతునికి తాను ఇవ్వదలచిన ఆతిథ్యానికి ఏర్పాట్లు చేయవలసిందిగా వారిని కోరాడు. అనేకమంది దేవతలు కలిసి నిర్వహించిన విందు ఏర్పాట్లు, వసతులు, భోజనాలు, విహారాదులు ఎక్కడా కని, విని, ఎరుగని రీతిలో జరిగినట్లు వాల్మీకి వర్ణించాడు. పసందైన ఆ విందు విషయాన్ని వివరించుటకు ఎనభైనాలుగు శ్లోకాలు గల ఒక సర్గనే కేటాయించాడు వాల్మీకిమహర్షి.

భరద్వాజుడు గొప్ప తపస్వి. మహా యశస్వి. ఆయన చేయలేని దేముంటుంది? నేను మాత్రం ఈ భరద్వాజ విందు అనే శీర్షికను విడిచిపెట్టి కథలో ముందుకు సాగిపోతున్నాను. మీరు మా ఆశ్రమాన్ని సందర్శించినపుడు ఇలాంటి విందును కోరుతారేమో అనే భయంతో నేను ఆ విషయాన్ని దాటేసి వెళ్తున్నాను.

ఈ అయోధ్యాకాండము ఇంతవరకు బరువైన బాధతో సాగింది. ఇక రాబోయే సర్గలలో కూడా మోయలేనంత హృదయబాధ నిక్షిప్తం చేయబడి ఉంది. మధ్యలో ఈ భరద్వాజ విందు అనే వినోదాన్ని హాస్యోక్తికంగా ప్రవేశపెట్టి మనసులను తేలికపరుస్తారు వాల్మీకిమహర్షి. అనేకమైన ఆకర్షణముల మధ్య ఏమాత్రం చెదరకుండా నియమవంతుడై రామునికొరకే నిరీక్షించు భరతుని ఆదర్శాన్ని కూడా చూపిస్తాడు.

భరద్వాజుని ఆతిథ్యమును గ్రహించి ఆరాత్రి అందరూ అక్కడే విశ్రమించారు. తెల్లవారింది. భరద్వాజుడు అగ్నిహోత్రమును పూర్తిచేసుకున్నాడు. భరతుడు భరద్వాజుని సమీపించి, చేతులు జోడించి నమస్కరించి, తాము వెళ్ళుటకు అనుజ్ఞనిస్తూ, ధర్మాత్ముడైన శ్రీరాముడు ఉండే ప్రదేశానికి మార్గమును తెలుపమని ప్రార్థించాడు.

భ్రాతృదర్శన లాలసుడైన భరతుని మాటలు విని సంతృప్తిచెందిన భరద్వాజమహర్షి, "భరతా! ఇక్కడనుండి మూడున్నర యోజనముల దూరాన చిత్రకూటమనే పర్వతముంది. అందమైన ఆ నిర్జనారణ్యము నందు అందమైన సెలయేళ్ళున్నాయి.

"చిత్రకూటపర్వతానికి ఉత్తరదిక్కున మందాకినీ నది ఉంది. ఆ నదికి ఇరువైపుల దట్టమైన అరణ్యాలు పుష్పశోభతో అలరారుతుంటాయి. నదికి అవతలనున్న చిత్రకూట పర్వతముపై ఒక చక్కని పర్ణశాల ఉంది. సీతారామలక్ష్మణులు అక్కడ వసిస్తున్నారు. నాయనా! వెళ్ళి రాముని దర్శించు" అని ఆశీర్వదించాడు భరద్వాజుడు.

దశరథుని రాణులు వచ్చి భరద్వాజునికి నమస్కరించారు. "భరతా! నీ తల్లులను గూర్చి చెప్పు" అని భరద్వాజుడు అడిగాడు. భరతుడు తన తల్లులను భరద్వాజమహర్షికి పరిచయంచేస్తూ



"మహాత్మా! ఉపవాసాలతో, శోకంతో కృశించియున్న ఈ దేవత మా తండ్రిగారి పట్టపురాణి కౌసల్యాదేవి. పురుషశ్రేష్ఠుడైన రాముని కనిన పుణ్యాత్మురాలు ఈమెయే.

"దీనురాలై, కౌసల్యాదేవికి ఎడమవైపు నిలబడియున్న తల్లి సుమిత్ర. వీరులైన లక్ష్మణ శత్రుఘ్నులను కనిన దివ్యమూర్తి.

"ఇదిగో ఈమె .... కోపిష్టి, అవివేకి, అహంకారి, గర్వి, సంపదలయందు దృష్టి గలది, కోమలంగా కనిపిస్తున్న కుటిలాత్మురాలు, మహాపాపి - ఈమే నా తల్లి కైకేయి. రామలక్ష్మణుల వనవాసము ఈమె కటాక్షమే. దశరథమహారాజు ఈమె చలవ వల్లనే దివికి చేరాడు. నాకు సంభవించిన సర్వ దుఃఖాలకు ఈమెయే కారణము;" అని కోడెత్రాచువలె బుసలు కొడుతూ, ఎర్రబారిన కండ్లతో భరతుడు నిట్టూర్పు విడిచాడు.

భరతుని మాటల నాలకించి ప్రజ్ఞానిధియైన భరద్వాజుడు ఇలాపలికాడు.

"భరతా! అంతా మంచికే జరిగింది. రాముని వనవాసము వల్ల దేవతలకు, దానవులకు, ఋషులకు శ్రేయము చేకూరింది.

**రామప్రవ్రాజనం హ్యేతత్ సుఖోదర్కం భవిష్యతి**

"నాయనా! రాముని వనగమనము వల్ల భవిష్యత్తులో ఎంతో సంతోషము కలుగబోతోంది. కైకేయిలో దోషమును చూడకు" అని పలికాడు. ప్రయాణానికి సిద్ధమైన భరతుడు భరద్వాజునికి ప్రణమిల్లాడు. అందరూ ప్రయాణానికి సిద్ధమయ్యారు.

భరతుడు చెప్పినట్లు ఈ దారుణానికంతా కైకేయియే కారణము. కానీ ఆమెలో మార్పు ఉంది. ఆమె మనసు మారింది. చేసిన తప్పిదాన్ని గుర్తించింది. లేనిచో రాముని అయోధ్యకు తీసికొని పోవడానికి భరతునితో కలిసి ఎందుకు వస్తుంది? కౌసల్యాసుమిత్రలు ఎక్కిన వాహనంలోనే ఎక్కి వచ్చింది కూడా.

కైకేయిలోని మార్పు సహజంగా తెలుస్తూ వుంది. కానీ భరతునిలో ఆమెపైనున్న కోపం తగ్గలేదు. పగిలిపోయిన అతని కోమలహృదయం ఇంకా అతుకు పడలేదు.

గాయం చేయడం తేలికే. చేసినవారు పశ్చాత్తాపపడితే తొందరగా తేరుకుంటారు. గాయపడ్డవారు మామూలు స్థితికి రావడానికి సమయం పడుతుంది. గాయం మానాలికదూ!

కొందరు ద్వంద్వమనస్తత్వంతో పైకి క్రోధం పోయినట్లు నటించి ఆంతర్యంలో క్రోధాన్ని నిక్షిప్తం చేసుకొని ఉంటారు. భరతునికి అలాంటివి తెలియదు. లోపలున్నదే బహిర్గతం చేస్తున్నాడు.

అయోధ్యలో కైకేయిని ప్రత్యక్షంగా నిందించాడు. కౌసల్యముందు నిందించాడు. వసిష్ఠుని ముందు సభలో నిందించాడు. ఇపుడు భరద్వాజుని ముందు నిందించాడు. కొందరికి భరతుడు సరళ స్వభావుడుగా కన్పించక పోవచ్చు. అనిపించక పోవచ్చు. ఏం చేద్దాం? నిప్పు ఇంకా ఆరలేదు. పొగ రాకుండా ఎలా ఉంటుంది? ఆ మహాత్మునిపై పడిన అపవాదు సామాన్యమైనదా? గాయం తగిలిన వారికి కలిగిన బాధ ఎలాంటిదో అలాంటి గాయం తగిలిన మరొకరికి మాత్రమే తెలుస్తుంది. తల్లిని పెద్దల ముందు నిందించినాడని భరతుని అవిధేయునిగా గుర్తించడములో నేను ఏకీభవించలేను.

ప్రయాణానికి అనుకూలమైన వాహనాలు బయలుదేరాయి. కొందరు కాలినడకన పయన మయ్యారు. వర్షాకాలమున గర్జించు మేఘాలవలె ఆడ ఏనుగులు ధ్వని చేస్తూ బయలుదేరాయి. రాణులందరూ వాహనము లెక్కారు. భరతుడు పల్లకిని ఎక్కాడు. నదులను, పర్వతాలను దాటుతూ ప్రయాణం చేశారు.

## వన సౌందర్యము

భరతుని అపార సైన్యము వనములో ప్రవేశించింది. ఈ సైన్యమును చూసి మృగసమూహాలు గుంపులు గుంపులుగా బయలుదేరి భయంతో పరుగిడసాగాయి.

ఎలుగుబంట్లు, అందమైన మచ్చలుగల లేళ్ళు, పెద్దపెద్ద కొమ్ములుగల దుప్పులు, పర్వతాలమీద, నదీతీరాలలో అందముగా పరుగులిడసాగాయి.

భరతుని సైన్యము సముద్రమువలె గోచరిస్తూ, వర్షఋతువు నందు మేఘాలు ఆకాశాన్ని కప్పివేయునట్లు భూమిని కప్పివేసింది. ఏనుగులు, గుఱ్ఱాలు విశేషంగా ఉండుటచేత చాలాసేపు భూమికూడా కనిపించలేదు.

భరతుడు వసిష్ఠునితో, "మహాత్మా! కనిపించే ఈ ప్రదేశములను చూడగా భరద్వాజమహర్షి చెప్పిన చోటికి వచ్చినామని నాకు అనిపిస్తూ వుంది. అదిగో.... అదియే చిత్రకూట పర్వతము. ఇదిగో.... ఇదే మందాకినీనది. అల్లదిగో... ఆ వనము నీలమేఘంలాగా శోభిస్తూ వుంది. మహర్షి చెప్పిన రమ్యమైన ప్రదేశము ఇదే. ఈ ప్రదేశము ఎంత రమణీయంగా ఉంది! పర్వతాలవలె ప్రకాశించు మన ఏనుగులు అందమైన ఈ గిరిచరియలలో నడుస్తూవుంటే ఎంతో శోభాయమానంగా వుంది. వర్షాకాలమున దట్టమైన మేఘాలు నీటిని వర్షించునట్లు దట్టంగా ఈ పర్వతములపై ఉన్న వృక్షాలు సుమవృష్టిని కురిపిస్తున్నాయి.

"శత్రుఘ్నా! సముద్రము మొసళ్ళచే నిండి యున్నట్లు ఈ సుందర వనప్రదేశము మృగములచే పరివ్యాప్తమై ఉంది. మన సైన్యముయొక్క ధ్వని నాలకించి భయంతో పరుగులిడే ఈ మృగసమూహాలు శరదృతువు నందు ఆకాశమున వాయువుచే చెదరగొట్టబడిన మేఘములవలె ప్రకాశిస్తున్నాయి.

"అటుచూడు. గుఱ్ఱపు డెక్కలచే పైకి లేచిన దుమ్ము అరణ్యాన్ని కప్పివేస్తూ వుండగా, గాలి మనకు మేలు చేయునట్లు ఆ దుమ్మును దూరంగా తీసుకొని పోతోంది.

"శత్రుఘ్నా! ఈవైపు చూడు. వేగముగా పరుగిడుతున్న మన రథములను చూసి అందమైన నెమళ్ళు, పక్షులు భయపడి పరిగెత్తుతూ ఉన్నాయి.

"ఇది చాలా అందమైన ప్రదేశము. ఎంతో మనోహరంగా ఉంది. స్వర్గమునకు దారియా! అన్నట్లు శోభిస్తున్న ఈ ప్రదేశము తప్పక ఋషుల నివాసస్థానమే అయిఉంటుంది;" అని పలికి సైనికులను అరణ్యమున ప్రవేశించి రామలక్ష్మణులను అన్వేషించమని ఆజ్ఞ ఇచ్చాడు భరతుడు.

భరతుని ఆజ్ఞను పాటిస్తూ సైనికులు ఆయుధములను ధరించి అరణ్యములో ప్రవేశించారు. అక్కడ వారు ఎత్తైన ప్రదేశమున ధూమాగ్రమును చూశారు. వెంటనే తిరిగివచ్చి భరతునితో ఇలా చెప్పారు.



**నా మనుష్యే భవత్యగ్ని ర్వ్యక్త మత్రైవ రాఘవౌ**

"మనుష్యులు లేనిచోట అగ్ని ఉండదు. రామలక్ష్మణులు అక్కడే ఉంటారు. "ఒకవేళ రామలక్ష్మణులు లేకపోయినా మహర్షులు ఉండవచ్చు;" అన్నారు. వారి మాటలు విన్న భరతుడు సంతసించి, అందరినీ అక్కడే నిరీక్షించమని చెప్పి, సుమంత్రుడు, వసిష్ఠునితో కలిసి తాను వెళ్ళుటకు నిర్ణయించుకొని ఉద్యుక్తు డయ్యాడు.

భరతుడు పొగ కనిపించే చోటికి తన దృష్టిని సారించాడు. రాముని దర్శనము త్వరలో లభించ బోతున్నదని సైన్యములోని వారందరూ చాలా సంతోషించారు.

## చిత్రకూటంలో సీతారాములు

రామునికి గిరులన్నా, వనాలన్నా, నదులన్నా ఎంతో ప్రేమ. ప్రకృతి సౌందర్యమును గాంచి రాముడు పరవశించిపోతాడు. రాముడు చిత్రకూట పర్వత శోభను సీతమ్మకు వర్ణించి చెబుతూ తనలోని కళాహృదయాన్ని అభివ్యక్తం చేస్తున్నాడు.

**న రాజ్యభ్రంశనం భద్రే న సుహృద్భిర్వినాభవః**
**మనో మే బాధతే దృష్ట్వా రమణీయ మిమం గిరిమ్**

"సీతా! శుభప్రదా! సుందరమైన ఈ చిత్రకూట పర్వతమును చూస్తుంటే, రాజ్యం పోయింది అనిగాని, మిత్రులు దూరమయ్యారని కాని మనసులో బాధ కలగడంలేదు" అన్నాడు సీతమ్మతో రాముడు.

రాముడు వనవాసం వచ్చి నెలరోజులైంది. సీతను సంతోషపెట్టాలని, ఆమె మనసులో వెలితి చోటుచేసుకోగూడదని భావించిన రాముడు ఆమెకు పర్వతశోభను చూపుతూ వర్ణిస్తున్నాడు. తన సంభాషణతో మనసుకు ఆహ్లాదాన్ని, హాయిని కూర్చుతున్నాడు.

ఇక్కడ సీతమ్మను 'భద్రే' శుభప్రదురాలా! అంటూ సంబోధించాడు. ఈ ప్రపంచంలో శుభమైనది ఏదియో అది చెప్పబోతున్నాడు కనుక ఆమెను 'భద్రే' అని సంబోధించాడు రాముడు. మరి ఈ ప్రపంచంలో శుభప్రదమైనది ఏమిటి?

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః**

ఏ లాభమును పొందిన పిమ్మట అంతకంటెను మించిన ఏ లాభమును గూర్చి చింతింపడో అదియే భద్రమైనది. ఇదియే ఆత్మ అని గీత, ఉపనిషత్తులు నిర్ణయిస్తున్నాయి.

అది చాలా ఎత్తయినది. చెడని అందము గలది కనుక సుందరమైనది. అదియే సుందరమైన, ఎత్తయిన చిత్రకూటము. చిత్రవిచిత్రములైన వృత్తులనెడి అరణ్యమున అతీతముగా గోచరించే ఉన్నతమైన దేదియో అట్టి అజరామరమైన ఆత్మయే చిత్రకూట పర్వతము.

దానిని దర్శించగానే రాజ్యం, మిత్రులవల్ల ఏర్పడే బాధ అదృశ్య మౌతూవుంది అంటున్నాడు రాముడు.

రాజ్యభ్రంశం వల్ల కలిగే దుఃఖం అంటే ప్రపంచములోని వస్తువులను పోగొట్టుకొనుట వలన సంభవించే దుఃఖమని భావము. మిత్రులవలన ఏర్పడే దుఃఖ మనగా, వ్యక్తులతో ఏర్పరచుకొనే సంబంధాలు దూరంకావడంవల్ల ఏర్పడే శోకం అని అర్థము.

సుందరమైన చిత్రకూట పర్వతాన్ని దర్శించిన వారికి రాజ్యభ్రంశం వల్ల, మిత్రులు దూరంకావడం వల్ల ఏర్పడే దుఃఖం దూరమవుతూ వుందన్నాడు రాముడు. చిత్రములైన ఆలోచనలు సాగించే చిత్తమనే అరణ్యములో, చిత్తమునకు అతీతంగా భాసించే స్థిరము, ధ్రువము నైన ఆత్మయనే చిత్రకూట పర్వతాన్ని ఎవరు దర్శిస్తారో వారు సమస్త బాధలనుండి విడిపడుతున్నారు. విశేషమైన లాభమును పొందుతున్నారు.

**ఆత్మలాభా న్న పరం విద్యతే**

"ఆత్మలాభము కన్నా మించిన ఉత్తమమైన లాభము మరొకటి లేదు" అని ఆపస్తంబ ధర్మసూత్రము.

"సీతా! ఈ పర్వతము ఎంత శోభాయుక్తంగా ఉందో చూడు. అది ఒకచోట వెండిలాగా ఉంది. ఒకచోట రక్తంలాగా ఎర్రగా ఉంది. ఆవైపు నీలాలు పరచినట్లుంది. ఈవైపు మంజిష్ఠం రంగుగా తెలుస్తోంది. ఒకచోట పుష్యరాగాలు పరచినట్లు, మరొకచోట ముత్యాలు ఆరబోసినట్లు ఎంత రమణీయంగా ఉందో చూడు.

"ఈ పర్వతముపై సంచరించు మృగాలు, పులులు, భల్లూకాలు క్రూరత్వాన్ని త్యజించి హాయిగా సంచరిస్తున్నాయి;" అన్నాడు రాముడు.

ఎవని సన్నిధిలో ప్రాణులు పరస్పర వైషమ్యాలను పోగొట్టుకుంటున్నాయో అతడినే కదా మహాత్ముడని శాస్త్రములు ఘోషించినవి! **"తత్సన్నిధౌ వైరత్యాగః"** అనికదా యోగదర్శనము. రాముడు అహింస యొక్క వ్యక్తస్వరూపము. రాముని సన్నిధిలో క్రూరమృగాలు కూడా శాంతిని అనుభవిస్తున్నాయి.

"జానకీ! జలపాతాలతో, నీటి ఊటలతో నిండిన ఈ పర్వతం మదజలం స్రవిస్తున్న ఏనుగులా లేదూ? గుహలనుండి కదలి అనేక పుష్పముల సుమసుగంధాలను మోసుకొస్తున్న ఈ వాయువు ఎవరికి హాయినివ్వదు?

"సీతా! నీతో, లక్ష్మణునితో కలిసి ఇక్కడ ఎంతకాలమైనా నేను హాయిగా జీవించగలను. ఈ పర్వతప్రాంతము నాకు ఎంతో హాయిని కల్పిస్తూ వుంది. తండ్రి ఋణమును తీర్చగలిగి నందుకు, సోదరుడైన భరతునికి హాయిని కూర్చినందుకు నేనెంతగానో తృప్తి చెందుతున్నా.

"జానకీ! నీకు ఎలా ఉంది? నీవు హాయిగా ఉన్నావా? వానప్రస్థాశ్రమానికి ఈ ప్రాంతము అమృతం వంటిదని మా పూర్వీకులు భావించేవారు. సీతా! ఈ ప్రదేశమున నేను నియమ బద్ధంగా జీవించి ధర్మజీవన ఫలాన్ని పొందుతాను.

"ఈ చిత్రకూటపర్వతము నాకు ఎంత హాయి నిస్తుందో, అలాగే ఇసుకతిన్నెలతో, రమణీయమైన హంసలతో, సారస పక్షులతో, కమలములతో నిండి గలగలమని ప్రవహించే మందాకినీ నది కూడా నాకు అంత హాయిని ప్రసాదిస్తుంది.

"మందాకినీ నదీతీరము లందు పుష్పవృక్షములు, ఫలవృక్షాలు ఉండుటచేత ఆ నది కుబేరుని సౌగంధిక సరస్సులాగా ప్రకాశిస్తూ ఉంటుంది. చూడు. ఆ రేవులెంత మనోహరంగా ఉన్నాయో!

"సీతా! అక్కడ చూడు. జటలు, కృష్ణాజినము ధరించిన ఋషులు మందాకినీ నదీజలాలలో స్నానంచేస్తూ, చేతులు పైకెత్తి సూర్యనమస్కారాలు చేస్తున్నారు. వాయుచలనానికి పర్వతశిఖరాల మీదనుండి రాలుతున్న పుష్పాలు నర్తకి నాట్యంచేస్తూ శ్రోతలపై పూలు చల్లినట్లులేదూ!



"జానకీ! మందాకినీ నదీజలాలలో పడి తేలియాడుతున్న పుష్పాలపై మధురమైన రవములను వినిపిస్తూ చక్రవాకపక్షులు ఎక్కుతున్నాయి. తపస్సు, ఇంద్రియనిగ్రహము, శాంతిని పొందిన ఋషులు స్నానంచేసే ఈ పవిత్ర మందాకినీ నదీజలాల్లో నాతో కలిసి స్నానం చేస్తావా?

"వైదేహీ! ఈ చిత్రకూట పర్వతమే అయోధ్యగా భావించు. ఈ మందాకినీ నదియే సరయూనది యని ఊహించు. అడవిలోని మృగాలే పౌరులనుకో. ఇక మనకు ఇక్కడ తక్కువ ఏముంది?" ఇలా పలుకుతూ రాముడు చిత్రకూటంపై విహరిస్తున్నాడు.

చరాచరముల యందు నిగూఢమైన సౌందర్యమును దర్శించువానికి నిత్యానందము లభిస్తుంది. చిత్రకూట పర్వతము చలనము లేనిది. మందాకినీ నది చలిస్తూ వుంటుంది. ఈ రెండిటిలోని సౌందర్యమును రాముడు దర్శించి, అనుభవించి, ఆనందించాడు. అంతేకాదు. సీతమ్మకు కూడా ఆ సౌందర్యాన్ని చూపి ఆనందింప చేశాడు.

**నిత్యోఽనిత్యానాం చేతన శ్చేతనానాం**
**ఏకో బహూనాం యో విదధాతి కామాన్ ।**
**త మాత్మస్థం యే అనుపశ్యన్తి ధీరాః**
**తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్ ॥**

"అనిత్యములలో నిత్యుడు, చేతనములలో చేతనుడు ఒక్కడే అయినా అనేకములైన కోర్కెలను తీర్చుతాడు. అట్టి ఆత్మ తమలో కలదని ఏ ధీరులు దర్శిస్తున్నారో వారికే శాశ్వతానందము లభిస్తుంది. ఇతరులకు లభించదు" అని కఠోపనిషత్తు ప్రవచించింది.

రాముడు తనలో ఉన్న సౌందర్యాన్నే చరాచరముల యందు దర్శించి ఆనందిస్తున్నాడు. ఆత్మజ్ఞాని తనలోని సౌందర్యమును బాహ్యంలో నిగూఢమైయున్న సౌందర్యముతో మిళితంచేసి ఆనందిస్తాడు.

తాను ఆనందించడమే గాకుండా ఇతరులుకూడా దర్శించేలా బోధిస్తాడు. రాముడు సీతమ్మ విషయంలో అదే చేశాడు.

తనకు చిత్రకూటంలో తక్కువేమీ లేదంటున్నాడు రాముడు. సత్యదర్శనము చేయు వాడు తానున్నచోటే సర్వమును పొందియున్నాడు. అతనికి కొరత ఏముంటుంది? వెలితి ఎలా ఉద్భవిస్తుంది?

## లక్ష్మణుడి ఆవేశం

చిత్రకూట పర్వత శిఖరముపై కూర్చుని ప్రకృతి వైభవాన్ని, పర్వత సౌందర్యాన్ని, నిర్మల మందాకినీ మనోహర వేగాన్ని సీతకు వర్ణించి చెబుతున్నాడు రాముడు.

"సీతా! ఫలపుష్ప భరితమైన ఆ పెద్ద వృక్షాన్ని చూడు. ఆ వృక్షాన్ని అందమైన లత ఎంత చక్కగా అల్లుకపోయి వుందో! మనోహరమైన ఆ లతను పొందిన ఆ చెట్టు ఎంత అదృష్టం చేసుకుందో?" అన్నాడు రాముడు.

"నాథా! నా భావం మరోవిధంగా వుంది. ఫలపుష్పభరితమైన అంతపెద్ద వృక్షాన్ని ఆలంబనంగా చేసుకొని ప్రాకే భాగ్యానికి నోచుకున్న ఆ లత ఎంత అదృష్టం చేసుకుందో కదా?" అన్నది సీతమ్మతల్లి.

ఈలోగా ఫలపుష్పాదులు తీసుకొని లక్ష్మణుడు వచ్చాడు. రాముడు చెప్పినట్లు చెట్టుది అదృష్టమో! లేక సీతమ్మ చెప్పినట్లు తీగది భాగ్యమో! న్యాయం చెప్పమని లక్ష్మణుని అడిగారు సీతారాములు.

లక్ష్మణుడు అంటాడు, "ఏమో! నా భావం ఇంకోవిధంగా ఉంది. మనోహరమైన ఆ లత మనోజ్ఞంగా అల్లుకపోయిన ఆ మహావృక్షం క్రింద విశ్రమించే బాటసారి భాగ్యమే భాగ్యము" అని.

కోమల హృదయురాలగు లత లాంటి సీతను పొందిన తాను భాగ్యశాలి అని రాముడు భావిస్తాడు. ధర్మవృక్షము వంటి రాముని అండ లభించినందుకు తాను అదృష్టవంతురాలిగా జానకి భావిస్తుంది. సీతారాముల ఆశ్రయం లభించినందుకు తన జన్మ ధన్యమైనదని తనను తాను బాటసారిగా అభివర్ణించుకొని తృప్తిచెందుతాడు లక్ష్మణుడు.

భరతుని సైన్యము చిత్రకూటారణ్యంలో ప్రవేశించింది. లేచిన దుమ్ము ఆకాశము నంటుతున్నది. శబ్దాలు మిన్ను ముట్టుతున్నాయి. భీతిచెందిన గజసమూహాలు అటు ఇటు పరుగెత్తుతున్నాయి. మృగాలు భయంతో పరుగులు తీస్తున్నాయి.

"లక్ష్మణా! మేఘగర్జనము లాంటి ఆ శబ్దం ఏమిటి? లేళ్ళు, ఏనుగులు, సింహాలు అన్ని బెదిరి పరుగెత్తుతూ వున్నాయి. పక్షులు కూడా కలవర పడుతున్నాయి.

"రాజు గాని, లేక అలాంటివాడు గాని ఎవడైనా విహారార్థము అడవిలో ప్రవేశించాడా? లేక ఏదైనా క్రూరమృగము కొత్తగా ప్రవేశించిందా? ఇది ఇలా జరగడం ప్రథమం. త్వరగా తెలుసుకో," అన్నాడు రాముడు.

లక్ష్మణుడు వెంటనే ఒక పెద్ద సాలవృక్షాన్ని ఎక్కాడు. అన్నివైపులా చూశాడు. తూర్పు వైపు చూచి, వెంటనే తలను ఎడమవైపుకు త్రిప్పి ఉత్తరాన్ని వీక్షించాడు. గొప్పదైన చతురంగబలము కదలిరావడం కనిపించింది. ఈ విషయాన్ని రాముడికి చెప్పాడు లక్ష్మణుడు.

"అన్నా! గొప్ప చతురంగబల సేన వస్తూవుంది. అగ్నిని ఆర్పేయి. వదినను పర్వత గుహలోకి పంపేయి. బాణానికి నారిని సంధించు. కవచం ధరించు. శరమును కరమున పట్టుకో;" అని ఆవేశంతో ఊగిపోయాడు సౌమిత్రి.

"లక్ష్మణా! బాగా చూడు. ఇంతకీ ఆ సైన్యము ఎవరిదో చూడవయ్యా!" అని నెమ్మదిగా పలికాడు రాముడు.

లక్ష్మణుడు క్రుద్ధుడయ్యాడు. అగ్నిహోత్రునిలాగా ఆ సైన్యాన్ని కాల్చివేసే వాడిలా గోచరిస్తున్నాడు. పళ్ళు పటపట కొరుకుతూ లక్ష్మణుడు రాముడితో పలికాడు.

"ఇంకెవరి సైన్యము? తల్లి నిర్వాకంద్వారా రాజ్యాభిషుక్తు డయింది చాలక, భవిష్యత్తులో మన ఆటంకం లేకుండా తొలగించుకోవాలని మనల్ని చంపడానికి వస్తున్న అయోధ్యాధిపతి శ్రీ శ్రీ శ్రీ భరతులుంగారు.



"అదిగో కోదారవృక్షము చిహ్నముగా గల ధ్వజము రథముపై కన్పిస్తూ వుంది. దానిని అనుసరించి గుర్రపుసేన వస్తూవుంది. వేలాది ఏనుగులపై గజారోహకులు వస్తున్నారు.

"అన్నా! మనం ధనుర్బాణాలు ధరించి కొండపైకి ఎక్కుతాము. లేదంటే కవచాలు ధరించి, ఆయుధాలు పట్టుకొని ఇక్కడే ఎదుర్కొందాం.

"అన్నా! ఎవడి కారణంగా నీకు రాజ్యలక్ష్మి దూరమైందో, మన ముగ్గురి దుఃఖానికి ఎవడు కారణభూతుడో అట్టి భరతుణ్ణి ఈరోజు చంపేస్తాను. భరతుణ్ణి వధించడం నాకు తప్పుగా తెలియడంలేదు.

**పూర్వాపకారిణం హత్వా న హ్యధర్మేణ యుజ్యతే**

"ముందు అపకారం చేసినవాడ్ని వధించడం అధర్మం కాదు.

"భరతుడు నీకు ముందే అపకారం చేశాడు. ధర్మాన్ని కాలరాచాడు. అతనిని నేను చంపుతాను. నీవు రాజ్యాన్ని పాలించు.

"నాచే వధించబడి, ఏనుగు విరిచేసిన చెట్టులా పడివున్న తన కుమారుని చూసి ఆ కైకేయి కన్నీరు మున్నీరై రోదిస్తుంది.

"నేను అంతటితో ఆగను. ఏడుస్తున్న కైకేయిని కూడా చంపి యమపురికి పంపేస్తాను. పీడ విరగడై పోతుంది. ధరణిపై అలుముకున్న పాపమంతా దగ్ధమై పోతుంది.



"ఇంతకాలము కోపాన్ని విగ్రహించుకున్నాను. ఈరోజు విజృంభిస్తాను. అగ్ని డొంకల్ని తగలేసినట్లు శత్రుసైన్యాన్ని కాల్చేస్తాను. నా తీక్ష్ణమైన బాణాలు శత్రువుల శరీరాల్ని చీల్చేస్తాయి. ఈ అరణ్యమంతా రక్తసిక్త మౌతుంది.

"నేను వధించిన ఏనుగుల్ని, గుఱ్ఱాల్ని, మనుషుల్ని క్రూరమృగాలు ఆనందంగా ఈడ్చుకొని పోతాయి. నెలరోజులుగా మనం ఈ అరణ్యంలో నివసిస్తున్నాం. మనతో ఎంతో ప్రేమతో మెలిగిన ఈ జంతుజాలానికి ఈవిధంగా విందుచేసి తృప్తి చెందుతా.

"భరతుడ్ని వధించేది ఖాయం. నా ధనుర్బాణాల ఋణం తీర్చుకొనేది కూడా తథ్యం. ఈ విషయంలో సందేహం వ్యర్థం. అనర్థం;" అంటూ కోపంతో ఊగిపోయాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని శాంతింపచేస్తూ రాముడు ఇలా పలికాడు.

"లక్ష్మణా! నీవు ఏమి మాట్లాడుతున్నావో నీకు తెలుస్తూఉందా? వీరుడైన భరతుడు ధనుర్బాణాలు ధరించి వస్తూవుంటే, మనకు ధనుర్బాణాల అవసరం ఏముందయ్యా? ధర్మాత్ముడైన భరతుడు మనకు సమీపంలో ఉన్నపుడు కవచాలు ధరించాల్సిన పని ఏముంది నాయనా?

"తమ్ముడూ! తండ్రిమాట నిలబెడతానని అనబూని నేను కానల కొచ్చాను. ప్రేమతో దర్శించడానికి వచ్చిన సోదరుడు భరతుని వధించి, అపకీర్తితో రాజ్యాన్ని పాలించమంటావా?

**యద్ద్రవ్యం బాంధవానాం వా మిత్రాణాం వా క్షయే భవత్**
**నాహం తత్ప్రతి గృహ్ణీయాం భక్షాన్విష కృతానివ!**

"తమ్ముడూ! బంధుమిత్రాదులను చంపడంవల్ల లభించే సంపదను నేను ముట్టను. దానిని విషంకలిపిన ఆహారంగా భావిస్తాను. అట్టిదానిని నేను అంగీకరించను.

"లక్ష్మణా! ధర్మార్థకామాల్ని గాని, రాజ్యాన్ని కాని నేను అభిలషించేది మీకొరకే. నాకొరకు కాదు. మిమ్మల్ని తృప్తిపరచేందుకే నేను సంపదల్ని వాంఛిస్తాను. ఆయుధాలను తాకి మరీ ప్రమాణంచేసి చెప్తున్నాను.

"నేను అభిలషిస్తే సముద్రపర్యంతం గల భూమిని క్షణంలో సంపాదిస్తాను. అధర్మంగా లభించేది దేవేంద్రపదవి అయినా నాకు రుచించదు.

**యద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద**
**భవే న్మమ సుఖం కించి ద్భస్మ తత్కురుతాం శిఖీ !**

"నాయనా! భరతునికి, నీకు, శత్రుఘ్నునికి లభించని సుఖం నాకు లభిస్తే అది తగలబడిపోవుగాక!

"వీరుడా! భరతుడు సోదరులయందు గాఢమైన ప్రేమగలవాడు. నాకు ప్రాణముల కంటెను ప్రియమైనవాడు. భరతుడు అయోధ్యకు రాగానే, మనం అరణ్యాలకు వచ్చినట్లు విని కలతచెంది ఉంటాడు. జ్యేష్ఠపుత్రుడే రాజు కావాలని వాదించి ఉంటాడు. తల్లియైన కైకేయిని నిందించి ఉంటాడు. నాన్నకు నచ్చచెప్పి అన్నకు రాజ్యమివ్వాలని ప్రాధేయపడి ఉంటాడు.

"లక్ష్మణా! మనల్ని చూడాలని ప్రేమనిండిన హృదయంతో ఇక్కడికి వస్తున్నాడేకాని మరొక కారణం నాకు తెలియడం లేదు.

"లక్ష్మణా! మనకు అన్యాయం చేయాలని భరతుడు కలలో కూడా భావించడు. నాయనా! నీకు భరతుడు ముందెప్పుడైనా అపకారం చేసియున్నాడా? అలాంటి భయానికి ఎన్నడైనా అవకాశం కల్పించాడా? ఇప్పుడు నీవలా ఎందుకు భరతుని సందేహిస్తున్నావు? తగని మాటలు పలుకుతా వెందుకు? తమ్ముడూ! అవి భరతునికి తగుల్తాయా? భరతుని తాకుతాయా?

**న హి తే నిష్ఠురం వాచ్యో భరతో నా ప్రియం వచః**
**అహం హ్య ప్రియముక్తః స్యాం భరతస్యా ప్రియే కృతే**

"భరతుని విషయంలో నిష్ఠూరంగా మాట్లాడకు. అప్రియమైన మాట పలకకు. అతణ్ణి అంటే నన్ను అన్నట్లే. భరతుని దూషిస్తే నన్ను దూషించినట్లే.



"నాయనా! ఏదో కష్టమొచ్చిందని బిడ్డలు తండ్రిని చంపుతారా? సోదరుడు సోదరుడ్ని వధిస్తాడా?

"ఇంతకీ నీవు ఇలా మాట్లాడేది రాజ్యంకోసమా? అయితే చెప్పు. నీకు రాజ్యము ఇవ్వమని నేను భరతునితో చెప్తాను. లక్ష్మణా! నీకు రాజ్యాన్ని ఇవ్వమని నేను చెప్తేచాలు. మారు పలకకుండా భరతుడు రాజ్యాన్ని నీకు అప్పగిస్తాడు;" అని ధర్మాత్ముడైన రాముడు చెప్పగానే రాముని ప్రాణతుల్యంగా ప్రేమించే లక్ష్మణుడు సిగ్గుపడిపోయాడు.

సిగ్గుపడిన సుగుణవంతుడగు లక్ష్మణుడు మాటమార్చే ప్రయత్నంలో, "అన్నా! దశరథమహారాజు నిన్ను చూడటానికి వస్తున్నాడని భావిస్తాను;" అన్నాడు.

లక్ష్మణుడు సిగ్గుపడుతున్నాడని రాముడు గ్రహించాడు. చిన్నవాడు చిన్నబోవడం చూడలేక, "అవును. నాన్నగారే మనల్ని చూడాలని వస్తున్నట్లు అనిపిస్తోంది. మనమెంతో అల్లారుముద్దుగా పెరిగాము కదా! మనం ఈ అరణ్యాల్లో కష్టపడలేమని భావించి బహుశ మనల్ని తీసుకొని పోవాలని నాన్నగారు వచ్చుంటారు. మనమాట ఎలావున్నా సీతనైనా తీసుకొనిపోతారు.

"తమ్ముడూ! అదిగో నాయనా! మన తండ్రిగారి ఏనుగు శత్రుంజయం. సైన్యానికి ముందుగా నడుస్తూ వుంది చూడు. కానీ సౌమిత్రీ! దానిపై నాన్నగారి తెల్లగొడుగు కనబడడంలేదు ఎందుకని? అక్కడే నాకు సందేహంగా ఉంది. ముందు నువ్వు క్రిందికి దిగు. నేను చెప్పినట్లు చెయ్యి" అని పలికాడు ధర్మాత్ముడైన రాముడు.

లక్ష్మణుడు చెట్టుదిగి, అన్నప్రక్కన చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

## రామలక్ష్మణులు

రామలక్ష్మణులు ఎప్పుడూ కలిసే వుంటారు. అందుకని వారి పేర్లను కలిసే పలుకుతూ ఉంటాము. మనషులు కలిసి వున్నా, మనస్తత్వాల దగ్గరికి వస్తే ఇద్దరిలో చాలా తేడా గోచరిస్తుంది.

రాముడికి ధర్మమే ప్రధానమైంది. రాముడు ఎవరినైనా ప్రేమించగలడు. కానీ ధర్మము వచ్చి నిలబడితే మాత్రం రాముడు ధర్మమువైపే తిరుగుతాడు. ధర్మాన్నే ప్రేమిస్తాడు. రాముడు ధర్మస్వరూపుడు. ధర్మము తెలిసి, ధర్మమును ఆచరించువాడే రాముని దృష్టిలో ఉత్తమ మానవుడు.

**'ధర్మజ్ఞః పండితో జ్ఞేయః'** 'పండితుడు ఎవరు?' అని మహాభారతంలో యక్షుడు ధర్మరాజుని ప్రశ్నించినపుడు ధర్మమును తెలిసినవాడే పండితుడు అని ధర్మరాజు యక్షునికి సమాధానం చెబుతాడు. ఈ సత్యమును విశ్వసించడమే గాక తన జీవితంలో ఆచరించి చూపినవాడు రాముడు.

రాముడికి ధర్మం ప్రధానమైతే లక్ష్మణుడికి రాముడే ప్రధానము. లక్ష్మణుడుకూడా ధర్మబద్ధమైనవాడే. కానీ రాముడు వచ్చి నిలబడితే మాత్రం లక్ష్మణుడు రాముడివైపే తిరుగుతాడు.

సుమంత్రుడు సీతారామలక్ష్మణులను అరణ్యంలో వదలిపెట్టి తిరిగి అయోధ్యకు వచ్చినపుడు, వారేమన్నారో చెప్పమని దశరథుడు అడిగినపుడు సుమంత్రుడు చెప్పిన లక్ష్మణుని మాటల్ని పరిశీలిస్తే లక్ష్మణుడేమిటో మనకు అర్థమవుతుంది.

**అహం తావ న్మహారాజే పితృత్వం నోప లక్షయే**
**భ్రాతా భర్తా చ బన్ధుశ్చ పితా చ మమ రాఘవః**

"దశరథుని నేను తండ్రిగా లక్ష్యపెట్టను. నాకు సోదరుడు, ప్రభువు, బంధువు, తండ్రి రాముడే;" అంటాడు లక్ష్మణుడు. రాముని వనాలకు పంపిన దశరథుడు తండ్రియైనా, లక్ష్మణునికి రాముడే ప్రధానం కనుక దశరథుని చర్యను తీవ్రంగా గర్హించాడు.

వనాలకు వెళ్ళేముందు రాజభవనంలో లక్ష్మణుడు రాముడితో కూడా వాదిస్తాడు. రాముని అరణ్యానికి పంపడం దశరథుడు చేయదగింది కాదు. అది అనుచితం, అధర్మం అంటాడు. అంతటితో ఆగకుండ అవసరమైతే దశరథుని బంధిస్తా నంటాడు. లేదా చంపేయడానికి కూడా వెనుకాడ నంటాడు. దీనినిబట్టి మనకు స్పష్టంగా తెలుస్తూ వుంది లక్ష్మణునికి రాముడే ధర్మము అని. రాముని కొరకు తండ్రిని వధించడానికి కూడా వెనుకాడడు. ఇపుడు భరతుని, కైకేయిని చంపడానికి కూడా వెనుకాడడం లేదు.

**ధర్మోహి పరమో లోకే ధర్మేసత్యం ప్రతిష్ఠితమ్**

"లోకంలో అన్నిటికంటె ధర్మమే శ్రేష్ఠమైనది. ధర్మమునందే సత్యము నిలిచి ఉంది" అని వనాలకు వెళ్ళేముందు, ఆవేశపూరితమైన వాక్కులను పలుకుతున్న లక్ష్మణునితో రాముడంటాడు. కనుక రామునికి ప్రధానమైనది ధర్మమే.

ధర్మాన్ని విడచి రాముడు జీవించలేనట్లు, రాముని వదలి లక్ష్మణుడు జీవించలేడు. రాముడికి ధర్మమే ధర్మము. లక్ష్మణుడికి ధర్మస్వరూపుడైన రాముడే ధర్మము. అందుచేతనే "నీకు మించిన ధర్మ మెక్కడుంది?" అని లక్ష్మణుడు రాముని ప్రశ్నిస్తాడు.

**ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యా వివోద్ధృతౌ**

"రామా! నీకు దూరమైన మేము నీటినుండి వేరుచేసిన చేపలవలె బ్రతకలేము" అని భరద్వాజాశ్రమము వెళ్ళే ముందునాటి రాత్రి అరణ్యంలో లక్ష్మణుడు రామునితో అంటాడు.

**'స్వర్గం వాపి త్వయా వినా'** "నీవు లేకుండా స్వర్గమైనా నాకు అవసరంలేదు" అంటాడు లక్ష్మణుడు. కనుక లక్ష్మణునికి రాముడే ధర్మము. రాముడే సర్వము. కనుక జీవితమంతా రాముని చెంతనే గడిపాడు పుణ్యాత్ముడైన లక్ష్మణుడు.

యాగ సంరక్షణార్థమై రాముని సిద్ధాశ్రమానికి తీసికొని పోవడానికి విశ్వామిత్రుడు వచ్చినపుడు, ఆ మహర్షి ఆశించింది రామునే గాని లక్ష్మణుని కాదు. అయినా లక్ష్మణుడు తనకు తానుగా అనుసరించి వెళ్ళాడు.

లక్ష్మణుని మనసు రామునిగూర్చి మాత్రమే ఆలోచిస్తుంది. ఆయన నేత్రాలు రాముని చూచేందుకే ఉన్నాయి. ఆయన పాదాలు రాముని అడుగుజాడలనే అనుసరిస్తాయి.

రాముని క్షేమమే లక్ష్మణునికి ప్రధాన కర్తవ్యము. అందుచేత ఎవరు రామునికి దగ్గరైనా వారిని అనుమానిస్తాడు. ఆయన అనుమానించని దెవర్ని? కోపగించుకోని దెవర్ని?



దశరథుణ్ణి అనుమానించాడు. కైకేయిని అనుమానించాడు. ఇపుడు భరతుణ్ణి కూడా అనుమానిస్తున్నాడు. ఇక్కడ విశ్వాసంతో మెలగడమే గాని విచక్షణ ఏది?

వనవాస మనేది కైకేయి,దశరథుడు కలిసి పన్నిన పన్నాగమే గాని మరొకటి కాదని దశరథుని ప్రథమంగా అనుమానించాడు. తాను అనుమానించడం వరకు బాగుంది. రాముణ్ణికూడా అనుమానించ మనడం లక్ష్మణుని పాత్రలో ప్రత్యేకత.

**పాపయోస్తే కథం నామ తయో శ్శంకా న విద్యతే**

"రామా! పాపాత్ములైన కైకేయీదశరథుల విషయములో నీకు సందేహము కలగడం లేదు ఎందుకని?" అనికూడా ప్రశ్నిస్తాడు.

లక్ష్మణునికి భరతునిమీద సదభిప్రాయం లేదని భావించలేము. కానీ రాముని ప్రసక్తి వచ్చిందంటే చాలు, అతను మరోలా మారిపోతాడు. అన్నీ సందేహాలే. అందరి మీదా అనుమానాలే.

చెట్టుపై కూర్చుని, భరతుని వధిస్తానంటాడు లక్ష్మణుడు. ఆ మాటలు విని రాముడు విస్మయం చెందాడు. లక్ష్మణుని ఆవేశానికి ఆశ్చర్యపోతాడు.

ఇక్కడ మనం ఒక విషయాన్ని ఆలోచించాలి. లక్ష్మణుడు భరతుని చంపుతా నన్నది ఎవరికోసం? తనకోసమా? రాముని కోసమా? రాముని సుఖంకొరకు హత్యచేయడానికి కూడా లక్ష్మణుడు వెనుకాడడం లేదు. తనకు కావలసింది రాముని సుఖమే. రాముని క్షేమమే.

కానీ రాముని విషయం వేరు. తన సుఖం తనకు అవసరంలేదు. రాజ్యం కూడా సోదరుల కొరకే గాని తనకొరకు కాదని చెప్పాడు. వారికి లేకుండా తనకు ప్రాప్తించే శుభాలు దగ్ధమవుతాయని ప్రతిజ్ఞకూడా పూనాడు. ఇది రాముని వ్యక్తిత్వం.

"భరతునికి, నీకు, శత్రుఘ్నునికి లభించని సుఖం నాకు లభిస్తే అది దగ్ధమగు గాక" అని రాముడు శపథం చేశాడు.

రాముడు చెప్పిన ఈ విషయంలో తాను సూచించిన సోదరుల పేర్లను పరిశీలిస్తే, ఆ క్రమము వారి జననములను దృష్టిలో ఉంచుకొని ముందు భరతుని పేరును, తరువాత లక్ష్మణుని పేరును సూచించినట్లు తెలుస్తుంది. కానీ వాస్తవం అదికాదు. ఈ సందర్భమున లక్ష్మణునిమీద కంటే భరతునిమీదే రామునికి అధికమైన ప్రేమ ఉన్నట్లు స్పష్టంగా తెలుస్తూ ఉంది. అందుచేత ముందుగా భరతుని పేరును రాముడు ఉచ్చరించాడు.

భరతుని వధించే స్థితికి లక్ష్మణుడు ఎందుకు వెళ్ళాలి? రాముడు రాజ్యాన్ని పోగొట్టుకొని అడవులపా లైనాడని, దీని కంతటికి భరతుడే కారణమని లక్ష్మణుని అభిప్రాయము.

అది గమనించిన రాముడు "లక్ష్మణా! నీవు భరతుని నిందించేది, వధించేది రాజ్యము కొరకా? అదే నిజమైతే రాజ్యాన్ని నీకివ్వమని నేను భరతునికి చెప్తాను. నేను చెప్పగానే భరతుడు మారు పలకకుండా నీ కప్పగిస్తాడు" అన్నాడు.

ఈ విషయం సత్యమని ధృవపరచేందుకో, ఏమో, నాకు తెలియదుగాని, రావణ వధానంతరము అయోధ్యలో రాముడు రాజ్యాభిషిక్తుడు అయ్యే సందర్భములో యువరాజుగా లక్ష్మణుని సూచిస్తాడు శ్రీరాముడు. భరతుడు ఎంతో ఉత్సాహంతో రాముని నిర్ణయాన్ని

ప్రోత్సహిస్తాడు. సరే, లక్ష్మణుడు రాముని సేవకు ఆటంకమైనది ఏదైనా అంగీకరించడు కనుక దానిని నిరాకరిస్తాడు. ఈ విషయాన్ని యుద్ధకాండలో చూస్తాము.

ధర్మమో, అధర్మమో రాముడు రాజుకావాలి. రాముడు రాజుకావడమే లక్ష్మణుని ధర్మంగా ఇక్కడ మనకు గోచరిస్తోంది. క్షణక్షణానికి రాజ్యప్రస్తావన తెస్తూనే ఉన్నాడు లక్ష్మణుడు.

కానీ, అధర్మంగా లభించేది ఏదైనా విషంకలిసిన పిండివంటయే నని రాముడు స్పష్టం చేశాడు. పదార్థం ఎంత రుచికర మైనదైనా, ఉత్తమ మైనదైనా విషం కలిసినపుడు నిరుపయోగ మైనట్లు, అధర్మంగా లభించే దేదైనా రాముడు విషతుల్యంగానే భావిస్తాడు. రామ భక్తులుకూడా రామునికి అనుగుణంగానే జీవించాలికదా?

అన్యాయంగా ఆర్జించాలని, అక్రమంగా కోట్లు గడించాలని ఈనాడు మనిషి ప్రాకులాడుతున్నాడు. భక్తులలో కూడా ఎక్కువ శాతం ఇలా కనిపిస్తున్నారు. వారు నిర్మించుకున్న ఆశల పల్లకిలో ఊరేగుతున్నారే గాని, ఈ చర్యలు రాముని దృష్టిలో ఎలా ఉంటాయి? అని ఆలోచించుకో గలిగితే జీవితంయొక్క తీరుతెన్నులే మారిపోతాయి.

ధర్మాధర్మాల విశ్లేషణ మనిషికి అర్థంకావాలి. బ్రతుకు ధర్మానికి దూరమైనపుడు మానవునితో పాటు ఎన్నికల్లో నిలబడేందుకు గేదె ముందుకొస్తుంది. పంది పోటీ పడుతుంది.

న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాలు, మంచిచెడులు కూడా ఈనాడు మనిషి బుర్రకెక్కడం లేదు. "నేను అధర్మం చేయలేదు. నేను అన్యాయం చేయలేదు. నేను తప్పు చేయలేదు;" అంటూ పలవరిస్తూ ఉంటాడు. ఇలా ఉండడము ధర్మమని అభిప్రాయం.

ఇదే ధర్మజీవన మయ్యేటట్లయితే నీవేకాదు సుమా! చెట్లు ఎవరికీ చెడు చేయడం లేదు. కుర్చీలు కీడు చేయడం లేదు. దున్నపోతు దోచుకోవడం లేదు. కంచము కబళించడం లేదు.

అర్థరహితమైన ప్రసంగాలు బ్రతుకును అధ్వాన్నంగా మార్చుతాయి. అయోమయంగా తీర్చుతాయి. ఏదో చేయకపోవడం ధర్మంకాదు. ఏది చేయాలో తెలిసి చేయడమే ధర్మం.

తానెలా వుండాలో మనిషికి తెలియడంలేదు గనుక ఇతరులను తన్నైనా తాను పబ్బం గడుపుకుంటున్నాడు. కోట్లు కూడబెట్టుకుంటున్నాడు. ఇది అధర్మం అని చెప్పూ, ఇలాంటి పనులు తాను చేయడంలేదు కనుక తాను ధర్మాత్ముడైనట్లు మరొకరు భావిస్తున్నారు. వాస్తవానికి ఇరువురూ ధర్మమార్గంలో లేరు.

ఒకడు చెడునే మంచిగా భావించి కొల్లగొడుతున్నాడు. మరొకడు అలాంటి చెడును చేయకుండా కబళిస్తున్నాడు. కానీ ఇద్దరికీ మంచినిగూర్చి తెలియదు.

మంచి తెలియని ఈ ఇరువురిలో ఒకడు ఈనాడు చెడుమార్గంలో ఉన్నాడు. రెండవవాడు ఆ దారిలో రేపు ప్రవేశిస్తాడు. ఒకవేళ రేపు వీలుకాకపోతే మరునాడు ప్రవేశించేది మాత్రం సత్యం. ఈ విషయంలో సందేహం అవసరం లేదు. దారి తెలియనివాడు ఎప్పుడు ఏ డొంకలో పడతాడో వాడికే తెలియదు కదా! తాను ఏ కూపంలో పడేది ముందుగా అంధుడు ఆలోచించగలడా?

ధర్మం వంటబట్టని వ్యక్తి స్వార్థముతో నిండిపోతాడు. మోసాలకు నివాస మవుతాడు. ద్రోహాలకు దోహదం చేస్తాడు. అవినీతికి అద్దం పడతాడు.



ఈ పరిస్థితి దేశానికి మంచిది కాదని ఆంగ్లకవి ఆలివర్ గోల్డుస్మిత్ హెచ్చరిస్తాడు.

**Ill fares the land, to hastening ills a prey**
**where wealth accumulates and men decay.**

"ధనరాశులు పెరిగి దాగినచోట - పాపరాశులు మరిగి బయటపడతాయి. దేశానికి కీడు ప్రాప్తిస్తుంది. కదిలొచ్చే చెడులకు ఎరువవుతుంది."

చేయకూడని పనులుచేసి ఒకడు పాపరాశులను సిద్ధం చేసుకుంటాడు. అలాంటివి చేయకుండా, మరొకడు పాపరాశులను తయారు చేసుకుంటాడు. అంతే తేడా.

వరదలు ముంచెత్తి ఒకగ్రామం తీవ్ర సంక్షోభానికి గురి అవుతుంది. ప్రాణాలు పోగొట్టుకున్న తనవారిని ముందెట్టుకొని ఆ కుటుంబీకులు రోదిస్తూ వుంటారు. అదే సమయమని భావించి, దుఃఖంతో పీడింపబడుతున్న వారి ఇంటిని ఒకడు దోచేస్తాడు నిర్దాక్షిణ్యంగా. వాడు దొంగ. అధర్మపరుడు.

వరదలలో నష్టపోయినవారికి ఉచితంగా ప్రభుత్వం కొన్నికోట్లు ధనసహాయం చేస్తుంది. ఆ డబ్బు పైవాడి నుండి క్రిందివాని వరకు పడపోతకు గురై, ఆ తరువాత బాధితులకు అందితే కొంత అందవచ్చు. లేకపోతే కాగితాలలో అందంగా ముస్తాబై కూర్చోవచ్చు.

ఇక చూడండి. మొదటివాడు అనగా దొంగ అధర్మపరుడు. ఎందుకని? దోచుకున్నాడు కనుక.

మొదటివాడు దొంగ అయితే రెండవవారు ఏమౌతారు? వారిని ఏ ముద్దుపేరుతో పిలవాలి? దొరగారనా? కొరగాడనా?

దోచుకున్నవాడు దొంగయితే, దాచుకున్నవాడు దొర ఎలా అవుతాడు? వీరిద్దరి మొరను రాముడు పట్టించుకోడు. ఎందుకని? ఇద్దరూ అధర్మ ఊబిలో దిగినవారే. ఒకటి కర్కశంగా కనిపిస్తూవుంది. మరొకటి చాపక్రింద నీటిలాగా సాగిపోతోంది.

ఇద్దరికీ ధర్మం తెలియదు. ధర్మం తెలిసిఉంటే మొదటివాడు దోచుకోడు. రెండోవాడు దాచుకోడు.

అధర్మం లేకుండా జీవించడం మంచిదే. కానీ అది ధర్మం కాదు. అది ఒకనాడు వ్యక్తిని అధర్మంలోనే దించుతుంది. మనిషైనందుకు ధర్మబద్ధంగా జీవించాలి. ధర్మం తెలిస్తే మొదటివాడు దోచుకోడు సరిగదా, తాను దాచుకున్న దేమైనా వుంటే తెచ్చి ఆర్తుల్ని ఆదరిస్తాడు.

అదే ధర్మం వంటబట్టి ఉంటే రెండవవాడు దాచుకొనే ప్రయత్నాన్ని విడచి, ధర్మబద్ధంగా వితరణ చేయడమేగాక, తానుకూడా ఉడతాభక్తిగా ఆ సంతర్పణలో భాగస్వామి అవుతాడు.

తే ॥ నియత తపమును నింద్రియ నిగ్రహంబు
భూరి విద్యయు శాంతికిఁ గారణములు
వాని యన్నిటి కంటె మేలైన శాంతి
కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర!

"నియమం తప్పని తపస్సు, ఇంద్రియములను నియమించుట, గొప్పదైన విద్య - ఇవి శాంతికి కారణాలు. కానీ లోభగుణాన్ని త్యజించడంలో వీటన్నిటికన్నా మించిన శాంతి లభిస్తుంది" అని మహాభారతము - ఉద్యోగపర్వమునందు కవిబ్రహ్మ తిక్కన విదురుని ద్వారా పలికిస్తాడు.

లోభంవల్ల లభించే లాభానికి, ప్రలోభానికి మనిషి లొంగకూడదు. దానిని విషం కలిపిన పిండివంటగా భావించాలి అంటాడు రాముడు.

భరతుడు ధర్మాత్ముడు. భవ్యమైనవాడు. ఆశయాలే గాని ఆశలు తెలియనివాడు. అందుచేత సీతారామలక్ష్మణుల్ని అయోధ్యకు తీసుకొని పోవుటకు వస్తున్నాడే గాని హాని చేసేందుకు కాదు అంటాడు రాముడు.

రాముని హృదయంలో భరతుడు ఎంతటి ఉన్నతమైన స్థానాన్ని సంపాదించుకున్నాడో చూడండి. ఆయన జన్మ ధన్యమైంది. భారతదేశమంతా భరతులతో నిండిపోవాలని రాముని ప్రార్థిస్తాం.

దివ్యాత్ముడు, మహాత్ముడు, భవ్యాత్ముడు అయిన భరతునిగూర్చి ఈ సందర్భమున సంత్ తులసీదాస్ మహాశయుడు రామచరితమానసంలో ఒకమాట అంటాడు.

**భరత హృదయ సియ రామ నివాసూ**
**తహఁ కి తిమిర జహఁ తరని ప్రకాసూ**

"భరతుని హృదయం సీతారాముల నిలయము. ఆదిత్యుడు ప్రకాశించే చోటికి అంధకారం ప్రవేశిస్తుందా?"

"లక్ష్మణా! భరతుని నిందించకు. భరతుని దూషిస్తే నన్ను దూషించినట్లే" అని పలికి రాజ్యాన్ని భరతుడు లక్ష్మణునకు ఇవ్వగలడు అని రాముడు చెప్పగానే లక్ష్మణస్వామి సిగ్గుపడి, చెట్టుదిగి, రాముని ప్రక్కనే చేతులుకట్టుకొని నిలబడ్డాడు.

ఆవేశపరుడులా కనిపించే లక్ష్మణునిలో ఎంత సంస్కారం దాగివుందో ఇక్కడ మనం జాగ్రత్తగా పరిశీలించి అర్థంచేసుకోవాలి.

భరతుని గురించి రాముడు అంతగా శ్లాఘించినపుడు ఆక్షణం వరకు లక్ష్మణుడున్న ఆవేశంలో, ఆవేగంలో మరెవరన్నా ఉంటే ఏమై ఉండేదో ఆలోచించండి.

"రామా! నీకోసం అయోధ్యను వదలి వచ్చాను. అర్ధాంగిని వదిలాను. తల్లిని విస్మరించాను. క్షణక్షణము నీకొరకే తల్లడిల్లిపోతున్నాను. అడవులపాలై, అగచాట్లకు గురియై నీకు, నీ భార్యకు చాకిరి చేస్తున్నాను. నీపై ప్రేమతో మాట్లాడిన నా మాటలు నీకు పోకిరిమాటలుగా వినిపిస్తున్నాయి.

"రాజ్యాన్ని కబళించి, అరువు తెచ్చుకున్న సున్నాన్ని అప్పటంగా రాసి, సూత్రం తెగిన గాలిపటంలా నిన్ను అడవుల పాల్జేసిన ఆ కులుకులాడి కైకేయి కొడుకు నీ కరుణకు పాత్రుడయ్యాడు. నేను దేనికి కొరగానివాడిగా మిగిలిపోయాను.

"నీకు, నీ పెద్దతనానికి ఒక సలాం. ఇక ఆ భరతుణ్ణే తోడుగా బయట పడుకోమని చెప్పు. నా మానాన నేను ఊరికిపోయి, ఉప్పుమ్ముకొని ఊర్మిళను పోషించుకుంటాము" అని తూనీగలాగా ఎగిరిపోయేవారు. వారి ఆంతర్యంలోని నీచత్వాన్ని ప్రదర్శించేవారు.



మహాత్ముడైన లక్ష్మణుడు అలా ప్రవర్తించలేదు. సిగ్గుపడి తలవంచాడు. అలా సిగ్గుపడడం వెనుక ఎంత సంస్కారం ఉందో ఆలోచిస్తే అవగత మవుతుంది. తన తప్పిదానికి సిగ్గుపడి, వెంటనే మాటమార్చి, "తండ్రిగారు మనల్ని తీసుకుపోవడానికి వస్తున్నట్లుంది" అంటాడు ఆ పిచ్చితండ్రి లక్ష్మణుడు.

"మా అమ్మ, అన్నావదినలకు సేవచేస్తూ తపస్విలా జీవించమన్నది. నేనేమో, క్షణికో ద్రేకంలో భరతుని రాముని ముందు అనవసరంగా అనరాని మాటలు క్రోధంతో అనే శాను" అనే పశ్చాత్తాపమే లక్ష్మణుని సిగ్గువెనుక దాగియున్న సంస్కారం.

లక్ష్మణుడు సిగ్గుపడడం చూసి, "అయ్యో! నేను లక్ష్మణుని బాధించానా? నా మాటల వల్ల లక్ష్మణుని పసిహృదయం కలత చెందిందేమో!" అని భావించిన రాముడు, "తమ్ముడూ! అదిగో నాన్నగారి ఏనుగు శత్రుంజయం కన్పిస్తోందికదూ!" అని మాటమార్చి లక్ష్మణుని సిగ్గును మరిపింపచేస్తాడు. ఆహాఁ.... రామలక్ష్మణులు, నిజం చెప్పాలంటే - రామలక్ష్మణులే.

## రామభరత సమాగమం

భరతుని అపారసైన్యము చిత్రకూట పర్వతాన్ని సమీపించింది. ఆశ్రమ ప్రశాంతతకు భంగం కలగకుండా సైన్యాన్ని అక్కడే ఉంచమని భరతుడు ఆజ్ఞాపించాడు. దర్పాన్ని విస్మరించి, ధర్మాన్ని స్మరిస్తూ ఆ సేన ఒకటిన్నర యోజనముల దూరము ఆవరించి నిలిచింది.

శత్రుఘ్నుడు, గుహుడు, అమాత్యులు, పౌరులు అందరూ భరతునితోపాటు రామాశ్రమాన్ని అన్వేషించారు. రాముడు చరించిన పవిత్రస్థలమని భావించి భరతుడు పాదచారియై వనంలో సంచరించాడు. సీతారామలక్ష్మణులను చూడనంతవరకు తనకు దుఃఖము ఉపశమించదని పలుకుతూ భరతుడు రాముని ఆశ్రమాన్ని అన్వేషించసాగాడు.

"రాముని ముఖారవిందమును సదా వీక్షించే లక్ష్మణుడు ఎంత భాగ్యశాలియో కదా! రాముని అనుసరిస్తూ జీవించే సీత ధన్యురాలు. రాముడు తన చరణకమలాల మంచిన ఈ పర్వతము పుణ్యమే పుణ్యము. క్రూరమృగాలతో నిండిన దట్టమైన ఈ అరణ్యము రామ పాదస్పర్శచే పునీతమైంది;" అని పలుకుచూ భరతుడు వృక్షములమధ్య రాముని అన్వేషిస్తూ నడుస్తున్నాడు.

చిత్రకూట పర్వతముపై రాముని పర్ణశాలనుండి పైకి పోతున్న పొగను భరతుడు చూశాడు. రాముడు అక్కడే ఉంటాడని భావించి నదికి ఆవలితీరాన్ని చేరిన ఈతగానివలె సంతోషించాడు భరతుడు.

పుణ్యశ్లోకుడైన రాముని ఆశ్రమం కనిపించింది. తన తల్లులను తొందరగా తీసికొని రమ్మని వసిష్ఠమహర్షికి చెప్పి, శత్రుఘ్న సుమంత్రాదులతో కలిసి చకచకా ముందుకు దూసుకుపోతున్నాడు భరతుడు. రాముని చూడాలనే అభిలాష తనకూ తక్కువేమీ లేనందున శత్రుఘ్నుడు కూడా తొందర తొందరగా భరతుని వెంబడించాడు.

భరతునికి పర్ణశాల కంటబడింది. ఆ పర్ణశాలముందు కొట్టితెచ్చిన కర్రలు, పూజకు తెచ్చిన పుష్పాలు ఉన్నాయి. ఆశ్రమానికి మార్గం తప్పకుండా రామలక్ష్మణులు చెట్లకు కట్టుకొనిన నారచీరల పీలికలను, దర్భలను భరతుడుచూచి శత్రుఘ్నునికి చూపించాడు.

దర్భలు పవిత్రతకు చిహ్నములు. నారచీరలు నిరాడంబరతకు ప్రతీకములు. నిరాడంబరత, పవిత్రత ఎవరిలో గోచరిస్తుందో వారికి మార్గము సుగమ మైనదని భావము. పరమాత్మను దర్శించాలని ఉబలాటపడే సాధకులు పవిత్రులై, నిరాడంబరులై ఉండాలి.

భరతుడు రాముని పర్ణశాలను సమీపించాడు. ఈశాన్యమున మండుచున్న అగ్నితో విశాలమైన యజ్ఞవేదిక కనిపించింది. పర్ణశాలలో జటామండలం ధరించి కూర్చునివున్న రాముని భరతుడు చూశాడు.

మహారాజుగా అయోధ్యలో శోభించవలసిన రాముడు మహర్షిలా అరణ్యంలో ఆసీనుడై ఉన్నాడు. ఉత్తమమైన పట్టుబట్టలను కట్టుకొనే రాముడు జింకచర్మాన్ని ధరించి ఉన్నాడు. అమాత్యుల మధ్య ప్రకాశింప వలసిన రాముడు మృగాలమధ్య ఉన్నాడు.

ఇదంతా తనవల్లనే రామునికి కల్గింది అని భావించి దుఃఖిస్తూ, చెమటలు గ్రక్కుతున్న శరీరంతో బిగ్గరగా విలపిస్తూ "అన్నా!" అంటూ రాముని పాదాలముందు నేలపై పడ్డాడు పుణ్యాత్ముడైన భరతుడు. నీళ్ళునిండిన కళ్ళకి రాముని పాదాలు కనిపించలేదు. చేతులతో తడుముకుంటూ బావురుమన్నాడు భరతుడు.

భరతుడు "అన్నా!" అని మాత్రమే అనగలిగాడు. శత్రుఘ్నుడు దుఃఖిస్తూ రాముని పాదాలకు నమస్కరించాడు. రాముడు తన రెండు చేతులు చాచి భరతశత్రుఘ్నులను దగ్గరగా తీసికొని, కౌగలించుకొని కన్నీళ్ళు కార్చాడు.

చిత్ర విచిత్రములను సాగించు మానవుని చిత్తమే చిత్రకూటము. రామభరతుల సమాగమం చిత్రకూటంలో జరిగింది. అదియే జీవబ్రహ్మైక్యం. తాపసజీవనంలోనే జీవుడు దేవుని కలిసి తరించిపోతాడు. చిత్తమే దానికి అనువైన ప్రదేశము.

భరతుడు రాముని సమీపించగానే భరతుని దేహము ముచ్చెమటలు పోసినాయి. కంఠం గద్గదమై మాట పెగల్లేదు. కన్నీరు మున్నీరుకాగా రాముని పాదాలుకూడా కనిపించ లేదట భరతునికి. పరమాత్మ కృపకు పాత్రుడయ్యే పవిత్రాత్ముడైన భక్తుని లక్షణాలు ఇలాగే ఉంటాయి.

**కంఠావరోధ రోమాంచాశ్రుభిః పరస్పరం లపమానాః**

"భక్తులు పరస్పరం భగవంతునిగూర్చి ముచ్చటించుకొను సమయాలలో నోటమాటల్ని కదిలించలేకపోతారు. దేహం గగుర్పాటు చెందుతూ వుంటుంది. కన్నీళ్ళు కారుతూ వుంటాయి" అని నారదమహర్షి భక్తిసూత్రాలలో చెప్పాడు.

రాముని పాదాలు కన్నీళ్ళు నిండిన నేత్రాలకు కనిపించక పోయేసరికి భరతుడు ఆ పాదాల కొరకు ఆరాటపడుతూ తడుముకుంటున్నాడు. ఈలోగా రాముడు భరతుని తన కౌగిలిలోకి తీసుకున్నాడు. భక్తుడుకూడా భరతునివలె పారవశ్యంతో భగవంతుని సమీపిస్తే ఆ తరువాత భగవంతుడే భక్తుని ఉద్ధరిస్తాడు.

రామచరితమానసంలో ఈ సన్నివేశాన్ని అతిరమణీయంగా వర్ణిస్తాడు తులసీదాసు.



రాముని పర్ణశాలను సమీపించేలోగా శ్రీరాముని పాదముద్రలు నేలపై గోచరిస్తాయి. వాటిని దర్శించి భరతశత్రుఘ్నులు పులకరించిపోతారు. పరవశించి ఆనందాశ్రువుల్ని కార్చుతారు.

**హరషహి నిరఖి రామపద అంకా! మానహుఁ పారసు పాయఉ రంకా!**
**రజ సిర ధరి హియఁ నయనన్హి లావహిఁ ! రఘువర మిలన్ సరసి సుఖ్ పావహిఁ!**

"శ్రీరాముని పాదముద్రలను చూసిన భరతుడు పరుసవేదిని పొందిన దరిద్రుడిలాగా సంతోషించాడు.ఆ ముద్రలపై నున్న రేణువులను తీసికొని తలపై ధరించాడు. హృదయానికి, నేత్రాలకు అద్దుకున్నాడు. ఆ శ్రీపాదరేణువుల్ని చూచి శ్రీరాముని చూచినట్లు సంతసించాడు.

భరతుడు పర్ణశాలను సమీపించి సీతారాములను దర్శించాడు. జ్ఞానమలైనవారి సభలలో భక్తిజ్ఞానములు ప్రకాశించునట్లు సీతారాములు ఆ పర్ణశాలలో శోభించినట్లు వర్ణిస్తాడు తులసీదాసు.

భరతుడు రాముని దర్శించి "రక్షించు తండ్రీ! రక్షించు" అంటూ రాముని పాదాలకు నమస్కరించాడు.

ఈ సన్నివేశంలో వాల్మీకి, తులసీలు రెండు విభిన్నకోణాల నుండి సత్యకిరణాల్ని ప్రసరింపచేసి మన హృదయంలోని అజ్ఞానతిమిరాలను తరిమేస్తారు. ఇదొక రమణీయ సన్నివేశము.

కంఠం గద్గదమై, రోమాంచలమై, అశ్రుపూర్ణ నయనాలతో భరతుడు శ్రీరాముని దర్శించినట్లు వాల్మీకి వర్ణించాడు.

తులసీదాస్ భరతుడు రాముని దర్శించిన సమయంలో చాలా ప్రశాంతంగా కనిపిస్తాడు. ఆత్మసాక్షాత్కారమును పొందిన జ్ఞానివలె భరతుడు ప్రకాశించాడు అంటాడు తులసీదాస్.

**కరత్ ప్రవేస్ మిటే దుఃఖ దావా! జను జోగీ పరమారథు పావా!**



"పర్ణశాలలో ప్రవేశించి రాముని దర్శించగనే భరతునిలో రగులుతున్న దుఃఖాగ్ని చల్లారింది. ఆత్మసందర్శనమైన యోగిలాగా భరతుడు ప్రసన్ను డయ్యాడు" అంటాడు సంత్ తులసీదాస్.

రాముని చల్లనిచూపు పడగానే భరతుని ఆవేదన అంతరించింది అంటాడు తులసీదాస్. భరతుడు చిత్ర కూటానికి భక్తి వైరాగ్యాలతో వెళ్ళినట్లు, మనం కూడా భక్తి శ్రద్ధలతో ఆలయాలకు, ఆశ్రమాలకు వెళ్ళాలి.

రాముని దర్శించగనే భరతుని ఆవేదన అదృశ్యమైనట్లు, భగవంతుని మూర్తిని భక్తితో దర్శించగనే మనలోని అసంతృప్తికూడా అంతరిస్తుంది.

భరతుడు రాముని పాదాలకు నమస్కరించాడు. "అన్నా! భరతుడు నీకు నమస్కరిస్తున్నాడు" అంటాడు రామునితో లక్ష్మణుడు.

భరతుని చూచిన ఆనందంలో రాముడు తననుతానే మరచిపోయాడు. భరతుడు నమస్కరిస్తున్నట్లు లక్ష్మణుడు చెప్పవలసి వచ్చింది. తన భక్తితో భగవంతుని పరవశింపచేసే భక్తియే నిజమైన భక్తి. అట్టి భక్తిని భరతుడు ప్రదర్శించాడు.

లక్ష్మణుడు అలా చెప్పగానే రాముడు ప్రేమపూర్ణ హృదయంతో గబగబ లేస్తాడు భరతుని కౌగలించుకోడానికి. భరతుని రాముడు చేజిక్కించుకొనే లోగా రాముడికి కొన్ని చేజారిపోతాయి. ఈ విషయాన్ని రామచరితమానసం అత్యంత రమణీయంగా రచించింది.

**ఉఠే రాము సుని ప్రేమ అధీరా! కహుఁ పట్ కహుఁ నిషంగ్ ధను తీరా!**

"రాముడు ప్రేమతో గబగబా లేచాడు. ఆ తొందరలో నాలుగు వస్తువులు శ్రీరాముని శరీరముపైనుండి జారి క్రిందపడ్డాయి. అవి 1. పైన కప్పుకొనియున్న ఉత్తరీయము 2. అంబులపొది 3. చేతిలోని బాణము 4. ధనుస్సు.

వాల్మీకిరామాయణంలో ఈ వేగంతో భరతుడు కన్పిస్తాడు. తులసీరామాయణంలో అదే ఆవేశంతో రాముడు గోచరిస్తాడు. జీవుడు దేవుని కొరకు ఎలా పరితపిస్తాడో, పరవశిస్తాడో వాల్మీకిరామాయణం వివరిస్తుంది. దేవుడు భక్తుడైన జీవుని చూసి ఎలా ఆనందిస్తాడో తులసీరామాయణము వర్ణిస్తుంది.

నది సాగరాన్ని చేరే రీతిని వాల్మీకి వర్ణించగా, సముద్రం నదిని ఆహ్వానించే తీరును తులసీదాస్ అభివర్ణిస్తాడు.

రాముని శరీరంనుండి నాలుగు వస్తువులు జారి పడ్డాయని తులసీదాస్ చెప్పిన విషయంపై అనేక భావపూర్ణ వ్యాఖ్యలున్నాయి. కొన్నిటిని చెబుతాను.

1. భక్తి విషయంలో నీవు ఏది సమర్పిస్తావో అదే తిరిగి నిన్ను చేరుతుంది అని చెప్పడానికి రాముడు నాలుగు వస్తువుల్ని జారవిడచాడు.

భక్తుడు భగవంతుని కొరకు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నాల్గింటిని సమర్పిస్తాడు. వాటిని గ్రహించి చతుర్విధ పురుషార్థముల యొక్క ఫలాన్ని భగవంతుడు భక్తునికి అందిస్తాడు అని తెలుపుటయే ఆ నాల్గింటిని జారవిడచుటలోని అంతరార్థము.

నీవు పరమాత్మకొరకు నాలుగు వదిలావు కనుక పరమాత్మ కూడా నీకొరకు నాలుగు విడిచాడు.

2. పరమాత్మ పరిపూర్ణుడు. అవ్యక్త స్వరూపుడు. అట్టివానిని దేహధ్యాస గలవారు దర్శించలేరు.

**క్లేశోఽధికతర స్తేషాం అవ్య క్తాసక్త చేతసామ్**
**అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే**



"అవ్యక్తోపాసన చేయువారికి కష్టము అధికంగా ఉంటుంది. దేహాభిమానులచే అవ్యక్త పరబ్రహ్మము అతికష్టంగా పొందబడుతుంది" అని భగవద్గీత.

దేహమనే వస్త్రముపై వ్యామోహము తొలగినపుడే దేహియగు పరమాత్మ దర్శనమిస్తాడు. దేహాభిమానము పరమాత్మ కృపతో తొలగుతుంది. భక్తిశ్రద్ధలతో పరమాత్మను ఎవరు సమీపిస్తారో వారి దేహాభిమానాన్ని పరమాత్మే తొలగిస్తాడు.

భక్తితో భరతుడు రాముని సమీపించాడు. రాముడు భరతుని ఆలింగనం చేసుకొనే ముందు రామునిపై ఉన్న వల్కలము జారి నేలపై పడుతుంది. "నీ దేహవాసనను తొలగించాను" అని చెప్పడానికే పరమాత్మయైన రాముడు వల్కలాన్ని జారవిడచాడు.

3. శ్రీరాముని దేహమునుండి జారిపడిన ఉత్తరీయము, అంబులపొది, ధనుర్బాణములను రాముడు త్యజించలేదు. వాటంతట అవే జారిపోయాయి.

భరతుడు శ్రీరాముని పాదాలపైబడి ఆయన చరణధూళిని శిరమున ధరించాడు. "అయ్యో! మనము ఇంతకాలము రామునిశరీరాన్ని అంటిపెట్టుకొని యున్నాము. కానీ ఆ దివ్యాత్ముని చరణపరాగాన్ని అందుకోవాలని భావించనేలేదు.

"ఈ భరతుడు పుణ్యాత్ముడు. వచ్చాడో లేదో ఆయనకు చరణధూళి లభించింది. ఈ మహత్తర అవకాశాన్ని మనము జారవిడచుకో కూడదు" అని ఆ నాలుగు వస్తువులు జారిపోయాయి.

4. సాధారణంగా ఓడిపోయినవారు ధనుర్బాణాలను త్యజిస్తారు. రాముని దేహము నుండి అంబులపొది, ధనుర్బాణాలు జారి పడిపోయాయి.

ఏనాడైనా వినయము గలవానిదే విజయము. విద్యా వినయములు గల భక్తుడు తన భక్తి ద్వారా ఒకనాడు తప్పక భగవంతుని గెలుచుకుంటాడు. భక్తవిజయమే గాని భగవద్విజయం లేదు.

భక్తుడైన భరతుని ముందు భగవంతుడైన రాముడు తన ఓటమిని అంగీకరించాడు. కనుక అంబులపొదిని, ధనుర్బాణాలను త్యజించాడు.

5. "భరతా! తండ్రి మాటను నిలుపుటకు ధర్మబద్ధుడనై నేను అరణ్యాలకి వచ్చాను. నీవేమో నాకు రాజ్యాన్ని అప్పగించాలనే అభిప్రాయంతో ఇక్కడికి వచ్చావు.

"ఈ పద్నాలుగు సంవత్సరాలు నేను వనవాసంలోనే ఉంటాను. రాజువై నీవే అయోధ్యను పాలించాలి. ధనుర్బాణాలను ధరించియున్నావు కదా! రాజువు కానిచో ఎందుకు ధరించావు? కనుక అయోధ్యకు రా! అని మొండిపట్టు పడతావేమో!

"భరతా! వనాలలో ఆత్మరక్షణ కొరకు ధనుర్బాణాలు ధరించానే గాని రాజునై కాదు. అది కాదని నీవు భావిస్తే, ఇదిగో ఈ ధనుర్బాణాలను కూడా త్యజిస్తున్నాను. నన్ను అయోధ్యకు రమ్మని బలవంతం చేయకు. రాజువు నీవే," అని చెబుతూ రాముడు అంబులపొదితో సహా ధనుర్బాణాలను విసర్జించాడు.

తులసీరామాయణం భక్తిరస ప్రధానమైన కావ్యం. తోడుతూవుంటే భావాలు ఊరుతూ ఉంటాయి. చదివేవారిని ఊరిస్తూ ఉంటాయి. బ్రతుకుల్ని ఊరేగిస్తూ ఉంటాయి.

# రాముని రాజనీతి

భరతశత్రుఘ్నులు రామునికి నమస్కరించిన తరువాత గుహుడు, సుమంత్రుడు కూడా రాముని కలిసి నమస్కరించారు. చిత్రకూట పర్వతముపై వసించు మహర్షులు అయోధ్యా సోదరులమధ్య అన్యోన్యంగా ప్రవహిస్తున్న అనురాగ స్రవంతిని చూచి, పరితాపహృదయులై అశ్రువులు చిందించారు.

**జటిలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి**
**దదర్శ రామో దుర్దర్శం యుగాన్తే భాస్కరం యథా!**

భరతుడు జటలను ధరించి వున్నాడు. నారబట్టలు కట్టుకొని వున్నాడు. ప్రళయకాలంలో ప్రభాకరునివలె చూచుటకు శక్యముగానివాడై ఉన్నాడు. చేతులు జోడించి నమస్కరిస్తూ నేలపై పడి ఉన్నాడు. అట్టి భరతుని రాముడు చూశాడు. ఇది ఈ శ్లోకభావం.

భరతుడు సుందరమైన కేశములు గలవాడు. గండు తుమ్మెదలవలె నల్లనైన ఒత్తుగా గల భరతుని కేశాలను చూచి తల్లిదండ్రులు చాలా సంతోషిస్తూ వుండేవారట. ఒత్తుగా వున్న భరతుని శిరోజాలను మెల్లగా చేతులతో ఒత్తుతూ తలను మూర్కొనేవారట. అట్టి భరతుడు జటలు ధరించి ఉండడము చూచి రాముడు దుఃఖ పరిప్లుతు డయ్యాడు.

"అదేమిటి? ఇలా తీసుకురా! ఈ బట్టలు కుట్టిస్తారా భరతునికి? భరతుడు సుకుమారుడు. కోమలమైన భరతుని శరీరము ఈ బట్టను ధరించి భరించలేదు. ఇంకా సన్నవి చూడండి. అందంగా ఉండే తేలిక వస్త్రాల్ని తీసుకురండి" అనేవాడట దశరథమహారాజు. అట్టి సుకుమారుడైన భరతుడు నారబట్టలతో కనిపించేసరికి రాముని కళ్ళు చెమ్మగిల్లాయి.

ప్రళయకాల సూర్యునివలె దుర్నిరీక్ష్యుడై గోచరిస్తున్న భరతుని చూచి రాముడు మనసును నిగ్రహించుకోలేక పోయాడు. దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు. కన్నీటిని పట్టి ఆపలేకపోయాడు.

ముఖమంతా కాంతిహీనంగా ఉంది. రాముడు కొన్ని క్షణాలు గుర్తు పట్టలేనంతగా భరతుడు మారిపోయాడు. రాముని పాదాలను పట్టుకొనియున్న భరతుని భుజాలు స్పృశించి పైకి లేవనెత్తాడు దాశరథి.

భరతుడు దీనుడై, దుఃఖంతో కుమిలిపోతూ, రెండు చేతులను దోసిలిగా పట్టి, ఏదో యాచిస్తున్న వానిలాగా గోచరించాడు. చిన్నతనం నుండి భరతుడు ఏదీ తనకు కావాలని అడిగేవాడు కాడట. అట్టి వాంఛారహితుడు ఉంఛవృత్తి వానివలె చేతులను దొన్నెగా తీర్చి యాచిస్తున్నాడు. అదిచూచి రాముడు భరించలేక భరతుని కౌగిలించుకొని హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు.

దీనుడై విలపిస్తున్న భరతుని తన అంకముపై కూర్చోబెట్టుకున్నాడు రాముడు.సింహాసనంపై కూర్చుని తృప్తి చెందలేని భరతుడు రాముని ఒడిలో సంతృప్తిచెంది సమస్తాన్ని మరచిపోయాడట.

భరతుని వేషం, దుఃఖావేశం చూసి దశరథుడు మరణించినట్లు రాముడు గ్రహించాడు. ఈ విషయంలో మరొక సందేహానికి అవకాశంలేదు.



"తమ్ముడూ! ఇలా అరణ్యానికి ఎందుకు వచ్చావు? దశరథమహారాజు ఎక్కడికి వెళ్ళాడు? ఆయన ఉండగా నీవిలా రాకూడదు నాయనా!" అన్నాడు రాముడు.

రాజు పెద్దవాడు. యువరాజైన భరతుడు రాజుగారి సేవలో ఉండాలి. ఇలా వచ్చాడంటే భరతుడు తండ్రిగారి సేవను త్యజించి వచ్చాడని అర్థము. కానీ భరతుడు ధర్మాత్ముడు. తండ్రి సేవను విస్మరించడు. బహుశ సేవలందుకొనే వ్యక్తి దశరథుడు అందుబాటులో లేడేమో! ఆ కారణంగా "నాన్న ఎక్కడికి వెళ్ళాడు?" అని ప్రశ్నించాడు రాముడు.

ఎక్కడికి వెళ్ళినా తిరిగి వచ్చే చోటికి వెళ్ళుంటే మాత్రం భరతుడు ఇలా తయారయ్యే వాడు కాదేమో? భరతుడు జటలు ధరించి నారబట్టలు కట్టుకోవడాన్ని దశరథుడు అంగీకరిస్తాడా? కనుక దశరథుడు మరణించాడేమో? అనుమాన మెందుకు? అడగడమే సముచితమని భావించి రాముడు భరతుని ఇలా ప్రశ్నించాడు.

**కచ్చి ద్ధారయతే తాత రాజా యత్త్వ మిహాగతః**
**కచ్చిన్న దీనః సహసా రాజా లోకాన్తరం గతః**

"నాయనా! నీవు అడవికి ఎందుకు వచ్చావు? దశరథమహారాజు జీవించి వున్నాడు కదా? దుఃఖాక్రాంతుడైన రాజుగారు కాలంచేశారా?"

"నీవు చిన్నవాడివి కనుక ఎవరైనా శత్రురాజులు రాజ్యాన్ని ఆక్రమించారా?" అని అడిగాడు రాముడు.

దశరథుడు జీవించివుంటే శత్రురాజులు అయోధ్యను కబళించలేరు. దశరథుడు జీవించి వుంటే భరతుడు ఇలా వల్కలములు ధరించి వచ్చుట సాధ్యపడదు. ఒకవేళ దశరథుడు రాముని వలన కలిగిన దుఃఖంతో మరణిస్తే, అది తెలిసి శత్రురాజులు దండెత్తివచ్చి రాజ్యాన్ని అపహరించి ఉంటారా? రాముడు ఆంతర్యంలో అలా సందేహపడదు. భరతశత్రుఘ్నులను శత్రురాజులు ఎదిరించలేరని రామునికి బాగా తెలుసు.

భరతుని వేషము, దుర్భరమైన దుఃఖము రాజ్యసంబంధమైనది కాదని తెలిసిపోతోంది. దశరథుడు గతించినాడని, తనను ఏవిధంగానైనా అయోధ్యకు తీసికొనిపోవాలనే దృఢసంకల్పంతోనే భరతుడు వచ్చినట్లుకూడా రామునికి అర్థమైపోయింది.

ధర్మవిరుద్ధంగా రాముడు అయోధ్యకు పద్నాలుగు సంవత్సరాల లోగా తిరిగి వెళ్ళడు. ఎలాగైనా మెప్పించి, ఒప్పించి భరతుని అయోధ్యాధిపతిగా వెనక్కి త్రిప్పి పంపాలని రాముడు నిర్ణయించుకున్నాడు.

భరతుడు చిన్నవాడు. రాజ్యాభిషేకము ఊహించని విషయ మైనందున అతడు రాజనీతి యందు శిక్షణపొంది యుండలేదు. వసిష్ఠాది మహర్షులు సలహాదారులుగా వున్నా, తమ్ముడైన భరతునికి రాజధర్మాన్ని బోధించడం మంచిదని రాముడు అభిప్రాయపడ్డాడు.

భరతుడు దుర్భరమైన దుఃఖంలో ఉన్నాడు. అయోధ్యకు తిరిగివెళ్ళమని ఎంత చెప్పినా ఈ దశలో అంగీకరించడు. లక్ష్మణునివలె తేలికగా భరతుని మెప్పించడం కష్టం. బలవంతంగా ఒప్పించడం సులభంకాదు.

అందుచేత కుశల మడుగుతున్నట్లు రాజనీతిని విపులంగా బోధిస్తే, అటు రాజనీతిని భరతునికి బోధించినట్లూ వుంటుంది. ఇటు వివిధ అంశాలను ఆలకించడము వలన మనసులో గడ్డకట్టియున్న దుఃఖము పలచబడడమూ జరుగుతుంది అని భావించి రాజనీతిని భరతునకు బోధించుటకు ఉద్యుక్తు డయ్యాడు రాముడు.

"భరతా! నీవు దూరదేశంలో ఉండడంచేత నిన్ను చాలాకాలానికి చూశాను. బాగా సన్నబడ్డావు. గుర్తుపట్టలేని విధంగా ఉన్నావు. నాన్నగారు కుశలంగా ఉన్నారా? మన తల్లులు క్షేమంగా ఉన్నారా?

"నాయనా! రాజ్యాన్ని చక్కగా పాలిస్తున్నావా? పురోహితుడైన వసిష్ఠుని, బుద్ధిమంతుడు, వసిష్ఠుని కుమారుడైన సుయజ్ఞుని సత్కరిస్తున్నావా?" అంటూ మొదలుబెట్టి రాజధర్మాన్ని ధారావాహికంగా సుమారు వంద ప్రశ్నలు వేస్తూ బోధించాడు. ఆనాటి రాజనీతి, రాజుల పరిజ్ఞానము ఎలాంటిదో దీనినిబట్టి మనము చక్కగా గ్రహించవచ్చు.

"భరతా! మంత్రులు నీతో సమానులై ఉండాలి. శూరులై ఉండాలి. జితేంద్రియులై ఉండాలి. విద్యావంతులై ఉండాలి. మనసును చదువగలిగే వారై ఉండాలి. పండితులై ఉండాలి. రాజుగారి ఆలోచనలను రహస్యముగా ఉంచేవారై ఉండాలి.

"నాయనా! రాజ్యవిషయాలు నీవు ఒక్కడివే ఆలోచించి నిర్ణయించ కూడదు. అలాగని అందరితోను చర్చించకూడదు. నీ ఆలోచనలు రాజ్యములో అందరికీ తెలియకూడదు.

"భరతా! గొప్ప ఉద్యోగాలలో నియమించే వారికి రహస్యంగా పరీక్షలు నిర్వహించాలి. వారి శీలాన్ని, నడవడికను గమనించడంతో పాటు వంశచరిత్రను కూడా దృష్టిలో ఉంచుకోవాలి.

"మంత్రులు రాజును ఎదిరించే పరిస్థితి తెచ్చుకోకూడదు. తెలివికలవాడు అధికార వాంఛతో ప్రభుత్వములోని ఉద్యోగులలో భేదాభిప్రాయాలు సృష్టించేటప్పుడు అట్టివానిని దండించడం విస్మరిస్తే ఆతరువాత రాజుకు మనుగడ ఉండదు.

" సేనాధిపతిని నియమించడంలో చాలా జాగ్రత్తగా ఉండాలి. సేనాధిపతి శూరుడుగా, ధైర్యవంతుడుగా, నిజాయితీపరుడుగా, తృప్తి కలవాడుగా, బుద్ధిమంతుడుగా, రాజభక్తి కలిగి సమర్థుడైన వాడుగా ఉండాలి.

"యుద్ధవీరులను అప్పుడప్పుడు గౌరవిస్తూ ఉండాలి. వారికి తగిన వేతనాన్ని ఆలస్యం చేయకుండా అందించాలి. లేనిచో వారు రాజుపై తిరగబడే ప్రమాదము ఏర్పడవచ్చు.

"మన చేతిలో ఓడిపోయిన శత్రువు బలహీనుడని ఉపేక్షించకూడదు. దూత సమర్థుడై ఉండాలి. రాజుకు బాగా తెలిసినవాడై ఉండాలి. సమయస్ఫూర్తి కలవాడై ఉండాలి. పండితుడై ఉండాలి.

"నాయనా! పండితుడైనా నాస్తికుడు దగ్గర చేరకుండా చూసుకోవాలి. అహంకారులను దగ్గర ఉంచుకోకూడదు.

"ప్రజలందరు కృషి, గోరక్షణములపై ఆధారపడి జీవిస్తూవుంటారు. వ్యవసాయము, గోరక్షణము చేయు వైశ్యులను ప్రతికూలంగా మార్చుకోకూడదు. వారికి రాజు రక్షణనిస్తూ ఆపదలను తొలగిస్తూ వుండాలి.



"స్త్రీలతో రాజు మంచిగా మాట్లాడి వారిని రక్షిస్తూ ఉండాలి. వారి మాటలను ఉన్నదిఉన్నట్లు నమ్మకూడదు. స్త్రీలకు రహస్యములు చెప్పకూడదు. **(ఇక్కడ రాముడు స్త్రీలను తక్కువగా భావించాడని తలచకూడదు. స్త్రీలు సున్నితహృదయులు. మాయలు తెలియనివారు. ఎవరేమి చెప్పినా నమ్ముతారు. కనుక స్త్రీలు చెప్పేవిషయాలను పరిశీలించి గ్రహించాలి అని భావము. మాయామర్మాలు తెలియనివారు కనుక రహస్యాలు దాచుకోలేక ఇతరులతో చెప్పేస్తారని రాముడి భావము)**

"భరతా! రాజు నిద్రను జయించినవాడై ఉండాలి. సమయాలు ఎరిగి మేల్కొంటూ ఉండాలి. ముఖ్యమైన విషయాల్ని తెల్లవారుజామున ఆలోచించాలి. నిత్యము దర్శనార్థమై వచ్చువారిని తృప్తిపరచాలి. అలంకరించుకోకుండా ప్రభువు దర్శన మివ్వకూడదు.

"ప్రభువు దగ్గర పనిచేయు ఉద్యోగులు భయము కల్గినవారై ఉండాలి. అలాగని అధికభయంతో దూరంగా ఉండకూడదు. ఏవిషయంలో కూడా అతి లేకుండా, మితంగా, హితంగా మధ్యమార్గమును అవలంబిస్తూ ఉండాలి.

"రాజుగారి ధనాగారము సమృద్ధిగా ఉండాలి. ఆదాయము అధికంగా ఉండాలి. వ్యయం తక్కువగా ఉండాలి. రాజధనము దుర్వినియోగము చేయువారి చేతికి అందకూడదు.

"పూజ్యుడు, బుద్ధిమంతుడు, ఉత్తమ నడవడి కలవాడు అయిన వ్యక్తిపై ఈర్ష్యతో, అసూయతో ఎవరైనా అపరాధములు ఆరోపించవచ్చు. అలాంటి సమయాలలో పండితులైన వారిని, నేర్పు గలవారిని సంప్రతించి నిర్ణయాలు తీసుకోవాలి.

"తప్పుచేసిన వానినుండి లంచాలు పుచ్చుకొని వానిని రక్షించకూడదు. మంత్రులు ధనిక దరిద్రులనే తేడా లేకుండా పాలించునట్లు ప్రభువు జాగరూకుడై గమనిస్తూ వుండాలి.

"పెద్దలను గౌరవిస్తూ ఉండాలి. అనాథులను ఆదరిస్తూ ఉండాలి. వృద్ధులను దయతో పలకరించాలి. అతిథుల్ని గౌరవిస్తూ ఉండాలి.రాజు అనుభవించే భోగాలు అతని మిత్రులకు కూడా అందాలి.

"భరతా! రాజు పదునాలుగు రాజదోషాలను త్యజించాలి. అవి ఏవనగా 1.నాస్తికత్వము 2.అసత్యము 3.క్రోధము 4.మరపు 5.దీర్ఘకాల నిర్ణయాలు 6.జ్ఞానులను నిర్లక్ష్యము చేయుట 7.సోమరితనము 8.ఇంద్రియ నిగ్రహము లేకపోవుట 9.నిర్ణయాలు చేయునపుడు మంత్రులను విస్మరించి తానే నిర్ణయించుట 10.అజ్ఞానులతో సమాలోచనలు చేయుట 11. ప్రారంభించిన పనులు చేయకపోవుట 12.ఆలోచనలను రహస్యంగా ఉంచకుండా వెల్లడిచేయుట 13.శుభకార్యములు చేయకపోవుట 14.ఏకకాలములో అనేకమంది శత్రువులను ఎదుర్కొనుట.

"వేయిమంది మూర్ఖులు ఉండుటకన్నా మేధావి, పండితుడు, శూరుడు, సమర్థుడు అయిన ఒక్కవ్యక్తి ఆంతరంగికంగా రాజుకు సన్నిహితుడై ఉండాలి. అట్టివానివలన రాజుకు గొప్పమేలు జరుగుతుంది.

"భరతా! మన పూర్వీకులందరూ ఏ సన్మార్గమున నడిచారో అట్టిమార్గమును నీవుకూడా అనుసరించుచున్నావు కదూ!

"నాయనా! అధికారము ఉన్నదికదా అని నిరపరాధులను శిక్షిస్తే ఆ వ్యక్తి కార్చిన కన్నీళ్ళు రాజుయొక్క సంతానమును కూడా నశింపచేస్తాయి.

"యథోచితంగా ధర్మమును అనుసరించి పరిపాలించు ప్రభువు ఈలోకంలో శోభించుటయే గాక మరణానంతరము కూడా సుఖిస్తాడు" అని ఇంకా అనేకములైన రాజ ధర్మాలను రాముడు భరతునికి బోధించాడు.

## ధర్మ మెవరికి? న్యాయ మెవరిది?

రాముడు చెప్పిన ధర్మనీతిని ఆలకించిన భరతుడు, "అన్నా! ధర్మమేలేని నాకు రాజధర్మంతో ఏమిలాభం?

"రామా! పురుషశ్రేష్ఠా! పెద్దకుమారుడే రాజుకావాలి అనేది మనవంశంలో అనాదిగా వస్తున్న ధర్మం. ఆచారం. పెద్దవాడు ఉండగా చిన్నవాడు రాజు కాకూడదు. అందువలన నీవు అయోధ్యకు వచ్చి వంశక్షేమానికై రాజ్యాభిషిక్తుడవు కా.

"రాజు కూడా మనిషే అని అజ్ఞానులు భావించవచ్చు. ధర్మార్థములను కాపాడే రాజు దేవుడే అని నా అభిప్రాయము.

"అన్నా! మనతండ్రి అనేక యజ్ఞాలు చేశాడు. పూజ్యుడు. సత్పురుషులకు ప్రియమైనవాడు. అట్టి నాన్న నేను కేకయదేశములో ఉండగా, నీవు అరణ్యములో ఉండగా మన ఇద్దరికీ శాశ్వతంగా దూరమయ్యాడు.

"నీవు అరణ్యానికి రాగానే పుత్రశోకాన్ని భరించలేక నాన్న దివంగతు డయ్యాడు. అన్నా! లే! నాన్నకు జలతర్పణములు ఇవ్వు. నేను, శత్రుఘ్నుడు ఇదివరకే ఇచ్చాము.

"అన్నా! తండ్రిగారికి నీవంటే ఇష్టం. ప్రియమైన కుమారుడు ఇచ్చింది అక్షయం అవుతుందని అంటారు. నీవు దూరమయ్యావనే బాధతో, నిన్ను చూడాలనే కోరికతో, మనసును మరొకవిధంగా మరల్చుకోలేక, శోకపరవశుడై తండ్రి మరణించాడు."

భరతుడు తండ్రి మరణవార్తను చెప్పగానే రాముడు మూర్ఛిల్లాడు. యుద్ధమునందు శత్రువులను అవలీలగా సంహరించువాడైనా, భరతుడు చెప్పిన ఆ మాటలు ఇంద్రుని వజ్రాయుధ ఘాతమువలె రామునికి తగిలాయి. రాముడు చేతులు జోడించుకొని గొడ్డలితో నరికిన చెట్టులాగా నేలపై కూలిపోయాడు.

దగ్గరే ఉన్న సోదరులు, సీత రాముని ముఖంపై నీళ్ళు చల్లారు. రాముడు తేరుకున్నాడు. కన్నీళ్ళు కార్చుతూ, దీనుడై పసిబిడ్డలాగా రోదించాడు. భరతునితో ఏడుస్తూ ఇలా పలికాడు.

"నాయనా! భరతా! తండ్రి పోయిన తరువాత నాకు అయోధ్యతో ఏమిపని? రాజులలో శ్రేష్ఠుడైన దశరథమహారాజు పరిపాలించిన అయోధ్యను ఆయన లేకుండా పరిపాలించే శక్తి ఎవరికుంది?

"తమ్ముడూ! నాకోసం దుఃఖిస్తూ మరణించిన తండ్రికి నేను అగ్నిసంస్కారము కూడా చేయలేకపోయాను. నా జన్మే చెడ్డది. అట్టి నావల్ల ఆయనకు ఏమి ప్రయోజనము?



"భరతా! పాపరహితా! నీవు, శత్రుఘ్నుడు తండ్రిగారికి అంతిమ సంస్కారములు చేసి తరించినారు. మీరు ధన్యులు. తండ్రిగారు లేని అయోధ్యకు నేను రాను. రాలేను. ఇప్పుడే కాదు. అరణ్యవాసము పూర్తయిన తరువాతకూడా రాను.

"నాయనా! నాన్నగారు నాకు రోజూ ధర్మబోధ చేస్తుండేవారు. వనవాసము పూర్తిచేసుకొని నేను అయోధ్యకు వస్తే అక్కడ నాకు ఉపదేశం చేసేవారెవరు? తియ్యని ఆ వాగామృతధారను మళ్ళీ ఎవరినుండి గ్రోలేది?

"సీతా! మీ మామగారు ఇకలేరు. నాయనా! లక్ష్మణా! తండ్రిలేని బిడ్డవయ్యావు. తండ్రిగారు మరణించారని భరతుడు చెప్తున్నాడు" అని రాముడు పలికాడు. భరత లక్ష్మణశత్రుఘ్నులు ఆమాటలు విని దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి దుఃఖించారు. అన్నయైన రాముని ఓదార్చి, జలతర్పణములు ఇమ్మని ప్రార్థించారు.

ఈ దుర్భర వార్తను వినిన సీతమ్మ భర్తను చూడలేక ముఖాన్ని చేతుల్లో ఉంచుకొని దుఃఖించింది. రాముడు సీతమ్మను ఓదార్చి, "లక్ష్మణా! నాన్నగారికి జలతర్పణం చేస్తాము. తెలగపిండిని, ఉత్తరీయాన్ని తీసుకురా. నీవూ, సీత కూడా బయలుదేరండి," అన్నాడు. సుమంత్రుడు రాజకుమారులను ఓదార్చి, వారిని పట్టుకొని నదీస్నానానికి తీసుకొని వెళ్ళాడు.



"తండ్రీ! మేము సమర్పించు ఈ జలము నీకు తృప్తిని కల్గించుగాక!" అని పలికి రామాదులు జలతర్పణము లిచ్చారు. ఆ తరువాత మందాకినీ నదీతీరమున తండ్రికి పిండప్రదానము చేశారు. రాముడు దర్భలు పరచి, గారపిండి రేగుపండ్లతో కలిపి ముద్దలు చేసి తండ్రికి పెడుతూ, "తండ్రీ! నేను తినేదే నీకు పెట్టాను. ఎవడైనా దేవతలకు తనకున్నదే గదా నైవేద్యం పెడతాడు?" అని పలికి నదీ తీరముననే నడిచి చిత్రకూటపర్వతాన్ని ఎక్కాడు రాముడు.

పర్ణశాలను సమీపించగనే రాముడు దుఃఖాన్ని ఆపుకోలేక భరతలక్ష్మణులను ఇద్దరిని కౌగిలించుకొని దుఃఖించాడు. అన్నదమ్ములు, సీత కలిసి ఒకేసారి రోదించడమువల్ల ఏర్పడిన శబ్దము పర్వతముపై సింహములు గర్జించినట్లు ఉండింది.

ఈ శబ్దము పర్వతముక్రింద నిరీక్షిస్తున్న సైనికులకు వినిపించింది. తండ్రి మరణవార్తతో రామాదులు విలపిస్తున్నారని గ్రహించిన సైనికులు వారిని సమీపించేందుకు బయలుదేరి పరుగెత్తారు. రాముని దర్శించాలనే కుతూహలంతో వారంతా కోలాహలంగా అలా

పరుగెత్తేసరికి ఆ శబ్దానికి కోతులు, తోడేళ్ళు, మృగాలు, వరాహములు, వ్యాఘ్రములు భీతిచెంది నలువైపులా పరుగెత్తాయి.

సైనికులందరూ పర్వతము నెక్కి పర్ణశాలవద్ద నేలపై ఆసీనుడైవున్న రాముని దర్శించారు. రామునికి నమస్కరించి కన్నీళ్ళతో కైకేయిని, మంథరను దూషించారు.

కొందరు రామునికి పాదాభివందనం చేశారు. కొందరు దూరంనుండే రామునికి నమస్కరించారు. సన్నిహితులు ఏడుస్తూ రాముని ఆలింగనం చేసుకున్నారు.

వసిష్ఠుడు రాణులను తీసికొనివచ్చాడు. కౌసల్యాది రాణులు మందాకినీ నదీతీరమున నడుస్తుండగా రామలక్ష్మణులు ఉపయోగించుకొనే రేవును చూశారు.

"సుమిత్రా! నీబిడ్డ నాబిడ్డకు ఈ రేవునుండే నీళ్ళు తీసికొనిపోతాడు. అన్న కొరకు నీ కుమారుడైన లక్ష్మణుడు ఎన్నో ఉత్తమ కార్యాల్ని చేస్తున్నాడు;" అని పలుకుతున్న కౌసల్య అప్పుడే రాముడు పిండప్రదానం చేసి వెళ్ళిన ప్రదేశాన్ని చూసింది.

"సుమిత్రా! ఇవిగో. రాముడు తండ్రిగారికి సమర్పించిన పిండాదులు. దశరథమహారాజు దేవతలతో సమానుడు. ఇంద్రునివలె శ్రేష్ఠమైన భోగాలను అనుభవించినవాడు. సమస్త భూమండలమును పాలించిన చక్రవర్తి. అట్టివానికి తెలకపిండిని సమర్పించాడు రాముడు.

"సుమిత్రా! ఇంతకన్నా బాధాకరమైన విషయం మరొకటుందా? ఇది చూసికూడా నాహృదయం ముక్కలు కాలేదు.

**యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః**

"పురుషుడు తాను ఏ ఆహారము తింటాడో దేవతలకు అదే సమర్పిస్తాడని లోకంలో ప్రతీతి. రాముడు అంతకన్నా వేరుగా ఏమి చేయగలడు?" అని కౌసల్య దుఃఖించింది. రాణులందరు పర్వతమునెక్కి రామునివద్దకు వచ్చారు.

సర్వభోగాలను త్యజించి, తాపసునివలె కూర్చునియున్న రాముని చూడగనే రాణులందరూ దుఃఖించారు. రాముడు తల్లులను చూడగనే లేచివెళ్ళి వారి పాదాలను స్పృశించి నమస్కరించాడు. లక్ష్మణుడు రాముని అనుసరించి వెళ్ళి నమస్కరించాడు. సీతమ్మ కూడా అత్తల పాదాలకు నమస్కరించి, ఏడుస్తూ ప్రక్కనే నిలబడింది.

కౌసల్య, తల్లి బిడ్డను కౌగలించుకొనునట్లు సీతను హృదయానికి హత్తుకొని విలపించింది. "జనకుని పుత్రిక, రాముని భార్య అయిన సీత కూడా జనసంచారము లేని ఈ అరణ్యములో జీవించవలసి వచ్చింది.

"సీతా! ఎండకు వాడిన కమలంలాగా, నలిగిపోయిన కలువలాగా, దుమ్ముపట్టిన బంగారంలాగా, మేఘములచే కప్పబడిన చంద్రుడులాగా కాంతిహీనమైఉన్న నీ ముఖాన్ని చూస్తూవుంటే, కొయ్యరాపిడికి పుట్టిన అగ్ని కొయ్యను దహించునట్లు నాలో కలిగే దుఃఖము నన్ను సమూలంగా దగ్ధం చేస్తూవుంది."

కౌసల్య అలా మాట్లాడుతూవుంది. రాముడు వసిష్ఠుని పాదాలకు నమస్కరించాడు. అందరూ ఆసీనులయ్యారు. భరతుడు రామునిప్రక్కన కూర్చున్నాడు. బ్రహ్మదేవుని ప్రక్కన ఇంద్రుడు ఆసీనుడైనట్లు భరతుడు గోచరించాడు. భరతుడు రామునితో విషయాన్ని ఎలా



ప్రస్తావిస్తాడో వినాలని అక్కడున్న వారంతా చాలా ఉత్సాహంతో ఉన్నారు. ఈలోగా రాముడే భరతుని ప్రశ్నించాడు.

"నాయనా! భరతా! నీవు జటాజినములతో, నారబట్టలతో ఇక్కడికి రావడానికి కారణమేమి? వివరంగా చెప్పు" అన్నాడు రాముడు.

భరతుడు రామునికి నమస్కరిస్తూ, "అన్నా! నిన్ను అరణ్యానికి పంపడమనే ఘోరమైన కర్మను ఆచరించి, ఆ తరువాత పుత్రశోకాన్ని భరించలేక మన తండ్రి దశరథమహారాజు స్వర్గస్థుడయ్యాడు.

"రామా! నా తల్లి కైకేయి ప్రేరణతో ఈ మహా పాపకార్యాన్ని చేసి తన కీర్తికి మచ్చ తెచ్చుకున్నాడు.

"నా తల్లి రాజ్యాన్ని పొందలేక, వైధవ్యమును మాత్రమే పొంది, దుఃఖపీడితురాలై, నరకాన్ని అనుభవిస్తుంది.

"రామా! నేను నీ దాసుణ్ణి. నన్ను కరుణించు. రాజ్యాభిషిక్తుడవై ఇంద్రుడు అమరావతిని పాలించినట్లు నీవు అయోధ్యను పాలించు.

"అన్నా! నీ దర్శనానికి పౌరులంతా వచ్చారు. భర్తను కోల్పోయిన మన తల్లులు కూడా వచ్చారు. అందరినీ అనుగ్రహించు. వంశానుక్రమంగా పెద్దవాడు పరిపాలించ వలసిన రాజ్యాన్ని నీవు స్వీకరించి మమ్మల్నందరినీ సంతోషపెట్టు.

"మంత్రులు, నేను, అందరము తలలువంచి నీకు నమస్కరిస్తున్నాము. అంజలిఘటించి ప్రార్థిస్తున్నాము. నేను నీ సోదరుణ్ణి. శిష్యుణ్ణి. దాసుడ్ని. నన్ను కరుణించు;" అంటూ పలికి దుఃఖార్తుడైన భరతుడు కన్నీళ్ళు కార్చుతూ రాముని పాదాలపై బడ్డాడు.

రాముడు నిట్టూర్పు విడిచి, భరతుని కౌగిలించుకొని ఇలా పలికాడు.

"భరతా! నీవు శ్రేష్ఠుడవు. బలశాలివి. తేజోవంతుడవు. సత్పురుషుడవు. రాజ్యము కొరకు నీవు పాపము చేసేవాడివి కావు. నీ విషయంలో నాకు ఏవిధమైన సందేహమూ లేదు.

"నాయనా! నీలో కించిత్తైనా నాకు దోషం కనిపించడం లేదు. పసితనము చేత నీవు తల్లిని నిందించే కార్యాన్ని మాత్రం చేయకు.

**కామకారో మహాప్రాజ్ఞ గురూణాం సర్వదానఘ**
**ఉపపన్నేషు దారేషు పుత్రేషు చ విధీయతే ॥**

"భరతా! నీవు ప్రజ్ఞావంతుడవు. పాపరహితుడవు. పెద్దలు తమ కిష్టులైన భార్యాబిడ్డల విషయంలో ఏవిధంగానైన ప్రవర్తించవచ్చును అని శాస్త్రం చెబుతోంది.

"నాన్నగారు, మనము కూడా అలాంటివారమే అని మరచిపోకు. నాన్నగారు అయోధ్యాధిపతి. నన్ను రాజ్యాభిషిక్తుణ్ణి చేసే అధికారం ఆయనకు ఉన్నపుడు అరణ్యాలకు పంపే అధికారం కూడా ఉంది.

"నాయనా! తండ్రిగారి విషయములో లోకులు మెచ్చుకొనునట్లు మనం ఎంతటి గౌరవాన్ని చూపుతున్నామో, తల్లుల విషయంలో కూడా అలాగే ఉండాలి.

"భరతా! ధర్మజ్ఞులైన తల్లిదండ్రులు నన్ను అరణ్యానికి వెళ్ళమని చెప్పినపుడు నేను మరియొక విధంగా ఎలా చరించగలను? చెప్పు. చూడు. నీవు అయోధ్యలో ప్రజలకు చక్కని రాజ్యపాలనము నందించాలి. నేను నారచీరలు కట్టుకొని దండకారణ్యంలో నివసించాలి. ఈవిధంగా నాన్న నిర్ణయించి ఈ లోకాన్ని త్యజించాడు.

"తండ్రిగారు ధర్మాత్ములు. ధర్మాచార్యుల వంటివారు. ఆయన వాక్కు మనకు శిరోధార్యము. ఈ వనవాస భాగ్యాన్ని తండ్రి నాకు అనుగ్రహించాడు. నేను దానిని అనుభవించక తప్పదు;" అని పలికాడు రాముడు.

## రామభరత సంవాదము

రాముని మాటలు ఆలకించిన వారంతా మౌనంగా కూర్చున్నారు. భరతుడు ఇలా పలికాడు.

"అన్నా! నా తల్లి మాటను మన్నించి నీవు నాకు రాజ్యాన్ని ప్రసాదించావు. దానిని నేను నీకు తిరిగి ఇచ్చేస్తున్నాను. స్వీకరించు. నిరాటంకంగా, నిష్కంటకంగా రాజ్యాన్ని పాలించు.

"సోదరా! వర్షాకాలమున జలప్రవాహ వేగానికి తెగిపోయిన వారధివలె, విశాల రాజ్యమైన అయోధ్యను నీవు తప్ప మరొకరు ఆపలేరు.

"గాడిద గుఱ్ఱాన్ని అనుకరించి పరుగెత్తగలదా? మామూలు పక్షి గరుత్మంతునితో ప్రయాణం చేయగలదా? రామా! నీ విషయంలో నేనూ అంతే;" అంటూ బుద్ధిమంతుడు, ధర్మాత్ముడు అయిన భరతుడు రాముని అయోధ్యకు తీసికొనిపోయే పరిస్థితులను సృష్టించే ప్రయత్నంలో ధారాప్రవాహంగా తాను చేయబోయే వాదనకు ఇక్కడ శ్రీకారం చుట్టాడు.

రాజ్యమనేది ఒక గొప్ప ప్రవాహంవంటిది అంటున్నాడు భరతుడు. అట్టిదానిని చక్కని పాలనము అనెడి సేతువుపై నడిపించగలగాలి. అది అందరికీ సాధ్యమయ్యే పనికాదు.

అంతేగాక, ఒకవేళ ఆ సేతువే తెగినపుడు, గండిపడి ప్రవాహం తీవ్రమై ప్రజల బ్రతుకులకు గండము ఏర్పడినపుడు ఆ ప్రవాహాన్ని ఆపాలంటే సామాన్యులకు సాధ్యపడే పనికాదు. కనుక దశరథుని మరణం వలన ఏర్పడిన గండి అనే గండాన్ని రాముడే పూడ్చగలడని భరతుని అభిప్రాయము.

మరి ఆపని భరతుడే చేయవచ్చుగదా? భరతుడు కూడా దశరథ రాజకుమారుడే గదా! రాజపుత్రుడే కదా! రాజ్యాధిపత్యానికి అర్హుడే కదా! అనే సందియము రావచ్చు. దానిని కూడా భరతుడు నివారణ గావించాడు.

గాడిద, గుఱ్ఱము రెండూ జంతువులే. రెంటికీ నాలుగేసి కాళ్ళు, ఒక తోక, రెండు చెవులూ ఉన్నాయి. రెండూ పరుగెత్తుతాయి. రెండూ బరువులు మోస్తాయి. అంతమాత్రాన రెండూ ఒకటే అని పలకడం ఎంత సబబు? అని భరతుడు ప్రశ్నిస్తున్నాడు. పందెములో నిలబడి పరుగెత్తాలంటే గుఱ్ఱం విషయం అలాఉంచి, గాడిద పరిస్థితి ఎలాఉంటుందో ఆలోచించ మంటున్నాడు భరతుడు.



గరుత్మంతునివలె నేనుకూడా పక్షినే అనుకోవచ్చు కాకి. కానీ ఆకాశపు అంచుల్ని కొలిచే రీతిగా పయనించే గరుడునికి కాకికి ఎక్కడ సంబంధము? రాముడనే గరుత్మంతుని ముందు తాను కాకిలాంటివాడని భరతుడు అంగీకరిస్తున్నాడు.

**సుజీవం నిత్యశస్తస్య యః పరై రుపజీవ్యతే**
**రామ తేన తు దుర్జీవం యః పరా నుపజీవతి**

"రామా! ఇతరులు తమ బ్రతుకుకై ఎవరిని ఆశ్రయిస్తారో అట్టివాని జీవితము సఫలము. ఎవడు ఇతరులను ఆశ్రయించి జీవిస్తాడో వాని జీవితము నిష్ఫలము;" అన్నాడు భరతుడు.

తాను చక్కగా జీవిస్తూ, ఇతరులు అలా జీవించడానికి ఎవడు సహకరించగలడో అతడి జీవితము సఫలము. అలా కాకుండా తన జీవితానికి ఇతరులపై ఆధారపడి జీవించువాని జీవితము నిష్ఫలము.

రాముడు తాను జీవించగలడు. రామునిపై ఆధారపడువారు జీవించునట్లు చేయగలడు. కాని భరతునితో కూడా అందరూ రామునిపై ఆధారపడి జీవించువారే గాని తమకు తాముగా జీవించగలిగేవారు కారు అంటున్నాడు వినయశీలుడైన భరతుడు. ఇలా పలికి ఇంకా చెప్తున్నాడు భరతుడు.

"రామా! నాకు తోచిన ఒక ఉపమానాన్ని చెబుతాను. ఆలోచించు. ఒకడు ఒక వృక్షమును నాటాడు. చక్కగా పోషించి పెంచాడు. అది బాగా పెరిగి, పొట్టివాడు ఎక్కలేనంత లావుగల మ్రానైంది. బాగా పుష్పించింది. కానీ ఫలాలను మాత్రం ఇవ్వలేదు. ఇప్పుడు చెప్పు. అది నాటిన వ్యక్తికి సుఖముంటుందా? శాంతి కల్గుతుందా?

"అన్నా! దశరథుడు రామమొక్కను నాటాడు. అది చక్కని ధర్మమొగ్గలను తొడిగి సుగుణపుష్పాలను విరబూసింది. కానీ రాజ్యపరిపాలనము అనే ధర్మఫలాలను ప్రసాదించ లేనపుడు రాజుగారి శ్రమ అంతా వృథా అయినట్లేగదా?

"శ్రేష్ఠుడైన రామా! సూర్యుడు సప్తాశ్వములు పూన్చిన రథముపై ఆసీనుడై ప్రకాశించునట్లు, నీవు సింహాసనారూఢుడవై ప్రకాశిస్తుంటే పౌరులందరూ ఆనందిస్తారు. మేము తృప్తి చెందుతాము. అంతఃపురములో తల్లులందరూ సంతోషిస్తారు;" అని భరతుడు పలికాడు.

భరతుని మాటలను ఆలకించిన పౌరులు, సైనికులు, పెద్దలు, రాణులు అందరూ చాలా సంతోషించారు. భరతుడు చాలా చక్కగా మాట్లాడాడని మెచ్చుకున్నారు. "ఇంకేముంది? ఇంతచక్కగా భరతుడు మాట్లాడాడు. ఇక రాముడు అయోధ్యకు వచ్చేస్తాడు" అని భావించారు.

రాముడు భరతుని వంక చూడగనే భరతుడు దుఃఖంతో కన్నీర్ను కార్చాడు. భరతుని ఓదార్చి రాముడు ఇలా పలకడం ప్రారంభించాడు. ఎలాగైనా అయోధ్యకు రాముని తీసికొని వెళ్ళాలని భరతుడు చేసే వాదనలను త్రిప్పికొట్టి, అరణ్యములోనే ఉండిపోయేందుకు అనువుగా ప్రతివాదాలను వినిపించేందుకు రాముడు ఇపుడు శ్రీకారం చుట్టాడు.

"భరతా! మంచిమాటలు పలికావు. మనం ఊహించినట్లు జీవితంలో అన్నీ జరగవు. దైవానుకూలంగానే జరుగుతాయి. ఈ విషయంలో మనం నిస్సహాయులం. కర్మలు మన అధీనంలో ఉన్నాయి. ఫలితాలు మన అధీనంలో లేవు.

**సర్వేక్షయనాః నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః**
**సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్**

"భరతా! ఎంత కూడబెట్టినా ధనము ఖర్చయిపోయేదే. ఎవడు ఎంత ఉన్నతిని సాధించినా అది ఒకనాడు పతన మయ్యేదే. బాంధవ్యాలన్నీ ఒకనాడు విడిపోయేవియే. పుట్టినవాడు మరణించకపోడు;" అంటూ ప్రారంభించాడు రాముడు.

ధనమెప్పుడూ ఒకరిదంటూ నిలవదు. నిలకడగా ఉండదు. చెట్టునీడలాగా చరిస్తూ ఉంటుంది. ధనం శాశ్వతం కాదు. అట్టి ధనాన్ని మనిషి శ్రమించి సాధిస్తాడు. పరిశ్రమించి రక్షిస్తాడు. చివరికి పోగొట్టుకొని పరితపిస్తాడు. ఇది ధనమంటే. అందుకే

**అర్థ మనర్థం భావయ నిత్యం**
**నాస్తి తతః సుఖలేశః సత్యం**
**పుత్రాదపి ధనభాజాం భీతిః**
**సర్వత్రైషా విహితా రీతిః**

"ఓ మందమతీ! అర్థము అనర్థమని, వ్యర్థమని సదా భావించు. దానియందు సుఖము కొంచెమైనా లేదు: ధనం కలవాడు బిడ్డల్ని చూసికూడా భయపడవలసి వస్తుంది. ఇది అంతటా కనిపించే సత్యము" అంటారు శ్రీశంకరాచార్యులవారు.

కూడబెట్టిన ధనం ఒకచోట కుదురుగా కూర్చోదు. కూడబెట్టిన వ్యక్తియే ఒకనాడు ఖర్చు చేయాలి. లేదా చోరులైనా దోచుకోవాలి. లేదా దాచుకోవడం నేరమని ప్రభుత్వమైనా స్వాధీనం చేసుకోవాలి.

ధనము ఎలా క్షయమవుతుందో అధికారాలు కూడా అంతమయ్యేవియే. పైకి ఎగరేసిన వస్తువు ఏదైనా క్రింద పడకపోదు. ఆకాశంలో ఎగురుతూ విహరించినా, దారం తెగిపోగానే తూలుతూ గాలిపటం నేలపై పడకపోదు. రాజ్యాలు శాశ్వతాలా? పదవులు శాశ్వతాలా? పుణ్యఫల విశేషంగా లభించిన ఇంద్రాదుల పదవులు కూడా శాశ్వతం కావుకదా!

అధికారం లభిస్తే ధనం ప్రాప్తిస్తుంది అని కొందరు భావిస్తారు. ధనంతో అధికారం లభిస్తుంది అని కొందరు ఊహిస్తారు. ఈ రెండు లభించి ఏం సాధించాలి? అని రాముడు ప్రశ్నిస్తున్నాడు. రెండూ పారిపోయేవియే గదా? జారిపోయేవియే గదా? అని సూటిగా ప్రశ్నిస్తున్నాడు రాముడు. మాట లెవ్వరైనా చెప్పొచ్చు. చెప్పిన మాటల్ని చేతల్లో చూపడం రాముడులాంటి వారికే సాధ్యం.

**For the love of money is the root of all evil.**

"విత్తాన్ని ప్రేమించడమే సమస్తమైన వెతలకు కారణము" అని బైబిలు చెప్పింది. కానీ అట్టి ధనాన్ని ఉపయోగించి మతమార్పిడులు చేయాలని కొందరు ప్రయత్నిస్తున్నారు. అమాయకులను వంచించి ఏదో సాధించినట్లు దయ్యంపట్టిన వారిలా ఊగిపోతున్నారు.



గ్రంథాలు ఎన్నో చెప్తున్నాయి. ఏం లాభం? వంటబట్టని ఆహారంలాగా మిగిలిపోతున్నాయి ఉపదేశాలన్నీ. బోధలన్నీ అవగాహన లోపించడంవల్ల బాధలుగా దర్శన మిస్తున్నాయి.

ధనము, అధికారము ఎలా క్షీణిస్తున్నాయో ఈ ప్రపంచంలో బాంధవ్యాలు కూడా అంతే నంటున్నాడు రాముడు. కలిసేదేదైనా ఈప్రపంచంలో విడిపోయేదే అంటున్నాడు. సంయోగమును వియోగము నీడలా వెంబడిస్తూనే ఉంటుం దంటున్నాడు.

కలియడంలో అందాన్ని, ఆనందాన్ని దర్శించడం తప్పులేదు. విడిపోవడంలో వికారాన్ని దర్శించడం దోషం. విడిపోని కలయికలు కాలంలో దుర్లభం.

భార్యాపుత్రులు, మిత్రులు, చుట్టాలు అందరూ కలుస్తారు. కానీ అందరూ మనతో ఎప్పుడూ కలిసి ఉండలేరు. ఇది ప్రకృతి పోకడ. తల్లిదండ్రులు జన్మను ప్రసాదిస్తారు. కానీ కలిసి ఎంతోకాలం జీవించరు మనతో.

చివరకు ఎవరికైనా మిగిలేది మరణమేనని చెప్తున్నాడు రాముడు. ఇది సత్యం. వాస్తవం. ఇది నిజమైతే రాజ్యము పోయిందని, ధనం క్షయమైందని, బంధువులు దూరమయ్యారని, తండ్రి మరణించాడని భావించడంలో అర్థమేముంది? అంటూ పరోక్షంగా భరతుని వాదాన్ని కుదిపి వదిలేశాడు ధర్మాత్ముడైన రాముడు.

**యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనాద్భయమ్**
**ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణాద్భయమ్**

"భరతా! పండిన పండ్లకు చెట్టునుండి పడిపోవడం తప్ప మరొక భయంలేదు. పుట్టిన ప్రతిమనిషికీ మరణించడం తప్ప మరొక భయంలేదు.

"నాయనా! బలమైన స్తంభాలతో, దూలాలతో కట్టినా, ఇల్లు ఒకనాడు శిథిలమై కూలి పోతుంది. అలాగే మానవులు జరామృత్యువుల వాతపడి తప్పక నశిస్తారు;" అని దేహాల అనిత్యత్వాన్ని అద్భుతంగా ప్రవచించాడు రామచంద్రుడు.

ఆకాశంలో మేఘం ఎంతకాల ముంటుంది? మేఘమే అనిత్యమైనపుడు దానిలో కనిపించే మెరుపు సత్య మవుతుందా? శరీరమనే మేఘములో సుఖమనే కాంతి ఎంతకాలం తెలుస్తుంది? పుట్టిన ప్రతివ్యక్తిని కబళించేందుకు మృత్యువు పొంచియే ఉంది. నీటివంతా కార్చేసుకొని మేఘం నామరూపాలు లేకుండా పోయినట్లు, ఆయువును కార్చుకుంటూ మానవులంతా ఈ ప్రపంచంలో అదృశ్యమై పోతున్నారు.

**ఆఖుర్మార్జార కేణేవ మరణే నావలోక్యతే**

"పిల్లి ఎలుకకై పొంచియున్నట్లు మరణము మనిషికై నిరీక్షిస్తూంది" అని యోగవాసిష్ఠము. ఈ దేహం చెప్పి రాలేదు. అందుచేత పోయేటపుడు చెప్పకుండానే పోతుంది. మన మధ్యకు వచ్చిన పిచ్చివాడు ఎపుడు లేచివెళ్తాడో ఎవరికి తెలుసు? ఈ ప్రపంచంలో చరించే శరీరాలు ఎపుడు కనుమరు గవుతాయో ఎవరు ఊహించగలరు? దేహం ఏనాడు రాలిపోతుందో తెలియకపోవచ్చు కాని రాలిపోవడం, పారిపోవడం సత్యమనే విషయం మాత్రం అందరికీ తెలుసు. ఇక అనిత్యమైన ఈ దేహాదులకై విచారమెందుకు?

**Weep not, for such is here the life of man**
**unasked he came, unbidden went he hence**
**Lo! ask thyself again whence came thy son**
**To bide on earth this little breathing space**
**By one way come and by another gone.**
**So hither and so hence - why should Ye weep?**

"విలపించకు. మనిషి బ్రతుకు ఇక్కడ ఇంతే. ఈ ప్రపంచంలోకి మనిషి రమ్మనకనే వచ్చాడు. పొమ్మనకనే పోతున్నాడు. ఈ ప్రపంచంలో స్వల్పకాలము మాత్రమే జీవించుటకు నీ కుమారుడు ఎక్కడనుండి వచ్చాడో నిన్నే నీవు ప్రశ్నించుకో. ఈ వైపునుండి వచ్చాడు. ఆవైపు నుండి పోతున్నాడు. ఇక్కడికి అంతే. అక్కడికి అంతే. నీవెందుకు దుఃఖిస్తావు?" అని బిడ్డల్ని పోగొట్టుకున్న తల్లుల్ని 'పతాచార' అనే బౌద్ధసన్యాసిని ఓదార్చుతూ ఉండేదట.

అనిత్యమైన ఈ దేహాలన్నీ కనికరంలేని కాలంలో కదుల్తున్నాయి. కాలం చాలా విచిత్రమైంది. అదొక మహేంద్రజాలము. చేర్చేది కాలమే. చెడిపేది కూడా కాలమే. ఈ విషయాన్ని భరతునికి రాముడు విశదం చేస్తున్నాడు.

**అత్యేతి రజనే యాతు సా న ప్రతినివర్తతే**
**యాత్యేవ యమునా పూర్ణా సముద్ర ముదకాకులమ్**

"భరతా! పోయిన రాత్రి తిరిగి రాదు. నీరు నిండిన యమునానది జలపూర్ణమైన సాగరములో ప్రవేశించిన పిమ్మట మళ్ళీ తిరిగిరాదు కదా!

"గ్రీష్మఋతువులో సూర్యుని కిరణాలు జలములను పీల్చివేయునట్లు, గతిస్తున్న దివారాత్రములు ప్రాణుల ఆయుర్దాయమును హరిస్తున్నాయి.

"నాయనా! కూర్చున్నా, నిలబడినా లేదా నడుస్తున్నా నీ ఆయువు క్షీణించిపోతూనే వుంది. అందుచేత నీవు నిన్నుగూర్చి ఆలోచించాలేగాని ఇతరులను గూర్చి కాదు.

**సహైవ మృత్యుర్వ్రజతి సహ మృత్యుర్నిషీదతి**
**గత్వా సుదీర్ఘ మధ్వానం సహ మృత్యుర్నివర్తతే**

"భరతా! మానవుడు ఎక్కడికి వెళ్ళినా మృత్యువు అతనిని అనుసరించి వెళ్తున్నది. కూర్చున్నవాడు ఎవడైనా మృత్యువుతోవే కూర్చుంటున్నాడు. ఎంతదూరం ప్రయాణము చేసినా మృత్యువు కూడా కలిసి ప్రయాణం సాగిస్తూనే వుంది.

"సూర్యుడు ఉదయించగానే మానవులు పనులలోకి దూకుతున్నారు. సూర్యుడు అస్తమించగానే పడకపైకి ఉరుకుతున్నారు. ఆయువు క్షీణిస్తూవుంది అనిమాత్రము గ్రహించలేకున్నారు.

"క్రొత్త ఋతువు రాగానే క్రొత్త పుష్పాలొచ్చాయని, క్రొత్త ఫలాలొస్తాయని జనులు సంతోషిస్తుంటారు. అంతేగాని,

**ఋతూనాం పరివర్తేన ప్రాణినాం ప్రాణ సంక్షయః**

తెలుసుకోలేక

"ఋతువులు మారుతూ ఉంటే తమ ఆయువు క్షీణిస్తున్నట్లు పోతున్నారు.



"సముద్రములోకి కొట్టుకొచ్చి కలిసిన కర్రలు ఒకదానితోఒకటి కలవడం, విడిపోవడం జరుగుతూ ఉంటుంది. భార్యాపుత్రాదులు, బంధువులు, ఆస్తిపాస్తులు అన్నీ అలాంటివే.

"ఈ ప్రపంచంలో ఎవడికీ కోరిందల్లా లభించదు. కనుక ఎంత దుఃఖించినా పోయిన వాడు రాడు. ఒక బాటసారి దారిన వెళ్తూవుండగా మరొకడు "నేనూ మీతో వస్తాను" అని అనుసరించునట్లు, ఈ ప్రపంచంలో పోయినవారిని అనుసరించి ఉన్నవాళ్ళు పోతున్నారు," అంటూ భరతునితో సహా తన తమ్ముళ్ళను, తల్లులను, మంత్రులను, పౌరులను తన భావమారుతముచే కదలించి ఎక్కడికో తీసికొని పోతున్నాడు రాముడు.

రాజ్యము, అధికారము అనిత్యమైనది అంటూ రాజ్యసంబంధమైన విషయాన్ని భరతుని మనసునుండి తొలగించాడు. ధనము, భోగాలు కూడా మెరపులాంటివి కనుక వాంఛనీయమైనవి కావని త్రోసిపుచ్చాడు.

ఇక భరతుని దుఃఖానికి కారణమైంది సోదర బాంధవ్యము. అది కూడిన ప్రవాహంలో కొట్టుకొచ్చిన కర్రల మధ్య నిలిచిన బాంధవ్యం లాంటిదేనని మనసునుండి తుడిపేశాడు. ఇంకేమి మిగిలుంది? తండ్రి మరణము. జననమరణాలు కూడా మనిషి చేతుల్లో లేవని, కాలాధీనమని కొట్టిపారేశాడు. ఇవన్నీ చెప్పి ఇపుడు అసలు విషయానికి వస్తున్నాడు.

"భరతా! జలప్రవాహంలాగా వెనక్కి తిరగకుండా వయసు దాటిపోతోంది. ఇది తెలిసి రాజైనవాడు ఏది సుఖప్రదమో దానియందు మనసును లగ్నం చేయాలి. రాజు చేసే అట్టి ఆలోచన వల్ల ప్రజలుకూడా సుఖిస్తారు.

"నాయనా! మన తండ్రి అనేక పుణ్యకార్యాలు చేశాడు. యజ్ఞదానాది కార్యక్రమాల్ని విశేషంగా ఆచరించాడు. వాటి ఫలితంగా స్వర్గాన్ని చేరాడు.

"కుమారా! తండ్రిగారిని గూర్చి బాధెందుకు? ఆయన పూర్ణ ఆయుర్దాయమును పొంది సుఖించాడు. ఉత్తమ భోగా లనుభవించాడు. బుధజనులచేత గౌరవింపబడ్డాడు. అట్టి నాన్నగారిని గూర్చి విచారించాల్సిన పనిలేదు. శిథిలమైన దేహాన్ని వదలిపెట్టి ఆయన దేవతలు పొందే దివ్యదేహాన్ని పొందాడు.

"ధీశక్తి గలవాడు భీతి చెందకూడదు. సదా ధైర్యవంతుడై ఉండాలి. ఎట్టి ఆపదలొచ్చినా ఇలా దుఃఖించడము, కన్నీళ్ళు కార్చడము చేయకూడదు.

"నాయనా! భరతా! దుఃఖించకు. శాంతించు. తిరిగివెళ్ళి చక్కగా అయోధ్యను పాలించు. ఇది మన తండ్రిగారి ఆజ్ఞ. మన తండ్రి ధర్మాత్ముడు. పవిత్రాత్ముడు. ఆయన ఆజ్ఞను నేను శిరసావహిస్తాను.

**న మయా శాసనం తస్య త్యక్తం న్యాయ్యమరిన్దమ**
**తత్త్వయాపి సదా మాన్యం స వై బన్ధుః స నః పితా ॥**

"భరతా! మహారాజుగారి ఆజ్ఞను నేను ఉల్లంఘించ కూడదు. నీవు కూడా దానిని గౌరవించాలి. ఎందుచేతనంటే ఆయన మనకు బంధువు. మన తండ్రి.

"కనుక వనములో వుండి ఆయన ఆజ్ఞను నేను పాలిస్తాను. మన తండ్రి గొప్ప చరిత్ర కలవాడు. అది గ్రహించి నీవు పరిపాలించు;" అని పలికి తన సుదీర్ఘ ప్రతివాదాన్ని రాముడు విరమించాడు.

# భరతుని అభ్యర్థన

రాముని మాటలను ఆలకించిన భరతుడు మరల రాముని అభ్యర్థిస్తూ పలకడం ప్రారంభించాడు.

**కో హి స్యాదీ దృశో లోకే యాదృశ స్త్వమరిన్దమ**
**న త్వాం వ్యవథయే ద్దుఃఖం ప్రీతిర్వా న ప్రహర్షయేత్**

"శత్రువులను సంహరించు రామా! దుఃఖాలు నిన్ను బాధపెట్టలేవు. సుఖాలు నిన్ను సంతోషపెట్టలేవు. అట్టి నీతో ఈ ప్రపంచమున సమాను డెవరు?"

"అన్నా! జీవించియున్నవారి విషయమునందు, మరణించియున్నవారి విషయమునందు, చెడ్డవాని విషయమున గాని, మంచివాని విషయమున గాని రాగద్వేషములు లేని నీకు దుఃఖమును ఏ శక్తీ కలిగించలేదు.

"మహారాజా! సత్యాసత్యములు, ధర్మాధర్మముల తారతమ్యమును గ్రహింపగలిగే నీవు ఇలా బాధలు అనుభవించ కూడదు.

"రామా! నీవు దేవతలతో సమానమైనవాడవు. సత్యమైన ప్రతిజ్ఞ కలవాడవు. సర్వజ్ఞుడవు. సర్వవిదుడవు. సర్వదర్శివి;" ఇది భరతుడు ప్రస్తుతం సోపానక్రమంగా వినిపించబోయే వాదనలో ప్రథమ సోపానం.

తండ్రి ఆజ్ఞను పాలిస్తూ తాను అరణ్యములో, భరతుడు అయోధ్యలో ఉండడమే సముచితమని రాముడు నిర్ణయించాడు. అరణ్యములో జీవించడము తనవరకు బాధ కానట్లే రాముని మాటల్లో ధ్వనిస్తూఉంది.

అది వాస్తవమేనని భరతుడు అంగీకరిస్తున్నాడు. సుఖదుఃఖాలకు రాముడు అతీతుడని చెబుతున్నాడు. అందుచేతనే రాముని శత్రుసంహారకా! అని సంబోధించాడు **(అరిన్దమ)**.

రాముడికి బాహ్యంలో శత్రువులు లేరు. ఒకవేళ బాహ్యశత్రువుల్ని జయించినంత మాత్రాన వ్యక్తి సుఖదుఃఖాలకు అతీతుడు ఎలా కాగలడు? ఇంద్రియ మనోబుద్ధులతోపాటు, కామక్రోధాదు లనెడి అంతశ్శత్రువులను జయించగలవారే సుఖదుఃఖాలకు అతీతులు కాగలరు.

రాముడు స్థితప్రజ్ఞుడై ఇంద్రియాలను జయించినవాడు కనుక ఆయనకు సుఖము ఆనందాన్ని ఇవ్వలేదు. దుఃఖము బాధను పంచలేదు. అట్టి వారెందరుంటారు? **"కోహి స్యాదీదృశో లోకే"** ఈ లోకములో నీతో సమాన మెవరు? అని భరతుడు రామునితో పలికాడు.

ఇక్కడ మనమొక విషయాన్ని గ్రహించాలి. రాముని అయోధ్యకు ఆహ్వానించడం కేవలం రామునికోసం మాత్రము కాదు అనేది ఇక్కడ భరతుని వాదన. సుఖదుఃఖాలకు అతీతుడైన రాముడు ఎక్కడైనా ఉండగలడు. కానీ రాముని అవసరము రాజ్యానికి, పౌరులకు ఉంది అంటాడు భరతుడు.

జీవించినవారి విషయంలో, మరణించినవారి విషయంలోను, మంచివారి విషయంలో, చెడ్డవారి విషయంలోను రామునికి రాగద్వేషాలు లేవంటున్నాడు భరతుడు. ఇదికూడా గమనించదగిన విషయమే.



దశరథుడు మరణించాడు. కానీ మంచివాడు. కైకేయి బ్రతికిఉంది. కానీ దుష్టురాలు. వీరిద్దరి వల్లనే రాముడు అయోధ్యను వదలి అరణ్యానికి రావలసి వచ్చింది. వాస్తవానికి ఇద్దరు చెడు చేసినవారే. కనుక ఇద్దరికీ ఈ విషయంలో ప్రాముఖ్యత నివ్వాల్సిన అవసరం లేదు అనేది భరతుని వాదం. ఈపాటి ఉపోద్ఘాతంతో విషయాన్ని ప్రవేశపెడుతూ తన వాదాన్ని వినిపిస్తున్నాడు భరతుడు.

"అన్నా! నేను దేశాంతరంలో ఉన్నప్పుడు నా తల్లి ఈ పాపాన్ని నాకొరకు చేసింది. ఇది నాకు సమ్మతం కాదు. ఆమె చేసిన పనిని నేను అంగీకరించడం లేదు. నన్ను అనుగ్రహించు.

**ధర్మబన్ధేన బద్ధోఽస్మి తేనేమాం నేహ మాతరమ్**
**హన్మి తీవ్రేణ దణ్డేన దణ్డార్హాం పాపకారిణీమ్**

"నా తల్లి పాపకార్యము చేసింది. ఆమె దండార్హురాలు. నేను ధర్మబద్ధుడను. అందు చేత, ఆమెను వధించలేకపోయాను;" అని రాముడు అంగీకరించని, ఆలకించను ఇష్టపడని విషయాన్ని, తనవాదానికి బలమును చేకూర్చే ముఖ్యాంశములలో ఒకటిగా భరతుడు ప్రతిపాదించాడు.

తనకొరకు తల్లి చేసిన ఈపని పాపభూయిష్టమైంది. ఆ కార్యంలో తన ప్రమేయం లేదు. (ఈ విషయాన్ని రాముడే ధృవపరచాడు). తనకు తెలియకుండా తనవిషయంలో దుష్టురాలైన తల్లి చేసిన పాపము దండార్హమైనది. అయినా ధర్మానికి భయపడి ఆమెను వధించలేదు గాని తల్లి అనే ప్రేమతో కాదు. అంతేగాకుండా అలాచేస్తే, ఆ కార్యాన్ని రాముడు గర్హిస్తాడనే భయంకూడా ఉన్నట్లు భరతుడు ముందొకసారి చెప్పివున్నాడు కూడా.

తల్లి పాపంచేసినా ధర్మవశుడై భరతుడు చంపలేదు. కనుక తాను ధర్మానికి బద్ధుడైన వాడని, ఇపుడు అయోధ్యకు రమ్మని ఆహ్వానించడము కూడా ధర్మపరిధి లోనిదేనని పరోక్షంగా తెలుపుతున్నాడు.

భరతుడు చెప్పినట్లు, రాముడు తిరిగి అయోధ్యకు వెళ్ళడం ధర్మమైతే, మరి తల్లిదండ్రులకు ఇచ్చిన మాట విషయమేమిటి? అది అధర్మ మనిపించుకోదా? ఈ విషయాన్ని రాముడు ప్రస్తావించవచ్చు. ఆ అవకాశాన్నికూడా రామునికి ఇవ్వకూడదని నిర్ణయించుకొనిన భరతుడు తల్లిదండ్రుల కిచ్చిన మాటను ఉల్లంఘించడంలో అధర్మం లేదని చెబుతూ, పైగా అలా ఉల్లంఘించడమే ధర్మమని, తల్లిదండ్రులకు హితం చేయాలంటే అదొక్కటే మార్గమని ఒక విచిత్రమైన వాదనను వినిపిస్తున్నాడు.

కైకేయిని దుష్టురాలని నిందించాడు. ఆవిడ చేసిన పాపము నిందార్హమైనది అని చెప్పాడు. బాగానేవుంది. మరి దశరథమహారాజు విషయమేమిటి? అట్టి ధర్మాత్ముడి నిర్ణయాన్ని పాటించాలా? లేదా? అవసరం లేదంటాడు భరతుడు. ఇంతవరకు కైకేయి చేసింది తప్పు అని వాదిస్తూవుండిన భరతుడు ఒక్కసారి అటుతిరిగి దశరథుడు చేసిందికూడా తప్పేనని విచిత్రంగా, ఉత్కంఠత గొలిపే రీతిలో వాదించుటకు ప్రారంభించాడు.

**గురుః క్రియావాన్ వృద్ధశ్చ రాజా ప్రేతః పితేతిచ**
**తాతం న పరిగర్హేయం దైవతం చేతి సంసది**

"దశరథమహారాజు నాకు గురువు. క్రియావంతుడు. పెద్దవాడు. తండ్రి. స్వర్గ మరణించినాడు. దేవత వంటివాడు అగుటచే తండ్రిని ఈ సభలో నేను నిందించడం లేదు;" అంటూ దశరథునిపై మొదటి శరాన్ని సంధించాడు భరతుడు.

దశరథుని నిర్ణయం న్యాయసమ్మతం కాదని, అతడు మరణించుటవల్లనే తన నిందలు వినలేకపోయాడని, బ్రతికి ఉన్నట్లయితే కైకేయిని నిందించినట్లే తండ్రిని కూడా నిందించేవాడనే విషయాన్ని భరతుడే స్పష్టంచేశాడు. కైకేయిని ఎంత దూషించినా తప్పుచేసింది కనుక దొంగకు తేలు కుట్టినట్లు భరిస్తూవుంది. ఒకవేళ దశరథుడు జీవించియుండినా ఆయన పరిస్థితికూడా కైకేయికంటే మెరుగ్గా ఉండేది కాదు అనేవిషయం కూడా భరతుని మాటల్లో ధ్వనిస్తూవుంది.

**కోహి ధర్మార్థ యోర్హీన మీదృశం కర్మ కిల్బిషమ్**
**స్త్రియాః ప్రియం చికీర్షు స్సన్ కుర్యాద్ధర్మజ్ఞ ధర్మవిత్**

"ధర్మజ్ఞుడైన రామా! స్త్రీని సంతోషపెట్టేందుకు ధర్మార్థాలకు విరుద్ధమైన ఈ దుష్టకార్యాన్ని ఎవడైనా చేస్తాడా?

దశరథుడు చేసింది ధర్మవిరుద్ధమని భరతుడు వాదిస్తున్నాడు. భరతుడు చూపిన కారణాలకన్నా వేరైన కారణాలనుకూడా కొందరు చూపియున్నారు. కానీ అవి పరీక్షకు తట్టుకోలేవు.

దశరథుడు కైకేయికి వరాలిచ్చాడు. ఆ కారణంగా రాముని అరణ్యాలకు పంపాడు. బాగుంది. మరి రాముని రాజ్యాభిషిక్తుని గావిస్తున్నట్లు ముందుగానే సభలో ప్రతిజ్ఞ చేసినాడు కదా? మరి రాముని అరణ్యానికి పంపితే అది భగ్నం కాలేదా? వ్రతభంగం జరిగినట్లు కాదా?

ఈ వాదన సరైంది కాదు. సభలో దశరథుడు వరాలు ఇవ్వలేదు. ప్రతిజ్ఞ పూనిందీలేదు. అది తన నిర్ణయం. అవసరమైతే దశరథునికి దానిని మార్చుకొనే హక్కుంది. ఇక్కడ ధర్మాధర్మాల ప్రసక్తి లేదు.

కానీ, ఒక స్త్రీని సంతోషపెట్టేందుకు దశరథుడు ఈ పాపకర్మను చేశాడు అనేది భరతుని అభియోగం. మరి దశరథుడు ధర్మాత్ముడని భరతుడే చెప్పాడుకదా! అలాంటప్పుడు ధర్మాత్ముడైన దశరథుడు పాపకార్యాన్ని ఎలా చేయగలడు?ఒకవేళ దశరథుడు పాపం చేసింది వాస్తవమే అయితే, అట్టి దశరథుని ధర్మాత్ముడని భరతుడు ఎందుకు పలికాడు?

దీనికి సమాధానం కూడా భరతుడే చెప్తున్నాడు. దశరథుడు ధర్మాత్ముడే. ఈ ఒక్క విషయమునందే అధర్మంగా ప్రవర్తించాడంటూ దానికి కారణం చెప్తున్నాడు.

**అన్తకాలేహి భూతాని ముహ్యన్తీతి పురాశ్రుతిః**

"వినాశకాలమందు విపరీతబుద్ధి" అనే సూక్తి ఒకటి ప్రాచీనంగా ఉంది. అది సత్యమని దశరథుడు నిరూపించాడు అంటాడు భరతుడు.

వయసు మీరినపుడు బుద్ధి మందగిస్తుంది. దశరథుడు ఆవిధమైన బుద్ధి బలహీనతలోనే ఈ కార్యం చేశాడని భరతుని వాదన. ఈవిధంగా దశరథుని ధర్మవిరుద్ధ కర్మను చేసినవానిగా ప్రతిపాదిస్తూ, రామునికి సంబంధించిన అతిముఖ్య విషయాన్ని ప్రస్తావిస్తున్నాడు. న్యాయవాది



న్యాయమూర్తిని సంతృప్తి పరచే రీతిలో తన వాదంలో పట్టుగలిగిన విషయాన్ని చివరగ వినిపిస్తున్నాడు. రెండు శ్లోకాలలో తన మనోభావాన్ని రాముని ముందుంచి, తిరిగి ఆలోచన చేయవలసిందిగా రాముని అభ్యర్థిస్తున్నాడు.

**సాధ్వర్థ మభిసన్ధాయ క్రోధా న్మోహాచ్చ సాహసాత్**
**తాతస్య యదతిక్రాన్తం ప్రత్యాహరతు తద్భవాన్**
**పితుర్హి సమతిక్రాన్తం పుత్రో యస్సాధు మన్యతే**
**తదపత్యం మతం లోకే విపరీత మతోఽన్యథా!**

"అన్నా! కోపం కావచ్చు. అజ్ఞానం కావచ్చు. సాహసం కావచ్చు. ఏదయితేనేమి? నాన్న ధర్మాన్ని త్రోసిపుచ్చారు. కనుక నీవు చక్కగా విషయాన్ని ఆలోచించి ధర్మవిరుద్ధమైన ఈ కార్యాన్ని మరొకదారికి మళ్ళించాలి.

"రామా! తండ్రి చేసిన ఉత్తమకార్యాన్ని అభినందించువాడే ఉత్తముమైన పుత్రుడు. తండ్రి చేసిన పాపకార్యాన్ని సమర్థించువాడు పుత్రుడు కాడు;" అన్నాడు భరతుడు.

ఏవిధంగానో దశరథుడు అధర్మంగా వర్తించాడు. దానిని చక్కచేయవలసిన బాధ్యత బిడ్డముందు ఉంది అంటాడు భరతుడు. తండ్రి అప్పుచేసి మరణిస్తే పుత్రుడు తీర్చినట్లు, తండ్రి తప్పుచేసి మరణిస్తే దానిని చక్కచేయవలసిన వాడుకూడా పుత్రుడే అనేది భరతుని వాదం.

ఈ సందర్భమున **"అపత్యం"** అనేపదాన్ని ఉపయోగించడమే భరతుని బుద్ధి వైశారద్యము.

అపత్యం అంటే పుత్రుడు అని భావము. అంటే తండ్రిని ధర్మవిషయమునందు పతనం కాకుండా చూసేవాడని అర్థము.

తండ్రి తప్పుచేసి ఉండొచ్చు. దానిని సరిచేయుట పుత్రునియొక్క ధర్మము. అందుచేతనే పుత్రుడు "అపత్యం" అనే పదముచేత పిలువబడ్డాడు. తండ్రి చేసిన తప్పిదాన్ని చక్కచేయవలసిన బాధ్యత పుత్రుడైన రామునిమీద ఉంది అంటాడు భరతుడు. అందుచేత,

**తదపత్యం భవానస్తు మా భవాన్ దుష్కృతం పితుః**

"అన్నా! నీవు అపత్యుడివికా! తండ్రి చేసిన పాపకర్మను సమర్థించకు."

"అన్నా! తండ్రి అధర్మ ప్రవర్తనను నీవు సమర్థిస్తే అతడు పతనమౌతాడు. స్వర్గ ప్రవేశాన్ని పోగొట్టుకుంటాడు. సరియైన కార్యంచేసి నాన్నను రక్షించు" అన్నాడు భరతుడు.

"అన్నా! రామా! అరణ్య మెక్కడ? అయోధ్య ఎక్కడ? రాజ్యాభిషిక్తుడివికా! ఇదియే క్షత్రియధర్మము. నీ పరిపాలన ద్వారా మమ్మల్నందరిని సంతోషపెట్టు.

"నేను నీకంటె చిన్నవాడను. పుట్టుకలో, విద్యలో నేను నీకంటె చిన్నవాణ్ణి. నీవు ఉండగా నేను రాజ్యాన్ని ఎలా పరిపాలిస్తాను? అలా కాకపోయినా, నీవు లేకుండా నేను దానిని ఎలా స్వీకరిస్తాను? అన్నా! నీవు లేకుండా నేను జీవించలేనుకదా!

"తండ్రీ! నామాట విను. నేను అయోధ్యనుండి అభిషేకసామగ్రి నంతా వెంటతీసికొని వచ్చాను. పౌరులు చాలామంది వచ్చియున్నారు. గురువులు, రాణులు, మిత్రులు, అమాత్యులు

అందరూ వచ్చియున్నారు. సైన్యమంతా ఇక్కడే ఉంది. మంగళవాద్యాలు కూడా సిద్ధమే. నీవు ఇక్కడే అభిషిక్తుడవై దేవేంద్రునిలాగా మాతో అయోధ్యకివచ్చి, నీ చల్లని చూపులతో మమ్మల్ని ధన్యుల్ని గావించు.

"అన్నా! నీవు రాజ్యాభిషిక్తుడవైతే తండ్రిగారు స్వర్గంలో ప్రవేశిస్తారు. నా తల్లిమీద జనులకు వున్న కోపము తగ్గుతుంది. వారు ఇక ఆమెను శాపాలు పెట్టడం మానేస్తారు. నీ స్నేహితులంతా సంతోషిస్తారు.

"నీకు శిరమోడ్చి నమస్కరిస్తున్నాను. పరమేశ్వరుడు ప్రాణులను కాపాడునట్లు మమ్మల్ని కాపాడు.

"రామా! నామాట కాదని వనాల్లో ఉండడానికే నీవు నిర్ణయించుకుంటే నేనూ అడవుల్లోనే ఉండిపోతాను;" అన్నాడు భరతుడు.

భరతుడు ఎంతచెప్పినా రాముడు చలించలేదు. హిమవత్పర్వతమువలె స్థిరంగా ఉన్నాడు. భరతుని వాదనతో తాను ఏకీభవించినట్లు రాముడు గోచరించలేదు.

**తదద్భుతం స్థైర్య మవేక్ష్య రాఘవే**

**సమం జనో హర్ష మవాప దుఃఖితః**

**నయాత్య యోధ్యామితి దుఃఖితో ఽ భవత్**

**స్థిరప్రతిజ్ఞత్వ మవేక్ష్య హర్షితః**

"రామునియందు గోచరించిన అద్భుతమైన ఈ మనోస్థైర్యమును చూచి జనులందరూ శోకముతోపాటు హర్షమునుకూడా అనుభవించారు. అయ్యో! రాముడు అయోధ్యకు వచ్చుట లేదే? అని దుఃఖించారు. ఆడినమాట తప్పని రాముని స్థిరత్వానికి సంతోషించారు" అంటాడు వాల్మీకిమహర్షి.

రాముడు దృఢనిశ్చయము కలవాడు. ధర్మమును త్యజించుటకు అంగీకరించడు. సత్యదూరుడై జీవించలేడు.

రాముడు మహాత్యాగి. ఇప్పటికి రెండుసార్లు రాజ్యమును త్యాగం చేశాడు. అప్పుడు అయోధ్యలో త్యాగం చేశాడు. ఇప్పుడు చిత్రకూటంలో త్యాగం చేశాడు.

రాముడు తనమాటను తృణీకరించి అయోధ్యలోనే ఉండిపోతే బాగుండును అని దశరథుడు భావించాడు. పౌరులంతా వెళ్ళవద్దని రథానికి అడ్డుపడ్డారు. ఎదిరించైనా రాజ్యాన్ని చేజిక్కించుకొని రామునికి రాజ్యాభిషేకం చేయాలని లక్ష్మణుడు సిద్ధపడ్డాడు. వెళ్ళడానికి వీలులేదని తల్లిగా కౌసల్య ఆజ్ఞాపించింది.

రాజ్యం కావాలని అభిలషించివుంటే, పై కారణాలలో ఏదో ఒకదాని పంచన నిలబడి రాముడు రాజయ్యేవాడు. ధర్మం ప్రక్కన నిలబడడమే రామునికి ఇష్టం కనుక అందరికీ దూరమై వనాల్లో వసిస్తున్నాడు.

చిత్రకూటంలో మళ్ళీ ఈనాడు అవకాశ మొచ్చింది. దానినికూడా సంతోషంగా తిరస్కరించాడు. అధర్మంతో సుఖించడంకన్నా ధర్మంతో కష్టా లనుభవించడమే శ్రేయస్కరమని రాముని అభిమతం. అదియే అతని మతం.



# శ్రీరాముని ఆదేశం

"భరతా! దశరథమహారాజుకి, కైకేయికి కుమారుడవైన నీవు చెప్పింది నీ యోగ్యతకి తగినట్లు బాగానేవుంది. కానీ నీకు తెలియని విషయాన్ని చెబుతాను. విను.

"మీ అమ్మ కైకేయిని వివాహమాడినపుడు మీ తాత అయిన కేకయరాజుకు ఒక వాగ్దానం చేశారు నాన్నగారు. మీ తల్లి కడుపున పుట్టినవానికి రాజ్యము ఇస్తానని చెప్పాడు.

"దేవదానవ సంగ్రామం జరిగినపుడు మీ అమ్మ సేవలకు తృప్తిచెందిన మహారాజు ఆమెకు వరము ఇచ్చి ఉన్నాడు. తల్లి అయిన కైకేయి రాజుగారిచేత ఒట్టుపెట్టించుకొని నీవు రాజ్యము పాలించునట్లు, నేను వనవాసము చేయునట్లు రెండువరాలు కోరింది. ఆమె కోర్కెకు బద్ధుడై తండ్రిగారు అంగీకరించారు. నాన్నగారి సత్యవాక్కును పాలించుటకు సీతాలక్ష్మణులతో కలిసి నేను అడవికి వచ్చాను. నీవుకూడా నాన్నగారి మాటయందు స్థిరంగా నిలిచి రాజ్యాన్ని పాలించు" అని భరతుని వాదాన్ని నిర్హేతుకంగా నిర్ణయించి నిరాకరించేందుకు సంకల్పించిన రాముడు తన ప్రతివాదాన్ని ఈవిధంగా మొదలుపెట్టాడు.

కైకేయిని పెళ్ళాడినపుడు దశరథుడు కేకయరాజుకి ఇచ్చిన మాటను, చేసిన ప్రతిజ్ఞను రాముడు ఇక్కడ ప్రస్తావించాడు. ఈవిషయాన్ని ఇంతవరకు ఎవరూ ప్రస్తావించలేదు.

కేకయరాజుకు దశరథుడు చేసిన వాగ్దానం విషయం ఎవరికి తెలిసినట్లు? కైకేయికి తెలిసివుంటే ఆమె తప్పక ఆవిషయాన్ని ముచ్చటించి ఉండేది. మంథరకు తెలిసిఉంటే కైకేయికి జ్ఞాపకంచేసి ఉండేది. అలాంటిదేమీ జరుగలేదు. ఈవిషయాన్ని నేను ముందే చర్చించినాను.

మరి దశరథుడు కైకేయిని వివాహమాడినపుడు చేసిన వాగ్దానం రాముడికి ఎలా తెలుసు? కౌసల్యకి తెలిసే ఉంటుంది కనుక కౌసల్య అయినా చెప్పివుండాలి. లేదా వసిష్ఠునికి తెలిసి ఉంటుంది కనుక రామునికి ప్రియుడు, సలహాదారు అయిన వసిష్ఠుని కుమారుడు సుయజ్ఞుడైనా చెప్పివుండాలి. వనాలకు బయలుదేరే ముందు రాముడు తన దగ్గరున్న ధనాన్ని దానా లివ్వాలని సంకల్పించినపుడు ముఖ్యంగా లక్ష్మణుని ద్వారా సుయజ్ఞుని పిలిపించాడుకూడా.

రాముడు కేకయరాజుకు దశరథుడు ఇచ్చిన మాటను ప్రస్తావించినపుడు వసిష్ఠుడు, సుమంత్రుడు కూడా అక్కడే ఉన్నారు. వారెవరుకూడా అది కాదని అనలేదు. ఒకవేళ వసిష్ఠుడు, కౌసల్య చెప్పకపోయినా సుమంత్రుడు రాముడికి చెప్పే అవకాశంకూడా లేకపోలేదు.

దశరథుడు చేసిన వాగ్దానాన్ని ఉటంకిస్తూ దానిని సఫలం చేయాల్సిన బాధ్యత బిడ్డలకు ఉందా? లేదా? అని పరోక్షంగా భరతుని ప్రశ్నిస్తున్నాడు రాముడు. జ్యేష్ఠుడు కనుక రాముడొక్కడే తండ్రి మాటను పాలించాలా? లేక తండ్రి మాటను పాలించవలసిన బాధ్యత బిడ్డలందరికీ ఉందా?

అందరికీ ఉండేటట్లయితే తాను వనవాసము చేస్తున్నట్లే, రాజ్యపాలనము చేసి తండ్రి మాటను నిలబెట్టమని భరతుని ప్రోత్సహిస్తున్నాడు రాముడు. ఈ సందర్భములో దశరథమహారాజు, కైకేయిల ముద్దుబిడ్డగా భరతుని అభివర్ణించి సంబోధించాడు రాముడు.

ఈ విషయం భరతుని పితామహుల, మాతామహుల ప్రతిష్ఠకు సంబంధించిన విషయంగా తెలుపుతూ, తల్లిదండ్రుల మాటను కాపాడవలసిన బాధ్యత భరతునిపై కూడా ఉందని రాముడు చాలా సూక్ష్మంగా ప్రతిపాదిస్తున్నాడు.

భరతుడు తండ్రి మాటను పాలించ నవసరం లేదని ముందు రామునితో చెప్పినపుడు అపత్యం' అనే పదాన్ని ప్రయోగించి తండ్రి పతనాన్ని నిరోధించాల్సిన బాధ్యత కుమారునిపై ఉన్నందున కుమారుని 'అపత్యం' అన్నారని తెలుపుతూ, ధర్మవిరుద్ధంగా దశరథుడు చేసిన నిర్ణయాన్ని ఉల్లంఘించడం వలన పతనమైన తండ్రిని రక్షించినట్లు అవుతుందని ఒక విచిత్రమైన వాదనను వినిపించాడు. దానికి రాముడు సమాధానం చెప్తున్నాడు.

"భరతా! మరొక విషయాన్ని కూడా విను. పూర్వం మహాత్ముడైన గయుడు పితృ దేవతలను గూర్చి గయలో యాగంచేస్తూ ఏమిచెప్పాడో నీవు వినేవుంటావు. నేను నీకు అది జ్ఞాపకం చేస్తున్నాను. అంతే.

**పున్నామో నరకాద్యస్మాత్ పితరం త్రాయతే సుతః**
**తస్మాత్ పుత్ర ఇతి ప్రోక్తః పితౄన్ యః పాతి సర్వతః**

"కుమారుడు తండ్రిని 'పుత్' అనే నరకమునుండి కాపాడుతాడు. సర్వవిధాల పితృదేవతలను రక్షిస్తాడు. అందుచేత కుమారునికి పుత్రుడు అనే పేరు వచ్చింది.

"నాయనా! భరతా! ఇప్పు డర్థమయిందా? తండ్రి ఇచ్చిన మాటను పాలించడమువల్ల మనం తండ్రిగారిని నరకంనుండి కాపాడాలి. నేను ఎలాగూ ఇక్కడ ఉండి నా ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాను. నీవు అయోధ్యకి వెళ్ళి నీ ధర్మాన్ని రక్షించు. మనిద్దరము ఆచరించే ధర్మంవల్ల తండ్రిగారికి మేలు జరుగుతుంది.

"భరతా! నీవు అయోధ్యకు రాజువి. నేను అరణ్యానికి రాజుని. నీవు పౌరులను పాలిస్తావు. నేను మృగాలను పాలిస్తాను. తెల్లని గొడుగు నీకు నీడనిస్తుంది. దట్టమైన చెట్లు నాకు ఛాయను ప్రసాదిస్తాయి. శత్రుఘ్నుడు నీకుతోడు. లక్ష్మణుడు నాకుతోడు. మనం నలుగురు పుత్రులము కలిసి తండ్రి మాటను నిలబెట్టాలి.దుఃఖించకు" అన్నాడు ధర్మాత్ముడైన రాముడు.

## నాస్తిక దర్శనం

రాముడు ఈవిధంగా ధర్మప్రబోధం గావిస్తూ నచ్చచెబుతూ వున్నాడు. భరతుని అనుసరించి వచ్చిన బ్రాహ్మణముఖ్యులలో ఒకడైన జాబాలి పెడవాదం, పిడివాదం చేయడం ప్రారంభించాడు.

"రామా! నీవు గొప్ప బుద్ధిమంతుడవు. మూర్ఖునివలె ప్రసంగిస్తున్నావు. నిరుపయోగమైన ఇలాంటి ఆలోచనలు నీలాంటివాడు చేయకూడదు.

**కఃకస్య పురుషో బన్ధుః కిమాప్యం కస్య కేనచిత్**
**యదేకో జాయతే జన్తు రేక ఏవ వినశ్యతి**

"ఎవడైనా ఒక్కడే పుడుతున్నాడు. ఒక్కడే మరణిస్తున్నాడు. అలాంటప్పుడు ఎవడు ఎవడికి బంధువు? ఎవడు ఎవనినుంచి ఏమి పొందగలడు?



"రామా! తల్లి, తండ్రి అంటూ వారిమీద అధికప్రేమను చూపువాడు పిచ్చివాని వంటివాడు. ఇక్కడ ఎవరికివారే.

"గ్రామాంతరము వెళ్ళేవాడు రాత్రిపూట ఒక ఇంట్లో నివాసముండి, మరునాడు ఉదయాన్నే ప్రయాణమై పోవునట్లు, మనిషి తనఇల్లు అనుకొనేదానిలో కూడా కొంతకాల ముండి వెళ్తాడు. ప్రయాణంలో వసించిన ఇల్లు, ఆ ఇంటిలోని వారితో బాటసారికి సంబంధం ఎలా లేదో ఇక్కడ తల్లిదండ్రులు, గృహధనాదులతో ఉండే సంబంధం కూడా అలాంటిదే.

"అయోధ్యను విడిచిపెట్టి అడవుల్లో అలమటించడం శుద్ధ అవివేకం. అయోధ్యకి వెళ్ళి పట్టాభిషేకం చేసుకో. వెంట్రుకలు విరబోసుకొని వున్న స్త్రీ లాగా అయోధ్య నీకోసం నిరీక్షిస్తూ వుంది. అయోధ్యను పాలిస్తూ హాయిగా జీవించు.

"దశరథునికి నీకు ఏ సంబంధమూ లేదు. ఆయనెవరో? నీవెవరో? నేను చెప్పినట్లు చెయ్యి.

"ప్రాణికి తండ్రి ప్రధానంకాదు. అతడు కేవలం బీజం మాత్రమే. ఋతుమతి యైన తల్లిగర్భంలో శుక్లశోణితాలు ఏకం కాగా పుత్రుడు జన్మిస్తున్నాడు.

"ఏదో పోవాల్సిన చోటికి దశరథుడు పోయాడు. అది మానవులకంతా తప్పదు. నీవు అనవసరంగా కష్టాలు కొనితెచ్చుకొంటున్నావు. ధర్మార్థముల కొరకు శ్రమించేవారంటే నాకు చాలా జాలివేస్తుంది. ఈ ధర్మం మాయలోపడి వారు ఇక్కడ దుఃఖజీవితాన్ని అనుభవిస్తారు. మరణానంతరము ఎలాగో నశించిపోతారు.

"జనులు శ్రాద్ధకర్మలు నిర్వహిస్తారు.పిండాలు పెడతారు. రామా! ఎంత అన్నం వృథా అవుతుందో చూడు. చచ్చినవాడు తింటాడా, చస్తాడా?

"ఒకడు తినిన ఆహారం మరొకని శరీరంలోకి వెళ్ళేటట్లయితే విదేశాలకు వెళ్ళేవాడికి కూడా శ్రాద్ధం పెట్టవచ్చు. ఆ ఆహారం అతనికి దారిలో ఆకలి తీరుస్తుంది.

"యజ్ఞాలు చెయ్యి. దానాలు ఇవ్వు. దీక్ష పూను. తపస్సు చెయ్యి. అన్నీ ఇచ్చేయి; అని చెప్తూ మేధావులు వ్రాసిన గ్రంథాలన్నీ డబ్బుగుంజడం కోసమే.

"రామా! పరలోకం లేదు. చింతకాయ లేదు. ముందు ఇది తెలుసుకో. ప్రత్యక్షమే సత్యం. పరోక్షమంతా బూటకమే. భరతుడు ప్రాధేయపడుతున్నాడు. నామాట విని రాజ్యాన్ని అంగీకరించు" అన్నాడు జాబాలి.

ఈ జాబాలి ఎవరు? ఇతడొక నాస్తికుడు. కానీ దశరథుని కొలువులో వసిష్ఠుని నాయకత్వంలో గల ఎనిమిదిమంది ధర్మమూర్తుల సలహామండలిలో జాబాలి ఒకడు.

దైవంమీద నమ్మకం లేనివాడు. ధర్మముపై విశ్వాసం లేనివాడు. అవకాశం చిక్కినప్పుడల్లా తన నాస్తికవాదాన్ని వినిపిస్తూ సమాజంలో అధర్మ జీవనాన్ని ఆవిష్కరించడమే అతని పని.

వసిష్ఠ వామదేవాది మహాత్ములుకూడా నోరు తెరవలేక రామభరతుల మధ్య జరుగుతున్న ధర్మసంవాదాన్ని శ్రద్ధతో ఆలకిస్తున్న తరుణంలో తగుదునమ్మా! అంటూ ముందుకొచ్చి ఈ నాస్తికపాషాణం ప్రవర్తించిన తీరు ఎంత ఘోరంగావుందో చూశారా?

రామాయణ కాలంలో కూడా ఈ అధర్మపరులు, నాస్తికవాదులు ఉండేవారని తెలుస్తోంది. అంతేగాదు. బరితెగించి ఎక్కడైనా, ఎలాగైనా పలవరించే సామర్థ్యం ఆరోజుల్లో కూడా ఉన్నట్లు జాబాలిని చూస్తే అర్థమవుతుంది.

కానీ, ఇటువంటి పాషాణాన్ని ధర్మమూర్తుల మండలిలో దశరథుడు ఎందుకు చేర్చాడా? అనేదే అర్థంకాదు. ఆరోజుల్లో నిజమైన ప్రజాతంత్ర పరిపాలన సాగుతూవుండేది కనుక నాస్తికునికి కూడా దశరథుని కొలువులో సముచితస్థానం లభించింది.

అర్థరహితమైన వాదములతో వ్యర్థప్రసంగం చేసిన జాబాలి మాటలు అనర్థదాయకాలుగా రాముడు తిరస్కరించాడు. శుష్కపాండిత్యముతో, శూన్యహృదయంతో జాబాలి సాగించిన వాదం హాస్యాస్పదమని తేల్చిచెప్పాడు శ్రీరాముడు.

## నాస్తికమత ఖండన

జాబాలి పలికిన మాటలు రాముని కదిలించలేక పోయాయి. రాముడు జాబాలితో ఇలా పలికాడు.

"జాబాలీ! నా మేలుకోరి ఇంతవరకు నీవు పలికిన మాటలు పైకి హితంగానే కన్పిస్తున్నాయి. ఆలోచిస్తే అహితంగా గోచరిస్తున్నాయి.

"మర్యాదహీనుడు, పాపి, దుర్మార్గుడు ఎప్పుడూ సత్పురుషుల గౌరవమును పొందలేడు. వ్యక్తియొక్క మంచిచెడులను అతని ప్రవర్తనే చెబుతుంది. దుష్టబుద్ధిగల మానవుని ఎవరూ అంగీకరించరు.

"నేను ఇచ్చినమాటను కాదని ఆతరువాత ఎవరికి నీతిని బోధించగలను? నేను ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తే పౌరులంతా అలాగే ప్రవర్తిస్తారు. స్వేచ్ఛావర్తనులై పాడైపోతారు. రాజు ప్రజలకు మార్గదర్శి కావాలి.

"రాజ్యము సత్యప్రధానమైనది. రాజు అసత్యమార్గంలో చరించకూడదు. సత్యవాది ఈ ప్రపంచంలో ఉత్తముడుగా పరిగణింప బడుతాడు.

"అసత్యవాదిని ఎవరూ గౌరవించరు. జనులు పామునుచూచి భీతిచెందినట్లు, అతనిని చూచి భయపడుతారు. సత్యమే ఉత్తమమైన ధర్మము. ధర్మము పుణ్యలోకాలను ప్రసాదిస్తుంది.

**సత్యమే వేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితా సదా**
**సత్యమూలాని సర్వాణి సత్యన్నాస్తి పరం పదమ్**

"ఈలోకములో సత్యమే ఈశ్వరుడు. సత్యమును ఆశ్రయించియే లక్ష్మి చరిస్తూ వుంటుంది. అన్నిటికీ సత్యమే మూలము. సత్యమును మించిన ఉత్తమధర్మము లేదు.

"నేను సత్యప్రతిజ్ఞ యందు విశ్వాసము కలవాణ్ణి. తండ్రికి మాటఇచ్చి దానిని పాలించకుండా ఎలా ఉండగలను?

"జాబాలీ! నీవు గొప్పదిగా నాతో చెప్పిన విషయమంతా వాస్తవానికి చెడ్డదే. నేను వనవాసము చేసి తండ్రిమాటను నిలబెట్తాను.



"జాబాలీ! సత్యము, ధర్మము, భూతదయ, ప్రియవాక్కు, అతిథిపూజ మొదలైనవి స్వర్గ ద్వారములని పెద్దలు చెబుతారు. అందుచేత బ్రాహ్మణులు సకల ధర్మాలను ఆచరిస్తూ ఉత్తమలోకములను పొందుచున్నారు.

"జాబాలీ! నీవు దుష్టబుద్ధి గలవాడవు. నాస్తికుడవు. ధర్మమార్గము నుండి పతనమైన వాడవు. నిన్ను చేరదీసి మా తండ్రిగారు చాలా పొరపాటు చేశారు. పండితుడెవ్వడు నాస్తికుని చేరదీయకూడదు;" అంటూ రాముడు జాబాలిని దుమ్మెదులిపాడు.

క్రుద్ధుడైన రాముని మాటలు విని జాబాలి వెంటనే మాటమార్చి హితవచనములను పలికాడు.

"రామా! నేను నాస్తికుణ్ణి కాదు. నాస్తికుల మాటలను నేను ఇక్కడ వల్లించలేదు. పరలోకం లేదని నేను చెప్పడంలేదు. అవసరాన్ని బట్టి అలా నాస్తికునిలాగా మాట్లాడుతూ ఉంటాను. నిన్ను అయోధ్యకు మరలించాలి అనే ఉద్దేశ్యముతోనే నేనలా మాట్లాడాను," అన్నాడు.

రామునికి కోపం వచ్చినట్లు వసిష్ఠుడు గుర్తించి రామునితో ఇలా పలికాడు. "రామా! పరలోకము ఉన్నదని జాబాలికి తెలుసు. నిన్ను అయోధ్యకు మరలించాలనే అలా మాట్లాడాడు" అని సర్దిచెప్పాడు వసిష్ఠుడు.

ఇంతకీ జాబాలి ఆస్తికుడా? నాస్తికుడా? జాబాలి నాస్తికుడే. సందేహం లేదు. అతడు మాట్లాడిన తీరు, ప్రసంగించిన విషయం అతడు శుద్ధ నాస్తికుడని నిరూపిస్తున్నాయి. ఇందులో సందేహం లేదు.

జాబాలిని చేరదీసి దశరథుడు పొరపాటు చేశాడు అని రాముడు అన్నాడు. ఆమాటకు భయపడి జాబాలి మాటమార్చి మనసును చంపుకున్నాడు. ధర్మం మీద విశ్వాసం లేనివాడు మనసును తేలిగ్గా చంపుకోగలడు.

రాముడు అయోధ్యకి తిరిగివస్తే తనను పదవిలో ఉంచడు. రాముడు చెప్పిన మాటలు భరతుడుకూడా విన్నాడు. ఒకవేళ రాముడు రాజు కాకుండా భరతుడు రాజైనా అన్నమీద వున్న గౌరవంతో జాబాలిని తొలగిస్తాడు.

బ్రతుకు చెడకుండా, మెతుకు దూరం కాకుండా ఉండాలంటే చేసిన తప్పిదానికి అతుకు వేసుకోవడమే సముచితమని భావించి నాస్తికత్వం నుండి ఆస్తికత్వానికి ఆలోచించకుండా దుమికాడు దుష్టుడైన జాబాలి.

రాముని కోపాన్ని గుర్తించిన వసిష్ఠుడు జాబాలిని సమర్థించాడు. ఉద్యోగం పోతుందేమోనని మాటమార్చి తంటాలుపడుతున్న జాబాలిపై జాలివహించిన మహాత్ముడైన వసిష్ఠుడు జాబాలిని సమర్థించాడు. నాస్తికుడైన జాబాలి కఠినోక్తులకు, ఆస్తికుడైన వసిష్ఠుని మంజుల వచనాలకు తేడా ఇక్కడే చూడవచ్చు.

జాలితో జాబాలిని సమర్థించినా పరలోకమునందు అతనికి విశ్వాసము లేదని వసిష్ఠునికి తెలుసు కనుక ఈ సందర్భమున సృష్టినిగూర్చి ప్రస్తావించి జాబాలి అజ్ఞానంపై వసిష్ఠుడు పరోక్షంగా దాడి చేశాడు. జాబాలి నోరు మూయించాడు.

ఈ సందర్భమున రాముడు నాస్తికవాదాన్ని ఖండిస్తూ బుద్ధుడు నాస్తికుడు అని జాబాలితో అంటాడు. ఆ బుద్ధుడెవరు? బౌద్ధమత ప్రవక్తయైన గౌతమబుద్ధుడు మాత్రం కాదని వారి కాలాన్నిబట్టి నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. లేదా బుద్ధుడనే పేరు గలిగిన నాస్తికుడెవడైనా ఉండి ఉండాలి. లేక అయోధ్యాకాండములో 109వ సర్గలో 30వ శ్లోకంనుండి కొన్ని శ్లోకాలు ప్రక్షిప్తాలు అని కొందరి అభిప్రాయం. ఆ శ్లోకాలు ప్రక్షిప్తాలని అనుమానించే అవకాశం మాత్రం లేకపోలేదు. అంతవరకు అనుష్టుప్ ఛందస్సులో సాగుతుండిన శ్లోకాలు ఉపజాతి వృత్తంలోకి మారడంకూడా ఇక్కడే జరిగింది.

వరిష్ఠుడైన వసిష్ఠుడు ధర్మాత్ముడైన రామునితో ఇలా పలికాడు.

"రామా! నీవు దశరథుని జ్యేష్ఠపుత్రుడవు. ఇక్ష్వాకువంశములో జ్యేష్ఠపుత్రుడే రాజుకావాలి అనే నియమముంది. పెద్దవాడుండగా చిన్నవాడు రాజు కాకూడదు.

"ప్రాచీనంగా వస్తున్న ఈ కులధర్మాన్ని నీవు పాడుచేయకు. సమృద్ధమైన సంపదగల అయోధ్యను నీ తండ్రివలె నీవూ పాలించు;" అని పలికి వసిష్ఠుడు తన సందేశాన్ని వినిపించాడు.

## సత్యాగ్రహం

వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునితో చెప్తున్నాడు.

"రామా! ప్రతి మనిషికి జీవితంలో ముగ్గురు గురువులు ఉంటారు. వారే తల్లి, తండ్రి, గురువు.

"తండ్రి జన్మనిస్తాడు. ఆచార్యుడు జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. రామా! నేను మీ నాన్నగారికి, నీకు ఇద్దరికీ గురువును. నామాటను ఆలకించడంవల్ల నీవు సత్పురుషుల మార్గంలో చరించినవాడవవుతావు.

"నీ తల్లి వృద్ధురాలు. ఆమెకు సేవచేయకుండా నీవు వనములో వసించడం మంచిది కాదు. తల్లిమాట విని, తల్లిని సంతోష పెట్టినట్లైతే నీవు సత్పురుషుల మార్గమున చరించినట్లే అవుతుంది. భరతుడు సమర్పిస్తున్న రాజ్యాన్ని అంగీకరించడం వల్ల నీవు సన్మార్గములో ఉన్నట్లే అవుతుంది. కనుక అయోధ్యకు వచ్చి రాజ్యాభిషిక్తుడవు కా!" అని పలికాడు వసిష్ఠుడు ముక్తసరిగా.

వసిష్ఠునితో రామచంద్రుడు ఇలా పలికాడు.

"మహాత్మా! తల్లిదండ్రులకు పుత్రునియందు గల ప్రేమ మాటలకు అందనిది. స్నానాదులు చేయించి, భోజనాదులు సమకూర్చి, హాయిగా నిద్రపుచ్చే, తల్లి ఋణాన్ని ఎవరు తీర్చుకోగలరు? కోరిన వస్తువులను ఇచ్చి, నిత్యము మంచిమాటలు చెప్పి పెంచిన తండ్రి ఋణం తీరుతుందా? తల్లిదండ్రులు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేయడం సాధ్యం కాదు.

"గురుదేవా! జన్మనిచ్చి, జ్ఞానమును ప్రసాదించిన అట్టి తండ్రికి నేను మాటఇచ్చాను. ఆయన ఎదుట ప్రతిజ్ఞ చేశాను. అది ఎలా వ్యర్థమవుతుంది?" అన్నాడు రాముడు.



రాముని మాటలు విని భరతుడు దుఃఖించాడు. దగ్గరనే ఉన్న సుమంత్రుని పిలిచి ఇలా పలికాడు.

"సుమంత్రా! ఇలారా. దర్భలను తీసికొనివచ్చి ఇక్కడ సిద్ధపరచు. అన్నగారిని అడ్డగిస్తూ ఇక్కడే పడుకుంటాను. నన్ను అనుగ్రహించి నంతవరకు, అలాగే ఉంటాను," అన్నాడు.

సుమంత్రుడు కదలలేదు. రామాజ్ఞకై నిరీక్షిస్తున్నట్లు రామునివైపు చూశాడు. అది గ్రహించిన భరతుడు తానే స్వయంగా వెళ్ళి దర్భలను తెచ్చి పరచుకున్నాడు.

"నాయనా! భరతా! నేను ఏంతప్పు చేశాను. నీకు నేను ఏమి అపకారం చేశాను. నీవు ఎందుకలా శయనిస్తావు?

"అప్పుతీసికొని తిరిగి ఇవ్వనివానిని బ్రాహ్మణుడు అడ్డగిస్తూ అలా పడుకోవడం చూశాను. క్షత్రియుడు అలా చేయడం ఎక్కడా చూడలేదు. వినలేదు.

"భరతా! దారుణమైన ఈ వ్రతాన్ని విడచిపెట్టి అయోధ్యకు వెళ్ళి రాజ్యాన్ని పాలించు;" అన్నాడు రాముడు.

భరతుడు కుశలపై ఆసీనుడై కదలలేదు. అక్కడ గుమిగూడియున్న పౌరులను చూచి "అలాచూస్తారేం? మీరు అన్నగారికి ఏమీ చెప్పకుండా అలా వుండుటకు కారణమేమి?" అని పలికాడు భరతుడు.

"అయ్యా! రామునిగూర్చి మాకు బాగా తెలుసు. రాముడు చెప్పేవదంతా ధర్మమే. మహాత్ముడైన రాముడు తండ్రిమాటపై నిలబడియున్నాడు. ఆ కారణంగానే మేము నోరు విప్పి రామునితో మాట్లాడలేక పోతున్నాము. అయోధ్యకు రమ్మని అడగలేక పోతున్నాము" అన్నారు భరతునితో అయోధ్యాపుర వాసులైన ప్రజలు.

"భరతా! ధర్మదృష్టి గల మన పౌరులు చెప్పిన మాటలను విను. నామాటను, వారి మాటను విని పైకిలే. నన్ను, జలమును స్పృశించి వ్రతాన్ని చాలించు" అన్నాడు రాముడు.

భరతుడు లేచాడు. ఆచమనం చేశాడు. పండితులు, మంత్రులు నిలబడియున్న వైపు తిరిగి ఇలా పలికాడు.

"నాకు రాజ్యము ఇవ్వమని మా తండ్రిగారిని నేను ఎప్పుడూ అడగలేదు. రాజ్యాన్ని సాధించిపెట్టమని నా తల్లితో నేనెప్పుడూ చెప్పలేదు. రాముడు అరణ్యానికి వెళ్ళాలని నేను అభిలషించలేదు. దానిని సమర్థించనూలేదు.

"తండ్రిమాట ప్రకారము పద్నాలుగు సంవత్సరాలు అరణ్యములో ఉండడాన్ని మీరు కూడా సమర్థిస్తున్నారు. మంచిది. అలాగే చేస్తాం. కానీ ఆ పదునాలుగేండ్లు అరణ్యంలో నేనుంటాను;" అని పలికాడు భరతుడు.

భరతుని మాటలు విన్న రాముడు ఆశ్చర్యపడి ఇలా పలికాడు.

"పౌరులారా! మా తండ్రిగారు జీవించియుండగా చేసిన క్రయవిక్రయాదులను నేనుగాని, భరతుడుగాని మార్పు చేసేందుకు వీలులేదు.

"నాకు బదులుగా మరొకరు వనవాసము చేయుట అనేది జుగుప్సితమైన కార్యము. కైకేయి వరాలు కోరడం ఉచితమే. నాన్నగారు అంగీకరించడం కూడా సముచితమే.

"అరణ్యవాసము పూర్తయిన పిదప నేను వచ్చి సోదరులతో కలిసి రాజ్యాన్ని పరిపాలిస్తాను.

"భరతా! తల్లి వరాలు కోరింది. తండ్రి అంగీకరించాడు. నేను సమ్మతించి వనవాసం చేస్తున్నాను. నీవుకూడా అంగీకరించి రాజ్యపాలనం చెయ్యి. తండ్రికి అసత్యదోషము అంటకుండా చూడు. మహాత్ముడవైన నీకు అంతా మంగళకరమే అవుతుంది" అన్నాడు రాముడు.

## పాదుకా ప్రదానము

రామభరతుల సమాగమమును, సంభాషణమును ప్రత్యక్షంగా చూచి ఆలకించిన ఋషులందరూ ఆశ్చర్యపడ్డారు. అక్కడే అంతర్హితులై వీక్షిస్తున్న సిద్ధులు, దేవర్షులుకూడా సోదరులను ప్రశంసించారు.

ధర్మాసక్తులు, ధర్మమూర్తులు, ధర్మజ్ఞులు అయిన ఈ పుత్రులను కనిన దశరథుడు ధన్యుడు అని మెచ్చుకున్నారు. వారి సంభాషణము వింటున్నకొలది వారిపై అనురాగము అధికమవుతూ ఉందని ముచ్చటించుకున్నారు. ఋషులు భరతునితో ఇలా పలికారు.

"భరతా! నీవు ఉత్తమకుల సంజాతుడవు. బుద్ధిమంతుడవు. సదాచార సంపన్నుడవు. కీర్తిమంతుడవు. నీకు తండ్రిపై భక్తి, గౌరవము ఉన్నచో రాముడు చెప్పినట్లు చెయ్యి;" అని పలికి ఋషులందరూ వెళ్ళిపోయారు. ఋషులు భరతునితో అలా చెప్పినపుడు రావణవధ తొందరగా జరగాలి అనే భావన వారి మనసులో గాఢంగా ఉన్నట్లు వాల్మీకి చెబుతాడు.

రాముడు ఋషులను పూజించాడు. భరతుడు మాత్రము భయపడుతూ, చేతులు జోడించి రామునికి నమస్కరిస్తూ, తొట్రుపాటుతో ఇలా పలికాడు.

"అన్నా! రాజధర్మము నిష్కంటకంగా సాగాలి. కులధర్మము అవిచ్ఛిన్నంగా కొనసాగాలి. ఈ రెండు విషయాలను దృష్టిలో ఉంచుకొని, నా ప్రార్థనను, నా తల్లియైన కైకేయి ప్రార్థనను మన్నించు.

"విశాలమైన అయోధ్యను పాలించుటకు నేను సమర్థుడను కాను. అనురాగం గల ఈ పౌరులను తృప్తిపరచేటట్లు పాలించే శక్తి నాకులేదు.

"కర్షకులు మేఘముల కొరకు నిరీక్షించునట్లు, మన బంధువులు, సైనికులు, మిత్రులు, శ్రేయోభిలాషులు నీకొరకు వేయికళ్ళతో ఎదురుచూస్తున్నారు. అన్నా! రాజ్యాన్ని చేపట్టి నిలబెట్టు. ఆ శక్తి నీకుమాత్రమే ఉంది" అని ప్రాధేయపడుతూ భరతుడు రాముని పాదాలపై పడ్డాడు.

రాముడు భరతుని తన ఒడిలో కూర్చోబెట్టుకొని ఇలా భాషించాడు. "నాయనా! భరతా! నీవు ఉత్తమ స్వభావము కలవాడవు. గురువులవద్ద చక్కని శిక్షణ పొందియున్నావు. ఈ భూమిని పాలించుటకు నీవు సమర్థుడవు.

"బుద్ధిమంతులైన అమాత్యులున్నారు. ప్రజ్ఞగల మంత్రులున్నారు. ఉత్తములైన మిత్రులున్నారు. వారితో కలిసి నీవు ఎంత ఘనమైన కార్యమునైనా చేయగలవు. అధైర్యపడకు.

**లక్ష్మీ శ్చంద్రా దపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్**
**అతీయా త్సాగరో వేలాం న ప్రతిజ్ఞా మహం పితుః**



"భరతా! చంద్రుణ్ణి ప్రకాశం వదలవచ్చు. హిమాలయ పర్వతాన్ని మంచు వదిలిపెట్టవచ్చు. సముద్రము తీరాన్ని దాటవచ్చు. నేను మాత్రము తండ్రి ఆజ్ఞను అతిక్రమించను.

"నాయనా! నీ తల్లి కైకేయి కామంవల్ల కావచ్చు, లోభంవల్ల కావచ్చు, ఇదంతా నీకోసమే చేసింది. నీవు దానిని మనసులో పెట్టుకోకు. తల్లిగా ఆమెను గౌరవించు;" అన్నాడు రాముడు.

కన్నీళ్ళు తుడుచుకుంటూ భరతుడు ఇలా పలికాడు.

"పూజ్యుడా! రామా! బంగారుతో తయారైన ఈ పాదుకలమీద నీ పాదాలు పెట్టు. పవిత్రమైన ఈ పాదుకలే లోకానికి యోగక్షేమాలను చేకూర్చుతాయి."

రాముడు ఆ పాదుకలను తొడిగికొని మరల వాటిని భరతున కిచ్చాడు. భరతుడు ఆ పాదుకలకు భక్తితో నమస్కరించి, చివరగ చేతులు జోడించి నమస్కరిస్తూ రామునితో ఇలా పలికాడు.

"అన్నా! ధర్మాత్మా! రామా! శత్రుసంహారకా! నేను జటలను ధరించి, ఫలమూలాదులను తింటూ రాజ్యభారము నంతా నీ పాదుకల మీదనే ఉంచి, ఊరు బయటనే నీకోసం ఎదురు చూస్తూ ఉంటాను. పద్నాలుగు సంవత్సరాలు గడచిన మరునాడు నీవు నాకు కనిపించకపోతే నేను అగ్నిలో ప్రవేశిస్తాను.

రాముడు సరేనన్నట్లు తలఊపాడు. భరతశత్రుఘ్నుల నిద్దరిని కౌగలించుకున్నాడు. రాముడు భరతుని ప్రేమతో వీక్షిస్తూ ఇలా పలికాడు.

"భరతా! తల్లియైన కైకేయిని భక్తితో చూడు. ఆమెపై కోపం పెట్టుకోకు. నామీద, మీ వదినమీద ఒట్టేసి మరీ చెబుతున్నాను;" అని పలికి కన్నీళ్ళు కార్చుతూ భరతునికి వెళ్ళడానికి అనుజ్ఞ నొసగినాడు రాముడు.

భరతుడు రాముని పాదుకలను పూజించాడు. శ్రీరామునకు ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. ఆ బంగారు పాదుకలను శ్రేష్ఠమైన ఏనుగుపై ఎక్కించాడు.

రాముడు తల్లులను సమీపించాడు. దుఃఖంతో వారి గొంతులు మూగబోయాయి. వారు ప్రయత్నించి కూడా రామునితో ఏమీ మాట్లాడలేక పోయారు. రాముడు తల్లులందరికీ నమస్కరించి, ఏడుస్తూ పర్ణశాలలోకి వెళ్ళిపోయాడు.

భరతుడు రాముని పాదుకలను శిరస్సుపై ఉంచుకొని రథమును అధిరోహించాడు. శత్రుఘ్నుడు అనుసరించాడు. వసిష్ఠ వామదేవాదులు, మంత్రులు అందరూ ప్రయాణమయ్యారు. చిత్రకూట పర్వతానికి ప్రదక్షిణం చేసి, తూర్పుగా మందాకినీనది ప్రక్కనుండి వెళ్ళారు.

దారిలో భరతుడు భరద్వాజమునిని దర్శించాడు. ఆయన పాదములను స్పృశించి నమస్కరించాడు. భరద్వాజుడు ప్రశ్నించగా చిత్రకూటమున రామునితో జరిగిన సంభాషణమును, స్వర్ణపాదుకా ప్రదానమును గూర్చి సవిస్తరముగ విన్నవించాడు.

భరద్వాజ మహాముని భరతునితో ఇలాపలికాడు.

"పురుషశ్రేష్ఠా! నీవు ఉత్తమోత్తముడవు. నీళ్ళు పల్లంలో నిలిచినట్లు కళ్యాణగుణాలన్నీ నిన్ను ఆశ్రయించాయి. ఈవిషయంలో ఆశ్చర్యం లేదు. నిన్ను పుత్రునిగా పొందిన దశరథుడు

మరణించినా చిరంజీవియే;" అని పలికాడు. భరతుడు భరద్వాజునికి ప్రదక్షిణ నమస్కారములు చేసి, మునివర్యుని అనుమతితో అయోధ్యకు ప్రయాణమయ్యాడు.

గొప్పదైన సైన్యము వెంటరాగా యమునానదిని, గంగానదిని దాటి, శృంగబేరపురము మీదుగా భరతుడు శ్రీరాముని పాదుకలను తీసికొని అయోధ్యలో ప్రవేశించాడు.

మహాత్ముడైన తండ్రి, ధర్మాత్ముడైన అన్న లేని అయోధ్యను చూడగానే భరతుని నేత్రాలు అశ్రుపూర్ణాలయ్యాయి. "సారథీ! అయోధ్యానగరం కళావిహీనంగా ఉంది. మంగళకర ధ్వనులు వినిపించడంలేదు" అన్నాడు భరతుడు. రథం అయోధ్యానగర వీధులలో ప్రవేశించింది.

సూర్యుడులేని పగలువలె కాంతిహీనమైన రాజభవనంలోకి భరతుని రథం ప్రవేశించింది. దశరథుడు లేని ఆ రాజభవనము సింహములేని గుహవలె కనిపించింది.

## పాదుకా పట్టాభిషేకము

సైన్యమంతా అయోధ్యకు చేరింది. రాణులు అంతఃపురంలో ప్రవేశించారు. శోకసంతప్తుడైన భరతుడు వసిష్ఠ వామదేవాదులతో ఇలా పలికాడు.

"నేను అయోధ్యలో వుండి ఈ దుఃఖాన్ని భరించలేను. ఇపుడే బయల్దేరి నందిగ్రామం వెళ్తాను. మిమ్మల్నందరినీ ప్రార్థిస్తున్నాను. అంగీకరించండి. రాముడులేని దుఃఖాన్ని ఎలాగో నందిగ్రామంలో ఓర్చుకుంటాను.

"తండ్రి స్వర్గస్థుడైనాడు. అన్న అడవులకేగాడు. నేను రాముని కొరకు నిరీక్షిస్తూ జీవిస్తాను. ఎప్పుడైనా అయోధ్యకు రాజు రాముడేకదా!" అన్నాడు భరతుడు.

"భరతా! నీ సోదరప్రేమ శ్లాఘనీయమైంది. నీవు పలికిన మాటలు నిత్యస్మరణీయాలు. అలా పలకడం నీకే తగును. బంధువులపై నీకున్న ప్రేమ అమోఘం. అన్నగారిపై నీకున్న ప్రేమచే నీవు ఏర్పరచుకొనిన నిర్ణయాన్ని ఎవరు కాదనగలరు?" అన్నారు వసిష్ఠాదులు.

భరతుడు తల్లులందరికీ నమస్కరించి, శత్రుఘ్నునితో కూడి రథం ఎక్కాడు. రథం వాయువేగంతో నందిగ్రామము వైపు కదిలిపోయింది. వసిష్ఠాది బ్రాహ్మణులందరూ భరతుని రథాన్ని అనుసరించారు. చతురంగసేన కూడా భరతుని అనుసరించి వెళ్ళింది.

భరతుడు రాముని పాదుకలను రథంలోకూడా తన శిరస్సుమీదనే ఉంచుకున్నాడు. నందిగ్రామము చేరగానే రథముదిగి భరతుడు ఇలా పలికాడు.

"నన్ను ఈరాజ్యానికి ప్రతినిధిగా మా అన్న ఉంచాడు. రాముడు స్వయంగా అనుగ్రహించిన ఈ సువర్ణపాదుకలే రాజ్యములో యోగక్షేమాల్ని నిర్వహిస్తాయి."

పాదుకలను శిరస్సుపై ఉంచుకొని కన్నీళ్ళు కార్చుతూ ఇంకా ఇలా పలికాడు.

"ఇవే మా అన్నగారి పాదాలు. వెంటనే ఈ పాదుకలకు తెల్లగొడుగు పట్టండి. రాజ్యంలో ధర్మాన్ని నెలకొల్పేది ఈ పాదుకలే. నాపై మా అన్నకున్న అనురాగంవల్ల ఈ నిక్షేపం నాకు అప్పగించబడింది. ఆయన వచ్చేవరకు నేను వీటిని సేవిస్తాను.



"రాముడు రాగానే ఈ పాదుకలను ఆయన పాదాలకు తొడుగుతాను. పాదుకలు తొడుగుకొనిన రాముని పాదపద్మాలను మనసారా పూజిస్తాను.

"ప్రస్తుతము ఈ రాజ్యభారము నామీద ఉంచాడు రాముడు. ఆయన తిరిగిరాగానే తిరిగి రాజ్యాన్ని ఆయనకు అప్పగించి, నేను ఆయన సేవచేసుకుంటాను. నావద్ద ఉంచబడిన ఈ పాదుకలను, రాజ్యమును, అయోధ్యను రామునికి సమర్పించి పాపవిముక్తుడ నవుతాను.

"రాముడు రాజైతే ప్రజలంతా సంతుష్టు లవుతారు. నాకు అదే ఆనందము. అదే నిజమైన కీర్తి" అని దీనుడై పలికి భరతుడు నందిగ్రామములో నిలిచిపోయాడు. మంత్రులతోకూడి అక్కడనుండి రాజ్యమును పాలించాడు. నారచీరలను, జటలను ధరించిన భరతుడు తపస్విలాగా నందిగ్రామములో జీవించాడు.

రాముని వైభవమంతా రాముని పాదుకలయందే ఉంది. అందుచేత మహర్షులందరూ రాముని పాదములను ఆశ్రయించారు. రామపాద వైభవమే అహల్యను పావనాత్మురాలిగా చేసింది. అట్టి సర్వశక్తి సమన్వితమైన శ్రీరాముని పాదుకలను అర్చించి భక్తుడైన భరతుడు తరించాడు. అట్టి దివ్యావకాశమును తనకుకూడా ప్రసాదించమని **"సందేహమును దీర్పవయ్య- సాకేత నిలయ రామయ్య"** అనే కీర్తనలో త్యాగరాజస్వామి రాముని ప్రార్థిస్తాడు.

**వరమౌనులెల్ల చరణమ్ములను**<br>
**స్మరియింప నీదు పద మొసంగెనే**<br>
**భరతార్చనచే పాదుకలు**<br>
**ధర నిన్నొసంగె త్యాగరాజ భాగ్యమా ॥సందేహము॥**

అని కీర్తించాడు త్యాగానికి రాజైన త్యాగయ్యస్వామి.



భరతుడు నిత్యము రాముని పాదుకలను అర్చించేవాడు. సమస్తమైన రాజకార్యములను ఆ పాదుకలకు విన్నవిస్తూ ఉండేవాడు. రాముని పాదుకలకు పట్టాభిషేకం చేసి, రాజ సింహాసనముపై ఆ పాదుకలనుంచి, తాను ఆ పాదుకల క్రిందగా కూర్చుని సేవకునివలె జీవిస్తూ భరతుడు రాజ్యాన్ని పాలించాడు. ఎవరైనా కానుకలు సమర్పిస్తే నైవేద్యంలాగా వాటిని ముందు రాముని పాదుకలకు సమర్పించి, అటుతరువాత వాటిని తగురీతిన వినియోగించేవాడు.

అయోధ్యాకాండమును సమాప్తిచేస్తూ ఫలశ్రుతిని ప్రవచించే సందర్భములో భరతుని హృత్పూర్వకంగా శ్లాఘిస్తాడు సంత్ తులసీదాస్.

**భరత్ చరిత కరి నేము తులసీ జో సాదర్ సునహిఁ**
**సీయ రామ్ పద పేము అవసి హోయీ భవరస బిరతి ॥**

"భక్తుడైన భరతుని కథను ప్రేమతో, నియమముతో ఎవడు ఆలకిస్తాడో అట్టివానికి శ్రీసీతారాముల చరణకమలముల యందు నిర్మలమైన భక్తి కలుగుతుంది. సంసార భోగములయందు విరక్తి జనిస్తుంది".

## చిత్రహింసల పాలైన చిత్రకూటం

భరతుడు తిరిగి అయోధ్యకు వెళ్ళిన తరువాత రాముడు తపోవనంలో ఉంటూ, ఎందుకో తన సమీపంలో జీవిస్తున్న మునులు భయపడుతున్నట్లు గ్రహించాడు.

ఏ మహర్షులు పూర్వము తన సన్నిధిలో ఆనందంగా జీవిస్తూ ఉండేవారో, వారే ఇపుడు కంగారుపడుతూ కనిపిస్తున్నారు. రాముని చూడగనే సైగలు చేసుకోవడం, గుసగుసమనడం రాముడి కంటబడింది.

తనవల్ల మునులకు బాధ కలిగిందేమోనని రాముడు అభిప్రాయపడి, ఆశ్రమాధిపతి యైన మునివృద్ధుని సమీపించి సమస్కరించాడు.

"మహాత్మా! ఇక్కడ మునులందరిలో ఏదో మార్పు కన్పిస్తూఉంది. అదోలా వుంటున్నారు. నా ప్రవర్తనవల్ల ఏదైనా బాధ కలిగిందా? నాతమ్ముడు లక్ష్మణుడు తెలియక పొరపాటు ఏదైనా చేశాడా? లేక, నాకుమల్లే మీకూ ఉత్సాహంతో సేవలు చేస్తున్న సీత అసందర్భంగా ప్రవర్తించిందా?" అని ప్రశ్నించాడు రాముడు.

రాముని మాటలు విన్న వృద్ధుడైన ఆ మహర్షి వణకుతూ రాముడితో ఇలా పలికాడు.

"తండ్రీ! రామా! సీత కళ్యాణమూర్తి. ఆమె సదా శుభకరములైన కార్యములయందే మనసును లగ్నంచేసి ఉంటుంది. ఆమె ధర్మములో లోపము ఎప్పుడూ కలగదు.

"నాయనా! నీవల్ల మునులకు ప్రమాదం వాటిల్లుతోంది. నీమూలంగా రాక్షసులు మునుల్ని బాధిస్తున్నారు. ఆ భయంతో వారు రహస్యంగా చర్చించుకుంటున్నారు.

"రామా! ఇక్కడికి సమీపమున జనస్థానంలో ఖరుడు అనే రాక్షసుడున్నాడు. అతడు రావణాసురుని తమ్ముడు. జనస్థానంలో వున్న తాపసులందరిని వాడు వధించాడు.

"ఆ ఖరుడు దుర్మార్గుడు. పాపాత్ముడు. క్రూరమైనవాడు. వాడు మనుష్యుల్ని భక్షిస్తాడు. మహాగర్వి. జనస్థానాన్ని నిర్జనంగా మార్చేశాడు. వాడు నిన్నుచూచి సహించలేకున్నాడు.

"రామా! నీవు ఇక్కడికి వచ్చినది మొదలుకొని రాక్షసులు మునుల్ని బాధించడం ఎక్కువైపోయింది. వారు భయంకర రూపాలతో అగుపిస్తారు. మునులపై అపవిత్రమైన పదార్థములను పడేస్తారు. కొందరి ఎదుట నిలబడి వారిని చంపేస్తున్నారు.

"యాగముచేయు సమయాలలో అగ్నిహోత్రము నందు జలాన్ని క్రుమ్మరిస్తారు. హోమద్రవ్యాలను విసిరిపారేస్తారు. కలశాల్ని బ్రద్దలు కొడుతారు. ఇక ఈ బాధను భరించలేక



ఈ ఆశ్రమాన్ని విడిచి మరొకచోటికి వెళ్ళాలని మహర్షులు గుసగుస మంటున్నారు. వన్ను కూడా ప్రేరేపిస్తున్నారు.

"రామా! ఈ ప్రదేశాన్ని విడిచివేయాలని మేము నిర్ణయించుకున్నాము. ఇక్కడికి కొంతదూరంలో గొప్ప వనమొకటుంది. అక్కడ కాయలు, పండ్లు దండిగా ఉంటాయి. పూర్వము మేము అక్కడే ఉండేవాళ్ళం. మళ్ళీ అక్కడికే వెళ్ళాలని నిశ్చయించుకున్నాం.

"తండ్రీ! ఆ ఖరుడు చాలా దుర్మార్గుడు. నీవిషయంలో కోపంతోకూడా ఉన్నాడు. నీకు చెడు చేసేందుకు ప్రయత్నిస్తాడు. నీకు ఇష్టమైతే నీవుకూడా మాతోపాటు వచ్చేయడం మంచిది.

"రామా! నీవు సమర్థుడవే కావచ్చు. అయినా భార్యతో ఉంటున్నావు. ఇక్కడ నివసించడం అంత మంచిదికాదు;" అని పలికి మునులందరూ ప్రయాణానికి సిద్ధమయ్యారు.

వారిని వెళ్ళవద్దని రాముడు ఎంతగానో వారించాడు. ధైర్యం చెప్పాడు. అయినా వారు వెళ్ళకుండా ఉండలేకపోయారు. నడచి వెళ్తున్న మునుల్ని రామలక్ష్మణులు కొంతదూరము అనుసరించి వెళ్ళారు. వారికి నమస్కరించి, వారివద్ద సెలవుతీసుకొని చిత్రకూట తపోవనానికి తిరిగివచ్చారు.

చిత్రకూటంలో రాముణ్ణి భరతుడు వదలివెళ్ళాడు. ఋషులూ వదలివెళ్ళారు. ఇక్కడే ఉండిపోతాను అనిన భరతుని వద్దని వారించి రాముడు తిప్పి పంపేశాడు. వెళ్ళకుండా ఇక్కడే ఉండండి అని రాముడు వారించినా వినకుండా మునులు వెళ్ళిపోయారు.

అన్నీ ఋణానుబంధాలే. అనుకున్నచోట ఉండలేము. ఒక్కొక్కసారి వద్దనుకున్న చోటును కూడా వీడలేము. ఉన్నవి పోవు. లేనివి రావు. జీవితము ఇంతేనేమో!

## అయోనిజకు అనసూయాదేవి ఆశీర్వాదం

చిత్రకూటం ఏదో చిన్నబోయినట్లుంది. మందాకినీ పవిత్రజలాల్లో స్నానమాచరించి, గుంపులు గుంపులుగా వేదనాదాన్ని వినిపిస్తూ నడచివచ్చే మునుల దివ్యదృశ్యం ఈనాడు కంటబడడం లేదు. హోమాగ్ని నుండి లేచే ధూమం అగుపించలేదు. వేదఘోషలు వినిపించ లేదు.

రాముడు ఆలోచించాడు. చిత్రకూటంలో నివసించకూడదని నిర్ణయించాడు. చిత్రకూటాన్ని త్యజించడానికి రాముని మనసు అనేక కారణాలను ఊహించింది.

ఋషులందరూ ప్రతిరోజూ రాముని అంటిపెట్టుకొనే ఉండేవారు. వారంతా వెళ్ళిపోయిన తరువాత తియ్యని ఆ జ్ఞాపకాలు కోమలహృదయుడైన రాముని మనసును సున్నితంగా స్పృశిస్తున్నాయి.

భరతుడు, తల్లులు, పౌరులు అందరూ ఇక్కడే రాముని కలిశారు. ప్రేమతో నిండిన వారందరు కార్చిన దుఃఖాశ్రువులు అక్కడ చలనచిత్రంలా కన్పిస్తూనే వున్నాయి. రాణులు ఎక్కడ కూర్చున్నారో, భరతుడు దర్భలు పరచుకొని ఎక్కడ సత్యాగ్రహం చేశాడో, ఆప్రదేశాలన్నీ చూడగానే ఆయాస్మృతులు జ్ఞాపకమొచ్చి రాముని పీడిస్తున్నాయి.

భరతుడు పెద్ద సైన్యముతో రావడంవల్ల గజాశ్వముల మలమూత్రాదులతో ఆ ప్రదేశమంతా పాడైపోయింది. ఈకారణాలచేత చిత్రకూటాన్ని వదలిపెట్టి మరొకచోటికి వెళ్ళాలని రాముడు నిర్ణయించాడు.

మరునాడు సీతారామలక్ష్మణులు చిత్రకూట పర్వతానికి నమస్కరించి బయలు దేరారు. అక్కణ్ణుంచి ప్రయాణం చేసి అత్రిమహర్షి ఆశ్రమాన్ని చేరారు. అత్రిమహర్షిని దర్శించి అర్చించారు. అత్రిమహాముని రాముని కన్నకొడుకులాగా ఆదరించాడు.

అత్రిమహర్షి భార్య అనసూయాదేవి. అత్రిమహర్షి భార్యయైన అనసూయను గౌరవంగా పిలిచి, రామ లక్ష్మణ సీతలకు పరిచయం చేశాడు. అత్రిమహాముని అనసూయతో

**ప్రతి గృహ్ణీష్వ వైదేహీ మబ్రవీ దృషి సత్తమః**

"ఈ సీతను స్వీకరించు" అని ఋషిసత్తముడైన అత్రిమహర్షి అనసూయాదేవితో చెప్పాడు.

అత్రిమహర్షి తన భార్యయైన అనసూయాదేవిని గూర్చి రామునితో ఇలా పలికాడు.

"రామా! ఈ అనసూయ గొప్ప చరిత్ర కలది. గతంలో ఒకసారి పది సంవత్సరాలు వర్షాలు కురవలేదు. పెద్దగా క్షామం ఏర్పడింది. లోకమంతా ఎండిపోయింది. మాడిపోయింది. అపుడు కందమూలాలను, పండ్లను ఈమె సృష్టించింది. గంగానదిని ప్రవహింపచేసి ఋషుల్ని బ్రతికించింది.

"నాయనా! ఈ అనసూయ పదివేల సంవత్సరాలు తపస్సు చేసింది. ఎన్నో వ్రతాలు చేసింది. మునులకు సహాయం చేసింది. దేవతలకుకూడా సహాయం చేసింది. పూర్వం దైవకార్యాన్ని ఫలింప చేయడానికి పది రాత్రులను ఒకే రాత్రిగా చేసిన మహాసాధ్వి. రామా! ఈమె నీకు తల్లివంటిది. ఎవరి విషయంలోను అసూయ లేనిది అగుటచేత ఈమె అనసూయ అని అందరిచేత కీర్తించబడింది.

**తామిమాం సర్వభూతానాం నమస్కార్యాం యశస్వినీమ్**
**అభిగచ్ఛతు వైదేహీ వృద్ధా మక్రోధనాం సదా ॥**

"ఈమె సర్వులూ పూజింపదగినది. కీర్తిమంతురాలు. వృద్ధురాలు. అక్రూరురాలు. ఆమె వద్దకు సీత వెళ్ళుగాక!" అన్నాడు అత్రిమహర్షి.

"సీతా! ఈ మహాత్ముని మాటలు విన్నావు కదా! వెళ్ళు. తపస్వినియైన ఆ తల్లిదగ్గరకు వెళ్ళు. నీకు శుభం కలుగుతుంది" అన్నాడు రాముడు. సీతమ్మ బయలుదేరి వెళ్ళి అనసూయాదేవికి ప్రదక్షిణ నమస్కారాలు చేసింది.

ఒక విషయాన్ని మనం ఇక్కడ గమనించాలి. అత్రిమహర్షి రామునికి పెద్దగా ప్రాధాన్యత ఇవ్వకుండా సీతకే ప్రాధాన్యత నిచ్చాడు. మహాసాధ్వి, తన అర్ధాంగి అయిన అనసూయాదేవిని సీతమ్మకు పరిచయం చేశాడు. అనసూయను ఆశ్రయించమని సీతకు చెప్పాడు. భార్యయైన అనసూయను ఎంతో గొప్పగా కీర్తించాడు. భర్త భార్యను ఇలా పొగడడం ఆరోజుల్లో ఎక్కడా మనం చూడం. అదికూడా అత్రిమహాముని వంటివారి స్థాయిలో.



అనసూయాదేవి దేవహూతీ కర్దముల ముద్దుబిడ్డ. భగవంతుడైన కపిలమహర్షి తోబుట్టువు. త్రిమూర్తులనే బిడ్డలుగా మార్చిన మహాసాధ్వి. త్రికాలజ్ఞురాలు. పతిసేవ ద్వారా జీవితానికి పూర్ణత్వాన్ని సిద్ధింపచేసుకున్న పవిత్రురాలు. పరమపావని.

భవిష్యత్తులో సీత తాను తట్టుకోవలసిన జీవిత పరీక్షలకు కావలసిన అవగాహనను, మనోస్థైర్యాన్ని ఈసందర్భంలో అనసూయద్వారా పొందగలదని అత్రిమహర్షి అభిప్రాయపడ్డాడు. అందుచేతనే రామునిపై ఆసక్తిని కనబరచకుండా సీతమ్మపై అవధానాన్ని కేంద్రీకరించాడు. అనసూయాదేవి ఆశ్రయాన్ని సీతకు కల్పించాడు.

సీతమ్మ అనసూయను సమీపించింది. ముసలితనము చేత ఆమె శరీరము ముడతలు పడివుంది. జుట్టు తెల్లగా ఉంది. గాలికి చలించే అరటిచెట్టులా వణికిపోతూ వుంది. సీత ఆమెను సమీపించింది. తను పేరుచెప్పి నమస్కరించింది. ఆమె కుశలాన్ని, ఆరోగ్యాన్ని ప్రశ్నించింది. అనసూయ ప్రేమతో భాషించింది.

"సీతా! నీవు భాగ్యవంతురాలివమ్మా! పతివ్రతాధర్మంతో శోభిస్తున్నావు. బంధువుల్ని వదిలేశావు. అహంకారాన్ని వదిలేశావు. ఐశ్వర్యాన్ని వదిలేశావు. భర్తవెంట వనాల్లో చరిస్తున్నావు.

"భర్త వనంలోఉన్నా , నగరంలోఉన్నా, పాపాత్ముడైనా, పుణ్యాత్ముడైనా ఏ స్త్రీలు అయితే అతణ్ణి అనుసరించి ఉంటారో వారికే ఉత్తమగతి ప్రాప్తిస్తుంది.

"భర్త దుశ్శీలుడైనా, కాముకుడైనా, దరిద్రుడైనా ఉత్తమ స్వభావురాలగు స్త్రీకి భర్తే దేవుడు. సీతా! ఎంత ఆలోచించినా భర్తను మించిన బంధువు నాకు గోచరించడం లేదు. భర్త ఉత్తమమైన తపస్సు వంటివాడు.

"సీతా! కామమునకు వశులైన దుష్టస్త్రీలకు యుక్తాయుక్తములు తెలియవు. భర్తలపై అధికారము వహించుటే వారికి తెలుసు. అట్టివారు ధర్మభ్రష్టలై అపకీర్తి పాలవుతారు.

**తదేవ మేనం త్వమనువ్రతా సతీ**
**పతివ్రతానాం సమయాను వర్తినీ**
**భవ స్వభర్తుః సహధర్మచారిణీ**
**యశశ్చ ధర్మం చ తతః సమాప్స్యసి**

"సీతా! సదా భర్తనే అనుసరిస్తూ వుండు. పతివ్రతల మార్గంలోనే నడువు. భర్తకు సహధర్మచారిణిగా వుండు. దానివలన నీకు కీర్తి, ధర్మమూ లభిస్తాయి" అన్నది అనసూయాదేవి.

సీతయొక్క కర్తవ్యాన్ని, తద్వారా లభించే ఫలితాన్ని కలిపి ఈ ఒక శ్లోకంలో అనసూయాదేవి బోధించింది.సీతమ్మ జీవితానికి కావలసినదంతా ఈ శ్లోకంలోనే ఇమిడిపోయింది. ఈ క్షణంనుండి కథాంతము వరకు ఎక్కడచూచినా సీతమ్మ పాత్ర ఈ ధర్మాలతోనే జాజ్వల్యమాన మవుతూ వుంటుంది.

**సా త్వేవ ముక్తా వైదేహీ అనసూయాఽనసూయయా**
**ప్రతిపూజ్య వచో మన్దం ప్రవక్తు ముప చక్రమే**

"అసూయలేని సీతమ్మ అనసూయమ్మ చెప్పిన మాటలను ఆలకించి, ఆ మాటలను స్తుతిస్తూ ఇలా పలికింది" అన్నాడు వాల్మీకిమహర్షి.

ఈ శ్లోకంలో 'అనసూయ' అనే పదాన్ని అనసూయాదేవిని, సీతమ్మను ఇద్దరినీ ఉద్దేశించి ప్రయోగించాడు. **"అనసూయ అనసూయయా"** అని రెండుసార్లు ఉపయోగించాడు.

'అనసూయ' అంటే అసూయ లేనిది అని భావము. అత్రిమహర్షి అర్ధాంగిపేరు అనసూయ. పేరుకు తగినట్లు ఆమె నడవడిక కూడా అలాగే ఉండింది. అందుచే ఆమె సార్థక నామధేయురా లైంది.

రాముని అర్ధాంగి సీతమ్మను వైదేహి అంటూ, అసూయ అనే చెడుగుణం లేకపోవుట చేత సీతమ్మను అనసూయగా వర్ణించాడు వాల్మీకి. అసూయ సాధారణంగా అందరిలోను ఉంటుంది. సీత, అనసూయలు ఇద్దరూ ఆవిషయంలో రాజీపడకుండా అసూయను మనసునుండి తుడిపేసుకున్నారు. వారిద్దరికే అది సాధ్యపడింది.

అనసూయ అత్రిమహర్షి భార్య. "అత్రి" - మూడు కానివాడు. పరిచ్ఛిన్నుడైన జీవుడు మూడు పంజరాలలో బంధింపబడి ఉంటాడు. ఈ మూడింటిని ఎవడు ఛేదించుకొని, వాటికి అతీతంగా జీవిస్తాడో అతడే జీవన్ముక్తుడు. ఆత్మవిదుడు. అతడే "అత్రి".

**'స్థూలసూక్ష్మ కారణ శరీరా ద్వ్యతిరిక్తః అవస్థాత్రయ సాక్షీ'**

"స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలకు భిన్నమైనవాడు, జాగ్రత్స్వప్న సుషుప్తులకు సాక్షి యైనవాడు" ఆత్మవిదుడు. అతడే అత్రి.

అత్రికి అర్ధాంగి అనసూయ. అసూయలేని వారే 'అత్రి' అనే జ్ఞానాన్ని పొందుతారు. జ్ఞానాన్ని పొందుటకు అనసూయలై ఉండడం అర్హత.

**ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే**

"అర్జునా! నీవు అసూయ లేనివాడవు. అందుచేత రహస్యమైన ఈ జ్ఞానమును నీకు బోధిస్తున్నాను" అంటూ భగవద్గీతలో అత్యంత వైభవోపేతమైన రాజవిద్యా రాజగుహ్య యోగాన్ని ప్రారంభిస్తూ శ్రీకృష్ణపరమాత్మ ఉపదేశించారు.

అత్రి అర్ధాంగి అనసూయ. విదేహరాజు కుమార్తె సీతమ్మ. అందుకే వాల్మీకి ఈ శ్లోకంలో సీతమ్మను వైదేహి అని సంబోధించాడు. విదేహులు అంటే దేహాభిమానం లేనివారు. దేహస్థాయి మండే అసూయలు ప్రారంభ మవుతాయి. బ్రతుకును అన్యాయంగా మార్చుతాయి.

సీతమ్మ వైదేహి కనుక అసూయ తెలియనదియై అనసూయగా కీర్తించబడింది. అత్రి భార్యగా త్రిపుటిని అధిగమించి, నడవడికలో దానిని ప్రతిఫలింపచేసి అనసూయాదేవి సార్థక నామధేయురా లైంది. అందుచేతనే ఈ శ్లోకంలో 'అనసూయ' అనే పదాన్ని సీత విషయంలో విశేషణంగాను, అనసూయ విషయంలో నామవాచకంగానూ ప్రయోగించారు వాల్మీకిమహర్షి.

అనసూయతో సీతమ్మ చెప్తూవుంది.

"అమ్మా! భర్త విషయంలో నీవు చెప్పిందంతా సత్యమే. స్త్రీకి భర్తయే దైవము అనే విషయం నాకుకూడా తెలుసు.

"స్త్రీకి భర్తసేవ కన్నా మించిన తపస్సులేదు. ఈ విషయాన్ని మిథిలలో వివాహసమయాన మాతల్లి చెప్పింది. వనాలకు బయలుదేరే ముందు మా అత్తగారు చెప్పారు.



"అమ్మా! ఒకవేళ నా భర్త దురాచారుడైనా నేను అతణ్ణి సేవించాలి. అది నా ధర్మం. కానీ ఆవిషయంలో నేను అదృష్టవంతురాల్ని. సుగుణవంతుడు, దయామయుడు, జితేంద్రియుడు, స్థిరమైన అనురాగం కలవాడు, ధర్మాత్ముడు నాకు భర్తగా లభించాడు. నా తల్లిదండ్రులనే మరపించాడు;" అని చెబుతూ పతిభక్తి గల సావిత్రి, అనసూయ, రోహిణులు తనకు ఆదర్శమూర్తులని పేర్కొంది సీతమ్మ.

జీవితంలో పతిసేవయే పరమలక్ష్యంగా భావించి జీవించిన స్త్రీమూర్తి అనసూయాదేవి. మరణించిన తరువాతకూడా వెంబడించి భర్తను పొందిన మహా పతివ్రత సావిత్రి. ఇలా సదా భర్తను అనుసరించడమే సతిధర్మమని, చంద్రుని సదా అనుసరిస్తూ తన జీవితం ద్వారా ప్రబోధము గావించింది రోహిణి. సీతమ్మ వీరి ముగ్గురిని తనకు ఆదర్శంగా పెట్టుకుంది.

సీతమ్మ మాటలు విని సంతసించిన అనసూయమ్మ సీతను సమీపానికి చేర్చుకొని, శిరస్సును మూర్కొని ఇలా పలికింది.

"సీతా! నావద్ద గొప్ప తపస్సు అనే సంపద ఉంది. కఠోరమైన నియమనిష్ఠలతో నేను ఆ ధనాన్ని సంపాదించాను. దాని శక్తిచేత నేను దేనినైనా ప్రసాదించగలను. నీకు ఏమి కావాలో చెప్పు. ఇస్తాను. సీతా! నీ పలుకులు కోమలంగా ఉన్నాయి. యుక్తియుక్తంగా ఉన్నాయి. నేను చాలా సంతోషించాను. నీకు ఏమి కావాలో చెప్పు;" అన్నది అనసూయ.

"అమ్మా! మీరు పలికిన ఈమాట ఒక్కటి చాలు. దానివల్ల నా మనోరథాలన్నీ సిద్ధించాయి," అన్నది సీతమ్మ. సీత మాటలకు మరింత సంతోషించిన అనసూయ తన సంతోషాన్ని అభివ్యక్తంచేస్తూ ఇలా పలికింది.

"సీతా! ఇదిగో! తీసుకో! ఇవి దివ్యమైన పుష్పమాలలు. ఇది శ్రేష్ఠమైన వస్త్రము, ఇవి దివ్యాభరణాలు, అంగరాగము, శ్రేష్ఠమైన సుగంధము. అందుకో. ఇవి ఎప్పుడూ ఇలాగే ఉంటాయి. నలగవు. నశించవు. ఎప్పుడూ నిత్యనూతనంగానే ఉంటాయి;" అని పలికి సీతమ్మకు అవన్నీ ప్రసాదించింది అనసూయాదేవి. సీతమ్మ భక్తితో గ్రహించి ఆ మహాసాధ్వికి నమస్కరించింది.

వాడని మాలలు,ఊడని వస్త్రాలు, వీడని ఆభరణాలను అనసూయ సీతకు ప్రసాదించింది. భవిష్యత్తులో వాడని కీర్తి, ఊడని జ్ఞానం, వీడని పతిభక్తి సీతకు తోడుగా ఉంటాయని భావించి ఆ వస్తువులను సీతమ్మకు ప్రసాదించింది అనసూయ.

అనసూయ నుండి ఆశీస్సులను పొందిన సీతమ్మ ఆ మహాసాధ్వికి దగ్గరగా కూర్చున్నది. అనసూయ చెప్పే విషయాలను శ్రద్ధగా ఆలకించాలని, బహుశ సీత అభిప్రాయపడి ఉంటుంది. కాని దానికి భిన్నంగా సీతనే మాట్లాడించింది అనసూయ.

"సీతా! రాముడు నిన్ను స్వయంవరంలో పొందినాడని నేను విన్నాను. దానిని వివరంగా నీద్వారా వినాలని కుతూహల పడుతున్నాను. యథోచితంగా చెప్పు;" అంది.

సీతమ్మ ప్రారంభించింది. జనకమహారాజుకి నాగేటిచాలులో తాను దొరికినది మొదలు రామునితో తనకు వివాహమై నంతవరకు జరిగిన విషయాన్నంతా ఇరవైఎనిమిది శ్లోకాల్లో వివరించింది సీతమ్మ. ఇది అయోధ్యాకాండము నందు నూటపద్దెనిమిదవ సర్గ.

ఇంతవరకు మనకు తెలిసింది, విన్నదే కదా అని నేను ఆ కథనంతా ఇక్కడ తిరిగి చెప్పడంలేదు. ఒకవేళ నేను ఆ కథనంతా వ్రాసినా మీకు విసుగుపుట్టదు. చెప్పిన విషయాన్నే విసుగు పుట్టకుండా మళ్ళీ చెప్పగలగడం వాల్మీకిలోని ప్రత్యేకత. రమ్యత. నవ్యత.

సీతమ్మ చెప్పిన ఆత్మకథలోని ఈ శ్లోకాన్ని పరిశీలించండి.

**దీయమానాం నతు తదా ప్రతిజగ్రాహ రాఘవః**
**అవిజ్ఞాయ పితుశ్ఛన్ద మయోధ్యాఽధిపతేః ప్రభోః ॥**

"అపుడు తనతండ్రి, ప్రభువు అయిన దశరథుని అభిప్రాయము తెలుసుకోకుండా నన్ను స్వీకరించడానికి రాముడు సమ్మతించలేదు."

ధనుర్భంగము గావించిన తరువాత రాముడు సీతమ్మను అంగీకరించలేదని, తన తండ్రి అంగీకరించిన తరువాతే తాను గ్రహించునట్లు తెలిపాడని ఈ సందర్భంలో సీత అనసూయతో చెప్పింది.

ఈవిషయాన్ని బాలకాండములో వివాహ సందర్భమున వాల్మీకి మనకు చెప్పలేదు. అత్రి ఆశ్రమంలో సీతచేత అనసూయకు చెప్పిస్తాడు. అది వాల్మీకిలో ప్రత్యేకత. పదార్థాలన్నీ ఉంటాయి. ఎక్కడ, ఎప్పుడు, ఏది, ఎలా వడ్డించాలో మహర్షికి తెలుసు. అందువల్ల ఆయన వడ్డించింది ఏదితిన్నా, ఎప్పుడుతిన్నా, ఎక్కడతిన్నా,ఎలాతిన్నా బాగానే వుంటుంది. బాగుండేలా చేస్తుంది.

తన ఆవిర్భావమునుండి రామునికి అర్ధాంగి అయ్యేవరకు సీతమ్మ చెప్పిన తన ఆత్మకథ ప్రశస్తమైనది. పవిత్రమైనది. పారాయణము చేయతగింది. ఒకవిధంగా పిలిస్తే దీనిని **"దేవీ రామాయణము"** అని తృప్తిగా, ఆనందంగా పిలుచుకోవచ్చు.

సీత చెప్పిన ఆత్మకథను ఆలకించిన అనసూయ సంతసించి సీతను కౌగలించుకొని శిరస్సును ముద్దాడింది.

"సీతా! మృదువైన పదాలతో మధురమైన నీ ఆత్మకథను మంజులంగా పలికావు. మధురభాషిణీ! నీ కథ వినడమువల్ల నాకు దివ్యానందము కల్గింది.

**రవి రస్తంగతః శ్రీమానుపోహ్య రజనీం శివామ్**
**దివసం ప్రతికీర్ణానా మాహారార్థం పతత్రిణామ్**
**సన్ధ్యాకాలే నిలీనానాం నిద్రార్థం శ్రూయతే ధ్వనిః**

"సీతా! దివ్యమైన శోభగల సూర్యుడు అస్తమించినాడు. రాత్రి సమీపిస్తూ వుంది. మేతకై పగలంతా తిరిగిన పక్షులు నిద్రకొరకు గూళ్ళను చేరుకుంటున్నాయి. వాటి అరుపులు వినిపిస్తున్నాయి" అన్నది అనసూయాదేవి.

సీత పలికే తియ్యని మాటలు ఇంకా వినాలని అనసూయ ఆసక్తితో వుంది. కానీ "చీకటి పడింది" అన్నది.

జగత్తును చీకటి ఎప్పుడు అలుముకుంటుందో మనకు తెలుసు. జీవితాలను చీకటి ఎప్పుడు ఆవరిస్తుందో మనకు తెలియదు. తెలిసిరాదు.



చీకటివెలుగుల సమ్మేళనంగా తెలిసే ఈ ప్రపంచంలో జీవించేవారు, వెలుగునీడలను విస్మరించి బ్రతుకలేరు. సుఖదుఃఖాలను నివారించి జీవించలేరు.

కలిమిలేములు, సుఖదుఃఖాలు జీవికి వీడని నేస్తాలు. ఈ రాస్తాలు ఎప్పుడు తెరుచు కుంటాయో, ఎప్పుడు మూతబడతాయో ఎవరూ ఊహించలేరు.

దివ్యశోభగల సూర్యుడు అస్తమించాడు అంటూ ఉంది అనసూయ. సూర్యుడు అస్త మించాడు అంటాము. వాస్తవానికి సూర్యుడు అస్తమించేవాడు కాడు. ఉదయించేవాడూ కాడు. తానెప్పుడూ స్వప్రకాశుడే.

అలాగే రవికులాన జన్మించిన రఘురాముడు అయోధ్యకు అగోచరు డయ్యాడు. రాత్రి సమయాన ప్రపంచము సూర్యుని పోగొట్టుకున్నట్లు కష్టకాలంలో అయోధ్య రాముని దూరం చేసుకున్నది. ఇది అనసూయమ్మ భావం.

సూర్యుడు అస్తమించడమే గాక రాత్రి సమీపిస్తూవుంది అంటున్నది అనసూయ.

చిత్రకూటాన్ని వదలిన తరువాత రాముడు ప్రథమంగా విడిదిచేసిన ప్రదేశం అత్రిమహర్షి ఆశ్రమం. ఇక్కడనుండి దండకారణ్యం ప్రారంభమవుతుంది.

తపస్సుకొరకు దండకారణ్యానికి వెళ్తున్న సీతారామలక్ష్మణులు మొదట అత్రి అనసూయల దర్శనం చేసుకున్నారు. అసూయకు దూరులై, త్రిపుటిని అధిగమించిన పరమాత్మకు చేరువగుటయే తపస్సుయొక్క ప్రయోజనం. సాధకులైన ప్రతిఒక్కరు అత్రి అనసూయల దర్శనం చేసుకోక తప్పదు.

సీతారాములు దండకారణ్యంలో ప్రవేశింప బోతున్నారు. "రాత్రి సమీపిస్తూవుంది" అన్నది త్రికాలజ్ఞురాలైన అనసూయాదేవి.

దండకారణ్యంలో సీతారాములకు కష్టకాలం సమీపిస్తున్నదని అనసూయ పరోక్షంగా ప్రస్తావించింది. రాక్షసుల బెడదంతా ఇక్కడే. నిజమేకదూ! జీవితమనే దండకారణ్యంలో ఆధ్యాత్మిక జీవనమనే తపస్సును సాగించువారిని కామక్రోధాది రాక్షసులు బాధించకుండా ఉంటారా? ఈవిధంగా సమయస్ఫూర్తితో రాబోయే ఆపదను సూచిస్తూ ప్రసంగించిన అనసూయ చివరగా ఇలా అంటోంది.

**గమ్యతా మనుజానామి రామ స్యానుచరీ భవ**

"సీతా! నీకు అనుమతి నొసంగుచున్నాను. ఇక నీవు రాముని వద్దకు వెళ్ళు" అన్నది అనసూయ.

జీవితంలో ఎపుడు ఏ బాధలు ఎదురౌతాయో, ఏ భయంకర పరిస్థితులు తలయెత్తుతాయో ఊహించలేము. కనుక రాముని సమీపించి, సుఖించుటే మానవులకు ప్రధాన లక్ష్యమై ఉంది.

రాముడెవరు?

**'సర్వేషు రమన్తీతి రామః'** అందరిలో రమించు దివ్యచైతన్యమే రాముడు. బాధలకు, భయాలకు అతీతమైన చైతన్యము.

**రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరాత్పరః**

"రాముడే పరబ్రహ్మము. రాముడే పరాత్పరుడు"అని రామ రహస్యోపనిషత్తు ప్రవచించింది.

కనుక పరమాత్మను చేరి సుఖించమని జీవులకు తెలుపుటయే అనసూయ రాముని వద్దకు వెళ్ళమని సీతకు చెప్పుటలోని అంతర్భావము.

"సీతా! నేను ఇచ్చిన వస్త్రాభరణాలను ఇక్కడే అలంకరించుకో. నాకు నేత్రానందాన్ని కలిగించు;" అన్నది అనసూయమ్మ.



సీత అలాగే అలంకరించుకొని అనసూయకు నమస్కరించి రామునివద్దకు వెళ్ళింది. అనసూయ అనుగ్రహించిన కానుకలను సీత రామునికి చూపింది. రాముడు చాలా సంతోషించాడు.

మరునాడు ఉదయాన్నే అగ్నిహోత్రాదికార్యాలు పూర్తి చేసికొని రామలక్ష్మణులు మునులకు నమస్కరించారు. ఈ అరణ్యమార్గమంతా రాక్షసుల కారణంగా ఉపద్రవాలతో కూడుకొని యున్నదని మునులు రామలక్ష్మణులకు చెప్పారు.

**ఏషపన్థా మహర్షీణాం ఫలాన్యా హరతాం వనే**
**అనేన తు వనం దుర్గం గన్తుం రాఘవ తే క్షమమ్.**

రాఘవ=ఓ రామా, ఏషః=ఇది, వనే=వనమునందు, ఫలాని=ఫలములను, ఆహరతామ్=తీసుకొని వచ్చు, మహర్షీణామ్=మహర్షుల యొక్క, పన్థాః=మార్గము. అనేన=ఈమార్గము చేత, దుర్గమ్=గమించుటకు శక్యముగాని, వనమ్=అరణ్యమున, గన్తుమ్=వెళ్ళుటకు, తే=నీకు, క్షమమ్=తగినది.

"రామా! అరణ్యములో ఫలములను తెచ్చుకొనుటకు మహర్షులు ఈ మార్గమునే ఉపయోగించుకొంటూ ఉంటారు. దుర్గమమైన అరణ్యములోనికి నీవు ఈ మార్గమున ప్రవేశించుట సముచితము" అన్నారు బాటను తెలిపే ప్రయత్నంలో మహర్షులు.

**This is the path followed by great sages gathering fruits in the forest. It would be advisable for you to make to the forest, which is difficult of access, by this path alone.**

మహర్షులు నడచిన బాటే బాట. వారు పలికిన మాటే మాట. ఇదే సనాతన ధర్మమార్గము. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులైన మహర్షులు చరించి, తరించిన బాటయే ముముక్షువులకు రాజమార్గమై శోభిస్తూఉంది.

కంటకాలు నిండిన బాటలు కళకళలాడుతూ కన్పించవచ్చు. కాలూనితే కలిగేవి కష్టాలే. మిగిలేవి కన్నీళ్ళే.



యుగయుగాలుగా ఎందరో పయనించిన బాట, తరతరాలుగా ఎందరినో గమ్యమునకు తరలించిన బాట, నాటికి, నేటికి, ఒనాటికి చెక్కుచెదరని బాట, సుగమమైన, సుందరమైన, సులభమైన, సత్యమైన బాట - అదియే సనాతనధర్మ బాట.

**ఏషః పన్థాః** - ఇదియే బాట.

సనాతనధర్మ బాట.

మునులు చెప్పినట్లుగా పయనించుటకు నిర్ణయించుకొనిన రాముడు మహర్షులకు నమస్కరించి, సీతాలక్ష్మణులతో కలిసి సూర్యుడు మేఘమండలములో ప్రవేశించినట్లు అరణ్యములో ప్రవేశించాడు.

మనంకూడా పూర్వీకులైన మన మహర్షుల మాటలు విందాం. మహర్షులకు నమస్కరించి రామునివలె సీత అనే భక్తిని, లక్ష్మణుడనే వైరాగ్యాన్ని వెంటబెట్టుకొని రాముడు అరణ్యంలో ప్రవేశించినట్లు జీవితారణ్యంలో ప్రవేశిస్తాం. తపస్సు చేసి తరిస్తాం.

## అయోధ్యాకాండము సమాప్తము.

